





# గేయాలు

పౌరాణిక,జానపద,సామాజిక

# తెలుగు కవితావికాసం





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100071700

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# తెలుగు కవితావికాసం

(1947 - 1980)

రచన

కడియాల రామమోహనరాయ్




ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు,
హైదరాబాదు-4

# తొలిపలుకు

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కార్యక్రమాలనూ, ప్రచురణలనూ రూపొందించే సందర్భంలో సలహా సంఘాల సూచనలను, సలహాలను పరిశీలిస్తుంది. స్వాతంత్ర్య సముపార్జనానంతరం తెలుగు కవితలో వచ్చిన పరిణామాలను వివరించే పుస్తకం ఒకటి అకాడమీ వెలువరించాలనీ, శ్రీ కడియాల రామమోహన్‌రాయ్ చేత అలాంటి పుస్తకం వ్రాయించాలనీ ఆధునిక తెలుగు సాహిత్య సలహా సంఘం చేసిన సూచనను అకాడమీ కార్యవర్గం అంగీకరించినది.

1947 నుంచి 1980 వరకు తెలుగులో వెలసిన వివిధ కవితా రీతులను శ్రీ రాయ్‌గారు ఈ గ్రంథంలో పరామర్శించినారు. సమకాలీన సాహిత్యంపై పరిశీలన జరిపే రచయితలు వివిధ కవితా కళాసిద్ధాంతాలకు సంబంధించిన వారినందరినీ సంతృప్తిపరచలేరు. కవిత్వానికీ, సౌందర్యానికీ, అనుభూతికీ సర్వజనాంగీకృతమైన నిర్వచనం లభించిననాడు అది సాధ్యమేమో!

శ్రీ కడియాల రామమోహన్‌రాయ్‌గారు ఈ పుస్తకంలో ప్రకటించిన అభిప్రాయాలు వారి సొంతం.

ఎంతో శ్రమపడి, ఎన్నో పుస్తకాలను పరిశీలించి ఈ పుస్తకం వ్రాసి ఇచ్చిన శ్రీ కడియాల రామమోహన్‌రాయ్ గారికి అకాడమీ పక్షాన కృతజ్ఞతలు.

హైదరాబాదు.
తేది. 29-4-1982

ఇరివెంటి కృష్ణమూర్తి
కార్యదర్శి

# కృతజ్ఞతలు

ఈ పుస్తకం రచించటంలో తగిన సూచన లిచ్చి తోడ్పడిన గురువర్యులు ఆచార్య తూమాటి దొణప్ప, పూజ్యశ్రీ 'అమరేంద్ర' గారలకు,

నా శ్రేయస్సును కాంక్షించి నన్నెప్పుడూ వాత్సల్యంతో ఆదరించే పూజ్యులు డా॥ కాసరనేని సదాశివరావు గారికి,

నన్ను నిరంతరమూ ప్రోత్సహిస్తూ, నా అభివృద్ధిని కోరే మిత్రులు, జీవించటంలో ఆనందాన్ని తెలియజెప్పిన ఆప్తులు పూజ్యశ్రీ సి.వి.ఎస్. ధన్ గారికి,

ఈ పుస్తక రచనలో నా సందేహాలను తీర్చి చక్కని సూచన లిచ్చి తోడ్పడిన మాన్య మిత్రులు శ్రీ నండూరి రామమోహనరావు, శ్రీ పురాణం సుబ్రహ్మణ్య శర్మ గారలకు,

నా మనసులోని మనసై, నన్ను నవ్వించి, ఉత్సాహపరిచి "ఇంకా రాయరేం" అని హెచ్చరించిన మిత్రులు శ్రీ శ్రీరమణ, ఇంద్రగంటి శ్రీకాంత శర్మగారలకు,

నా మీద నమ్మకంతో నేను రచన చేయగలనని విశ్వాసం కలిగించిన మిత్రులు, ఆప్తులు డా॥ కడియాల వాసుదేవరావు గారికి,

ఈ సత్కార్యాన్ని నిర్వహించటంలో నాపై కొండంత విశ్వాస ముంచి, ఆదరాభిమానాలతో నన్ను ఉక్కిరి బిక్కిరి చేసిన మిత్రులు శ్రీ గుత్తికొండ సుబ్బారావు గారికి,

కావలసిన పుస్తకాలిచ్చి - "ఇంకా ఇవిగో, ఇవికూడ పనికి వస్తాయి" చూడండంటూ ప్రోత్సహించిన పెద్దలు, మనసున్న మిత్రులు శ్రీ తుమ్మల వెంకట రామయ్య, లంక సూర్యనారాయణ, వెలగా వెంకటప్పయ్య గారలకూ; పుస్తకాలిచ్చి తోడ్పడిన ఇతర మిత్రులకు,

నా రచనకు మొదటి విమర్శకుడు, ఆత్మీయుడు ఆర్.ఎమ్.కె. వెంకటాద్రి గారికి,

ఈ పుస్తకం రాయమని ఆదేశించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి, ముఖ్యంగా నాతో సహకరించి అన్ని దశలలోను ప్రోత్సాహ పరచిన కార్యదర్శి డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారికి నా కృతజ్ఞతలు.

కావలసినంత మేరకే అల్లరిచేసి, రచనపై కుతూహలం కనపరచిన మా చిరంజీవులు భారవి, శ్రీనాథ్‌లకు,

నాకు తోడూ నీడా అయి నా మనసెరిగి మెలిగే ఇల్లాలు, స్నేహితురాలు అర్ధాంగి రాజ్యలక్ష్మికి నా శుభాకాంక్షలు.

ఈ పుస్తకం రచించటానికి కావలసిన సమయాన్ని సమకూర్చిన శ్రీ జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి కళాశాల పాలకవర్గం వారికి నా కృతజ్ఞతలు.

పుస్తకాన్ని అందంగా ముద్రించిన పద్మా పవర్ ప్రెస్ వారికి; ప్రూఫ్స్ సరిచూచిన శ్రీ డి. రామలింగం గారికి నా ధన్యవాదాలు.

రామమోహనరాయ్

# ప్రవేశిక

"ఆధునిక కవిత్వం అర్థం కాలేదంటే ఆధునిక జీవితమే అర్థం కాలేదన్నమాట."[1] అతివేగంగా మారుతున్న విలువలూ, నాగరికతా సంక్లిష్టమై జీవితాన్ని సంక్షోభపరుస్తున్నాయి. ఎవరెస్టు శిఖరం అధిరోహణ; యూరీగగారిన్ గగన పథయాత్ర; నీల్‌ఆర్మ్‌స్ట్రాంగ్ చంద్ర మండలంపై పాదముద్రలు; చంద్రశిలలపై పరిశోధన; 'టెస్ట్‌ట్యూబ్'లో జీన్స్‌సృష్టి; శస్త్ర చికిత్సలో గుండెల మార్పిడీ; ప్రపంచాన్ని భస్మీపటలం చెయ్యగల మారణాయుధాలూ; 'జర్మ్‌వార్‌ఫేర్'; మనిషినిమనిషికి అతి దగ్గరగా తీసుకువచ్చిన 'టెలీకమ్యూనికేషన్స్' సౌకర్యాలూ; ప్రపంచ మంతటా యువతరం తిరుగుబాటు "శాంతిలోనే అశాంతినీ, అశాంతిలో నూతనత్వం కోసం తపననూ కల్గిస్తున్నాయి." "నీటిలో విసరినరాయి చుట్టూ వలయాలుగా బయలుదేరే కెరటాల"వలె ఆధునిక జీవితంలో మార్పులు విస్తరించి, విస్తరించి మరోమార్పులో అదృశ్యమౌతున్నాయి.

ఆధునిక కవిత్వం వున్నట్టుండి ఒక్కసారిగా వూడిపడలేదు. పదకొండవ శతాబ్దం నుండి 19వ శతాబ్దం దాకావున్న తెలుగుసాహిత్యం, తొమ్మిదిశతాబ్దాల పరిణామం తర్వాత ఆధునికకవిత్వాన్ని ప్రసవించింది. ఎవరెంత తర్కించినా ప్రాచీనాంధ్ర సాహిత్యం ప్రజాదరణలో కాక రాజాదరణలో వృద్ధి పొందిందన్న సత్యాన్ని కాదనలేము. రాజసభల్ని, సత్సభాంతర సరసీ వనాలనుదాటి సాహిత్యం ప్రజలకు సన్నిహితంగా వచ్చినది వీరేశలింగం పంతులుగారి కాలానికి తర్వాతనే. జానపదవాఙ్మయము జానపదకళారూపాలు నిరక్షరాస్యులైన సామాన్య ప్రజల అవసరాల్ని తీరుస్తూవుండటంచేత శిష్టసాహిత్యమూ, జానపదసాహిత్యమూ సమాంతరంగా వృద్ధి పొందుతూ వచ్చాయి. కవిత్వ మనగానే పండితులు శిష్ట సాహిత్యాన్ని మాత్రమే పరిగణనలోకి తీసుకోవటం జరిగింది.

1. 'నేటి తెనుగు కవిత - కొత్త పోకడలు' - శ్రీ శ్రీ - 'భారతి' - ఫిబ్రవరి

రామాయణ, భారత, భాగవతాల్లో పాత్రలు తెలుగు సమాజంలో వ్యక్తులు కాకపోయినా తెలుగు జాతికి అతి సన్నిహితమైనారు. 'కవిత్రయము', పోతన, రంగనాథ, భాస్కర, మొల్ల మొదలైన వారి రచనలను శిష్టులు ఆదరిస్తే, ఆకథలనే పామరజనులు గేయాలుగా కూర్చుకుని ఆనందించారు. తెలుగుదేశానికి సంబంధించిన 'గాథాసప్తశతి' గాథలు పదకొండవ శతాబ్దం తర్వాత ప్రజల్లో వ్యాప్తిలోకి రాలేదు. శ్రీనాథ మహాకవి 'గాథాసప్తశతి' అనువాదం కాలగర్భంలో కలిసిపోయింది. ఆయన 'రీతి' మార్గాన్ని అనుసరించి "ఏమి చెప్పటం అనేదానికంటె, ఎలా చెప్పటం" అనే దానికి ఎక్కువ ప్రాముఖ్యమిచ్చాడు. ఆంధ్రజాతి మహేతిహాసం 'పలనాటి వీర చరిత్రము' కొంతభాగమే శ్రీనాథుని రచనకు నోచుకున్నది. ఇతివృత్తం ఆంధ్రదేశంలో జరిగినదే అయినా ఆంధ్రపండితులు 'పలనాటి వీరచరిత్ర'ను తగినంత ఆదరించలేదు. కథానక కావ్యాలు రచించిన కవులు సామాన్య ప్రజల జీవితాన్ని పరిశీలించి ఇంపుగొలిపే కథలు రచించారు.

ప్రబంధయుగాన్ని కొందరు పండితులు తెలుగు సాహిత్యానికి స్వర్ణయుగంగా పేర్కొంటారు గాని ప్రజలజీవితానికీ, కవిత్వానికీ యెడం ప్రబంధాల్లోనే ఎక్కువైంది. పురాణేతిహాసాల్లో వున్న చిన్న కథలను ప్రపంచించి రాయటంలో కవులు మేధాశక్తికి ఇచ్చినంత ప్రాముఖ్యం హృదయానికి ఇవ్వలేదు. కరుణ రసపోషణ బాగా వెనుకబట్టింది. కాబట్టే ప్రబంధాల్లో నాయికలు దుఃఖిస్తూ వుంటే సహృదయులకు దుఃఖం కలగ దానికి బదులు, శృంగారరస పర్యమైన ఆనందమే కలుగుతుంది. ప్రబంధాల్లో జీవంగలపాత్రలు చాలతక్కువ. వరూధిని, సత్యభామ, నిగమశర్మ అక్కవంటిపాత్రలు కొద్ది. గిరిక, గోదాదేవి మొదలైనవారుదృగ్గోచరమూ మనోగోచరమూకారు. "కొయ్య బొమ్మలె మెచ్చు కళ్ళకు కోమలుల సౌరెక్కునా" అన్న శ్రీ గురజాడ అప్పారావు ఆక్షేపణ ప్రబంధ పాత్రలకు సరిగా అన్వయిస్తుంది. " ఇఁక సామాన్య ప్రబంధములన్ననో వాని యందలి స్త్రీ. పురుషులెండిన కట్టెలవలె నున్నారు. వంగలేరు. పెరుగలేరు. కాబట్టి ప్రాప్తులు రెండు; విఱువఁబడుట; ప్రోయినిడఁబడుట"

అని శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు ప్రబంధపాత్రలను నిరసించారు''[2] వీరి మాటల్లో తీవ్రత ఎక్కువగావున్నా ప్రబంధపాత్రలు సమకాలిక సమాజంలో వ్యక్తులు కారనేమాట వాస్తవమే. రాజుల దండయాత్రలను విలాసాలను వర్ణించటంలో మైమరచిన ప్రబంధకవులు ప్రజల జీవితాన్ని గురించి పట్టించుకున్న సందర్భాలు కొద్ది. ధూర్జటి మొదలైనవారు రాజులను నిందించి, స్వేచ్ఛను ప్రకటించినా, వారుభక్తికి ఇచ్చిన ప్రాధాన్యం ప్రజల కష్టసుఖాలకు ఇవ్వలేదు. శైవ వైష్ణవభేదాలు కవులను ఆవహించి, తమ ఇష్టదేవతను స్తుతించటంతో ఆగక, అన్యమతాల్ని దూషించేస్థాయికి దిగజారాయి. రాజుల విలాసాల్ని కొనియాడటంతో ఆగక కవులు వారి వ్యసనాలను కూడ- 'రాయవేశ్యా భుజంగా' మొదలైన సంబోధనలతో- స్తుతించటం సాహిత్యంలో క్షీణదశనే తెలుపుతుంది.

లాక్షణికుల 'పుణ్యమా' అని కావ్య లక్షణాలను నిబంధించటంతో కవులు గతానుగతికులై లక్షణాల మధ్య బందీలై స్వేచ్ఛను కోల్పోయారు. ఇతివృత్తము, నాయకుడు,రసము, అష్టాదశవర్ణనలు, అన్నిటిలో లాక్షణికుల సూచనలు సంకెళ్ళుగామారి, యంత్రంలోనుంచి తీసినబొమ్మల వంటి ప్రబంధాలు వెలువడినాయి.

శతకాలలో సాంఘిక జీవనస్పర్శ కొంతవరకు వున్నప్పటికీ వాటిని ఉత్తమ కావ్యాలుగా, కవులు, కవి చరిత్రకారులు గుర్తించలేదు. సామ్రాజ్యాలు అంతరించి, చిన్నచిన్న రాజుల పరిపాలన ఏర్పడిన కాలంలో-''రాజులు 'రాజా'లైన కాలంలో'' తెలుగు సారస్వతంలో క్షీణయుగం ప్రారంభమైంది.

దక్షిణ భారతదేశంలో యుద్ధ భీభత్సం తగ్గిపోయి, ప్రజలు ఆకలి, దారిద్ర్య బాధలకు గురిగాక, శాంతిని అనుభవిస్తున్న కాలంలో తెలుగు సాహిత్యం క్షీణదశను చేరుకొన్నది. హృదయ సంబంధియైన కవిత్వం సాము గరిడీలకు నిలయమైంది. ప్రతిభావంతులైనవారు కూడ కాల

2. **కవిత్వతత్త్వ విచారము - ప్రథమ భాగము - కట్టమంచి రామలింగారెడ్డి. ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రచురణ - ఐదవ ముద్రణ - ३६ వ పేజీ.**

ప్రభావానికి లొంగి, పరకీయా శృంగారాన్ని, విషయలంపటత్వాన్నీ కావ్యాలలో వర్ణించి, దుర్నీతిని ఆకర్షవంతం చెయ్యసాగారు. నలువైపులా అంధకారం అలముకోవటం చేతనేదాన్ని సాహిత్య చరిత్రకారులు అంధ యుగంగా, క్షీణయుగంగా వర్ణిస్తున్నారు. "ఎవ్వరేమన్నా దక్షిణాంధ్ర నాయక రాజయుగం ఆంధ్ర సాహిత్యంలో మునిమాపు."[3] ఆ తరువాత 1750-1850 సంవత్సరాల మధ్య ఆంధ్ర సాహిత్యం అంధకారంలో మునిగి పోయింది.

చీకటిలో అరుణరేఖలు తోచినట్లు యక్షగానాలలో, ఇతర కళా రూపాలలో ప్రజలకు మేలు చేకూర్చేది కాక పోయినా, ఉన్నత పథాలు పట్టిపోతున్న సాహిత్యం క్రమంగా నేలమీదకు దిగింది. ప్రజల భాష కావ్యాలలో ప్రవేశించటం దోషమనే తలపుపోయి - వాడుక భాష క్షీణ యుగ కావ్యాల్లో కన్పించసాగింది. ఇది కవిత్వానికి ఆరోగ్యకరమైన పరిణామమే. ఈ యుగంలో ఆనంద గజపతి, పిఠాపురంరాజా వంటి కళాపోషకులైన రాజులు కొందరు విద్వత్కవులకు ఆశ్రయ మిచ్చారు. జమీందారులను మెప్పించటానికి కవులు మేధా సంబంధమైన చిత్ర,బంధ, కవిత్వాలనీ, అవధాన విద్యనూ ఆశ్రయించారు. "256 విధాలుగా చదవ దగిన కంద పద్యాన్ని మండపాక పార్వతీశ్వర శాస్త్రి చెప్పా"డంటే కవుల ఆలోచనా రీతి, వారిని ఆదరిస్తున్న ప్రభువుల అభిరుచులూ కొంతవరకు బోధపడతాయి. గురజాడవంటి నవ్య భావాలుగల కవిని ఆదరించి గజపతి భావితరాలకు ఆదరపాత్రుడయ్యాడు.

19 వ శతాబ్దంలో ఈస్టిండియా కంపెనీవారి పరిపాలన స్థిర పడటంతో భారతదేశమంతా మార్పులు వచ్చినట్లే ఆంధ్రదేశంలో కూడ మార్పులు వచ్చాయి. విలియం బెంటింక్ దేశీయులకోసం ప్రవేశపెట్టిన ఇంగ్లీషు భాషా బోధన మనదేశంలో సత్ఫలితాల నిచ్చింది. 1813 లో మద్రాసు సెంట్ జార్జి కోటలో కాలేజి స్థాపింపబడింది. అందులో తెలుగు భాషా బోధన కూడ వున్నది. మత ప్రచారంకోసం మనదేశం వచ్చిన

3. 'ఉదయసంధ్య' - 'మహోదయం' - కె. వి. రమణారెడ్డి - విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ - 26 వ పే.

మిషనరీలు, ప్రభుత్వోద్యోగాల్లో వున్న విదేశీయులు దేశ భాషలు నేర్చుకొని, వాటికి వ్యాకరణాలూ, ఛందశ్శాస్త్రాలూ రచించ సాగారు. మొదట తెలుగుకు శాస్త్రీయ పద్ధతిలో వ్యాకరణం రచించిన 'కాంప్ బెల్', జీవితమంతా తెలుగు భాషా, వాఙ్మయాభివృద్ధికోసం తోడ్పడిన సి.పి. బ్రౌన్: బిషప్ 'కాల్డ్ వెల్' మొదలైనవారు తెలుగులో కొత్త వెలుగును ప్రసరింపజేశారు. మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీ పండితులు చిన్నయసూరి 'నీతి చంద్రిక' రచించి సలక్షణమైన భాషలో ఉత్తమ గ్రంథాలు రాయ వచ్చునని ఋజువుచేశారు. ఆయన రచించిన 'బాల వ్యాకరణం' తొమ్మిది శతాబ్దాల కావ్య భాషకు లక్షణ మేర్పరచి మహోపకారం చేసింది. "దిక్ప్రదర్శనముగ దెలిపెదనిందు లక్షణము" అని ఆయన విశాల హృదయాన్ని ప్రదర్శించినా, ఆ వ్యాకరణాన్ని తూ.చా. తప్ప కుండా అనుసరించదలచిన పండితులు వాఙ్మయానికి తీరని అపచారం చేశారు. పూర్వ గ్రంథ పరిష్కరణంలో, వ్యాఖ్యానాల్లో చిన్నయసూరి వ్యాకరణం ఆధారంగా పూర్వ కావ్యాలలోని పాఠాలను దిద్దేశారు. పాఠశాలల్లో పఠనీయ గ్రంథమైన నీతిచంద్రిక ముక్కుపచ్చలారని బాలలకు కొరకరాని కొయ్య అయింది. భాషలో సంస్కరణ అత్యావశ్యక మైంది. ఈ సందర్భంలో తెలుగు భాషకొక నిఘంటువును సమకూర్చిన చిన్నయసూరి కృషిని కొనియాడకుండ వుండలేం. ఆంధ్రుల దురదృష్టాన అది కనిపించకుండా పోయింది.

తెలుగు వాఙ్మయాన్ని ఆవరించిన చీకటిని ఛేదిస్తూ నవయుగ భానుడిలాగ శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు అవతరించారు. శ్రీ వీరేశలింగం తనకు పూర్వం వున్న సాహిత్య రీతిని అనుసరించి కొన్ని రచనలు చేశారు. చిన్నయసూరి గారిని అనుసరించి సంధి, విగ్రహము రచించారు. కాని త్వరలోనే ఆధునిక సాహిత్యం ఏ విధంగా వుండకూడదో ఆయన అర్థం చేసుకున్నారు. "నువు పోదలచుకొన్న చోటికి మనిషిలా కాళ్ళతో నడిచిపోవాలి గాని - అడ్డంగా నేలమీదపడి కడుపుతో దొర్లి, ప్రయాసపడి గమ్యస్థానమును జేరి యసాధారణ ప్రౌఢి మను జూపిన బుద్ధిమంతుని మెచ్చుకొనునట్లే కవితా చమత్కృతులు

మెచ్చుకొనదగి యుండును" అని క్షీణ యుగకాలంనాటి కవితా చమత్కృతులను ఆయన హేళన చేశారు[4]. ఆంగ్ల సాహిత్యాన్ని శ్రద్ధగా అధ్యయనం చేసిన పంతులుగారు అనేక నవ్య సాహితీ ప్రక్రియలకు మార్గదర్శకులయ్యారు.

నవ్య కవిత్వావిర్భావాన్ని గురించి శ్రీపాద గోపాలకృష్ణ మూర్తిగారు "నవ్య కవిత్వమన్నది ఒక్కనాడు ఒక్క వ్యక్తి సృజించిన దాన్ని అనుసరించి వర్తిల్లలేదు. వర్షము పడినప్పుడు సెలయేళ్ళు కలిసి నదియైనట్లు, వ్యక్తులూ, ఉద్యమాలూ, పరిస్థితులూ కలిసి నవ్య కవిత్వము నాలుగుచోట్ల పుట్టి పెరిగింది. వ్యక్తులు గురజాడ, రాయప్రోలూ-ఉద్యమాలు వందేమాతరోద్యమమూ సంఘ సంస్కారోద్యమమూ-పరిస్థితులు, ఆంగ్ల విద్య, పత్రికా ప్రచారమూ-ప్రపంచ యుద్ధమూను" అని ఆనాటి పరిస్థితులను వివరించారు[5]. సంఘ సంస్కారోద్యమములో భాషా సంస్కరణోద్యమాన్ని ప్రధాన భాగంగా గుర్తించాలి. శ్రీ గిడుగు రామమూర్తి పంతులు నవ్య సాహిత్యం ఆవశ్యకతను వివరిస్తూ "ఏ తరంలోని సాహిత్యమైనా తన కాలపు ఆలోచనా స్వభావాలను ప్రతిబింబిస్తుంది. ఒక యుగం వెనుకటి యుగపు సాహిత్య ప్రమాణాలను గుడ్డిగా అనుసరించదు. అది వర్తమాన కాలం నుంచి ఆవేశాన్ని పొందుతుంది. విషయ స్వీకరణలో, భావ వ్యక్తీకరణలో రెండిటా తన లక్ష్యం జీవిత విమర్శేగాని, నిర్జీవ పదార్థ విమర్శయే కాదని అది ఉద్ఘాటిస్తుంది" అన్నారు[6]. జీవద్భాషలో కావ్య నిర్మాణం జరగాలని దీక్షగా జీవితమంతా సనాతన పండితులతో పోరాడిన గిడుగువారు నవ్య కవులకు రాజమార్గం ఏర్పరచారు.

---

4. ఆంధ్ర కవుల చరిత్రము – కందుకూరి వీరేశలింగం – తృతీయ భాగము – 167–168 పేజీలు.

5. అర్థశతాబ్ది ఆంధ్ర కవిత్వము – శ్రీపాద గోపాలకృష్ణమూర్తి – 'భారతి' – నవంబరు 1962.

6. వ్యాసావళి – గిడుగు రామమూర్తి పంతులు – విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ – తృతీయ ముద్రణ – 1976.

నవ్య సాహిత్యం నిలదొక్కుకుని, ఏపుగా ఎదిగి పూలు పూస్తున్న దశలో శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి "ఎప్పుడో పాతిక శతాబ్దాల క్రింద ఏర్పడ్డ లక్షణ శాస్త్రాలూ, వ్యాకరణ శాస్త్రాలూ విధించిన కట్టుబాట్లున్నూ, ధర్మశాస్త్రాలూ సంఘశాస్త్రాలూ నియమించిన నిబంధనలున్నూ, కులాలూ, మతాలూ. వ్యక్తులూ ఇత్యాదులలోగల భేద భావాలు ఎన్నో మన అభ్యున్నతికి అడ్డుపడుతున్నాయంటే వాటిని తోసి వేస్తున్నాము" అని తెగింపుతో పలికారు[7]. ఈమాటల్లో వున్న ఆవేశాన్ని మించిన ఆవేశమే గిడుగు, గురజాడల కాలంలో నవ్య సాహిత్య సృష్టికి కారణమైంది.

కావ్యవస్తువులో కొత్తదనమెలా వస్తుందని అడిగేవారు ఆనంద వర్ధనుడు చెప్పిన,

> "దృష్ట పూర్వా అపిహ్యర్థాః కావ్యేరస పరిగ్రహాత్
> సర్వేనవా ఇవాభాంతి మధుమాస ఇవద్రుమాః"

అన్న మాటలు మననం చేసుకోవాలి[8]. క్షీణయుగ కవులు స్వీకరించిన కావ్య వస్తువులను పరిశీలిస్తే లోకజ్ఞులైన కవులకు కావ్య వస్తువులకు కొరత లేదని తెలుసుంది.

పాత కవిత్వం మీద తిరుగుబాటు లేవదీసిన కవులు నిర్మాణాత్మకంగా తాము ప్రవేశపెట్టదలచిన కొత్తదనమేమిటో యోచించుకోవాలి. "It began with a natural assumption that, since poetry had become false through its addiction to conventional manners and subjects, it must again become true to its own nature; rid itself of what really belong to it and become purer than before" అని C.M. Bowra చెప్పినట్లు కవులు తాము ప్రవేశపెట్టదలచుకొన్న కొత్త

7. అధ్యక్షోపన్యాసము - పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి - నవ్యసాహిత్య పరిషత్తు - నాల్గవ సమావేశము.

8. ధ్వన్యాలోకము - ఆనందవర్ధనాచార్యుడు - 4 4

దనంలో పాత వాసనలు వదిలించుకొని, కొత్తదనాన్ని పాతదానికి పూర్తిగా భిన్నంగా, స్వచ్ఛంగా వుండేలాగ చూసుకోవాలి[9]. పూర్వ కవులు వర్ణించదలచుకొన్న సన్నివేశం గోచరింపచేయటానికి ఉపమాలంకారాన్ని స్వీకరించి-ఒక్కొక్కసారి ఉపమాలంకారాలను పేర్చుకుంటూ పోయే పద్ధతి కవిత్వానికి దౌర్బల్య చిహ్నమని శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి తలచారు. వర్ణ్య వస్తువును మనోగోచరం చెయ్యటానికి అవసరమైన అలంకారాలు అప్రయత్నంగా సిద్ధించాలేగాని, ప్రయత్నపూర్వకంగా పేర్చుకుంటూ పోగూడదని ఆధునిక కవులు విశ్వసించారు. భావకవులలో పూర్వ కవులవలె అలంకారాలను పేర్చుకుంటూపోయే దౌర్బల్యం కొంత కన్పిస్తుంది. తర్వాత వచ్చిన కవులలో అలంకారాలను విరివిగా వాడాలనే చాపల్యం చాలావరకు తగ్గింది.

కవిత్వమంటే భావావేశం పొంది, ఆ ఆవేశాన్ని మాటలలో వ్యక్తీకరించటంకాక, భావావేశం నుండి విముక్తి పొందటమేనని కవులు తలంచసాగారు. T.S. Eliot మాటల్లో చెపితే "Poetry is not a turning loose of emotion but an escape from emotion; it is not the expression of personality but an escape from personality." అని ఆధునిక కవులు భావించసాగారు[10].

ఆధునికత్వమంటే వ్యక్తిస్వేచ్ఛ అని కొందరు కవులు భావకవితాయుగంలో భావించారు. సమాజంలో వ్యక్తి భాగస్వామియేగాని అతనికి వేరుగా వ్యక్తి స్వేచ్ఛ వుండాలనటం సరికాదని అభ్యుదయ కవులు తలచారు. సమాజం అన్ని విధాల పీడననుండి, దోపిడి నుండి విముక్తి పొందడమే నిజమైన స్వేచ్ఛకు అర్థం, పరమార్థం. "All art is conditioned by the conception of freedom which

9. The Creative Experiment - C. M. Bowra - Macmillan - 1967 Edition.

10. Tradition and Individual Talent - T. S. Eliot - Selected Essays - 1932.

rules in the society that produces it'' అని Christopher Caudwell చెప్పినట్లు సంఘ స్వరూపాన్ని అనుసరించే కళలు వికసిస్తా యని అభ్యుదయ కవులు గుర్తించారు[11].

శ్రీ వీరేశలింగం, గిడుగు రామమూర్తి పంతుల కృషి నేపథ్యంలో శ్రీ గురజాడ అప్పారావు పంజరం తలుపులు విరుగగొట్టి 1910 లో ఆధునిక కవిత్వాన్ని ప్రారంభించారు. ఆంగ్ల సాహిత్యంలో ఆధునిక కవిత్వానికి 1912 వ సంవత్సరాన్ని ఒక మలుపుగా గుర్తిస్తారు. ఐదవ జార్జి ప్రభువు 1910 లో బ్రిటీషు సింహాసనాన్ని అధిరోహించాడు. 1912 లో జార్జియన్ ఉద్యమం ప్రారంభమైంది. Edward Thomas (1878–1917) Wilfred owen (1893–1918) Robert Graves (1895– ) జార్జియన్ ఉద్యమనేతలు. 1912 లోనే Thomas Hardy (1840–1928) కొత్త కవిత్వాన్ని ప్రారంభించాడు. W.B. Yeats (1865–1939) 19 వ శతాబ్దంలో ప్రఖ్యాతుడైన కవి. ఆధునిక కవిత్వపు పంథాలో నడవాలనుకొని, ఆయన అప్పటికి యువకుడైన Ezra Pound ను తన కవిత్వాన్ని సరిచూచి, ఆధునిక కవిత్వంగా రాణించటానికి సూచనలిమ్మని కోరటం 1912 లోనే జరిగింది. ఇంగ్లీషు సాహిత్యంలో నిష్ణాతులైన శ్రీ గురజాడ 1910 లోనే ఆంగ్లంలో ఆధునిక కవిత్వావిర్భావంకంటె రెండేళ్ళు ముందుగానే తెలుగులో నవ్య కవిత్వాన్ని ప్రారంభించారు. వీరేశలింగంగారి కాలం నుండి పురిటి నొప్పులు పడుతున్న సాహిత్యం 1910 లో 'ముత్యాల సరాలు'తో ఆధునిక కవిత్వాన్ని ప్రసవించిందని చెప్పవచ్చు.

1910 నుండి 1947 ఆగస్టు 15 న భారతదేశం స్వాతంత్ర్యం పొందేవరకూ వున్న కాలాన్ని సింహావలోకనంచేసి చూస్తే తెలుగు కవిత్వాన్ని నడిపించిన కాల్పనికోద్యమం (భావ కవిత్వం), అభ్యుదయ

11. Illusion and Reality - Christopher caudwell - People's Publishing House - New Delhi - 1976 Edition.

కవితోద్యమం వీటితోపాటే సమాంతరంగా వస్తున్న సంప్రదాయ కవిత్వమూ గోచరిస్తాయి. 1947 తరువాత కవిత్వం మరింత తొందరగా మార్పులకు గురిఅవుతున్నదని చెప్పటానికి సందేహం అక్కరలేదు. "ఇప్పుడు పరుగెత్తేటంత త్వరగా ఇదివరకెన్నడూ కాలం మనదేశంలో పరుగెత్తలేదు" అని కృష్ణశాస్త్రిగారు స్వాతంత్ర్యానికి పూర్వం కాలాన్ని గురించి చెప్పారుగాని ఆ మాట యీ ముప్పై మూడేళ్ల (1947-1980) కాలానికి మరింత బాగా వర్తిస్తుంది[12].

స్వాతంత్ర్యానంతరం తెలుగు కవిత్వం ఏ విధమైన వికాసాన్ని పొందినదీ వివరించటం యీ గ్రంథం లక్ష్యం. శతాబ్దాల తరబడి మన జాతి బానిసత్వంలో మగ్గి 1947లో స్వాతంత్ర్యాన్ని పొందింది. శతాబ్దాల తరబడి మన సారస్వతం సంస్కృత వాఙ్మయ ప్రభావంలోనే వున్నది. 19-20 శతాబ్దాల్లో ఇంగ్లీషు సాహిత్య ప్రభావంతో ప్రక్రియా వైవిధ్యాన్ని, నవ్యతను పొందింది. 1910-47 సంవత్సరాల మధ్య తెలుగు కవిత్వ పరిణామాన్ని విహంగావలోకనం చేసి, ఆ తర్వాత స్వాతంత్ర్యానంతరం తెలుగు సాహిత్యంలో ఆధునిక కవిత్వ వికాసాన్ని వివరించాను.

స్వాతంత్ర్యానికి పూర్వం వృద్ధి పొందుతున్న అభ్యుదయ కవిత్వం 1948-50 ప్రాంతాలలో మహోద్యమమై విస్తరించింది. 1955 నాటికి తన శక్తిని కోల్పోయింది. 1955-1965 మధ్యకాలంలో తెలుగు కవిత్వంలో స్తబ్ధత ఏర్పడి చెప్పుకోదగినంతగా తేజస్వంతమైన ఆధునిక కవిత్వం వెలువడలేదు. 1965 తర్వాత వచ్చిన దిగంబర కవితోద్యమం మగతలోవున్న కవులను తట్టి- కాదు చరిచి, 'షాక్' చేసి, మత్తు వదిలించింది. 1970 లో విప్లవ రచయితల సంఘం ఏర్పడి 1970-1980 మధ్య కాలం, ఒక దశాబ్దం విప్లవ కవులదే అనిపించింది. 1975 తర్వాత సాయుధ విప్లవంతో ఏకీభావంలేని కవులు కవిత్వానికే కట్టుబడి- ఏ 'ఇజా'లకూ చెందకుండ, స్వీయానుభూతికే ప్రాధాన్యమిచ్చే కవిత్వం

12. 'పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము' - దేవులపల్లి కృష్ణశాస్త్రి - భారతి 948 జనవరి.

రచిస్తున్నారు. వీరిలో 'కవిసేన' కవులు, అనుభూతివాదులు, ఇంకా ఏ పేరూ పెట్టుకోకుండ స్వతంత్రులై స్వచ్ఛమైన కవిత (Pure Poetry) రాస్తున్న కవులూ వున్నారు.

కవిత్వం 1980 తర్వాత చీలుదారుల్లో నిలబడి వున్నది. వివిధ సిద్ధాంతాలు గల కవులు తలకొక దిక్కుగా ప్రయాణం సాగిస్తున్నారు. కాని అందరి గమ్యం వొకటే- శ్రీ బాలగంగాధర తిలక్ అన్నట్టు "అగ్ని జల్లినా అమృతం కురిసినా అందం ఆనందం" కవిత్వ పరమావధి అని కవులు గుర్తిస్తున్నారు. "విస్తరించాలి చైతన్య పరిధి", చెప్పేది ఏదయినా కవిలోంచి రావాలి- చించుకొని రావాలి- అప్పుడే కవిత్వం నాలుగు కాలాలపాటు నిలుస్తుంది. "ఎరవు తెచ్చుకొన్న అభిప్రాయాల"ను తగులబెట్టి నిరంతరం కొత్తదనం కోసం వెదుక్కుంటున్న కవులు కవిత్వాన్ని చైతన్య దీప్తితో నడిపిస్తున్నారని చెప్పటానికి గర్వంగా వున్నది. ఇటీవల వస్తున్న ఆధునిక తెలుగు కవిత్వం భారతీయ భాషలలో దేనికీ తీసిపోదని విజ్ఞులు భావిస్తున్నారు. తెలుగు కవితకు అంతర్జాతీయ ప్రతిష్ఠ లభించే కాలం సమీపంలోనే వున్నదని ఆశిద్దాం.

## పాఠకులకొక మనవి

సమకాలిక కవిత్వాన్ని అంచనా వెయ్యబోవటం సాహసమే. కాని భావి సాహిత్య చరిత్రకారులకు, సహృదయులకు ముందు ముందు ఈ గ్రంథం ఏ మాత్రం ఉపయోగపడినా నా కృషి వ్యర్థం కాలేదనే భావిస్తాను. కవిత్వంలోలాగే విమర్శలో కూడ విమర్శకుని ఆత్మీయత (Subjectivity) ద్యోతకం కాక తప్పదు. సమకాలిక కవులపై నా అభిప్రాయాలు వ్యక్తులపై రాగద్వేషాలతో కూడుకొన్నవి కావు. కేవలం కవిత్వాన్ని మాత్రమే దృష్టిలో పెట్టుకుని రచించినవని మనవి.

కడియాల రామమోహనరాయ్

# వి ష య సూ చి క

మొ ద టి అ ధ్యా య ం

# నవ్యకవిత్వం - అవతరణ వికాసాలు

## విద్యుచ్ఛక్తి వీరేశలింగం

విద్యుచ్ఛక్తి రాకముందున్న ప్రపంచానికీ విద్యుచ్ఛక్తి కనుగొన్న తర్వాత ప్రపంచానికీ ఎంత వ్యత్యాసం వున్నదో వీరేశలింగం గారి రచనలకు పూర్వం ఆంధ్ర సాహిత్యానికీ వీరేశలింగం గారి తర్వాత ఆంధ్ర సాహిత్యానికీ అంత భేదం వున్నది. వీరేశలింగంగారు దారి తీసిన సంఘ సంస్కరణోద్యమాలు ఆంధ్ర సంఘంలోని కశ్మలాన్ని చాలావరకు కడిగివేశాయి. ఆంగ్లేయులు వీరేశలింగం గారి ఉద్యమాలకు బాసటగా నిలిచారు. ఆంగ్ల భాషావ్యాప్తి తెలుగు సాహిత్యంలో ప్రక్రియా వైవిధ్యం లేని సంకుచితత్వాన్ని తెలియజెప్పింది.

శ్రీ వీరేశలింగం పంతులుగారిని "ఆంధ్రదేశంలో మొట్టమొదటి ఆధునిక వ్యక్తి"గా అభివర్ణించవచ్చు.[1] ఆయన "భాషా రచనయందు స్వాతంత్ర్యము వహించి తీయని వాకిండ్లు తీసినాడు."[2] "పంతులుగారికి ప్రఖ్యాతులైన వాల్టేరుతో వాఙ్మయమున సమానస్థాన మీయవచ్చును"[3]

---

1. **'యుగపురుషుడు' - నార్ల వెంకటేశ్వరరావు - 'యుగపురుషుడు వీరేశలింగం': స్మారకోత్సవ సంఘం ప్రచురణ.**
2. **'మూల పురుషుడు' - రాయప్రోలు సుబ్బారావు - 'యుగపురుషుడు వీరేశలింగం' స్మారకోత్సవ సంఘం ప్రచురణ.**
3. **పానుతాప ప్రకటన - కట్టమంచి రామలింగారెడ్డి - ఆంధ్రపత్రిక - 21 వ తేదీ జూన్ 1919-మంజుశ్రీ రచించిన వీరేశలింగం - సంక్షిప్త జీవిత చరిత్ర'కు అనుబంధంగా చేర్పబడినది.**

సాహిత్య రంగంలో ఆయన ప్రౌఢత్వం నుండి సులభశైలికి మరలారు. 'శుద్ధాంధ్ర నిర్వచన నిరోష్ఠ్యనైషధం' రచించి పండితులను మెప్పించారు. నిగ్రహ తంత్రాన్ని వ్రాసి పండితులచేత సత్కరింపబడ్డారు. తర్వాత కాలంలో ఆయన దేశకాల పరిస్థితులను గమనించి అజ్ఞానాన్ని భేదిస్తూ, సులభశైలిలో పాఠకులకు కూడ బోధపడే గ్రంథాలు రాశారు. స్త్రీ విద్య కోసం అహరహమూ కృషిచేశారు. ఐదవతరగతి వాచకంతోసహా పిల్లలకు, స్త్రీలకు, సామాన్యులకు ఉపయోగపడే రచనలు చేశారు. "దేశాభిమాన మనగా జనులమీద అభిమానమే" అని ఆయన విశ్వసించారు. గ్రామ భాషానిరసన సభల్లో పాల్గొన్న పంతులుగారు సత్యం గుర్తించాక, తాము అధ్యక్షులుగా, గిడుగు రామమూర్తి పంతులుగారు కార్యదర్శిగా "వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమాజాన్ని" స్థాపించారు. 'గద్యతిక్కన' బిరుదు వహించిన వీరేశలింగంగారు పద్య కవిత్వంలో కూడ అంతటి సారళ్యాన్ని సాధించారు. ఆయన దృష్టికి తెలుగు కవితాసరస్వతి నియమాల సంకెళ్ళలో బాధపడుతూ, విలపిస్తూ కనిపించింది. తెలుగు భాషకు, కవిత్వానికి స్వేచ్ఛను ప్రసాదించి, అంధకారం తొలగిపోయేముందు వేగుచుక్కలాగ వీరేశలింగం పంతులుగారి రచనలు వెలుగును ప్రసాదించాయి.

"నే నారంభించిన కాలమందు తెలుఁగులో నిప్పటివలె వివిధములైన పుస్తకములు లేవు.... తెలుఁగులో మొదటి వచన ప్రబంధమును నేనే చేసితిని; మొదటి నాటకమును నేనే తెనిగించితిని; మొదటి ప్రకృతి శాస్త్రమును నేనే రచించితిని; మొదటి ప్రహసనమును నేనే వ్రాసితిని; మొదటి చరిత్రమును నేనే విరచించితిని; స్త్రీలకై మొదటి వచన పుస్తకమును నేనే కావించితిని"[1] అని పంతులుగారు స్వయంగా చెప్పుకున్నారు. వీటిలో ఒకటిరెండు పుస్తకాలవిషయంలో పంతులుగారే మొదటివారనటాన్ని పరిశోధకు లంగీకరించకున్నా, ఆయన మార్గదర్శిత్వాన్ని ఎవ్వరూ కాదనలేరు. క్షీణయుగ కవిత్వం నుంచి విముక్తిని ప్రసాదించిన పంతులుగారు కవిత్వం "మూగ చెవిటివారి ముచ్చట" కాదని గుర్తించి,

1. స్వీయచరిత్ర - కందుకూరి వీరేశలింగం - 1915 ముద్రణ - 232 వ పేజీ.

సరళమైన రచనకు దారి తీశారు. చీకటిని ఛేదించి ఉషోరేఖలు తోపించిన పంతులుగారి సేవను, బహుముఖ ప్రజ్ఞను, సంఘ సంస్కారదీక్షను, త్యాగనిరతిని గుర్తించి, గౌరవించి ఆయనను యుగపురుషునిగా సంభావించగలం, కాని, ఆధునిక కవిత్వానికి ఆయనను ఆద్యునిగా పేర్కొనలేము. వీరేశలింగంగారి కవిత్వంలో విశ్వశ్రేయస్సును కాంక్షించే సదుపదేశాలు ఎన్నో వున్నాయి. కాని, కావ్యశిల్పం దృష్ట్యా చూచినప్పుడు ఆయనను ఆధునిక కవి అనలేము. ఆధునికత్వానికి దారితీసిన వారుగా, నూతన మార్గాన్ని సుగమం చేసిన వారుగా ఆయనను జ్ఞాపకం పెట్టుకున్నా, ఆధునిక కవిగా తలచుకోదగిన కావ్య మేదీ ఆయన రాయలేదు. ఆయన ఋణం జాతి ఏనాటికీ తీర్చుకోలేనిది. శ్రీ చిలకమర్తి వారు పలికినట్లు "తన దేహము, తన గేహము, తన కాలము, తన ధర్మము, తన విద్య, జగజ్జనులకు వినియోగించిన ఘనుడు" వీరేశలింగం. "అభినవాంధ్రకు ఆయన ఆద్యబ్రహ్మ."[5] ఆధునిక కవులకు, పూజనీయుడు.

## కట్టమంచి భావవిప్లవం

గతానుగతికమైన మార్గంలో ప్రయాణం చేస్తున్న పండితవర్గం 'కవిత్వతత్త్వ విచారము'ను చూచి తమ కాళ్ళక్రింద భూమి తొలుచుకుపోతున్నట్లు తలచారు. రామలింగారెడ్డిగారి తీవ్రభావాల ముట్టడికి ఆనాటి విమర్శకులు తల్లడిల్లిపోయారు. సంస్కృత ఆలంకారికులను సరిగా అర్థం చేసుకోకుండ వారి మాటలను చిలకపలుకులుగా వల్లిస్తూ, అప్పకవివంటి సంకుచిత దృష్టిగల లాక్షణికుల మాటలను వేదవాక్కులుగా నమ్ముతున్నవారికి 'కవిత్వ తత్త్వవిచారము' దుర్నిరీక్షమై తోచింది.

శ్రీ పింగళి లక్ష్మీకాంతము భావించినట్లు "విమర్శ మార్గమును బాహిరజగత్తునుండి ఆంతరజగత్తునకు కొనిపోయిన ప్రథమాంధ్ర

5. 'గద్యతిక్కన, సంఘ సంస్కర్త కందుకూరి వీరేశలింగం పంతులు - ఆరుద్ర - 'వికాసలహరి' - యువభారతి ప్రచురణ - 1973.

విమర్శన గ్రంథము'' కవిత్వతత్త్వ విచారము.[6] ''కావ్యము నందలి అంగాంగములకు గల కలయిక ముఖ్యము'' అని హెచ్చరిస్తూ రామలింగారెడ్డిగారు కావ్యంలో కథ, కల్పనలు, వర్ణనలు, రసము, ధ్వని, ఔచిత్యము, గుణములు, దోషములు అని విడివిడిగా వర్గీకరించి విమర్శించే పద్ధతి సరియైనది కాదని ఋజువు చేశారు. వీరేశలింగం పంతులుగారి కాలంలో కూడ కావ్యాంశాలను విడివిడిగా తీసుకొని విమర్శించటమే జరుగుతూ వుండేది. మొట్టమొదటిసారిగా రామలింగారెడ్డిగారే కావ్యాన్ని విమర్శించేటప్పుడు, ఆ కావ్యం చదివిన మీదట సహృదయునిలో కలిగే అనుభూతిని దృష్టిలో వుంచుకుని విమర్శ చేశారు. విమర్శ అంటే గుణదోష విచారణమనే మాట తెలుగు సాహిత్య విమర్శలో రామలింగారెడ్డిగారి రాకతోనే సార్థకమైంది. విమర్శకునికి కవి ఎంత ఇష్టమైనవాడైనా ఆ కవి దోషాలను వెల్లడించటంలో ఏమాత్రమూ మొగమాట పడకూడదని రామలింగారెడ్డిగారు నమ్మారు. ఆయనకు గాఢంగా నచ్చిన తిక్కన, పింగళి సూరనల కావ్యాలను విమర్శించేటప్పుడు కూడ గుణాలను విశదీకరించడంతోపాటు, దోషాలను బయటపెట్టటానికి ఏమాత్రం వెనుదీయలేదు.

సాహిత్య విమర్శ అంటే శబ్దాల సాధుత్వాసాధుత్వ చర్చలు, కవి కులగోత్ర, శాఖానామాదులు, మతపరమైన విశ్వాసాల ఆక్షేపణలూ, కేవలం అష్టాదశ వర్ణనలు సరిపోయాయా లేదా అని చూచే సంకుచితత్వమూ - అన్నీ మారిపోయి 'కవిత్వతత్త్వ విచారము'తో సాహిత్య విమర్శలో ఒక నూతన శకం ప్రారంభమైంది.

భావవిప్లవాన్ని కోరిన రామలింగారెడ్డిగారు భాషావిప్లవాన్ని కోరలేదు. గిడుగు, గురజాడల వ్యావహారిక భాషోద్యమం వీరిని కదిలించలేదు. వీరు రచించిన 'ముసలమ్మ మరణము' తెలుగు కవిత్వంలో ఒక కొత్త మార్గాన్ని ప్రవేశపెట్టింది. ''ఒకానొక త్రిలింగ దేశీయునిచే

---

6 ఉపోద్ఘాతము - పింగళి లక్ష్మీకాంతము - కట్టమంచి రామలింగారెడ్డి గారి 'వ్యాసమంజరి' - ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రచురణ 1947.

వ్రాయబడి బ్రౌన్ దొరగారిచే ప్రకటింపబడిన అనంతపుర చరిత్రము అను గ్రంథమునుండి ఇందలి కథఁ గైకొంటిని. అయినను కొన్ని యెడల రసాధిక్యమునకై నూతన కల్పనలు చేసినాఁడ" అని కావ్యం మొదటి కూర్పు- 'ముఖపత్రము'లో పేర్కొన్నారు. ముసలమ్మ అనే ఒక స్త్రీ గ్రామక్షేమాన్ని కోరి, తన త్యాగంతో ఊరిచెరువు గట్టుతెగి ఊరిని ముంచెయ్యకుండా వుంటుందని నమ్మి, ఆత్మాహుతి గావించు కొనటం యీ కావ్యంలో ఇతివృత్తం. కళాశాలలో చదువుతున్నప్పుడు, క్రిందటి శతాబ్దం చివరలో 1899 లో ఆయన యీ కావ్యం రచించారు. రెడ్డిగారి శైలి ప్రబంధ ధోరణికి సమీపమైంది. ఆధునిక రీతులు చాల తక్కువ. ఒక మూఢనమ్మకానికి బలం కల్పించటం వలన ఇతివృత్తమూ శ్రేష్ఠమైనది కాదు. ఆ తర్వాత కాలంలో రామలింగారెడ్డిగారు 1936 లో 'నవయామిని' కావ్యం రచించారు గాని అది బిల్హణీయానికి మార్పులూ, కూర్పులూ చేసినదేకాని ఆధునికమైనది కాదు. 'కవిత్వతత్త్వ విచారము'తో సాహిత్య విమర్శలో నూతన మార్గం ఏర్పరచి, అధునిక కవిత్వం సరియైన మార్గంలో సాగటానికి ఆయన తోడ్పడ్డారు.

## వాగర్థాలు తిరుపతి వేంకటకవులు

శ్రీ తిరుపతి వేంకటకవులను "అద్యతనాంధ్ర కవి ప్రపంచ నిర్మాతలుగా", వారి కవిత్వాన్ని ప్రాచీన కవిత్వానికి భరత వాక్యంగా, నవ్య కవిత్వానికి నాందీ వాక్యంగా భావించవచ్చు. పద్యరచనలోని ధారాశుద్ధి వలన, అహ్లాదకరమైన సంభాషణారీతిలో వుండటం వలన వీరి పద్యాలు పండిత పామరులందరికీ ఆనందాన్ని కలిగించాయి. "బావా ఎప్పుడు వచ్చితీవు; అలుగుటయే యెఱుంగని మహామహితాత్ము డజాత శత్రు ధేయలిగిననాడు" మొదలైన పద్యాలు పసులకాపరులు కూడ పాడుకొని ఆనందించారంటే వీరి కవిత్వప్రాశస్త్యానికి వేరే నిదర్శనం అక్కరలేదు. అవధాన విద్యలో ఆరితేరినవారై, నానా రాజ సందర్శనం చేసి, ఎన్నో "సాహిత్య యుద్ధాల"లో పాండిత్య వీరం ప్రదర్శించి "కింకవీంద్ర ఘటాపంచానను" లయ్యారు. శ్రీ విశ్వనాథవా రన్నట్లు వానకు

దడియనివారు, వారి అవధాన మృదూక్తి మరందధారలోఁ గడుగని వారు తెనుగునాడున కానరారు.

"కాలముఁబట్టి దేశమును గాంచి ప్రభుత్వము నెంచి దేశభాషాలలి తాంగి మాఱుటది సత్కవి సమ్మత"మని పలికి, ఔచిత్యాన్ని గమనించి ఆంధ్ర కవిత్వంలో అన్యదేశ్యాలను వాడవచ్చునని తిరుపతి వేంకట కవులు విశాల హృదయాన్ని ప్రదర్శించారు. "శ్రవణానందము, పాణిగృహీత" కావ్యాలు రసికులను ఎంత ఆనందింపజేసినా, వాటిని ఆధునిక కావ్యాలని చెప్పలేము. సంప్రదాయపు విత్తులోనుండి మొలకెత్తుతున్న నవ్యకవితాంకురాలుగా మాత్రమే వీటిని గురించి భావించవచ్చు. ఆధునిక సమాజపు నాడీ స్పందన యీ కావ్యాలలో వినిపించదు. ఇప్పటి సాహిత్యాన్ని గూర్చి పర్యాలోచన చేసేటప్పుడు వేశ్యావృత్తి వుండాలా, అక్కర లేదా అని చర్చించటం వ్యర్థం. ఈ సమస్యను ఆధునిక సమాజం పరిష్కరించింది. వేశ్యావృత్తిని కనీసం శాసనరూపంలోనైనా ప్రభుత్వం నిషేధించింది.

తిరుపతి వేంకటకవులు రచించిన పాండవోద్యోగ, విజయాది నాటకాలను నేటికీ ప్రేక్షకులు ఆదరిస్తున్నారు. సాంఘికనాటకా లెన్ని వచ్చినా, వీరి నాటకాలలో కలకండ పలకులవంటి పద్యాలు, సంభాషణలు తెలుగు వారికి మిక్కిలి ప్రీతిపాత్రము లైనాయి. మహాభారతంలో పాత్రలు, తెలుగు వారికి మిక్కిలి సన్నిహితంగా వీరి నాటకాల్లో కన్పిస్తాయి,

కవిత్వంలో వ్యాకరణము, భాషా విషయాల్లో స్వతంత్రతను వహించిన వీరు కొన్ని అంశాల్లో ఆధునికతకు వ్యతిరేకులు. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి "జాతకచర్య ఇటీవలిచర్య"లో దేవాలయాల్లో హరిజన ప్రవేశం వంటి ఆధునిక దృక్పథాన్ని వీరు వ్యతిరేకించటం స్పష్టంగా కానవస్తుంది.

పద్యం రాయటం బ్రహ్మవిద్యేమీ కాదనీ, మంచినీళ్ళ ప్రాయమనీ ఆచరణలో నిరూపించిన తిరుపతి వేంకటకవులు ఆధునిక కవులకు

పద్యమంటే భూతమనే భీతిని వదలగొట్టారు. సమర్థుడైన కవిభావ ప్రకటనకు ఛందస్సు ఆటంకం కాదని వీరి కవిత్వం నిరూపించింది. నియమాల సంకెళ్ళను సడలించి నవ్యకవిత్వానికి నాందీగీతం పలికిన శ్రీ తిరుపతి వేంకటకవులను ఆధునిక కవులు ప్రత్యక్షంగా, పరోక్షంగా గురువులుగా అంగీకరించి శిష్యులైనారు. ఒక కాలంలో ఆధునిక కవులకు "చెళ్ళపిళ్ళ వేంకన గురు వంచు చెప్పికొనంగా నది గొప్ప."

## చిలకమర్తి దేశభక్తి కవిత్వం - "భరతఖండంబు చక్కని పాడియావు"

సంఘసంస్కారోద్యమాలలో వీరేశలింగం గారికి తోడునీడయై, జాతీయతాభావ ప్రచారంతో మరొక్క అడుగు ముందుకు వేసిన కవి శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం. వారి పేరు వినగానే 'గయోపాఖ్యానం' నాటకం, 'గణపతి' నవల జ్ఞాపకానికి వస్తాయి. "అల్లుడా రమ్మని ఆదరంబున బిల్వ" మొదలైన పద్యాలు తెలుగు దేశంలో మార్మోగిపోయాయి. ప్రహసనాలు, నవలలు, నాటకాలు, వ్యాసాలు అన్నిటిలో ఆయన సంఘశ్రేయస్సును కాంక్షించే రచనలే చేశారు. "భరత ఖండంబు చక్కని పాడియావు" పద్యం దేశసేవకులకు తారకమంత్రమైంది. బిపిన్ చంద్రపాల్ ఉపన్యాసానికి ముగ్ధులై జాతీయ భావాలను ప్రబోధించిన శ్రీ చిలకమర్తి తన కవిత్వాన్ని ఎక్కువగా దేశసేవకే అర్పించారు. ఆధునికమని చెప్పదగిన కావ్యమేదీ ఆయన రాయకపోయినా, ఆయన ప్రహసనాల్లో, నవలల్లో మన సంఘంలో లోటుపాట్లను చక్కగా తెలియజెప్పారు. ముందుచూపు గల సాహిత్యవేత్తగా, సంస్కార ప్రబోధకమైన రచనలు చేసిన కవిగా వారిని తెలుగుజాతి గౌరవిస్తుంది. అంధత్వం భౌతికంగా ఆయనకు బాధ కలిగించినా, రచనల్లో మానవ మనస్తత్వ పరిశీలన ఆయిన నిశితదృష్టిని వెల్లడిస్తుంది. అభ్యుదయ రచయితలచే సత్కరింపబడిన చిలకమర్తి ఆధునిక కవులకు ఆచార్యు లనటం అతిశయోక్తి కాదు.

## ప్రాచీన అధునాతన భావాల సమ్మేళనం - పానుగంటి

సాంఘిక దురాచారాలను నిశితమైన వ్యంగ్యంతో చీల్చిచెండాడి జాతికి మేలుచేసిన శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు ప్రతిభ 'సాక్షి' వ్యాసాలలో పరాకోటి కెక్కినది. వీరి సూక్ష్మదృష్టిని తప్పించుకుపోయిన అంశమేదీ ఆ కాలంలో లేదనడం అతిశయోక్తి కాదు. వచనంలో కావ్య భాషాశైలిని ప్రవేశపెట్టి అనితర సాధ్యమైన శిల్పనైపుణ్యాన్ని ప్రదర్శించారు.

తాము నమ్మిన మూఢవిశ్వాసాలు చెల్లాచెదరై నూతన ప్రపంచంలోకి అడుగుపెడుతున్నట్లు సంప్రదాయప్రియులూ; తా మనుసరిస్తున్న నూతన విధానాలు జాతి కెంత తలవంపు లౌతున్నాయో, తమ ధన, మాన, ఆరోగ్యాల కెంత చేటుగా పరిణమిస్తున్నాయో తెలుసుకుని ఆధునికులూ పానుగంటివారి శక్తికి లోబడ్డారు. శస్త్రచికిత్సకుడి నైపుణ్యాన్ని వీరు సమాజ వ్రణాలకు చికిత్స చేయటంలో చూపెట్టారు. "జంఘాలశాస్త్రి, వాణీదాసుడు, కాలాచార్యులు, బొఱ్ఱయ్యసెట్టి, సాక్షి" తెలుగు సాహిత్యంలో చిరస్మరణీయమైన పాత్రలుగా మిగిలిపోయారు.

"పాదుకాపట్టాభిషేకము, పట్టభంగరాఘవము, రాధాకృష్ణ, కోకిల" మొదలైన నాటకాలలో రమ్యమైన సన్నివేశాలను, చవులూరించే పద్యాలను రచించినప్పటికీ ఇతివృత్త స్వీకరణలో శ్రీ పానుగంటి ఆధునికులు కారు. 'కంఠాభరణము'లో వీరు కల్పించిన హాస్యం కడుపుబ్బ నవ్వించినా, కులాలను, శాఖలను విమర్శించటంచేత తక్కువ తరగతిహాస్య మనక తప్పదు.

వ్యావహారిక భాషోద్యమాన్ని వ్యతిరేకించిన 'ఆంధ్ర సాహిత్య పరిషత్తు'తో కలిసి వీరుకూడ భాషాసంస్కరణకు అడ్డు నిలిచారు. సంప్రదాయంలో మంచిని స్వీకరించాలి గాని, ఆధునికత్వపు కాలం వెర్రిలో పడిపోకూడ దని పానుగంటి వారు తలచారు. Adison రచించిన Spectator వ్యాసాల ప్రేరణతో 'సాక్షి' రచనకు పూనుకున్నప్పటికీ

సాక్షి వ్యాసాలు ఇంగ్లీషుకు అనువాదమూ, అనుకరణా కావు; సమకాలిక సంఘాన్ని నిలువుటద్దంలో చూపించిన 'సాక్షి' వ్యాసాలు ఆధునిక ఆంధ్ర సాహిత్యానికి పుష్టిని చేకూర్చాయి.

## ప్రతాపరుద్రీయం - పాత్రోచిత భాష

"దేశ క్షేమమునకు భాషాక్షేమమే పునాది" అని శ్రీవేదం వేంకటరాయశాస్త్రి ఆధునిక కవి పండితులను హెచ్చరించారు.[7] 'శృంగార నైషధము, ఆముక్త మాల్యద'వంటి ప్రౌఢ కావ్యాలకు వ్యాఖ్యానం రచించి భాషాసేవ చేసిన శ్రీ వేంకటరాయశాస్త్రి గ్రాంథికాంధ్రాన్నే అభిమానించారు. కాని, నాటకాల్లో పాత్రోచితభాష వుండవచ్చునని ఆధునికతకు చోటిచ్చారు. వ్యాకరణం మీద అపరిమితమైన గౌరవం వున్నటికీ 'విసంధి వివేకము'లో విసంధిని అంగీకరించి ఆధునిక కవులకు కొంత స్వేచ్ఛను కల్పించారు. 1897 లో రచించిన ప్రతాపరుద్రీయం లోనే పాత్రోచిత భాషను అంగీకరించటం వీరి స్వతంత్ర ప్రవృత్తికి నిదర్శనం. సాంఘికాచారాల్లో వీరు సనాతనులే. విధవా వివాహాది సంస్కరణలను వీరు తీవ్రంగా వ్యతిరేకించారు.

మహాపండితులైన వేదంవారు ప్రతాపరుద్రీయంలో పాత్రోచిత భాషను ప్రవేశపెట్టడం ఆధునిక కవులకు నైతికబలాన్ని సమకూర్చింది. కాలంతోపాటు కదిలివచ్చి అధునిక భావాలను అంగీకరించకపోయినా వేదం వారు తనకు తానే ఒక వ్యవస్థయై ఆధునికులకు మార్గదర్శకమైన పాత్రోచితభాష, విసంధి వివేకముల నొసగారు. సంస్కృత నాటకానువాదాలు, బొబ్బిలియుద్ధము, ఉషా పరిణయమువంటి స్వతంత్ర నాటకాలు వేదంవారి బహుముఖ ప్రజ్ఞకు నిదర్శనమైనవి. వేదంవారి రచనల నుండి ఆధునికులు గ్రహించవలసిన ఉత్తమభావా లెన్నో వున్నాయి - ఆధునిక కవిత్వానికి ఆయన చేసిన సేవ పరోక్షమైనదనే చెప్పాలి.

7. అధ్యక్షోపన్యాసము : ఆంధ్ర సాహిత్య పరిషత్తు - 1919.

## భక్త చింతామణి భావగాంభీర్యం

'భక్త చింతామణి' శతకం రచించి శ్రీ వడ్డాది సుబ్బారాయుడు ఆధునిక కవిత్వానికి ఎనలేని గౌరవాన్ని సమకూర్చారు. పద్యరచన, వ్యాకరణము, అలంకార నియమాలూ సంప్రదాయబద్ధమైనవే అయినా వడ్డాదివారి భావాలు భావప్రకటనారీతి మాత్రం ఆధునికమైనవే. 'వేణీ సంహారము మొదలైన నాటకానువాదాలున్నా ఆయన ప్రతిభ 'భక్త చింతామణి'లోనే బాగా వెల్లడి అయింది. కవులు గతానుగతికులై పూర్వ కవుల భావాలకీ చిలవలు పలవలు కల్పించడం కాక, నూతన భావాలను వ్యక్తీకరించగల రని శ్రీ వ. సు. రాయకవిగారు ఋజువు చేశారు. పూర్వకవులను స్మరించి, "ఇప్పు డటువంటి కవి యేడీ?" అని ప్రశ్నించేవారికి వ.సు. రాయకవిగారి కవిత్వం చక్కని జవాబు -

## ఆధునిక కాలంలో పురాణేతిహాసాలు రచించిన కవులు

పురాణాలను, భారత రామాయణాలను తెలుగులో రచించిన వావిలకొలను, జనమంచి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి ప్రభృతులు సామాన్య ప్రజలకు పూర్వ గ్రంథాల వైశిష్ట్యాన్ని తెలియజెప్పారు. ఆధునిక కవిత్వానికి, పూర్వకవిత్వానికి గల వ్యత్యాసాలను అర్థం చేసుకోవటానికి వీరి రచనలు తోడ్పడ్డాయి. ఈ విధంగా వీరి రచనలు నవ్య సాహిత్య వికాసానికి పరోక్షంగా తోడ్పడ్డాయి.

## సాంస్కృతిక పునరుజ్జీవనంలో మానవోద్యమము :

## హైందవ జాతీయోద్యమాలు

19 వ శతాబ్ది ప్రారంభంలో భారతదేశంలో జాతీయతా భావం పెంపొందింది. భారతీయసాంస్కృతిక పునరుజ్జీవనంలో(Renaissance) బెంగాలు ప్రముఖపాత్ర వహించింది. రాజా రామమోహన రాయ్ సాంఘిక మత విశ్వాసాలపై తిరుగుబాటుచేసి మానవోద్యమానికి దారి తీశాడు. ప్రాచీన భారతీయ సంస్కృతిని తృణీకరించకుండానే, అందులో

వున్న మంచిని మాత్రమే తీసుకోవాలంటుంది యీ ఉద్యమం. జాతికి స్వాతంత్ర్యం ఊపిరి పీల్చటంలాంటిదనీ, "జగత్తులో మానవుడే మకుట ధారి" అనీ యీ ఉద్యమం తలచింది. 'బ్రహ్మ సమాజం' జాతీమతాల సరిహద్దుల్ని తుడిచివేసి, ఏకేశ్వరోపాసనను స్వీకరించి, నూతన విలువ లను ప్రసాదించింది. ఆంధ్రదేశంలో యీ ఉద్యమానికి శ్రీ వీరేశలింగం పంతులు, బ్రహ్మర్షి రఘుపతి వేంకటరత్నం నాయుడు నేతలు - వీరి ప్రభావం ఆధునిక కవులను నూతన యుగంలో ప్రవేశపెట్టింది. గురజాడ అప్పారావుగారిలో మానవోద్యమం ఏపుగా ఎదిగి నిత్యసువాసనా భరితా లైన పూలు పూచింది. వీరేశలింగం గురజాడల కాలంలో కవులు బ్రిటీషు చక్రవర్తిని ద్వేషించలేదు, బ్రిటీషువారి పరిపాలన తొలగిపోవాలని కోర లేదు. పరపరిపాలన తొలగిపోవటం కంటె ముందుగా మన సంఘాన్ని మనం సంస్కరించుకోవాలన్నది వారి దృష్టి.

ప్రజల్లో ధార్మిక జీవనాన్ని పెంపొందించటానికి రఘుపతి వెంకట రత్నం నాయుడుగారు కృషిచేశారు. "Morality Uivifies religion; religion sanctifies morality" అని ఆయన ఉద్దేశ్యం.[8] ఆయన నైతికవర్తనమూ, బోధనలలో "ఋషివాటికల నుండి పఱతెంచు నామ్నాయపూతగంగామృతమ్ము" వేలాదిమంది శిష్యుల జీవన విధా నాన్ని మార్చివేశాయి. కొల్లనికావేశం గల కవులకవిత్వంలో మాన వత్వపు విలువలు పాదుకొన్నాయి.

భారత రాజకీయ రంగంలో మహాత్మగాంధీ అవతరణతో 'లోక మాన్య' తిలక్ జాతీయతా భావం, హైందవ మతాభిమానం వెనుకబట్టి మానవోద్యమమే వ్యాపించింది. విశ్వకవి రవీంద్రుల మానవతావాదం ఈ శతాబ్దారంభంలో తెలుగు కవులకు బాగా నచ్చింది.

8. 'Grace Abiding'- Dr. R. Venkataratnam-Published by R. Venkataratnam Centenary celebrations Committee 1965.

శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి వివరించినట్లు ఆధునిక కాలాన్ని ప్రాభావితం చేసిన మరొక మహోద్యమం హైందవ జాతీయోద్యమము.[9] దయానంద సరస్వతీ నేతృత్వంలో 'ఆర్యసమాజం' హిందూమతాన్ని సంస్కరించి, ఆర్షధర్మాన్ని పునరుద్ధరించటానికి ప్రయత్నించింది. రామకృష్ణ పరమహంస, వివేకానందుల బోధనలు హిందూమతంపై అభిమానం కలిగించాయి. సాహిత్యలో ద్విజేంద్రలాల్‌రాయ్ యీ ఉద్యమాన్ని మరింతముందుకు తీసుకుపోయి, ప్రాచీన గాథలపై మోజును పెంచారు. ఆంధ్రదేశంలో రాయప్రోలు సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ గార లీ ఉద్యమానికి ప్రతినిధులు. రాయప్రోలు వారు ఆంధ్ర జాతి ఔన్నత్యాన్ని కొనియాడిన విధానం విశ్వనాథ, జాషువా, ఏటుకూరి, తుమ్మల మొదలైనవారికి ఆదర్శమైంది, మానవతావాదం సంకుచితమై వీరాంధ్ర పౌరుషాన్ని పెంపొందించింది. పారతంత్ర్యంలో మగ్గుతున్న ఆ రోజుల్లో, కవులకు వీరరసాన్ని పోషించటం సహజగుణమైంది. గురజాడ అప్పారావుగారిలో మాత్రం పాత కొత్తల మేలు కలయిక అందంగా రూపుదిద్దుకొని, మానవతావాదం సంకుచితత్వానికి చోటీయ లేదు.

మానవోద్యమం, హైందవ జాతీయోద్యమం నూతనమైన కొంతిని పరిశుభ్రమైన గాలిని అందించి తెలుగు సాహిత్యాన్ని చైతన్యవంతంగా ముందుకు నడిపించాయి.

## తెలుగు కవిత్వంలో వెలుగుబాట; "అడుగుజాడ గురజాడది"

తెలుగు సాహిత్యంలో ఆధునిక కవిత్వానికి ఆద్యులు శ్రీ గురజాడ అప్పారావు. 1910 లో ఆయన రచించిన 'ముత్యాలసరాలు'లో ఛందస్సు, ఇతివృత్తము, భావవ్యక్తీకరణా, అలంకారసామగ్రి అన్నీ ఆధునికమైనవే. అప్పటికే "జీవితమంత గొప్పదైన" 'కన్యాశుల్కం' రచించి

1. ఈ అధ్యాయంలో ముఖ్యాంశాలను దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు రచించిన పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము భారతి - జనవరి - 1949 - నుండి స్వీకరించాను. వారికి కృతజ్ఞుణ్ణి.

ప్రజల భాషకు, ప్రజా జీవితానికి అతిసన్నిహితులైన గురజాడవారు కవిత్వంలో కూడ నూతన రీతులను ప్రవేశపెట్ట దలచారు. 'గుమ్మడేడీ గోపితల్లీ' అనే జానపదగేయము, కర్ణాట భాషలో ఒక షట్పది, పారసీ భాషలో ఒక గజల్ వృషభగతి రగడ మొదలైనవి 'ముత్యాల సరం' ఛందస్సుకు మూల మని పరిశోధకులు భావించారు. కాని, ముత్యాలసరం పేరు వినగానే గురజాడవారి పేరే జ్ఞాపకం వస్తుంది. "ఒక నూత్నావేశానికి వాహనంగా చేసికొని ఒక స్వతంత్ర కవిత్వాన్ని విడుదల "చేసిన ఘనత గురజాడ వారిదే."[10]

"గుత్తునా ముత్యాల సరములు
కూర్చుకొని తేటైన మాటల
క్రొత్తపాతల మేలు కలయిక
క్రొమ్మెరుంగులు చిమ్మగా"

అని ఆరంభించిన కవిత్వం తెలుగులో ఆధునికత్వానికి కవాటాలు తెరిచింది. శ్రీ గురజాడ "వైతాళికులనే మేలుకోలిపినవాడు; మార్గదర్శి."[11] ఆయన చూపిన మార్గంలో ఆధునిక కవులు ప్రయాణించినా, అందరూ ఆయనను చేరుకోలేకపోయారు. "అప్పరాయోపజ్ఞకమైన సరసగీతాలను రాయప్రోలు సుబ్బారావుగా రందుకున్నారు."[12] ఆ తర్వాత కవులు రాయప్రోలు వారిని అనుసరించినంతగా గురజాడవారిని అనుసరించలేదు. గురజాడవారి కవితా రీతి కొంత బసవరాజు అప్పారావు, కవికొండల వెంకటరావు గారలలోను, ఆ తర్వాత శ్రీశ్రీగారిలోనూ ప్రస్ఫుటంగా కన్పిస్తుంది.

10. "ముత్యాలసరం ఒక కృషి" - శ్రీశ్రీ - 'గురజాడ'-విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ - ప్రథమ ముద్రణ - 1959.

11. 'గురజాడ అప్పారావు' పరిచయం - ముద్దుకృష్ణ: 'వైతాళికులు' - ఆదర్శ గ్రంథమండలి - ఆరవముద్రణ - 1966

12 నవ్యసాహిత్య పరిషత్ అధ్యక్షోపన్యాసము - విశ్వనాథ సత్యనారాయణ- భారతి - ఏప్రిల్ 1940.

"ఆకులందున అణగి మణగి
కవిత కోవిల పలకవలెనోయి
పలుకులను విని దేశమం దభి

మానములు మొలకెత్తవలెనోయ్" అనే పంక్తులలో నూత్న కవితావేశం సహజంగా, అప్రయత్నంగా వెలువడింది. "దేశమంటే మట్టి కాదోయ్, దేశమంటే మనుషులోయ్" అని ఎలుగెత్తి చాటి "దేశమును ప్రేమించుమన్నా" అని అన్ని అలంకారాలను దుల్చివేసి, అన్ని సంకెళ్ళను విదల్చి, "భావి కవులకు మేగ్నకార్టా" వంటి దేశభక్తి గీతాన్ని ఆయన రచించాడు. "పావురంలాగ ప్రశాంతంగా రవళిస్తూనే, సింహంచేసే క్ష్వేళాధ్వనిని స్ఫురింపజేస్తుంది." దేశభక్తి గీత మని శ్రీశ్రీ దీన్ని వేనోళ్ళ కొనియాడారు.[13]

కొత్త కవిత్వాన్ని మెచ్చలేని సనాతనులను యీసడిస్తూ గురజాడ "మెచ్చనంటావీవు; నీ విక మెచ్చకుంటే మించిపాయను; కొయ్య బొమ్మలె మెచ్చు కళ్ళకు కోమలుల సౌ రెక్కునా ?" అని అవహేళన చేశారు. "యెల్లలోకము వొక్కయిల్లై వర్ణభేదము లెల్లకల్లై వేల నెరుగని ప్రేమబంధము వేడుకల కురియ"గా విశ్వమానవ ప్రేమను ప్రబోధిస్తూ గళం సారించారు. లోకమందలి మంచిచెడ్డ లెరుగని లోకులకు ఆయన మంచిని బోధించారు. సంఘసంస్కార ప్రేరకమైన లవణరాజు కల, కన్యక, పూర్ణమ్మ, మనిషి-లంగరెత్తుము, మొదలైన కావ్యాలు రచించి ఆయన జాతికి నిద్దురమత్తు వదిలించి, నవచైతన్యాన్ని కలిగించారు. కవిత్వమంటే సామాన్య ప్రజలకు దూరమైన బరువు భాషలో వుండనక్కరలేదని ఋజువుచేశారు. పాతకొత్తల మేలు కలయికలో తేటైన మాటల కూర్చుకొని నవ్యరీతులకు వొరవడి పెట్టారు.

"కన్నుగానని వస్తుతత్త్వము కాంచ నేర్చరు లింగిరీజులు; కల్ల నొల్లరు; వారి విద్యల కరచి సత్యము నరసితి" నన్నట్లే శ్రీ గురజాడ

13. 'పరిచయం' – 'ముత్యాలసరాలు'–గురజాడ – విశాలాంధ్ర ప్రచురణాలయం నాల్గవ ముద్రణ – 1961.

ఆధునిక ప్రపంచపు పోకడను సవ్యంగా అర్థం చేసుకున్నారు. మేధా శక్తి హృదయ సౌకుమార్యాన్ని దెబ్బ తీయకుండా కాపాడుకున్నారు. కాలానికి ముందుగానే సత్యాన్ని దర్శించిన కవి, కవిత్వంలో ఏ మాత్రం అస్పష్టతకు, అయోమయానికి చోటివ్వక, కొద్దిపాటి అక్షరజ్ఞానం కలిగిన వారందరికీ ఆస్వాదయోగ్యమైన కవిత్వం రచించారు. వెతికి చూచిన కొద్దీ రత్నాలు లభించే కవిత్వ సముద్రం గురజాడ వారి 'ముత్యాల సరాలు.'

పఠితకు కావ్యానుభవము "కల్గించాలంటే వర్ణనలు ఇంద్రియ గోచరము కావాలి. అప్పారావుగారి వర్ణనల కీ శక్తివున్నది....బలబల కన్నుల కన్నీ రొలికెను పుత్తడిబొమ్మకు పూర్ణమకు; కన్నులు తుడు చుకు కలకల నవ్వెను పుత్తడి బొమ్మా పుర్ణమ్మా - చెప్పేవస్తువూ, చెప్పే పద్ధతీ వేరుగా కనబడవు. కవిత్వానికి ఉత్తమ లక్షణ మిది. వస్తువు వర్ణన కందనంత గొప్పగా తోచినట్లయితే కవివాక్కు కుంటినట్లు, కవి వాక్కు గొప్పగా కనబడితే వస్తువులో అందము చాలనట్లు - ఉత్తమ కవిత్వములో రెండూ పాలూ పంచదార లాగ కలిసిపోయి వుంటాయి" అని శ్రీ పాద గోపాలకృష్ణమూర్తిగారు గురజాడ కవిత్వ ప్రాశస్త్యాన్ని చక్కగా వివరించారు.[14]

'గురజాడ వాల్మీకి' వ్యాసంలో శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గురజాడను ఆధునికాంధ్ర కవిత్వానికి మూలపురుషునిగా సంభావించారు. "నా కావ్యకళ నవీనం. నా ఇతివృత్తాలు భారతీయం" అనీ తా నప్పుడు అనుసరిస్తున్న కవితామార్గం పూర్తిగా కొత్తదనీ గురజాడవారే స్వయంగా చెప్పుకున్నారు కూడ. కన్యాశుల్కంలో కనిపించే హాస్య దృష్టి 'ముత్యాలసరాలు' లో చాలకొద్దిగా మాత్రమే కనిస్తుంది. "I am terrible as I was humourous" అనటం మహాకవి గుర జాడకే చెల్లింది.

14. అర్ధశతాబ్ది ఆంధ్ర సాహిత్యము - శ్రీపాద గోపాలకృష్ణమూర్తి - భారతి - నవంబరు 1962

"పాటలాధరి పాట పాడితే చెట్లుచామలు కోటి చెవులను గ్రోలి యలర; తాటివనమున నాగి చంద్రుడు తాను చెవియొగ్గె"నని గురజాడ, వర్ణించటం తెలుగు కవిత్వంలోనే అపూర్వం. అంతేకాదు - ఆ తర్వాత కూడ కవు లింత చక్కటి, మనోజ్ఞమైన వర్ణన లెన్నో చేయ లేకపోయారు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గా రన్నట్టు "వచన రచయి తలు మాత్రమే అప్పారావుగారి మార్గదర్శిత్వం స్వీకరించారు. పద్య రచయితలు ఆదారి పట్టుకోలేక పోయారు."[15]

"తెలుగులో నవ్యరీతులకు నూతన ప్రమాణాలకు ప్రయత్నించిన మొదటి కవిని నేనే. నాకావ్యకళ నవీనం; కావ్య ఇతి వృత్తాలు భారతీయం; కవితలో నేను ఉత్తమ ప్రయోజనాలను ఉపలక్షించాను; జీవితాన్ని నూతన దృక్పథంతో దర్శించి, కథా, కవితా రూపంలో దాని తత్త్వాన్ని అన్వయించడానికి ప్రయత్నించాను."[16] అని మహాకవి ఒకలేఖలో పేర్కొన్నట్లే తెలుగులో నవ్యరీతులకు, నూతనప్రమాణాలకు ప్రయత్నించిన ఆదికవిగా ఆయనను గౌరవించాలి. "గురజాడ అప్పా రావు 1915 లో చనిపోయినా, 1915 తరువాతనే జీవించడం ప్రారంభిం చాడు.[17]

"మతములన్నియు మాసిపోవును, జ్ఞానమొక్కటి నిలిచి వెలు గును; ప్రేమ కలుగక బ్రతుకు చీకటి" అని పలికిన మహాకవిమార్గంలో నడిచినప్పుడే తెలుగు కవిత్వం విశ్వసాహిత్యంలో చోటు గడించు

15. మార్గదర్శి గురజాడ అప్పారావుగారు - శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి - నవోదయ, డిసెంబరు 1946 - సారస్వత వ్యాసములు - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ - నాలుగవ సంపుటము.

16. గురజాడ రచనలు - లేఖలు (సం) అవసరాల సూర్యారావు - విశాలాంధ్ర ప్రచురణాలయం 205 వ పేజీ.

17. పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము - దేవులపల్లి కృష్ణశాస్త్రి - భారతి, రజతోత్సవ సంచిక, జనవరి 1949.

కొంటుంది. దురభిమానానికి తావిచ్చే తెలుగుజాతి ప్రశంసలకు తల వొగ్గక, ఎల్ల లోకము వొక్క ఇల్లై అన్న గురజాడ సూక్తిని స్మరించి, వసుధైక కుటుంబ భావనను తెలుగుకవి పెంపొందించుకోవాలి.

## గిడుగు పిడుగు - భాషోద్ధరణకు ముందడుగు

'అభినవ వాగనుశాసనులు' శ్రీ గిడుగు రామమూర్తి భాషా సంస్కరణకు పూనుకొని. రచనల్లో వ్యావహారికభాషను ప్రయోగించ వచ్చుననటంతో ఆధునిక కవిత్వం పెద్ద మలుపు తిరిగింది. ప్రజలు మాట్లాడేభాషకు, కావ్యాల్లో భాషకూ వున్న వ్యత్యాసాన్ని తొలగించి కావ్యభాషను ప్రజలకు దగ్గరగా తీసుకొనిరావాలని శ్రీ రామమూర్తి పంతులుగారు జీవితమంతా కృషి చేశారు.

గిడుగు రామమూర్తి పంతులుగారూ, గురజాడ అప్పారావుగారూ సహాధ్యాయులు. వీరిద్దరూ ఆధునిక భాషను, కవిత్వాన్ని తీర్చిదిద్దటంలో ఎంతో వ్యతిరేకతను ఎదుర్కొన్నారు. జె. ఎ. యేట్స్ అనే పరీక్షాధి కారి గంజాం, విశాఖపట్టణం, గోదావరి జిల్లాలకు పరీక్షాధికారిగా వుండే వాడు. తెలుగులో కావ్యభాషకు, ప్రజలు వాడుకునే భాషకూ చాలా వ్యత్యాసం వుండటం ఆయనకు ఆశ్చర్యం కలిగించింది. అప్పుడు విశాఖ పట్టణంలో ప్రిన్స్‌పాల్‌గా వున్న శ్రీ పి. టి. శ్రీనివాసయ్యంగార్‌తో తన సందేహాన్ని యేట్స్ వెల్లడించాడు. ఆయన సరియైన సమాధానం చెప్పలేక గురజాడ అప్పారావుగారిని, గిడుగువారిని సంప్రదించమని సలహా ఇచ్చాడు. అప్పటికే గిడుగువారు భాషాశాస్త్రవేత్తగా, సవర భాషాభివృద్ధికై కృషిచేసిన మహాపండితునిగా ప్రసిద్ధులు. గిడుగువారికి ప్రాచీన కావ్యాలలో కపుల ప్రయోగాలు కొట్టిన పిండి, ఏ ప్రయోగ మైనా తడుముకోకుండ చెప్పేవారట. ఆయనకు దురదృష్టవశాత్తూ బధి రత్వం ప్రాప్తించింది. అసౌకర్యాన్ని లక్ష్యపెట్టక ఆయన ఏకాగ్ర చిత్తంతో తెలుగు సాహిత్యాన్ని ఔపోసనపట్టారు. ఆరేడు సంవత్సరాలు కృషిచేసి 1912 వ సంవత్సరానికల్లా స్కూల్‌ఫైనల్, ఇంటర్‌మీడియట్ పరీక్షలలో వ్యాసరచన, అనువాదాలకు వ్యావహారిక భాష ఉపయోగించ

వచ్చునని ప్రభుత్వంనుండి అనుమతి సంపాదించారు. అంతటితో పండితులలో గగ్గోలు పుట్టింది. ఈ వాదాన్ని ఎదుర్కొనటానికి 1911 లో స్థాపింపబడిన 'ఆంధ్ర సాహిత్య పరిషత్తు' రామమూర్తిగారి వాదాన్ని తీవ్రంగా వ్యతిరేకించింది. వ్యావహారికాన్ని గ్రామ్యమని నిందిస్తూ మహాపండితులు రామమూర్తిగారి వాదాన్ని ఎదుర్కొన్నారు. వాడుక భాష ఒక్కొక్క మండలంలో ఒక్కొక్క విధంగా వుంటుందని, కొబట్టి దేన్ని ప్రామాణికంగా అంగీకరించాలో చిక్కు వస్తుందని పండితు లోకవాదం లేవదీశారు. వ్యావహారిక భాషావాదానికి మాండలిక భేదాలు అడ్డురావని నిరూపించి శ్రీగిడుగు ఆంధ్రభాషకు మహోపకారం చేశారు. కన్యాశుల్కం వంటి నాటకాలు మాండలికంలో రచింపబడటం చేతనే జీవంతో తొణికిసలాడుతున్నాయని పండితులు గుర్తించారు. కాని సనాతనులైన పండితుల వొత్తిడికి లొంగి ప్రభుత్వం వాడుకభాషను ఉపయోగించవచ్చునన్న అనుమతిని ఉపసంహరించుకొన్నది. గురజాడవారు మద్రాసు విశ్వవిద్యాలయానికి సమర్పించిన "Dis ent Note" ఆయన స్థిరచిత్తానికి నిదర్శనం.

"వ్యాసావళి; బాల కవి శరణ్యం; పండిత భిషక్కుల భాషా భేషజం; సూర్యరాయాంధ్ర నిఘంటు విమర్శనం" మొదలైన గ్రంథాలు రచించి శ్రీ గిడుగు పండిత ప్రకాండుల పాలిటి పిడుగై వాడుకభాషకు విజయాన్ని సమకూర్చి పెట్టారు. తెలుగు కవిత్వంలో కవులు యథేచ్ఛాను వర్తనులై శబ్దాలను ప్రయోగించే స్వేచ్ఛను ప్రసాదించిన గిడుగువారికి ఆధునిక కవి లోకం ఋణపడి వున్నది. వీరేశలింగం, గురజాడ, గిడుగు వారలు ఆధునిక కవిత్వానికి మూలపురుషులు. గిడుగువారి వాదాన్ని సమ్మతించి వార్తా పత్రికలు, ఆకాశవాణి, సినిమా, వాడుక భాషకు చోటిచ్చాయి. విశ్వవిద్యాలయాలు మాత్రం వాడుకభాషను కొంతవరకు అంగీకరించాయి. విద్యాలయాలన్నీ గిడుగువారి వాదాన్ని ఆమోదించటమే వారిపట్ల ఆంధ్రజాతి తనకు గల గౌరవాన్ని ఋజువు చేసుకోవటం.

## అభినవ కవికుల గురువు రాయప్రోలు

'అభినవాంధ్ర కవిత'కు ఆచార్యులై శ్రీరాయప్రోలు సుబ్బారావు ఒక నూతన కవితా మార్గాన్ని అనుసరించారు. 'కోకిలస్వామి' శ్రీరాయ

ప్రోలు కవివిహంగాలలో కలకలం కలిగించారు. శ్రీగురజాడ వైతాళికులై కవులను మేల్కొల్పగా, కవులు గళాలు సవరించి కలకూజితాలు చేయటానికి రాయప్రోలు ప్రారంభకులయ్యారు. ఆంధ్ర పౌరుషాన్ని రేకెత్తించే కవిత్వంతో ఒక నూతన యుగానికి పాదులు తీసిన తోటమాలి శ్రీ రాయప్రోలు.

"శ్రీలు పొంగిన జీవగడ్డయి పాలు పారిన భాగ్య సీమయి వరలినది యీ భరత ఖండము భక్తి పాడర తమ్ముడా"; "ఏ దేశమేగినా ఎందుకాలిడిన ఏ పీఠ మెక్కినా, ఎవ్వరెదురైన పొగడరా నీ తల్లి భూమి భారతిని" మొదలైన రమ్యమైన గీతాలను రచించి శ్రీ రాయప్రోలు దేశభక్తిని ప్రబోధించారు. "ఏ మంచి పూవులన్ ప్రేమించినావో, జనియించినాడ వీ స్వర్గ ఖండమున" అన్న కవి వాక్కు మధురం. గురజాడ వారి ముత్యాలసరాలను రాయప్రోలు స్వీకరించారు. కాని, రాయప్రోలు ఆంధ్ర పౌరుషాన్ని కొనియాడిన సీసపద్యాలే అనంతర కవులను ఎక్కువగా ఆకర్షించాయి.

రాయప్రోలువారు బాల్యంలో వారి మేనమామ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారితో కలిసి అవధానాలు చేస్తుండేవారు. అవధాన విద్య అపరిమితమైన ఆదరం పొందుతూ వుండిన కాలంలో రాయప్రోలు అవధాన విద్య వైపు ఆకర్షితులయ్యారు. బుచ్చిరెడ్డి పాలెములో జరిగిన అవధానంలో రాయప్రోలువారికి ఆశుధార కుంటుపడగా, అప్పుడు వారు తమ కర్తవ్యాన్ని గుర్తించి చెప్పిన పద్యాలు రెండూ నవ్య కవితాభిమానులకు మరపురానివి.

"తెనుగే తీయని దందు పద్య పదరీతిక్రీడ లత్యంతమో
హనముల్ శోభనముల్ తదీయ రస రక్తాలాపనంబుల్ లభిం
చిన వాగర్థ కలా కలాప జయలక్ష్మిన్ గాలికిం బుత్తునే
జననీ ! యేమిటి కింక ఆశుకవితాసన్యాస మిప్పించవే !

రసమో, భావమొ, జీవదర్ధసుకుమారవ్యంజనామంజు శ
బ్ద సమాసారచనంబొ, సాధుహృదయ స్పందప్రతిష్ఠా కథా
విసరంబో, సకలార్థ శూన్యమగు నీ వేగాతివేగోక్తి దు
ర్వ్యసనం బేటికి త్రిప్పు మింక జననీ! రవ్యాక్షరశ్రోణికిన్''

శ్రీ పల్లా దుర్గయ్య అన్నట్లు శ్రీ రాయప్రోలు 'సుబ్బావధాని' కాబోయే ప్రమాదం నుండి తనను తాను రక్షించుకున్నారు.[18]

1909 లో 'లలిత' (గోల్డ్‌స్మిత్ Hermit కావ్యానికి అనుసరణ) 1910 లో 'అనుమతి' (టెనిసన్ 'Dora' కావ్యానికి అనుసరణ) రచించిన శ్రీ రాయప్రోలు ఆధునికమైన 'అభినవ కవిత'కు శ్రీకారం చుట్టినది 'తృణకంకణము'తో. 1912 లో తృణకంకణము, స్నేహలతా దేవి, అంతకుముందే 'కష్టకమల' రచించిన తర్వాత ఆయన 'శాంతి నికేతనం'లో రవీంద్రులశుశ్రూష చెయ్యటానికి వెళ్లారు. ఆధునిక కవిత్వాలలో ప్రసిద్ధమైనవి రచించిన తర్వాతనే ఆయన శాంతి నికేతనము వెళ్లటం గమనార్హం. 'తృణ కంకణము' ఆ కాలానికి శ్రీ లక్ష్మీరంజనం పేర్కొన్నట్లు "Insulated Wire. కాలగమనము. తిరుగుబాటు, ఆటు పోట్లు, తృణ కంకణం అనే జీవ విద్యుత్తంత్రి మీద సంరక్షక ఆచ్ఛాదనమును కల్పించి యుండవచ్చును. కాని, దానిని ముట్టుకు చూస్తే దాని యందలి జీవలక్షణం చురుక్కున భావహస్తమునకు తగులక మానదు. సాత్త్వికచైతన్య లక్షణం అంతా అంతే."[19]

వరకట్న దురాచారాన్ని నిరసించే 'స్నేహలతా దేవి' వంటి కావ్యం రచించినప్పటికీ మొత్తంమీద రాయప్రోలు వారిలో సంఘ

---

18. 'నా గురుదేవుడు; నా ఉపాస్యదైవము' - పల్లా దుర్గయ్య - రాయప్రోలు వారి సాహిత్య సౌందర్య దర్శనం - వంశీ ఆర్ట్ థియేటర్స్ ప్రచురణ 1980

19 'తృణకంకణ మొక ప్రేమగీత'- ఖండవల్లి లక్ష్మీరంజనం - రాయప్రోలు వారి సాహిత్య సౌందర్య దర్శనం - వంశీ ఆర్ట్ థియేటర్స్ ప్రచురణ 1980

సంస్కార ప్రేరకమైన రచనలకంటె శృంగారకావ్యాలే హెచ్చు. "అమలిన శృంగారం" ఆయన ప్రతిపాదించిన కావ్యతత్త్వం. ప్రేయసీ ప్రియుల మధ్య సంయోగం కంటె వియోగాని కెక్కువ ప్రాధాన్యమిచ్చే యి శృంగారతత్త్వాన్ని భావకవులు స్వీకరించారు.

శ్రీ రాయప్రోలు కావ్యవర్ణనల్లో కథావస్తువులో కొత్త కాంతిని ప్రసరింపచేశారు. కేవలం నిఘంటువులలో మాత్రమే కనిపించే వృక్ష సంపదా, జంతు సముదాయమూ మారిపోయి అరటి, నారింజ, కొబ్బరి, మామిడి, నిమ్మవంటి తెలుగు సీమలో కనిపించే చెట్టూచేమలూ; తామర, కలువవంటి నీటిపువ్వులేగాక మల్లి, మాలతి, సంపెంగ, మొగలి, జాజి, పొన్నవంటి తెలుగిండ్లలో పూచేపువ్వులూ; పొదుగుభారంతో నడయాడే గోమాతలూ, చెంగనాలు దొక్కే లేగదూడలూ, పెంపుడు నెమళ్ళూ, లేళ్ళూ, రామచిలుకలూ హృద్యంగా కన్పించసాగాయి. వర్ణనల్లో సమాసాడంబరం తగ్గి, అన్వయక్లేశం లేని తేటైనమాటలపొందిక మనోహరంగా తోచింది. పూచిన కొత్తిమెర చేలూ, పచ్చి గంధపు వాసనలూ, బంతిపూల సొగసులూ మనసుల్ని మురిపించసాగాయి.

ప్రాచీనులలో లేని కవితాగుణం రాయప్రోలులో యేమి వున్నదనే ప్రశ్నకు రాయప్రోలు వారి మాటల్లోనే

"కులసుభాంగి వయోరూప కుసుమమందు
మోహమధువె గవేషించె మున్ను సుకవి
సాత్త్విక ప్రేమకోశ పేశలము లయిన
వత్సలామృతరుచులను వలచె నేడు" (రమ్యాలోకమ్)

అని జవాబు చెప్పవచ్చు. నవ్య కవిత్వంలో రాయప్రోలువారు కోరిన మార్పులను. నూతన సిద్ధాంతాలను వివరించే లక్షణగ్రంథం 'రమ్యాలోకమ్'. స్త్రీమూర్తిలో మాతృత్వాన్ని దర్శించిన మహాకవి రాయప్రోలు వారికి, ఆ అమృతభావనకు ప్రోది చేసినది వారిని పెంచిన 'పిన్ని' అని సవినయంగా పేర్కొన్నారు.

"మామిడికొమ్మమీద కలమంత్రపరాయణు డైన కోకిల
స్వామికి మ్రొక్కి ఈయభినవస్వరకల్పన కుద్యమించితిన్
కోమలగోస్తనీరుచులకున్ కదళీఫలపాకపంక్తికిన్
లేములు తీర్చు మా తెనుగు లేతముదుళ్లు వెలార్చు వేడుకన్"

ప్రారంభించిన వారి కవిత్వం ఎన్నో ప్రయోజనాలను సాధించింది. ప్రేయసీప్రియులమధ్య కామానికి అతీతమైన

"కనుల నొండొరులను జూచుకొనుటకన్న
మనసు లన్యోన్యరంజనల్ గొనుటకన్న
కొసరి "యేమోయి" యని పిల్చుకొనుటకన్న
చెలుల కిలమీద నేమి కావలయు సఖుడ" (తృణకంకణము)

అని ఆత్మీయమైన స్నేహబంధాన్ని ఆశించారు. భావకవులు రాయప్రోలువారి ఒరవడిని అనుసరించారు.

"ఈ శతాబ్ది రెండో పదిలోనే సమగ్రాంధ్ర స్వరూపాన్ని సందర్శించగలిగిన క్రాంతదర్శి" శ్రీ రాయప్రోలు.[20]

## అబ్బూరి కవితలో అర్థగౌరవం

నవ్యకవితకు ప్రోదిచేసి, కాలువలు తీసి, రసవాహినులు ప్రసరింపజేసినవారు శ్రీఅబ్బూరి రామకృష్ణరావు. భాషలో పదప్రయోగంలో, చక్కనైన అర్థగాంభీర్యానికి నిలయమైన కవిత రచించటంలో అన్నిటా సంస్కారీ, సమర్థుడూ శ్రీ అబ్బూరి. ఈయన రచించిన కవిత్వంలో ఒక పంక్తి కూడ వొదులుకోలే మంటారు కృష్ణశాస్త్రిగారు. "ఊహాగానము; నదీసుందరి; మల్లికాంబ"వంటి కావ్యాల్లో ఆయన భావనారీతి తర్వాత కవులెందరికో మార్గదర్శకమైంది. ఇంచుమించు రాయప్రోలువారు ప్రారంభించిన కాలంలోనే కవిత్వంలో శ్రీ అబ్బూరి నవ్యరీతులను

20 'ఆంధ్రోద్యమ కవితకు పాదు.' - సి. నారాయణరెడ్డి - రాయప్రోలువారి సాహిత్య సౌందర్య దర్శనం - వంశీ ఆర్ట్ థియేటర్స్ ప్రచురణ

ప్రవేశపెట్టారు. 'కవీనాం కవిః' అని పిలువదగిన ప్రజ్ఞ వీరిది. వీరి ఖండకావ్యాల్లో "కాపుపాట; తిక్కన; మాతృభూమి" చిరస్మరణీయ మైనవి.

'కాపుపాట'లో "పాడుట కొప్పులేని పడవ ల్నడిపించెడు నేటి త్రోవలే
చూడగవద్దు, లేతమనసుల్ తడిసేసెడు చెట్లచాటునన్
గూడినమేను లాసుకొన కొమ్మల నాకులవోలె నొక్కమా
టాడకకూరుచుంద మనువైన పొలమ్ముల గట్టునీడలన్.

"అనే మాటల్లో వినిపించని శ్రావ్య సంగీతపు సవ్వడులు విన వచ్చు. ("Unheard melodies are sweeter"). వీరి కవిత్వంలో వీరాంధ్ర పౌరుషం కనిపించదు. భారతదేశ పౌరునిగా 'మాతృభూమి'ని కొనియాడారు. సుజలమూ, సుఫలమూ అయినభూమిని తల్లిముఖాన్ని తనయుడు తనివితీరక చూచినట్లు, 'మాతృభూమి' గీతంలో దర్శించారు.

శాంతినికేతనంలో రవీంద్రుని అంతేవాసిత్వమూ, మానవేంద్ర నాథరాయ్ మానవతావాదమూ, రామలింగారెడ్డిగారి హేతువాదనైశి త్యమూ, తిక్కనతెలుగుపలుకుబడీ రామకృష్ణారావుగారివాణికి సంస్కృతీ పరమైన గాంభీర్యాన్ని, సౌందర్యాన్ని ప్రసాదించాయి.

"శ్రోణీభరాలసగమన"మైన సుందరిగమనసౌందర్యం కొన్ని చోట్ల ఆమె నాట్యమూ సంగీతమూ, చిత్రలేఖనమూ అన్నీ కలిసి కమనీయమైన కవితగా రూపుదిద్దుకొన్నాయి, వీరివలన పెక్కుమంది భావకవులు, శ్రీశ్రీగారు ప్రభావితులైనప్పటికీ ప్రత్యక్షంగా వీరిని అనుస రించినవారు లేరు - అనితరసాధ్యమైన ఊహానైశిత్యం వీరిది. ధగధగ మెరయక, మిరుమిట్లు గొలుపక, శాంతంగా నిండుగా ప్రవహించే ఏటి కాలువవలె సాగిపోయే వీరిశైలిని ఎవరూ పుణికిపుచ్చుకోలేకపోయారు.

తెలుగుపద్యరచనలో నూతనమైనపోకడలూ, ముఖ్యంగా పద్యానికి నాదమాధుర్యాన్ని రామకృష్ణారావుగారు ప్రసాదించారు. భావ

కవిత్వానికి అప్రశుతి లేని, గానానికి అనువైన శబ్దసంపద వీరికవిత్వంలో పుష్కలంగా వున్నది. అబ్బూరివారి భావుకశక్తి –

"దీపికలు లేని వాకిళ్ళు తెరచి నాదు
తలపు లొక్కొక్కటి నిన్ను తెలియబోయి
తిరిగివచ్చుచునుండు, పందిళ్ళక్రింద
కేళి దిరుగాడు పెండ్లిచుట్టాలరీతి"

అనే పద్యంలో ఆనందముగ్ధంగా గోచరిస్తుంది.

## వేంకట పార్వతీశ కవుల భక్తి కవిత్వం

శ్రీ వేంకటపార్వతీశకవులు రచించిన "భావసంకీర్తనము, ఏకాంతసేవ" తెలుగుకవితకు కొత్తదనాన్ని, ఆధ్యాత్మిక రామణీయకత్వాన్ని ప్రసాదించాయి. "తెల్లవారగట్ట పెళ్ళివారిని మేల్కొలిపే సన్నాయిపాట"లాగా వీరికవిత్వం బద్ధకంతో నెమ్మదిగా కదుల్తున్న ఆధునికకవిత్వానికి ప్రాభాతసంగీతం సమకూర్చింది. "విదిదండ మెడలోన వేయుటేకాని, కన్నార నీమూర్తి గాంచనేలేదు" మొదలైన పద్యాలు కవులకు సహృదయులకు కంఠోపాఠా లయ్యాయి. రవీంద్రుని 'గీతాంజలి'కి అనుకరణ కాకపోయినా వీరి 'ఏకాంతసేవ' తెలుగుగీతాంజలిగా ఖ్యాతి పొందింది. ప్రాచీనకవిత్వంలో పోతన రచించిన భాగవత దశమ స్కంధం చతువుతున్నప్పటి రసానందం వీరి పద్యాల్లో కలుగుతుంది. అదే సమయంలో ఆధునికమైన భావస్ఫూర్తి, విగ్రహారాధనాప్రసక్తి లేని ఆరాధనాభావం, హృదయాన్ని నైవేద్యంగా సమర్పింప జూచే నిజాయితీ వీరి కవిత్వంలో దర్శనమిస్తాయి. భావకవులు చాలామంది వీరి ననుకరించి కవితను పలచబారజేసి, పునరుక్తులకు పాల్పడ్డారు. వీరికవితలో భావపునరుక్తి వున్నంతగా వర్ణనల పునరుక్తి వుండదు – భక్తులు భావపునరుక్తిని దోష మనరు గదా!

ఏకాంత సేవ''ప్రవిమల భక్తియుక్తుడైన భక్తుఁడు పరమేశ్వరునిఁ గూర్చి పాడు ప్రణయగీతము; ఇది భాగవతమువలెనే పఠింపఁదగినది; ప్రేమింపదగినది; శిరసా వహింపఁ దగినది.''[21]

## దువ్వూరి రామిరెడ్డి - కృషీవల కవిత్వము

భారతజాతికి వెన్నెముక అనదగిన కృషీవలునిపై తెలుగులో తొలుతగా కావ్యం రాసిన కవి శ్రీ దువ్వూరి రామిరెడ్డి.

''సైరికా ! నీవు భారతక్ష్మాతలాత్మ
గౌరవ పవిత్రమూర్తివి ! శూరమణివి !
ధారుణీపతిపాలనదండ మెపుడు
నీహలంబుకన్నను బ్రార్థనీయ మగునె ?''

అని కర్షకుని స్తుతించి, అతని జీవితంలో కష్టసుఖాలను రసవత్కావ్యంగా రచించారు రామిరెడ్డిగారు. తొలిదశలో వీరు 'మేఘసందేశము, ఋతుసంహారం' కావ్యాలు అనువాదం చేశారు. తర్వాత రామలింగారెడ్డిగారి ప్రభావంతో ''కడపటివీడ్కోలు, నలజారమ్మ అగ్నిప్రవేశము' కావ్యాలు రచించారు. రామలింగారెడ్డిగారివలె ప్రబంధపద్ధతి వర్ణనలజోలికి పోక నవ్యమార్గాన్ని అనుసరించటానికి ప్రయత్నించారు.

కేవలం ఒక నెరసిన వెంట్రుకపై 'పలితకేశము' కావ్యాన్ని వ్యంగ్యశక్తితో, తాత్త్వికచింతనావివశత్వంతో రచించిన ప్రతిభావంతులు శ్రీ రామిరెడ్డి. బహుభాషలను నేర్చి, దేశదేశాల కవుల కవితామాధుర్యాన్ని తెలుగువారికి చవి చూపించదలచి 'గులాబితోట; పానశాల' రచించారు. ఉమర్ ఖయామ్ రుబాయీలకు ''పారసికన్నె కోమల మైన తెనుగు''లో మధురమైన అనువాదం చేశారు.

21. 'ఏకాంత సేవ' పీఠిక-దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి-1922.

'బాష్పదౌత్యము'లో ''జీవనగంగాహరితతటంబునఁ
జింతావటతరుమూలమునస్
ఏల యధోముఖి వై గడతెంచెద
విశ్వధి యౌవననిశలస్'' అనే గీతం ఆలోచనామృత మైనది. ''అందరబీదల వేడియూర్పులం దనరు దవాగ్ని నీ బ్రదుకు దగ్ధ మొనర్చదె యొక్క పెట్టునన్'' అని విప్లవభావాలను వెలువరించిన శ్రీ రామిరెడ్డి సంప్రదాయాన్ని ఛేదించుకుని నవ్యకాంతిని ప్రసరింపజేశారు.

## త్రిపురనేని హేతువాద విప్లవం

తిరుపతి వేంకట కవులకు శిష్యులై, ధారాశుద్ధి గలిగిన పద్య రచనలో అఖండులు, శతావధాని, బారిస్టరూ శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరి కవితావస్తువులో సమూలమైనమార్పును కోరారు. ఆర్య నాగరికతాప్రభావంచేత ద్రావిడులైన తెలుగుజాతికి తీరని అన్యాయం జరిగిపోయిందని, పతితజాతి చెప్పుకోవలసిన వేదాంతమైన 'భగవద్గీత'కు గౌరవం లభించిందనీ వాపోయి, అష్టాదశపురాణాలలో విలువల్ని ప్రశ్నిస్తూ కావ్యాలు, నాటకాలు రచించారు. సూతపురాణము, కుప్పు స్వామి శతకము, ధూర్తమానవా కావ్యాలు, కురుక్షేత్ర సంగ్రామము, శంబుకవధ, ఖూనీ, నాటకాలు, 'భగవద్గీత' (సంస్కృతానికి అనువాదం కాదు- బ్రహ్మనాయుడు పలనాటి యుద్ధంలో బాలచంద్రుడుకు బోధించినది) వీరి రచనల్లో విశేషమైనవి.

అష్టాదశ పురాణాలను సూతుడు శౌనకాది మహామునులకు చెప్పి నట్లుగా వ్యాసుడు రచించటాన్నిబట్టి, ఆ సూతుడే తనకు పురాణాల గుట్టు బయటపెట్టినట్లు సూతపురాణాన్ని రచించారు. పురాణేతిహాసా లపై కూలంకషమైన పరిజ్ఞానము, ప్రపంచ చరిత్ర గమనమూ, లోతైన తాత్త్వికచింతనా కలిగిన త్రిపురనేనివారిశక్తి నెదుర్కోవటం సంప్రదాయ ప్రియులకు సాధ్యం కాలేదు.

దైవభావనే సమాజంలో అనర్థాలన్నిటికీ మూలమని తలచి శ్రీ త్రిపురనేని నాస్తికభావాలను ప్రచారం చేశారు. పురాణకథలను తన ఆలోచనారీతిలో తిరుగరాశారు. పురాణకథలను రచించేటప్పుడు మహాభక్తునివలె ప్రారంభించి, కవిత్రయాన్ని, పోతనను తలపించే శైలిలో కవిత్వం రచించి, కథచివరలో పురాణాలలో చెప్పినవన్నీ కల్లలని, ఆర్యఋషుల మోసపువన్నాగాలని వీరు ఖండించారు. దక్షిణభారత దేశంలో ఆరోజుల్లో బ్రాహ్మణవ్యతిరేకోద్యమం సాగుతున్నది. దానికి వీరు నేతలై, స్వసంఘ పౌరోహిత్యాలను ప్రోత్సహించి, ప్రతి అంశాన్ని హేతువాదదృష్టినుండి ఆలోచించటాన్ని అలవాటు చేశారు.

కట్టమంచి, త్రిపురనేనిగారలు ప్రారంభించిన హేతువాద విప్లవం తెలుగుకవిత్వంలో భౌతికవాదతత్త్వానికి, అనంతర కాలంలో మార్క్సిస్టు తత్త్వం వ్యాపించటానికి తోడ్పడింది. వీరిరువురూ భాషావిప్లవాన్ని కోరకుండానే, భావవిప్లవాన్ని కోరారు.

పోతనకవిత్వమాధుర్యాన్ని మళ్ళీ రుచి చూస్తున్నట్లనిపించే

''తృణగుల్మావృత కూలసాలముల సందీపించు కాళిందిలో
మణిరోచిష్ణుత నొప్పు కాళియఫణామధ్యప్రదేశంబునన్
ఘృణిరంజన్మణికింకిణుల్ మొఱయ శ్రీకృష్ణుండు
నర్తించుచున్
ఫణినిన్ వ్రేల్మిడిఁ ద్రోసిపుచ్చిన తదావాసస్థలం బిద్దియే.
కాలియందలి యందెలు గల్లురనఁగఁ
జిందుఁ ద్రొక్కుచుఁ దనతల్లి చేతి కోలఁ
గాంచి కల్లారి కన్నీరు కార్చునట్టి
నవ్యనవనీతచోరుండు నాకుఁ దోఁచె'' మొదలైన పద్యాలు

శ్రీ త్రిపురనేనివారిని మహాభక్తులని తలచేలాగ చేస్తాయి. కాని, విప్లవ విస్ఫులింగాలవంటి,

"మలమల మాడుపొట్ట తెగమాసినబట్ట కలంతవెట్టగా
విలవిల యేడ్చుచున్న నిఱుపేదకు జాలినిఁ జూపకుండ, సు
త్తలపడిపోయి జీవరహితం బగు బొమ్మకు నిండ్లువాకిళుల్
పొలమునుబొట్ర గూర్చెడి ప్రబుద్ధవదాన్యుల నిచ్చమెచ్చెదన్"

అని విగ్రహారాధనను తిరస్కరించిన పద్యాలవంటివి త్రిపురనేనివారి భావతీవ్రతను చక్కగా వెల్లడిస్తాయి.

గంగావతరణగాథను ప్రబంధశైలిలో రసవంతంగా రచించిన శ్రీ త్రిపురనేని "గగనంబులోనుండి గంగమ్మ శివమస్తకమున దూకె ననుమాట ములుచమాట....సగరసుతభస్మరాసుల సరవి దడిపె స్వర్గమున కంపె ననుమాట వట్టిమాట... టక్కు నేర్పెడి కవుల గంటాల వ్రాత, కాదసగరాదు ప్రాచీనకవులు గాన" అని చెప్పి పిట్టకథలకు ఆ పైన కథల్లో సత్యాన్ని గ్రహించమంటారు. శతావధానాన్ని దిగ్విజయంగా నిర్వహించి దైవభావనకూ అవధానవిద్యకూ సంబంధం లేదని ఋజువుచేశారు.

నందనోద్యానవనాన్ని సందర్శించి

"కల్లు నిచ్చెడి చెట్లకుఁ గల్గు గౌరవంబు పెఱవానికిలేదు వజ్రిమోల
గజ్జకట్టెడి బోగంపుగరిత కున్న పలుకుబడి కానరాదెట్టివారి కిందు
ఇండ్లొ యున్నవి కాని పెండ్లిండ్లు లేవు ఆంద్రొ యున్నారు
కాని యిల్లాండ్రు లేరు
బాగు! శివ! యిది వట్టి భోగభూమి
యుండ రాదిందు మావంటియోగులకును" అని దేవ లోకంలో

నియమాలను ఏవగించుకొన్నారు. ఇంద్రునియొడలిమీద వేయికన్నులు కన్పింపలేదు గాని, కన్పించె నొడలినిండ పొడలుమాత్రము" అని చెప్పటంలో రామస్వామిచౌదరిగారి భావతీవ్రతద్యోతక మవుతుంది.

"యథార్థరామాయణము, యథార్థప్రహ్లాదచరిత్రము, ఏకలవ్యుని వృత్తాంతము, యాదవప్రళయము" మొదలైనపుట్టాల్లో రామస్వామి చౌదరిగారి హేతువాదనైశిత్యం పురాణాలపై విశ్వాసంగలవారినిగూడ ఆలోచింపచేసి, ఆనందింపజేస్తుంది. ఆయనతర్కం సనాతనధర్మ మనే పేరిట చలామణిలో వున్న కుహనా విలువల్ని తీవ్రంగా ఖండించింది. కాని, ఆయన వ్యక్తులనుగాక వాదాన్నిమాత్రమే ఎదుర్కొన్న సాధు స్వభావులు కావటంచేత వారి హేతుతత్వాన్ని, ఆయన వాదాన్ని వ్యతిరేకించేవారుకూడ సానుభూతితో పరిశీలించారు.

నవ్యకవిత్వపరిణామక్రమంలో హేతువాదయుగానికి శ్రీ త్రిపుర నేని వైతాళికు లని విశ్వనాథసత్యనారాయణగారు పేర్కొన్నారు. అభ్యుదయ కవిత్వావిర్భావానికి త్రిపురనేనివారి కవిత్వం పూర్వరంగ ప్రస్తావనగా ఉపయోగపడింది. కాని, రామస్వామిచౌదరిగారు లేవనెత్తిన ఆర్యద్రావిడభేదాలు, బ్రాహ్మణ అబ్రాహ్మణభేదాలూ, క్రమంగా మరుగునపడిపోయాయి. సంఘంలో పీడించేవారూ, పీడింపబడేవారూ నన్న వర్గకలహదృష్టి ప్రబలింది. సోవియట్ రష్యాలో జార్ చక్రవర్తుల పరిపాలనలో మతాన్ని ఆదరించినకాలంలో ప్రజలు బాధలతో అలమటించ టమూ: కమ్యూనిస్టులు అధికారంలోకి వచ్చిన తర్వాత ఆర్థికఅసమానతలు తగ్గి ప్రజలు సుఖించటాన్ని శ్రీ త్రిపురనేని వివరించి సమాజం బాగుపడాలంటే దైవభావన నశించా లన్నారు.

## ఆంధ్ర సాహిత్య పరిషత్తు- ఆధునికతకు అడ్డుకట్ట

సాహితీపరులు ఒక సంఘంగా ఏర్పడవలసిన ఆవశ్యకతను గుర్తించి శ్రీ జయంతి రామయ్యపంతులు పిఠాపురంరాజావారి సహాయంతో ఆంధ్రసాహిత్యపరిషత్తును 1911 లో స్థాపించారు. మొదట్లో దీని కేంద్ర స్థానం మద్రాసు. గిడుగు రామమూర్తి పంతులుగారు ప్రారంభించిన వ్యావహారిక భాషోద్యమాన్ని నిరోధించటానికి, మద్రాసు విశ్వ విద్యాలయంలో పాఠ్యగ్రంథాల్లో వాడుకభాషను అనుమతింపజేయటానికి

చేస్తున్న ప్రయత్నాలను అడ్డుకోవటానికి సనాతన పండితులు యీ పరిషత్తును స్థాపించారు

ఆంధ్రభాషకు ప్రామాణిక మైన నిఘంటువు, సమగ్రమైన వాఙ్మయ చరిత్ర, సంపూర్ణమైన భాషాచరిత్రలను రచింపజేయటం పరిషత్తు లక్ష్యంగా పెట్టుకొన్నది. వారు ప్రారంభించిన "సూర్యరాయాంధ్ర నిఘంటువు" వాడుకభాషాశబ్దాలను స్వీకరించకపోవటం, ఆ నిఘంటువుకు పెద్ద వెలితి. అది సమగ్రమూ కాలేదు, ఇటీవలి వరకూ పూర్తి కాలేదు కూడ. వాఙ్మయచరిత్ర, భాషాచరిత్రలరచనకు పరిషత్తు పూనుకోనేలేదు. పరిషత్తు ప్రధానంగా ఆధునిక సమాజానికి అవసరమైన వాడుకభాషను నిరోధించటానికే ఎక్కువగా తన శక్తి యుక్తులను వెచ్చించింది,

'ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక' సమితిపక్షాన వెలువడిన సాహిత్య పత్రిక. ఇందులో మొదటిసారిగా ఎన్నో తాళపత్ర గ్రంథాలు, ముద్రితమైనాయి. సనాతనపండితులు రచించినవే అయినా విలువైన సమాచారాన్ని అందించే అమూల్యమైన వ్యాసాలు ప్రకటితమైనాయి. చరిత్రపరిశోధకులకు,వ్యాకరణవేత్తలకు,ఛందోఽలంకార జిజ్ఞాసువులకూ యీ పత్రిక వేదిక అయింది. ప్రాచీన తాళపత్ర గ్రంథాలను ముద్రించేటప్పుడు పాఠపరిష్కరణము, టీకాతాత్పర్యరచనవంటి సేవ చేసింది. శ్రీ శ్రీ గా రన్నట్లు "ఒక్క శ్రీనాథుని శివరాత్రి మాహాత్మ్యం ప్రచురించి నందుకే పరిషత్తుజన్మ సార్థకమయింద"ని తలచవచ్చు[22]. కాని, శ్రీ కురుగంటి సీతారామయ్య అభిప్రాయపడినట్లు పరిషత్తు గతానుగతిక మార్గాల్లో ప్రవర్తించింది గాని, భాషకుగాని సారస్వతానికి గాని యెన్నదగిన నూతనాలంకారా అలవర్చలేదు[23]"

22 'ఆంధ్రదేశంలో సాహిత్య సంఘాలు' - శ్రీ రంగం శ్రీనివాసరావు - కిన్నెర-ఆగస్టు 1949 - సారస్వత వ్యాసములు - రెండవ సంపుటము - ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ.

'నవ్యాంధ్ర సాహిత్య వీధులు' - కురుగంటి సీతారామయ్య-౧౬ వ పేజీ - మొదటి ముద్రణ.

## ఆధునిక సాహిత్య వేదిక - 'సాహితీ సమితి'

గురజాడ, రాయప్రోలతో ప్రారంభమైన నవకవిత్వాన్ని ఒక ఉద్యమవేగంతో కొనసాగించినది 'సాహితీ సమితి'. దీన్ని 1919 ఆగస్టులో శ్రీ తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి తెనాలిలో స్థాపించారు. శ్రీయుతులు నోరి నరసింహ శాస్త్రి, కొడవటిగంటి వెంకట సుబ్బయ్య, త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి, మునిమాణిక్యం, మొక్కపాటి, చింతా దీక్షితులు, కొమ్మూరి హనుమంతరావు, కోపల్లె శివకామేశ్వరరావు, పెద్దిభొట్ల పూర్ణశర్మ మొదలైనవారు సభ్యులు. నవ్యసాహిత్య ప్రచారానికి వీరు 'సాహితి' పత్రికను ప్రారంభించారు. 1920 జనవరి లో మొదటిసంచిక వచ్చింది. తరువాత శ్రీయుతులు దేవులపల్లి కృష్ణశాస్త్రి, వేదుల, బాపిరాజు, కాటూరి మొదలైన వారు వచ్చి చేరారు. సుప్రసిద్ధ పండితులు అక్కిరాజు ఉమాకాన్తం, పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి గారలు కూడ 'సాహితీ సమితి' సభ్యులే. ఈ సమితివారు గిడుగువారికి గౌరవసభ్యత్వ మిచ్చి గౌరవించారు. ''ఆనాడు సాహితీ సమితికి ఏ కొత్త రచయిత బైలుదేరినా, అతన్ని తమలో కలుపుకోగల విశాలత్వము వుండేది[24].''

తన చుట్టూ చేరిన యువకులలో ప్రతిభను గుర్తించి, ఆయా ప్రక్రియలలో వారిని రచన చెయ్యమని ప్రోత్సహించి, వారికి కావలసిన నైతికబలాన్ని సమకూర్చారు శ్రీ శివశంకర శాస్త్రి. ఒక విధంగా ఆనాటి ఆంధ్ర సాహిత్యంలో ఆయన సేవను జాన్సన్ ఇంగ్లీషు సాహిత్యానికి చేసిన సేవతో పోల్చవచ్చు. సాహితీ సమితి 'ఏకాంకిక'లను, సంగీత రూపకాలను ప్రారంభించింది. ఈ సమితి కొక నిర్దిష్టమైన కార్యక్రమమూ, ప్రణాళికా, ఆర్థికంగా సౌష్ఠవస్థితీ ఎప్పుడూ లేవు. శ్రీయుతులు విశ్వనాథ, నాయని, నండూరి, కొడాలి సుబ్బారావు కొంతకాలం సమితిలో సభ్యులుగా వుండి, సమితిపద్ధతులు నచ్చక రాజీనామా చేశారు.

24. 'కవి హృదయం' - చలం - 'బుక్ సెంటర్'-విశాఖపట్నం.13 వ పేజీ.

"అప్పటికి రేడియోలు లేవు, టాకీలు లేవు; భారత రాజకీయ రంగంలో సత్యాగ్రహం లేదు. మహాత్మునికి కాంగ్రెసులో సర్వాధిపత్యం లేదు. తెలుగుదేశంలో వాఙ్మయపత్రిక అంటే ఏమిటో తెలియదు.[25]" ఆ కాలంలో సాహితిపత్రికను, ఆతర్వాత 'సఖి' పత్రికను నడిపి సాహితీసమితి గొప్ప సేవ చేసింది. "కృష్ణశాస్త్రి బి.ఏ., అనిపించు కోవటం కంటె సాహితీ సమితి సభ్యుడు అనిపించుకోవటం" గొప్పగా భావించే వాడినని కృష్ణశాస్త్రిగారొక సందర్భంలో పలికారు. "ఈ సమితి సభ్యులు తమ రచనలు ఎందులో ప్రచురించినా తమ పేరు ప్రక్కన సాహితీ సమితి అని కూడ వేసుకోవడం అలవాటు చేసినారు. దానితో దేశములో ఇప్పుడు మన మూహించుకోలేనన్ని సారస్వత సమాజాలు బయలుదేరినవి[26]."

"దేశములో ఆకలిబాధ ఎక్కువగా ఉన్నది. దరిద్రదేవత తాండవమాడుచున్నది. దారిద్ర్యము ఆకలిబాధ తగ్గించటానికి ఈ సమితి కవులు ఏమి చేశా రని ఈ కాలములో చాలమంది అడుగుచున్నారు. ఏమీ చేయలే దని సమితి కవులు నేరము ఒప్పుకోవలసిందే." అని శ్రీ నోరి నరసింహ శాస్త్రి సాహితీ సమితి కార్యకలాపాలు వెనక బట్టి పోవటానికి కారణాన్ని నిష్పాక్షికంగా వివరించారు[7]. 1930 తర్వాత దేశంలో ప్రబలిన ఆర్థికసంక్షోభంలో సాహితీ సమితి సభ్యుల రచనలు కాలదోషం పట్టినట్లుగా కన్పించసాగాయి. సాహితీ సమితి నామమాత్రావశిష్టమై పోయింది. 1946 లో గుంటూరులో రజతోత్సవము జరుపుకొన్నది.

ఆధునికాంధ్ర సాహిత్య చరిత్రలో సాహితీ సమితి నిర్వహించిన పాత్ర గణనీయమైనది. 'సాహితీ సమితి'ని చూచి విశాఖపట్టణంలో

25 'సాహితీ సమితి కవులు'- నోరి నరసింహ శాస్త్రి; సారస్వత వ్యాసములు- ఐదవ సంపుటము - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ - 1980

26 సాహితీ సమితి కవులు-నోరి నరసింహశాస్త్రి; సారస్వత వ్యాసములు- ఐదవ సంపుటము - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 1980.

27. సాహితీ సమితి కవులు- నోరి నరసింహ శాస్త్రి; సారస్వత వ్యాసములు- ఐదవ సంపుటము - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ- 1980

శ్రీయుతులు పురిపండా, శ్రీ శ్రీ, వడ్డాది సీతారామాంజనేయులు 'కవితా సమితి'ని స్థాపించారు. 'అఖిలాంధ్ర కవుల ఛాయాచిత్ర ప్రదర్శన' వంటి కార్యక్రమాలను యీ సమితి నిర్వహించింది. శ్రీ బుర్రా శేషగిరిరావు స్థాపించిన 'ఆంధ్ర భారతీతీర్థ' కూడ సాహితీవేత్తలను ప్రోత్సహించింది

## పత్రికాప్రచారము - విజ్ఞానవ్యాప్తి

ఈ శతాబ్దారంభంలో కొండా వేంకటప్పయ్య పంతులుగారు 'కృష్ణా పత్రిక' ను ప్రారంభించారు (1902). తెలుగుజాతి సంస్కృతి, వాఙ్మయ వికాసాలకు కృష్ణాపత్రిక మిక్కిలి సేవచేసింది. శ్రీ ముట్నూరు కృష్ణా రావు సంపాదకీయ వ్యాసాలు, 'లోవెలుగులు' గాంభీర్యానికి, ఆధ్యాత్మిక చింతనకు, యుక్తాయుక్తవిచక్షణా జ్ఞానానికి పెట్టింది పేరు. 1906 లో కొమర్రాజు లక్ష్మణరావుగారు విజ్ఞానచంద్రికా గ్రంథమండలిని స్థాపించారు. లాభదృష్టి లేకుండ యీ సంస్థ ప్రజలలో విజ్ఞానవ్యాప్తి గావించింది. లక్ష్మణరావుగారే 'వేగుచుక్క గ్రంథమాల' ను గూడ ప్రారంభించారు.

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు 1908 లో ఆంధ్రపత్రికను వారపత్రికగా బొంబాయినుండి ప్రకటించసాగారు. అంతటితో తెలుగు పత్రికా రంగంలో నూతనశకం ఆరంభమయింది. 1910 నుండి 'ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచిక'లు ప్రకటించటం ప్రారంభించారు. తెలుగు జాతి చరిత్ర, వాఙ్మయ, విజ్ఞాన విషయాలలో సంవత్సరాది సంచిక ఆంధ్రులకు మిక్కిలి ప్రీతిపాత్రమైంది. 1912 లో 'ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక' త్రైమాసపత్రికగా వెలువడి చరిత్ర, వాఙ్మయ జిజ్ఞాసువులకు తోడ్పడింది. పూర్తిగా సాహిత్యవిషయాలకే అంకితమైన మొదటి పత్రిక సాహితీసమితివారి 'సాహితి.' ఇది 1920 జనవరిలో వెలువడింది. వీరిదే 'సఖి' పత్రిక ఆతర్వాత కొన్నాళ్లపాటు నడిచింది.

భారతదేశంలో ప్రఖ్యాతిగాంచిన రామానందఛటర్జీ సంపాదకత్వంలో వెలువడుతున్న 'Modern Review' పత్రికను ఆదర్శంగా

పెట్టుకొని కౌతా శ్రీరామశాస్త్రిగారు 1923 లో మచిలీపట్టణము నుండి 'శారద' పత్రికను ప్రారంభించారు. ఆర్థికవనరులు చాలక నడిపినది రెండుమూడేండ్లే అయినా 'శారద' తెలుగు పత్రికలలో ఒక విశిష్ట స్థానాన్ని సంపాదించుకొన్నది. అయ్యంకి వెంకటరమణయ్యగారి సంపాదకత్వంలో వెలువడిన 'గ్రంథాలయ సర్వస్వం' సాహిత్య సంబంధమైన రచనలనుకూడ ఆదరించింది. క్రిందటి శతాబ్దంలో ప్రారంభమైన 'అముద్రితగ్రంథచింతామణి' సాహిత్యానికి ఎనలేని సేవచేసింది.

ఆంధ్రసాహిత్యాన్ని మూడుపువ్వులు ఆరుకాయలుగా వృద్ధి పొందించిన మాసపత్రిక 'భారతి' 1924 లో ప్రారంభింపబడి ఇప్పటికీ క్రమం తప్పకుండ వెలువడటం ఆంధ్రజాతికి గర్వకారణమే. ఎన్నో సాహిత్యపరిషత్తులు చేసినసేవ ఒక్క 'భారతి' చేసిందనటం అతిశయోక్తి కాదు. స్త్రీలకోసం ప్రారంభింపబడినా ఆంధ్రులందరికి ఆదరపాత్రమైన గృహలక్ష్మి' పత్రిక సాహిత్యానికి చెప్పుకోదగిన సేవచేసింది.

ఇంకా పాటిబండ మాధవశర్మగారి 'వీణ'; రాజమన్నారుగారి 'కళ'; సురవరం ప్రతాపరెడ్డిగారి 'గోలకొండ పత్రిక'; శ్రీపాదవారి 'ప్రబుద్ధాంధ్ర' ఆంధ్రమహిళ మొదలైన పత్రికలు ఆధునిక సాహిత్యం ఆరంభదశలో మిక్కిలి తోడ్పడ్డాయి. సాహిత్యప్రచారం కోసం ఏర్పడిన "ఆంధ్రప్రచారిణి; సరస్వతి; హితకారిణి" మొదలైన గ్రంథమాలలు తక్కువధరకు ప్రజలకు సాహిత్యగ్రంథాలను అందించాయి.

నవ్యసాహిత్యపరిషత్తువారి 'ప్రతిభ'; ముద్దుకృష్ణగారి 'జ్వాల'; కొంపెల్ల జనార్దనరావుగారి 'ఉదయిని'; అభ్యుదయ రచయితల సంఘం వారి 'అభ్యుదయ; తెలుగుతల్లి' భావకవిత్వము, అభ్యుదయ కవిత్వము తెలుగుదేశాన్ని కాంతిమంతం చేస్తున్నకాలంలో నవ్యసాహిత్యానికి పట్టు

గొమ్మలై నిలిచాయి. నవ్యసాహిత్యవికాసానికి పత్రికల, గ్రంథమాలల తోడ్పాటు కొనియాడదగినది.[28]

## జాతీయోద్యమంలో తెలుగుకవుల వీరగీతాలు

భారత జాతీయోద్యమకవి బంకించంద్రఛటర్జీ రచించిన 'వందే మాతరమ్' ఈ శతాబ్ది మొదటిదశాబ్దంలోనే ఆంధ్రదేశంలో మార్మోగింది. రవీంద్రుని గీతాంజలి, ఇక్బల్, నజ్రుల్ ఇస్లాంకవుల దేశభక్తి ప్రపూరితమైన గీతాలు ఆంధ్రులకు ఉత్సాహం కల్పించాయి. అరవిందుడు, హరీన్ రచనలు యువకవులకు ఉద్రేకం పుట్టించాయి. ఆంధ్రోద్యమం కూడ మొదటిదశాబ్దంలోనే ఆరంభమైంది. బందరులో జాతీయ కళాశాల స్థాపింపబడింది. గాంధీజీ ప్రభావానికి లోనై అనాటి పెద్దలు, యువకులు ఖద్దరుధారులై విదేశీవస్త్రాలను, చివరకు విదేశీయులు ప్రవేశపెట్టిన విద్యావిధానాన్ని తిరస్కరించారు. రాట్నము ప్రతిఇంటా వెలిసింది. స్త్రీపురుషభేదం లేకుండా చరఖా వడకటం మొదలైంది. ఎంతోమంది సుఖ జీవనానికి అధారమైన తమ ఉద్యోగాల్ని, చదువుల్ని విడిచిపెట్టేశారు. కుటుంబాలు నిరాశ్రయాలైనా త్యాగాలకు వెనుదీయక స్వాతంత్ర్యసమరంలో పాల్గొన్నారు. ఆంధ్రోద్యమాన్ని స్వాతంత్ర్యసమరాన్ని నడిపించిన హేమాహేమీలు జాతీయ కళాశాలలో పనిచేశారు. శ్రీయుతులు కాటూరి వేంకటేశ్వరరావు, అడవి బాపిరాజు, విశ్వనాథ సత్యనారాయణ, కోలవెన్ను రామకోటేశ్వరరావు మొదలైన సుప్రసిద్ధ సాహిత్యవేత్తలు జాతీయ కళాశాల నిర్వహణలో ప్రాముఖ్యం వహించారు. ప్రమోద కుమారఛటర్జీ ఈ కళాశాలలో చిత్రకళ బోధించారు. శ్రీ శివలెంక శంభు

28. ఇక్కడ ఇచ్చిన పత్రికల సమాచారం సమగ్రం కాదు. ఇంకా వివరాలు కావలసినవారు జి. వి. సుబ్రహ్మణ్యంగారు సారస్వత వ్యాసములు- మొదటి సంపుటము (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ) నకు రచించిన పీఠిక చూడవచ్చు. మరికొన్ని వివరాలకు "Studies in the History of Telugu Journalism - Edited by K. R. Seshagiri Rao" గ్రంథాన్ని సంప్రతించవచ్చు.

ప్రసాద్, బెజవాడ గోపాలరెడ్డివంటి ప్రముఖులు పెక్కుమంది ఇక్కడి విద్యార్థులు.

బందరులోనే 'కృష్ణాపత్రిక' సంపాదకత్వాన్ని శ్రీ ముట్నూరు కృష్ణారావు చేపట్టారు. జాతీయ భావప్రేరేపకమైన రచనలతో కృష్ణా పత్రికను ఆయన తీర్చిదిద్దారు. "కృష్ణాపత్రికా, జాతీయ కళాశాలా అన్నాచెల్లె ళ్లనవచ్చు."[29]

స్వాతంత్ర్యోద్యమానికి శంఖారావం పూరించిన ఉద్యమాలలో గ్రంథాలయోద్యమం విశేషంగా చెప్పదగినది. గాడిచర్ల హరిసర్వోత్తమ రావు, అయ్యంకి వెంకటరమణయ్యగారలు గ్రామాలలో గ్రంథాలయాలు నెలకొల్పటానికి తోడ్పడి ప్రజలలో విద్యావ్యాప్తి గావించారు. ఆ రోజుల్లో వక్తృత్వ మొకకళగా వ్యాప్తిలోకి వచ్చింది. బిపిన్ చంద్రపాల్ ఆంధ్రదేశ పర్యటనలో రాజమహేంద్రవరంలో ఇచ్చిన ఉపన్యాసం ఎంతోమందిని ముగ్ధుల్ని చేసింది. ఆనాటి ఆవేశంలో శ్రీ చిలకమర్తి ఆశువుగా

"భరత ఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియగట్టి" అని పద్యం చెప్పి జాతీయోద్యమ కవితకు పుష్టి చేకూర్చారు.

చెరసాల కేగటంలో ఔన్నత్యాన్ని కీర్తిస్తూ చిలకమర్తివారు

"చెరసాలల్ వరచంద్రశాలలె యగున్ చేదోయి గావించు, న
య్యరదండల్ విరిదండ లయ్యెడును, హేయంబైన చోడంబలే
పరమాన్నం బగు, మోటు కంబళులె శాల్వల్ బట్టుసెల్లాలగున్
స్థిరుడై యేసరుడాత్మదేశమును భక్తిం గొల్చు నప్పట్టునన్" అని

నవ్యాంధ్ర సాహిత్య వీధులు - కురుగంటి సీతారామయ్య - మొదటి ముద్రణ - ౧౬౮ పేజీ.

సత్యాగ్రహులకు సమరోత్సాహం కల్పించారు. పారతంత్ర్యంలో క్రుంగు తున్న భారతదేశం వీరికి బందిఖానగా తోచింది.

మంగిపూడి వేంకట శర్మగారి 'వితంతు విలాపము' సంఘ సంస్కార రీతిలో వెలువడిన ఉత్తమ కావ్యం. వీరి 'నిరుద్ధ భారతము' హరిజన సమస్యను ప్రస్తావించిన విశిష్టమైన కావ్యం. 1920 లోనే గాంధీ శతకము, 'మద్దుకత' రచించి మంగిపూడి వారు జాతీయోధ్యమ కవులకు మార్గదర్శకులయ్యారు.

జాతీయోద్యమంలో ప్రజలను ఉత్తేజపరుస్తూ ప్రబోధగీతాలు రాసిన వారిలో కనిష్ఠికాధిష్ఠితులు గరిమెళ్ల సత్యనారాయణగారు. "ఆయన యొక్కడే, యీ మహాంధ్ర స్వాతంత్ర్యోద్యమము కవితా రూపమున వెడలినదన్నచో, నా సరస్వతికి రూపమిచ్చినవాడు. ఆయన పండితుడు, సంగీత సాహిత్యములందు గొప్ప సమర్థుడు. కాళిదాసు మహా కవియైనచో నాయన రచించిన కావ్యములలో నభిజ్ఞానశాకుంతలము పరమోత్తమమైనచో, నితని మహా కవితా ధారలో "మా కొద్దీ తెల్ల దొరతనము" అన్న పాట "శాకుంతలము" వంటిది. "చూడి ఆవుల మంద సురిగి యింటికి రాదు"-యీ ఒక్క వాక్యము చాలును. ఇతరుల నాగరకత, మన నాగరకత, మన మతము, మన మతములో నున్న మేలిమి సర్వము దీనియందు మహా ధ్వనిగా నున్నది. అంతటి జాతీయ కవి పుట్టుట సాధ్యముగాదు. ఈ మహానుభావుడు చివరకు తినుటకు తిండికిలేక మాడినాడు. అది మన జాతి లక్షణము గదా!" అని విశ్వనాథ వారన్న మాటలు గరిమెళ్ల వారి గొప్పతనాన్ని చక్కగా వెల్లడిస్తాయి[30]

జాతీయోద్యమాన్ని వర్ణించటంలో పద్యాలు, గేయాలు విరివిగా వెలువడినాయి. సభలలో ఊరేగింపులలో పాడుకోవటానికి అనువైన గేయాలు ఎక్కువ ప్రచారాన్ని పొందాయి. భక్తి గీతాల ననుకరించిన

30. **ఉపోద్ఘాతము - విశ్వనాథ సత్యనారాయణ, 'జాతీయ గీతాలు' - గురజాడ రాఘవ శర్మ సంపాదకులు-ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 1973.**

స్వాతంత్ర్య సమర గీతాలను సామాన్యులు, మాన్యులూ కన్నుల కద్దుకొన్నారు. "శ్రీ గాంధి నామం-మరువాం మరువాం సిద్ధము జైలుకు-వెరువాం వెరువాం"వంటి గేయాలు ప్రజల నోళ్లలో నిరంతరం నాట్యమాడేవి. "మేలుకొనుమీ! భరత పుత్రుడ! మేలుకొనుమీ! సచ్చరిత్రుడ! మేలుకొనవయ్యా! వత్సా మేలుకో!" అన్న మంగిపూడి వారి గీతం ఉత్సాహాన్ని కలిగించి, పారతంత్ర్యం నుండి బయటపడమని ఉద్బోధించింది. జాతీయ పతాకను చిత్రించి పింగళి వెంకయ్యగారు ఆంధ్రుల కెనలేని గౌరవాన్ని సమకూర్చారు.

"కల్లు మానండోయ్-కల్లు మానండోయ్" దండాలండోయ్-మేముండలేమండోయ్ బాబు/ఉప్పుకును పన్ను-పప్పుకును పన్ను....ఉన్న కొప్పు కాస్త దేముడికి-మొక్కుకుంటె పన్ను బాబు" మొదలైన గరిమెళ్లవారి గీతాలు సత్యాగ్రహులకు, సామాన్య ప్రజలకు నిత్య పారాయణా లయ్యాయి.

శ్రీయుతులు బలిజేపల్లి లక్ష్మీకాంతం, దామరాజు పుండరీకాక్షుడు, మాధవపెద్ది బుచ్చి సుందరరామ శాస్త్రి, తుమ్మల సీతారామమూర్తి, దువ్వూరి రామిరెడ్డి ప్రభృతులు జాతీయోద్యమ కవులుగా ప్రఖ్యాతి పొందారు. దామరాజువారి నాటకాల్ని బ్రిటీషు ప్రభుత్వం నిషేధించింది.

శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారి 'మాలపల్లి' జాతీయోద్యమ కాలంలో వచ్చిన ఉత్తమ నవల. ఇందులో తక్కెళ్ల జగ్గని ధర్మబోధలు (బుఱ్ఱకథ) సామాన్య ప్రజలకు రాజకీయ చైతన్యం కలిగించిన ఉత్తమ కవిత్వం.

ఉద్యమ వేగంలో వచ్చిన పాటలు స్వాతంత్ర్యం సిద్ధించాక మరుగున పడిపోయాయి వాటిలో కవితాశిల్పం గలవి నేటికీ ఆదరింపబడుతున్నాయి.

ఆధునికాంధ్ర కవితావికాసంలో జాతీయోద్యమం కవిత్వాన్ని సామాన్యులకు దగ్గరగా తెచ్చింది. మిగిలిన సమయాల్లో కవిత్వం రచించని

కొందరు దేశ భక్తులను స్వాతంత్ర్యోద్యమం కవులను చేసింది. శ్రీ గురజాడ రాఘవశర్మ సంపాదకత్వం వహించిన 'జాతీయ గీతాలు' చదివితే ఆనాటి ఉద్యమ స్వరూపమే గాక, కవితా స్వరూపం గూడ చక్కగా బోధపడుతుంది.

## నవ్యకవిత్వ వికాసానికి తోడ్పడిన పండితులు - విద్వత్కవులు

ఆలోచనలలో, కావ్యరచనలో పూర్తిగా ఆధునికులు కాకపోయినా కొందరు సనాతనపండితులు, కవులు ఆధునికభావాలను అర్థంచేసుకొని, తమ పరిధినుండి బయటికి వచ్చి నవ్యులతో సహకరించారు. వారిలో తిరుపతి వేంకటకవులు, మారేపల్లి రామచంద్రశాస్త్రి, ఆదిభట్ల నారాయణ దాసు, వేలూరి శివరామశాస్త్రి, సెట్టి లక్ష్మీనరసింహం, ఉమర్ అలీషా, దాసు శ్రీరాములు, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ మొదలైన కవులు; తాతా సుబ్బారాయశాస్త్రి, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, వేదాల తిరు వేంగళాచార్యులు, జమ్ములమడక మాధవరాయశర్మ మొదలైన సంస్కృత పండితులు, కొమఱ్ఱాజు లక్ష్మణరావు, చిలుకూరి వీరభద్ర రావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, సురవరం ప్రతాపరెడ్డి, మాడపాటి హనుమంతరావు, ఆదిరాజు వీరభద్రరావు మొదలైన చరిత్ర పరిశోధ కులు మొదలైనవా రున్నారు. వీరందరూ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఆధునిక కవిత్వాభివృద్ధికి తోడ్పడినవారే.

"తమ యవ్వనమంతా కర్పూరంలా ఖర్చుపెట్టి" బాలకులలో కవిత్వపిపాస కల్పించి హైస్కూలు పండితులుగా పనిచేసిన చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి, మారేపల్లి రామచంద్రశాస్త్రిగారలు యువకవులను తీర్చి దిద్దారు. చెళ్లపిళ్లవారి ఆశుకవిత, అవధానచాతుర్యమూ యువకుల్లో కవిత్వం చెప్పాలన్న తహతహను రేకెత్తించాయి. తిరుపతి వేంకటకవుల 'బుద్ధచరిత్రము'ను మించిపోయిన 'సౌందరనందము' రచించిన నవ్య కవులు పింగళి-కాటూరి చెళ్ళపిళ్ళవారి శిష్యులే. చెళ్ళపిళ్ళవారు విడిది చేసిన చోటల్లా కవిత్వపు తిరునాళ్ళ వెల్లివిరిసేది. మారేపల్లివారి సాహ చర్యంలో పురిపండా, శ్రీశ్రీ, కాటూరి నరసింగరావు మొదలైనవారు

కవులుగా ప్రసిద్ధికెక్కారు. శృంగారం దట్టించి యువకులలో ఉత్సాహం పుట్టించిన సెట్టి లక్ష్మీనరసింహంగారు నవకవితా వికాసానికి తోడ్పడ్డారు.

ఆదిభట్ల నారాయణదాసుగారు హరికథారచన, కథనాలతో ఆంధ్ర దేశాన్ని యీ తరుణంలో ఉఱ్ఱూతలూగించారు. సంస్కృతములో, ఇంగ్లీషులో మహాపండితులైన ఆదిభట్లవారు దేశీయమైన కథాగానాన్ని చేపట్టి కవితను పండిత, పామరులందరికీ రంజకంగా వుండేలాగ చేశారు.

వేలూరి శివరామశాస్త్రిగారు ఎంత శాస్త్రవైదుష్యంగలవారో అంత ఆధునికులు. ఆయన రచించిన 'ఏకావళి' ఖండకావ్యసంపుటి చిన్నదైనా విశిష్టమైనది. ఎక్కడ ఏ మంచి కావ్యం వెలువడినా అరమరికలు లేక అభినందించటం వేలూరివారి హృదయ వైశాల్యానికి గుర్తు. ఆరుద్రగారు రచించిన 'ఇంటింటి పజ్యాలు'లో కొత్తదనాన్ని హర్షించగలిగారంటే ఆయన కాలంతోపాటు కదిలివచ్చారని చెప్పవచ్చు.

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సుప్రసిద్ధ సాహిత్య పరిశోధకులు. 'కడుపుతీపి' కావ్యరచనతో ఆయన నవ్యకవులలో వొకరుగా గణుతింప దగ్గవారు. చరిత్ర పరిశోధనలో సాహిత్యపరిశోధనలో ఏ వినూత్నమైన అంశం కనిపించినా, తనకు తోచినా సత్యాన్వేషణాదృష్టితో దాన్ని వ్యాస రూపంలో వెల్లడించేవారు. ఆధునికకవులకు ఆయన అండదండలు లభిం చడం వారి భాగ్యవిశేషమే.

శ్రీ ఉమర్ అలీషా ఇస్లాముమతావలంబకులైనప్పటికీ తెలుగు దేశచరిత్ర, పురాణాలపై ఆసక్తివహించి రసవంతమైన కావ్యాలు రచిం చారు. ఉమర్ ఖయాము రుబాయీలకు వీరి అనువాదం ఆధునికులకు అభిమానపాత్రమైంది.

'దేవీభాగవతం' వంటి సంప్రదాయ కావ్యాలు రచించిన దాసు శ్రీరాములుగారు 'తెలుగునాడు' రచించి నవ్యకవుల ఆదరాన్ని పొందారు. సమకాలికమైన తెలుగుదేశ ప్రజల ఆచార వ్యవహారాలను హాస్యరీతిలో వీరు 'తెలుగునాడు'లో వర్ణించారు.

'పెనుగొండలక్ష్మి, శాలివాహన సప్తశతిసారము' కావ్యాలలో నవ్యకవులను ఆకర్షించిన శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ ఉత్తమాభిరుచులు గల మహనీయులు. ఆయన విమర్శవ్యాసాలు నిష్కర్షగా, నమ్మిననిజాన్ని నిర్భయంగా వెల్లడించేవిగా వుంటాయి. ఆయన విమర్శవ్యాసాలు నవ్యకవులు తమ మార్గాన్ని సవరించుకోవటానికి తోడ్పడ్డాయి.

ఆంధ్రదేశంలో పేరెన్నికగన్న సంస్కృత పండితులంతా ఎప్పుడో ఒకప్పుడు శ్రీ తాతా సుబ్బారాయశాస్త్రి శిష్యరికం చేసినవారే. ఆయన తమ గురువని చెప్పుకోవటానికి పండితులు గర్విస్తారు. నవ్య సాహిత్యానికి ప్రోద్బలకమైన గ్రంథ మేదీ ఆయన రాయకపోయినా, గ్రాంథిక వ్యావహారికవాదమే సరియైనదని, ఆధునిక కవులకు కొండంత అండను సమకూర్చారు.

ఎంకిపాటలపై చెలరేగిన దుమారంలో పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు నండూరివారి పక్షం వహించి, ఎంకిపాటల అందచందాలు అందరికీ వివరించి, ఆ పాటల్లో శృంగారం ఆలంకారిక మర్యాదలను పుణికిపుచ్చుకొన్న వేనని, వాటి ఔన్నత్యాన్ని ఘనంగా చాటి చెప్పారు.

'ఆంధ్ర ధ్వన్యాలోకము' రచించిన శ్రీ వేదాల తిరువేంగళాచార్యులు ధ్వన్యాలోకంలో ఉదాహరణలుగా సమకాలికకవుల పద్యాలను గ్రహించి, వాటిలో ధ్వనిలక్షణాలను విశదీకరించారు. శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ 'రసగంగాధరమణి'ని వాడుకభాషలో రచించి, సంస్కృత అలంకారశాస్త్రాలు ఆధునికులకు దూరమైనవి కావని నిరూపించారు. ఆధునిక కవిత్వాన్ని ఆయన 'నాట్యవేదము'నుండి 'రసగంగాధరం' దాకా, ఆలంకారికుల లక్ష్యలక్షణాలతో సమర్థించారు. ఈ సందర్భంలో ఆధునిక కవిత్వంపై ధ్వజమెత్తి భావకవిత్వాన్ని తీవ్ర విమర్శకు గురిచేసిన అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరులు వ్యావహారిక వాది అన్నసత్యం మరచిపోకూడదు. 'పలనాటి వీరచరిత్ర'కు ఆయన

ఉపోద్ఘాతంలో దేశిచ్ఛందస్సులను, దేశీయమైన కవితా రీతులను ఆయన సమర్థించారు.

కొమర్రాజు, చిలుకూరి, మల్లంపల్లి మొదలైనవారి చరిత్ర పరిశోధనా వ్యాసాలు, గ్రంథాలు నవ్యకవులకు ఆంధ్రాభిమానాన్ని, దేశభక్తిని ఉద్దీపింపజేశాయి. ముఖ్యంగా మల్లంపల్లి సోమశేఖరశర్మగారు నవ్యకవుల గ్రంథాలను అంకితం తీసుకొని, పీఠికలు రచించి, వారిని ప్రోత్సహించారు. ఆయన విశాలహృదయంతో ఏ కొత్త కవిత్వ పద్ధతి ప్రవేశించినా ఆగ్రహించక ఆహ్వానించారు.

తెలంగాణలో సాంస్కృతిక చైతన్యానికి దోహదం చేసిన మాడపాటి హనుమంతరావు, ఆదిరాజు వీరభద్రరావు, సురవరం ప్రతాపరెడ్డిగారలు విద్యావిషయికంగా వెనుకబడివున్న ప్రాంతంలో కవులను ప్రోత్సహించారు. గోలకొండకవుల రచనలను, ఆకారాలను సేకరించి ప్రకటించిన సురవరం ప్రతాపరెడ్డిగారు యువకవులకు గురుతుల్యులు.

## "వచ్చేసింది కొత్తతరం" - నవ్యసాహిత్య పరిషత్తు

ఆంధ్ర సాహిత్యపరిషత్తు వాడుకభాషకు, నవ్యసాహిత్య వికాసానికి అడ్డుగా నిలవటంతో యువకవులలో నిరుత్సాహం ప్రబలింది. వాడుకభాషలో కూడ రచనలు చేయవచ్చునన్న తీర్మానాన్ని ఒకప్పుడు నవ్యులు ఆంధ్రసాహిత్య పరిషత్తులో ప్రవేశపెట్టి నెగ్గించారు. కాని, ఆ తర్వాతి సమావేశంలోనే సనాతనులకు ప్రతినిధియైన జయంతి రామయ్యపంతులుగారు ఆ తీర్మానాన్ని ఓడించారు. నవ్యసాహిత్యాభిమానులకు తీవ్రమైన అసంతృప్తి కలిగింది. 'సాహితీసమితి' నవ్యసాహిత్య ప్రచారంకోసమే ఏర్పడినా దానిశక్తి పరిమితమై కొద్ది పట్టణాలకే పరిమితమైపోయింది. నవ్యసాహిత్యాభిమానులు తమ కొక వేదిక కోసం ఎదురు చూడసాగారు.

1933 లో బరంపురంలో పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, గురుభాగవతుల ధర్మారావుగారల సారథ్యంలో "అభినవాంధ్ర కవి పండిత

సభ'' జరిగింది. ఈ పేరు నవ్యసాహిత్యానికి అంతగా సరిపోదని ఆ తర్వాత ''నవ్యసాహిత్య పరిషత్తు'' అని మార్చారు. గిడుగు రామమూర్తి పంతులుగారు ప్రారంభకులుగా, చిలుకూరి నారాయణరావుగారి అధ్యక్షతన మొదటిసభ జరిగింది.

''గ్రాంథికాంధ్రము ఒకానొకప్పుడు పరిమిత ప్రయోజనము కలదైనా, నేడది సర్వజనోపయోగకారి కాదు...వ్యావహారికాంధ్రము అపరిమిత ప్రయోజనము కలది. ప్రజలలో జ్ఞానాభివృద్ధి కలగడానికి యిదే పరమసాధనము'' అనే సదుద్దేశ్యంతో ప్రారంభమైనది నవ్య సాహిత్య పరిషత్తు, ఆంధ్ర సాహిత్య పరిషత్తు ఆధునిక సాహిత్యానికి దూరమైపోయిందని నవ్యసాహిత్య పరిషత్తువారు తలచారు.

''నవ్య సాహిత్య రచన చేయడము, నవ్యసాహిత్యము దేశములో యే విధముగా ఉత్పత్తి అవుతున్నదో పరిశీలించి అందులోని బాగోగులు విమర్శించడము, నవ్యవాఙ్మయమును గురించిన అపోహలు తొలగించుటకు, నవ్యసాహిత్య వ్యాపనము కోసము ప్రచారము చేయడము, వచన వాఙ్మయము - సాధ్యమైనంతవరకు పద్యవాఙ్మయమును ప్రజలకు సుపరిచితమైన వ్యావహారిక భాషలో నిర్మించి అందు మూలముగా ప్రజలలో విజ్ఞానము వ్యాపింపజేయడము'' పరిషత్తుల లక్ష్యాలుగా పెట్టుకున్నది, ఏడాదికొకసారి వార్షికసభలు జరిపి, సభ్యుల రచనలు ప్రజలకు పరిచయం చేయటమూ, ఆ సభకు అధ్యక్షులుగా ప్రసిద్ధ సాహితీవేత్తలను ఎన్నుకొని వారి సందేశాన్ని అందుకొని చైతన్యవంతులు కావటమూ జరుగుతూ వుండేది. శ్రీయుతులు రాయప్రోలు, తల్లావజ్ఝల, పంచాగ్నుల, విశ్వనాథ. కృష్ణశాస్త్రి. అడవి బాపిరాజు, బుర్రా శేషగిరిరావు, కాటూరి వేర్వేరు సంవత్సరాలలో నవ్యసాహిత్య పరిషత్తుకు అధ్యక్షత వహించి తమ ప్రసంగాలతో సాహిత్యలోకంలో చైతన్యాన్ని రగుల్కొల్పారు. శ్రీవిశ్వనాథ అధ్యక్షత వహించిన సప్తమ వార్షికోత్సవ ఉపన్యాసం మొత్తం నవ్యసాహిత్యాన్ని సింహావలోకనం చేసి సాహిత్య స్వరూపాన్ని, లక్ష్యాన్ని స్పష్టంచేసింది. భావకవిత్వమంటే యేమిటో విశ్వనాథవారీ ఉపన్యాసంలోనే నిర్వచించారు.

"వ్యావహారిక భాష గ్రామ్యభాష అని ద్వేషించేవారికి యీ పరిషత్తులో స్థానం లేదు." కాని కట్టమంచి, త్రిపురనేని, దువ్వూరి మొదలైన గ్రాంధికవాదులను కూడ నవ్య సాహిత్యంలో చేర్చారు శ్రీ విశ్వనాథ," వారిది కూడ నవ్యసాహిత్యం యెల్లా అవుతుందీ అంటే సాహిత్యాదర్శాల్లో, సంప్రదాయాల్లో యెదురు తిరిగి నవ్యత్వం కోరటం మూలంగా నవ్యసాహిత్యమే అవుతుందని విశ్వనాథవారు వివరించారు.

"సాహిత్యమంటే ఒక జాతియొక్క సంస్కారం. మనజాతి పూర్వం ఒక గొప్ప సంస్కార దశను పొందింది. సృష్టిక్రమంలో, సృష్ట్యాదికాల నిర్ణయంలో, భిన్నరాజ చరిత్ర నిర్ణయంలో, సంఘ ధర్మనీతులలో, ఆర్థిక రాజకీయాలలో, సారస్వత పథాలల్లో ఒక విశిష్టమైన సంస్కారంతో గూడిన సిద్ధాంతాలమీద మనజాతి నడిచింది. ఇవ్వాళ ఆంగిలేయులు మన్ని ఆక్రమించటం చేత ఆ మహాసంస్కారం మీద అభిమానం పోయింది. పాశ్చాత్యదేశీయుల సంస్కారంమీద అభిమానం ప్రబలింది. ఏతదభిమాన పురస్కృతమునైన భాషాతత్త్వం, చరిత్ర నిర్మాణం, సృష్ట్యాది కాలనిర్ణయం, సంఘధర్మాలూ, విశ్వాసాలూ యే గ్రంథం పరామర్శిస్తుందో అదంతా నవ్యసాహిత్యం" అని విశ్వనాథ నవ్యసాహిత్య పరిధిని విశాలతరం చేశారు.[31] పాశ్చాత్య సారస్వత ప్రభావంచేత మనదేశంలో కొత్తగా వ్యాప్తిలోకి వచ్చిన ఖండకావ్యము, నవల, నాటకం, చిన్నకథ, గేయము, చిన్ననాటకం, హాస్యరచన అనే ఏడు ప్రక్రియలనుగురించి విశ్వనాథ విపులీకరించారు. "భావం నీయిష్టం వచ్చినట్లు చేసుకో. ఆ భావానికి అమలు ఉన్నన్నాళ్ళూ ఆ భావం అమలులో వుంటుంది. భాష మాత్రం అచ్చంగా నీ తెలుగుభాష వాడు! నుడికారంలో, ప్రయోగించడంలో తెలుగుపుస్తకంలో తెలుగుకాని పోకడ పోవద్దు. ఇది ఒక్కటి లక్ష్యంగా పెట్టుకుంటే నవ్యసాహిత్యానికి భయంలేదు" అని ఆయన నవ్యసాహిత్య ప్రియులకు హితవు చెప్పారు.[32]

31, 32 : సప్తమహర్షికోత్సవము - నవ్యసాహిత్య పరిషత్తు అధ్యక్షోపన్యాసము - విశ్వనాథ సత్యనారాయణ, 'భారతి' - ఏప్రిల్ 1940.

1936 లో నవ్యసాహిత్య పరిషత్తువారు ప్రతిభ అనే సారస్వత త్రైమాస పత్రికను ప్రారంభించారు. అభినవయుగంలో, నవ్యసాహిత్యంలో వివిధ ప్రక్రియలకు 'ప్రతిభ' పట్టుగొమ్మయై నిలిచింది దీనికి సంపాదకులుగా శ్రీ తెలికచర్ల వేంకటరత్నం చేసినసేవ కొనియాడదగినది. శ్రీశ్రీ 'మహాప్రస్థానం'లో కొన్ని గీతాలు మొదటిసారి 'ప్రతిభ'లోనే అచ్చుపడ్డాయి. 'పుస్తక సమీక్షల్లో గుణదోషవిచారణ చేసే నిజమైన విమర్శను 'ప్రతిభ' ప్రవేశపెట్టింది. ''ఈ కాలపు రచయితలు బహువిధాలుగా ఉన్నారు. నన్నయాదులవలె భారత రామాయణాదులు వ్రాసేవారి దగ్గరినుంచీ ప్రబంధ ధోరణిలో కావ్యాలు వ్రాసేవారి దాకా, ఆంధ్రాభిమానము దగ్గరినుంచీ సోవియటు అభిమానము దాకానూ, భావ కవిత్వము దగ్గరినుంచీ శ్మశాన కవిత్వము దాకానూ ఆధ్యాత్మికానుభూతుల 'దగ్గరనుంచీ' 'కొంటె' కోణాలూ, Vigbior, ఫిడేలు రాగాలడజను, నవమిచిలుక దాకానూ వివిధకావ్యాలు వ్రాసే కవులున్నారు....సాధ్యమైనంతవరకు బహుసంఖ్యాకులను ఏకముఖము చేయడమే నవ్యసాహిత్య పరిషత్తు ప్రధానోద్దేశమని చెప్పవచ్చును'' అని శ్రీ నోరి నరసింహశాస్త్రి పరిషత్తు స్వభావాన్ని చక్కగా వివరించారు.[33] భాషా శాసనము కాని, రచనా శాసనముకాని నవ్యసాహిత్య పరిషత్తు లక్ష్యం కాదు, కేవలం నవ్యకవులను, రచయితలను ఒకచోట చేర్చి, వారి కొక వేదికను కల్పించి పత్రికను ప్రకటించి, వార్షికసభలు జరపటమే తన కర్తవ్యంగా పెట్టుకొన్నది.

1930 నాటి గడ్డురోజుల్లో ఆకలితరం యువకులు సమాజాభ్యుదయాన్ని కోరే రచనలకే ఎక్కువ ప్రాముఖ్య మిచ్చి, కేవల రసానందం కల్పించే రచనలను యీసడించటంతో నవ్యసాహిత్య పరిషత్తు వెనకబడిపోయింది. అభ్యుదయోద్యమం పుంజుకునేదాక నవ్యసాహిత్య పరిషత్తు దేదీప్యమానమై వెలిగి, చారిత్రకంగా తన కర్తవ్యాన్ని నెరవేర్చింది.

**33. 'నవ్యసాహిత్య పరిషత్తు' - నోరి నరసింహశాస్త్రి - సారస్వతవ్యాసములు - ఐదవసంపుటము - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ - 1980.**

## ఆత్మాశ్రయ కవిత అందచందాలు
## భావకవులలో గౌరీశంకరశిఖరం కృష్ణశాస్త్రి

శ్రీ రాయప్రోలు ప్రారంభించిన నూతన కవిత్వాన్ని ఆయన అభినవ కవిత అని పిలుచుకున్నారు. నవ్య కవిత్వ మనేమాట కవులలో సహృదయులలో వ్యాప్తిలోకి వచ్చింది. ఇతివృత్తము కంటె, పాత్రల కంటె, సన్నివేశాలు కంటె, సంభాషణల కంటె కవి చెప్పే భావాలకే అత్యధిక ప్రాధాన్యం వుండటంచేత దీన్ని భావకవిత్వ మని వ్యవహరించ సాగారు. తర్వాత ఆ పేరే యీ నవ్యకవిత్వానికి స్థిరపడిపోయింది. ఆత్మాశ్రయమైన కవితారీతి భావకవులది. "గురజాడవారే యీ ఆత్మాశ్రయ రీతికి 'పెరిగి విరిగితి' వంటి కావ్యంలో పునాది వేశారు." "ఆత్మపరమైన కావ్యంలో ప్రయోజనం స్ఫుటంగా కనపడదు. ఎక్కువ మందికి అందుబాటులో ఉండదు." అని కొందరు ఆక్షేపించారు గాని ఉత్తమ కవిత్వ మెప్పుడైనా ఆత్మాశ్రయంగానే ఉంటుందని క్రిష్టఫర్ కాడ్వెల్ అభిప్రాయపడ్డాడు. ఆత్మాశ్రయ కవిత్వాన్ని సహృదయులు ఆదరిస్తారనటానికి భావకవులు పొందిన ఆదర గౌరవాలే మంచి తార్కాణ. ఆత్మాశ్రయమైన యీ కవిత్వ పద్ధతికి భావకవిత్వ మనే పేరు రూఢమైనది.

కాల్పనికోద్యమానికి మార్గదర్శి రాయప్రోలువారైతే, ఈ ఉద్యమంలో గౌరీశంకరశిఖర మనదగిన కవి శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి. భావకవి అనగానే కృష్ణశాస్త్రిగారే జ్ఞాపకం వస్తారు. ఆయన మోజుపడి ధరించిన వేషం-గిరజాలు, పొడవు లాల్చీ, సుగంధ ద్రవ్యాలూ, కలల్లో తేలిపోయే చూపులు-వీటితో భావకవి కవిత్వంలోనే కాక వేషంలో కూడ కొత్త పద్ధతిని అవలంబించినట్లనిపిస్తుంది. శ్రీ కృష్ణశాస్త్రి ఉత్తమ భావుకుడు, ఉత్తమ వాగ్గేయకారుడు, శబ్దార్థాల రహస్యం ఆకళించుకొన్నవాడు, మహా భక్తుడు. అన్నిటినీ మించి మహోన్నతమైన మానవతావాది, మహాకవి. కృష్ణ పక్షము, ప్రవాసము, ఊర్వశి, మహతి, ఇంకా ఎన్నో నాటికలు భావకవులకు ఒరవడి పెట్టాయి. ఎవరూ ఆ ఒరవడిలో ఆయనను చేరుకోలేకపోయారు. ఆయన యవ్వన దశలోనే వేంకట

పార్వతీశ కవులవంటి లబ్ధ ప్రతిష్ఠులు 'ఏకాంతసేవ'కు ఆయనను పీఠిక రాయమని కోరారంటే భావకవులలో ఆయన స్థానం అవగతమౌతుంది. 'కృష్ణపక్షానికి' పుంఖానుపుంఖంగా అనుకరణలు బయలుదేరాయి. "ఆకులో నాకునై, పూవులో బూవునై, కొమ్మలోఁ గొమ్మనై నునులేఁత రెమ్మనై ఈయడవి దాగిపోనా, ఎట్లైన ఇచటనే యాగిపోనా" అన్న గీతంతో 'ఎట్లైన ఇచటనే ఆగిపోనా' అనే భావంవంటిది ప్రాచీనాంధ్ర కవిత్వంలో కన్పించదు.

"ప్రళయ కాల మహోగ్ర భయదజీమూతోరు గళ గంభీర ఘెళ ఘెళార్భటులలో మెఱపేలా ?" మొదలైన పంక్తులు సామాన్యులకు అర్థంకాక, భావకవిత్వ మంటే అర్థంకాని దనే భ్రమ వొకటి ఏర్పడింది. ఒక గడుసరి ఆధునిక కవి కృష్ణశాస్త్రిగారి కృష్ణ పక్షమును తెలుగులోకి అనువాదం చెయ్యాలని వున్నదన్నాడు. కృష్ణశాస్త్రిగారు పదాలను, భావాలను ఎంత చిత్రికపడితేనేం- అవి భారతీయ మహా శిల్పాలలో, చిత్తరువులలో అమరావతి, అజంతా వంటివి. వాటి సొగసు ఇంక ఏ కవితకూ రాదు. కాలంతోపాటు ఎదిగి, కదిలి వచ్చిన కవి ఆయన.

## చూపుతో మాటాడి ఊపిరితో తెనిగించిన కవి నండూరి సుబ్బారావు

"చూపుతో మాటాడి ఊపిరితో తెనిగించిన" మహాకవి నండూరి సుబ్బారావు. యెంకి పాటలు తప్ప మరేమీ రచించని నిష్ఠాపరుడు. తెలుగువారి ఆడపడుచుగా 'యెంకి'ని నిల్పి, తెలుగు కవితలో చిరస్మరణీయమైన పాత్రను రూపొందించారు. "యెంకెవ్వరని లోకమెపుడైన కదిపితే యెలుగు నీడలపైపు యేలు సూచింతు"నని జవాబు చెప్పిన తాత్త్వికుడు.

1917 లో శ్రీ నండూరి మద్రాసులో 'లా' చదువుతున్నప్పుడు, ఒకనాడు ట్రాంబండిలో వెళ్తున్నప్పుడు వారి నోటంట కూనిరాగంగా మొదలై " గుండె గొంతుకలోన కొట్లాడుతాదీ కూకుండనీదురా కూసింత సేపు" అనే పాట వెలువడింది. అదే యెంకి పాటలకు నాంది. జాన

పదుల యాసతో ఆయన కవిత్వం రాయటం చూచి శ్రీ బసవరాజు అప్పారావు "నీవు నిత్యం వాడే భాష కాదిది. ఈ భాష సాయమున సత్యాన్వేషణ చేయలేవు" అని హెచ్చరించారు. కాని నండూరి యెంకి పాటలను జానపద రీతిలోనే కొనసాగించారు. కొత్త పాటలలో కొన్ని పూర్వపు పాటల స్థాయిలో లేకపోయినా, ప్రణయ కవిత్వంలో ఆయన ఆవలిగట్టు చేరుకొన్నారు.

1920 ప్రాంతాల్లో యెంకి పాటలు తెలుగు కవిత్వంలో పెద్ద దుమారాన్ని రేకెత్తించాయి. పంచాగ్నుల, వేదాలవంటి పండితుల సమర్ధనా, ఊరూరా కృష్ణశాస్త్రిగారి గానమూ యీ దుమారాన్ని అణచి వేసి, యెంకి పాటలకు ఖ్యాతి తెచ్చాయి. "తనకు సాక్షాత్కరించిన కవితను అందుకోవడంలో బంధాలను తెంచివేశాడు. నియమాలను తోసి పారవేశాడు మహా సాహసంతో" శ్రీ నండూరి.[34] ఎందరో యెంకి పాటలను అనుకరించినా, ఎవ్వరూ ఆయన సమీపంలోకి కూడ రాలేక పోయారు. "యెంకిపాట వన్స్‌మోర్" అన్నారు శ్రీ శ్రీ.[35] యెంకిపాటలు నిత్యనూతనంగా హృదయాన్ని రసప్లావితం చేస్తూనే వున్నాయి.

## వేదనామయ కవితకు మరోపేరు వేదుల

భావ కవులలో శక్తిమంతమైన గీత రచన, భావుక నైశిత్యమూ కలిగిన ఉత్తమ కవి శ్రీ వేదుల సత్యనారాయణ శాస్త్రి. వీరి ఖండ కావ్యం 'దీపావళి నాడు' హరీన్ద్రనాథ చటోపాధ్యాయ మెప్పు పొందింది.

"మ్రొక్కిన కొలందిఁ గాలితోఁ ద్రొక్కుచున్న
యీ కఠినలోకమ్మెల్ల బహిష్కృతమ్ము
రండు చిమ్మటలార ! ఈ రాత్రి వేళ
నావలెనె పాడుకొనుమీరె నాకు సఖులు"

34. కవి పరిచయం-'వైతాళికులు'-ముద్దు కృష్ణ-ఆదర్శ గ్రంథ మండలి-ఆరవ ముద్రణ-1966.

35. 'ప్రాస క్రీడలు'-శ్రీశ్రీ-శ్రీశ్రీ సాహిత్యం – మూడు (కావ్య విభాగం) 1979-194 వ పేజీ.

అని చీకటిని ప్రాణసఖిగా తలచిన వీరి భావౌన్నత్యం కొనియాడ దగినది. 'దీపావళి'లో కవిత్వపు చిక్కదనం, పదముల పొందిక, భావ నిర్భరత, పద్యమాధుర్యం మిగిలిన భావకవుల కంటె వేదుల విశిష్టతను వెల్లడిస్తాయి- 'దీపావళి'లో ప్రతి పంక్తీ కవి గాఢమైన అనుభూతిలో నుంచి వెలువడినవే.

## 'ఆపలేని ధాటి - ఓపలేని అనుభూతి' - బసవరాజు గీతాలు

జీవితంలో సుఖదుఃఖాలేవి వచ్చినా ఆపుకోలేని ఆవేశంలో నిలు వెల్లా కదలి, అనుభవాలే పాటలుగా పాడుకొన్న కవి శ్రీ బసవరాజు అప్పారావు. "నగ్నంగా, నిజంగా వుంటుంది యీయన కవిత్వం. జిలుగూ తళుకూ ఉండదు. ఉండటానికి వీలులేదు, ప్రతి భావమూ గుండె చీల్చుకుని దూకుడుగా వస్తుంది. అందుచేతనే ఈయన పాటల్లో తొలి చరణాలే గుండె పట్టుకుంటవి" అన్నారు ముద్దుకృష్ణగారు.[36]

"వేదాద్రి శిఖరాన వెలిగొన్న జ్యోతి
మినుకుమని కాసేపు కునికిపోయింది
. .కాపురమ్మొచ్చిన కన్నె పాపాయి
ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోయాడు"

ఈ చివరి పంక్తిని "ప్రపంచ కావ్యభాండారంలో గొప్ప పంక్తుల్లో వొకటి"గా కృష్ణశాస్త్రిగారు తలచారు. "ఒంటిగా ఉయ్యాల లూగితివా నా ముద్దుకృష్ణా"; ఈ మావిపై నుండి ఈవు కూకూయంచు; ఏలా పాడేనింక యమునా కల్యాణి; గుత్తివంకాయ కూరోయిబావా" మొదలైన గీతాలు బసవరాజు కవిత్వాన్ని అజరామరం చేశాయి. గురజాడ వారి పద్ధతిలో గీతాన్ని హాయిగా నడిపించగలిగిన బసవరాజు, తొలి చరణాల తర్వాత తన భావావేశాన్ని నిల్పుకోలేరు. తొలి చరణాల భావ తీవ్రత మనోవీధిలో పదేపదే కలకవేస్తుంది.

36. కవిపరిచయాలు - ముద్దుకృష్ణ - వైతాళికులు - ఆదర్శ గ్రంథమండలి ఆరవ ముద్రణ - 1966.

## జీవితానుభవాలనే కవిత్వంగా మలచుకున్న నాయని

జీవితానుభవాలను కావ్యాలుగా రచించటంలో బసవరాజు అప్పారావుగారిలాగే నాయని సుబ్బారావుగారు కూడ ప్రముఖులు. కాల్పనికోద్యమ కాలంలో ఆయన "సౌభద్రుని ప్రణయయాత్ర! ఫలశ్రుతి; మాతృగీతాలు" రచించారు. తన బిడ్డను మేనల్లునికిచ్చి వివాహం చేస్తానని చిన్ననాడు తన తల్లికి ఇచ్చిన వాగ్దానాన్ని కాదని పిల్లకు వేరే సంబంధాలు చూడడం మొదలుపెట్టారు సుబ్బారావుగారి మేనత్త. తన ప్రియురాలు వత్సలను దక్కించుకోవడానికి నాయని పొందిన వేదన 'సౌభద్రుని ప్రణయయాత్ర'; ఆమెను పరిణయ మాడాక 'ఫలశ్రుతి' కావ్యాల్లో కన్పిస్తుంది. తల్లి మరణించిన శోకంతో రచించినది 'మాతృగీతాలు'.

ఉపనిషత్తులలో చెప్పిన జీవేశ్వర ఐక్యానుసంధానాన్ని కోరిన ప్రణయతత్త్వాన్ని నాయని ఉపాసించారు. గీతపద్య రచనలో రాయప్రోలు, వేదులవలె శక్తిమంతమైన రచన వీరిది. ప్రత్యేకమైన శైలి. పద్యం చదవగానే నాయనివారి శైలిని గుర్తించవచ్చు. ఎంత పెద్ద సమాసాలైనా చిన్న గీతపద్యంలో యిమిడ్చి పాఠకుని హృదయాన్ని పట్టి యీడ్చుకుపోతారేగాని, సమాసరచన భారమని తోచనీయరు. "ప్రతి పాదం జీవించే పలుకుతారు" నాయని.

## 'సంస్కారపూరితమూ శుచిమంతమూ అయిన వాక్కు' - తల్లావజ్ఝల కవిత్వం

నవ్యకవుల సభలకు 'సభాపతి' శ్రీ తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి "హృదయేశ్వరి, ఆవేదన, వకుళమాలిక, పద్మావతీ చరణచారణ చక్రవర్తి, దీక్షితదుహిత" మొదలైన కృతులు రచించారు. వీరి కవితలో భావతీవ్రత తక్కువ. చెప్పుకోదగిన కల్పనలూ అరుదే. గేయ నాటికల రచనలో మాత్రం సిద్ధహస్తులు. వీరినిగూర్చి శ్రీ ముద్దుకృష్ణ "పండితుడు, వ్యుత్పన్నుడు, హృదయం గలవాడు, ప్రేమించినవాడు, బాధ

పడ్డవాడు, జీవించినవాడు. పూర్వపు సంస్కారమంతా బలాన్ని కూరుస్తూ వుండగా రాదగిన నూతనత్వాన్ని ఆహ్వానించినవాడు'' అని వీరి స్వభావాన్ని సరిగా అంచనా వేశారు.[37]

## 'పల్లవివరకు పలుకు మధురిమ' - బాపిరాజు పాటలు

చిత్రకారుడు, శిల్పి, సంగీతవేత్త, నవలా రచయిత, కథానికా రచయిత, కవి శ్రీ అడవి బాపిరాజు లలితకళలలో బహుముఖ ప్రజ్ఞావంతులు. కాల్పనికోద్యమ కాలంలో వీరు ''శశికళ; గోధూళి; తొలకరి రాగమాలిక, తరంగిణి'' కావ్యాలు రచించారు. అపుకోలేని భావావేశంతో పల్లవివరకూ గుండె పట్టుకొనేలాగ సాగి, ఆ తర్వాత గీతం మాత్రం పేలవంగా, ఆవేశం చప్పబడి పోయినట్లుంటుంది బాపిరాజుగారి కవిత్వం. ''లేపాక్షి బసవయ్య లేచిరావయ్య; ఉప్పొంగిపోయింది గోదావరి; హిమాలయోత్తుంగశృంగం'' మొదలైన గీతాలన్నీ యిటువంటివే.

బాపిరాజుగారి కావ్యనాయిక 'శశికళ'. ఆమె ఆయనకు ''సూర్యసుతగా, యోగినిగా, నర్తకిగా, గానసుందరిగా, దేశికగా, ప్రేయసిగా'' దర్శనమిస్తుంది. లేతవెన్నెలలు వెదజల్లే యీామె సహృదయులకు ఆనందం కలిగిస్తుందిగాని, కావ్యమంతా చదివినా ఆమె ఆకృతి గోచరించదు. ఒక వెలుగుపాయ ఆకాశంలో మెరిసినట్లు లీలగా మాత్రమే తోస్తుంది.

## మల్లవరపు కవిత్వం - మధురమైన బాధ

కాల్పనికోద్యమంలో జీవసారాన్ని గ్రహించి శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు ''మధుకీల, కల్యాణకింకిణి'' కావ్యాలు రచించారు. ''తెప్పవోలిక చంద్రబింబం తేలిపోతోంది నింగిని, అందులో నా ప్రేయసి వుంది కాబోలు'' మొదలైన లలితగీతాలతో శ్రీ విశ్వేశ్వరరావు భావకవిగా పేరుపొందారు. ప్రకృతి, ప్రణయమే వీరి కావ్యవస్తువులు.

---

37. కవి పరిచయాలు - వైతాళికులు - ముద్దు కృష్ణ - ఆదర్శ గ్రంథమండలి, ఆరవ ముద్రణ.

భావనలో కొత్తదనం చూపిస్తూ పరస్పర విరుద్ధమైన 'మధువు, కీల' లను జోడించి 'మధుకీల' రచించటం వీరి కాల్పనికావేశాన్ని సూచిస్తుంది.

## 'ఉషసి చరణ మంజీరనిక్వాణం'-పిలకా గణపతిశాస్త్రి 'రత్నోపహారం'

సంస్కృత కళాశాలలో చదివి సంస్కార పూరితమైన వాక్కును సంతరించుకుని, సంప్రదాయ బలంతో సవ్యత్వాన్ని ఆహ్వానించిన కవి శ్రీ పిలకా గణపతిశాస్త్రి. "రత్నోపహారము, ప్రమద్వర, విభ్రాంతా మరుకము" వీరి కృతులు. "శ్రీ ఉషసి చరణ మంజీరాల విడివడిన చిన్ని బంగరు గంటలారా/గలగలను చిట్టి బంగరు పిచుకలారా" అని పిచుకను సంబోధించి ఒక ఇల్లాలు "పాప చుట్టూ తిరిగి పలకరించండి/పాపనో మారైన ఆడించిపొండీ! చిట్టి ఈ వేళేమొ పట్టింది పోరు/ఉయ్యాల ఊపగా చెయ్యారు కోడు" అని మాతృ హృదయంలో మమకారాన్నంతా పొదివి పెట్టినట్లు పలుకుతుంది. 'పాపాయికి' అనే యీ గీతం హృద్యమైనది. 'మాతృ భాగ్యము' అనే మరో గీతం కూడ మరపురానిదే.

## సృష్టిలో తియ్యనిది స్నేహమేననే హనుమదింద్రగంటి

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి కవిత్వం భావ కవులలో ఒక ప్రత్యేక తరహాకు చెందినది. కావ్యాలు, కథానికలు, విమర్శ - ఎన్ని రచించినా ఆయన హృదయం పాటలలోనే రమ్యంగా వ్యక్తమైంది. ఆచితూచి ప్రయోగించే శబ్ద శక్తి, సంప్రదాయ పద్ధతిలో చదువుకున్న ఫలితంగా శబ్దాన్ని పుటంబెట్టి పరీక్షించి, ఔచిత్య శోభితంగా ప్రయోగించాలనుకునే దీక్ష వీరి కవిత్వావేశాన్ని తగ్గించివేశాయి. ఏ పూవు పూచినా, ఏ పాటపాడినా హృదయం కళవళపడే రసహృదయుడు; కాల స్వభావాన్ని చక్కగా అర్థము చేసుకొన్న కవి; ఉద్యమావేశంలో కొట్టుకుపోక, వాటి జీవసారాన్ని గ్రహించే నేర్పరి.

## పేరడీలతో నవ్య కవితకు ప్రాణం పోసిన జలసూత్రం

ఆధునిక కవిత్వపు పోకడలను సవ్యంగా అర్థంచేసుకొని, వాటిని హృదయంలో నిలుపుకొని, వాటికి 'పేరడీ'లు రచించిన జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రిగారు కేవలం భావ కవి కాకపోయినా నవ్యకవిత్వంలో ఒక ప్రత్యేక రీతికి ప్రారంభకులు. ఎక్కడ కొత్త కవిత్వం తొంగి చూచినా హృదయ కవాటాలు తెరిచి ఆహ్వానించిన జలసూత్రం, ఉత్తమ కావ్య రసాస్వాదనతో ఆగిపోక పునః సృష్టి చేసిన ప్రతిభావంతులు.

## మరికొందరు భావకవులు

భావ కవులలో సంపత్, బొడ్డు బాపిరాజు, చింతా దీక్షితులు, మొదలైనవారు కూడ నవ్య కవితా వికాసానికి తోడ్పడ్డారు.

## హఠాత్తుగా ఆగిపోయిన సంగీతం-చిన్న వయస్సులో అదృశ్యమైన కొందరు కవులు

"అన్నం చల్లారి పోతోంది తమ్ముడూ' అని చెప్పడానికి వచ్చాను. నీ గుడిసె తలుపు తాళం వేసి ఉంది. అక్కడో కాగితపు చీటీ చూశాను. అందులో 'నా కోసం దుఃఖించు' అని వ్రాసి ఉంది. కిందని ఏ సంతకమూ లేదుగాని, ఆ అక్షరాలలో మానవజాతి సొంతదస్తూరిని పోల్చుకున్నాను-" పిన్న తనంలో మరణించిన ఫ్రెంచికవి రాంబో మీద ఒక అమెరికన్ కవి వ్రాసిన గీతం ఇది. చిన్నతనంలోనే చనిపోయిన అన్ని దేశాల కవులకీ ఇది వర్తిస్తుందనుకుంటాను. శంకరాచార్యుడు-షెల్లీ, రూపర్ట్ బ్రూక్, డిలాన్ థామస్, పెనుమర్తి వెంకటరత్నం, కొంపెల్ల జనార్దనరావు, దేవరకొండ బాలగంగాధర తిలక్ అందరికీ ఇది వర్తిస్తుంది" అన్నారు శ్రీశ్రీ[38]. ఈ జాబితాకు చామర్తి రాజశేఖరరావుగారి పేరు కూడ చేర్చుకోవచ్చు. కొడవటిగంటి వెంకట సుబ్బయ్యగారు యౌవన ప్రాయంలో ఇల్లు విడిచి వెళ్ళిపోవటంచేత ఆయన కవిత్వ రచన హఠాతుగా ఆగిపోయింది.

'లోక బాల్య తిలక్' – తిలక్ స్మృతి సంచిక సంపాదకీయం - శ్రీశ్రీ - ఆనందవాణి.

శ్రీ చామర్తి రాజశేఖరరావు తన 24వ యేటనే మరణించారు. ఆయన రచించిన 'బృందావనము' కావ్యం తర్వాత ప్రకటింపబడింది. ఆయన కవిత్వంలో పాంచాలీ సాంత్వనము, బృందావనము, శరద్రాత్రి, వేణుగానము, విశ్వమూర్తి, వసంత కుసుమము, ప్రతీక్ష'' ఖండకావ్యాలు మధురమైనవి.'' 'బృందావనము' ఆంధ్ర సహృదయులు మరచినచో ఆంధ్రకవితాదేవి కిరీటములోని రత్నమొకటి పోగొట్టుకొనుటయే!''[39].

ఇరవై మూడేండ్లకే ముగిసిపోయిన జీవితం పెనుమర్తి వెంకట రత్నంగారిది. 'నీతి సుధ, రత్నాపణము' కావ్యాలను యీ కొద్ది వ్యవధి లోనే రచించారు. 'రత్నాపణము' భావ కవిత్వంలో ఉత్తమ శ్రేణిలో చేర్చదగింది, ''ఏ మబ్బుల మలుపులోనో దృష్టికి అనని ఆశయాలకు తెరచాపను ఎత్తి సాహసపు నావికుడివలె కనిపిస్తాడు. ఈయన ఆసించిన యాత్రకు శరీరం కలిసిరాలేదు.[40]'' 'అడవి పూవు' ఖండ కావ్యంలో నేను కవినయి బ్రతికియుండిన దినాల, స్వప్నములు గంటినొకవనచ్ఛాయ లోన/నొక్క పువ్వునైన బాగుండునో యటంచు/దాని ఫల లబ్ధి నేటి జన్మానగంటి ! నాకిక ప్రపంచమందున యీ కిరాత హృదయమునేమి పని, యుదయించి సంజ కెంపులంబడి నవ్వుల కిలకిలమని శాంతిగొందును సాంధ్యనిశాంతవేళ! - యీ గీతం చదువుతున్నప్పుడు సహృదయుల కళ్ళు చెమరుస్తాయి.

## 'ధూర్తలోకం' వదలిపోయిన కొంపెల్ల జనార్దనరావు

భావ కవుల పద్ధతిలో పెక్కు ఖండ కావ్యాలు రచించి, మరపు రాని సాహిత్య పత్రిక 'ఉదయిని'ని నడిపిన కవి శ్రీ కొంపెల్ల జనార్దనరావు. ''ఒక ముసలిదోనె యిది పడియున్నదిచట

ఊడిగము సేత సత్తువలుడిగి యుడిగి

39. 'కవిస్మరణము చామర్తి రాజశేఖరరావు'-నోరి నరసింహశాస్త్రి-సారస్వత వ్యాసములు. ఐదవ సంపుటము ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 1980.

40. కవి పరిచయము-ముద్దు కృష్ణ-వైతాళికులు-ఆదర్శ గ్రంథ మండలి.

తనకు దామృత స్మృతులు కల్పనము నేసి
కొనుచు తనపయిఁదా జాలిగొనుచు నిట్లు" అని

కాల విషు చోదనము లెంచి, 'విజయలక్ష్మి'ని తన్నా వహింపుమని కోరిన శ్రీజనార్దనరావు లోకం నుండి సహకారం లభించక క్షయవ్యాధితో పిన్న వయస్సులో మరణించారు. శ్రీశ్రీ తన 'మహాప్రస్థానాన్ని' అంకితమిస్తూ 'కొంపెల్ల జనార్దనరావు కోసం' రాసిన గీతం తెలుగులో వచ్చిన అన్ని స్మృతి గీతాలలోను గొప్పది. జనార్దనరావు సాహిత్య కృషి అర్ధాంతరంగా ఆగిపోవటం నవ్య సాహిత్యానికి తీరని వెలితి.

## కవయిత్రుల కవితా కమనీయత

భావ కవిత్వాన్ని గురించి ఆలోచించినప్పుడు కవయిత్రుల సంఖ్య తక్కువే అయినా చావలి బంగారమ్మ, తల్లాప్రగడ విశ్వసుందరమ్మ, బసవరాజు రాజ్యలక్ష్మమ్మగారల కవితలు మధురమైనవి.

బంగారమ్మగారి పద చిత్రాలు కాల్పనిక కవితకే వన్నె తెచ్చేవి. నీటిలో అందంగా ప్రతిబింబించిన మందార పువ్వును

"అందాలు తానె చూసింది/నీటిలో చందాలు తానె
చెప్పింది నా తోటి
పొద్దున్న మందార వొంగి బొట్టెట్టుకుని అందాలు తానె
చూసింది"

అనే వర్ణన కమనీయమైన ప్రకృతి చిత్రం. 'ఆ కొండ' గీతంలో "మంచులో మునిగింది/మాయమైపోయింది/ఆకసమునగలసెనో,ఆకొండ, అక్కడే పడియుండెనో అనే దృశ్యం యీమె భావనా పటిమకు మంచి నిదర్శనం. 'కప్పతల్లి పెళ్లి' మరొక ఆహ్లాదకరమైన గీతం. భాషలో, భావంలో పాండిత్య వాసన సోకని తెనుగుదనం యీమె సొత్తు.

శ్రీమతి బసవరాజు రాజ్యలక్ష్మమ్మ బసవరాజు అప్పారావుగారి అర్ధాంగి-'సౌదామని' యీమె కలంపేరు. అప్పారావుగారి భావావేశాన్ని

పుణికి పుచ్చుకొన్న కవయిత్రి యీమె. అప్పారావుగారి మరణానంతరం యీమె రచించిన వియోగి గీతాలు మరపురానివి. సున్నితమైన భావన, గుండెల్లో గుచ్చుకొని సెలవేసే వియోగబాధ యీమె కవిత్వంలో వున్నాయి. "చల్లని చిరుగాలి పాట/మెల్లగ వీనుల సోకగ, వాకిట నిలబడి, అడుగుల/చప్పుడైన యప్పుడెల్ల/ఆత్రముతో నీవె వచ్చితని/ భ్రమపడి చూతునాధ!" అనే తలపులు 'ప్రియ నిరీక్షణము'లో గుండె పట్టుకుంటాయి. "చిటపటమను చినుకుల తీయని పాటలు, కోవెలలో మేళం; చల్లని వెన్నెలలు కన్నతల్లివోలె కాయటం; మనసు మాటుమణ గడం" వంటి సుకుమారమైన భావాలు 'సౌదామని' కవితలో చిరస్మరణీ యమై, భావ కవిత్వంపై గౌరవాన్ని కలిగిస్తాయి.

స్వచ్ఛమైన కవితా సౌందర్యమూ, భావనలో సౌకుమార్యము శ్రీ విశ్వసుందరమ్మ కవిత్వంలో విశిష్టంగా గోచరిస్తాయి. తల్లాప్రగడ నరసింహశర్మ, విశ్వసుందరమ్మ దంపతులు దేశభక్తులు. దేశ స్వాతంత్ర్య సమరంలో చాలసార్లు కారాగార శిక్షననుభవించారు. చాగల్లులో వీరు స్థాపించిన 'ఆనంద నికేతనం' మహాత్ముని పాదస్పర్శతో పునీతమైంది. 1930 లో కోర్టు విచారణలో ఇచ్చిన వాఙ్మూలం ఆశ్చ ర్యాన్ని గొలిపే ఆమె సాహసానికి నిదర్శనం. ప్రకృతి పూజ, దేశ భక్తి, స్నేహానురక్తి, సేవాభిలాష, ప్రణయానురక్తీ ఆమె వ్యక్తిత్వానికి కవిత్వానికీ వన్నె లెచ్చాయి.

## సౌందర్య తపస్వి చలం

భావ కవులలో చేరకపోయినా సౌందర్య తపస్వి గుడిపాటి వెంకట చలంగారు ప్రకృతి, ప్రణయాల్లో ఉదాత్తమైన కవిత్వం రచించారు. వివాహ వ్యవస్థను ధిక్కరించి, స్వేచ్ఛా ప్రణయాన్ని సమర్థించిన చలం గారు ఆనాటి పాఠకులలో తీవ్ర సంచలనం కలిగించారు. తెలుగు వచనానికి అంతకుముందుగాని, తరువాతగాని ఎప్పుడూ అంతశక్తి లేదు. చలం వచన రచన రక్తాన్ని ఉడుకెత్తించి పరుగులు తీయిస్తుంది. హృదయమంతా పూర్వమెన్నడూ ఎరుగని తీవ్రమైన భావోద్వేగానికి

గురి అవుతుంది. వచన రచనలో కవిత్వం కుమ్మరించి 'మ్యూజింగ్స్, ప్రేమ లేఖలు' రచించారు. "కృష్ణశాస్త్రి పదాలకు చిత్రికలు పడతాడు నావీ నండూరి సుబ్బారావుపీ "raw and unpolished" అని చెలం గారు పలికినట్లే ఆయన నండూరి, కృష్ణశాస్త్రిగారలంతటి ఉత్తమ కవి. 'విన్నపాలు, యశోద గీతాలు' ఆయన కావ్యాలు భక్తితో రచించినవి. వీటిల్లో విగ్రహారాధనకు చోటులేని భక్తితత్త్వం వున్నది.

## ఆతిథ్యము

శ్రీ కొడవటిగంటి వెంకట సుబ్బయ్య రచించిన 'ఆతిథ్యము' భావ కవిత్వ స్వరూపాన్ని చక్కగా ఆవిష్కరిస్తుంది.

"అగుమాగుము తెరువరీ, ఆ
యాసఖేదము నపనయింపుము
మా గృహాంగణ కుసుమ సముదయ
మధుపు లియ్యవిగో" అనే భావం నవ్య కవిత్వ స్వరూపాన్ని కొండను అద్దంలో చూపినట్లు చూపిస్తుంది. శ్రీ వేంకట సుబ్బయ్య హఠాత్తుగా కవిత్వ రచనను కట్టిపెట్టి అదృశ్యం కావటం కవితాభిమానులకు బాధ కలిగిస్తుంది.

## భావ కవిత్వంపై ఆక్షేపణలు

భావకవిత్వం హృదయైక వేద్యం. ఆ మాటకొస్తే ఏ కవిత్వమైనా హృదయైక వేద్యమే. శబ్దార్థాలు తెలిసినంత మాత్రం చేత కవిత్వం అర్థమైందనుకోక, కవితో సానుభూతి వహించి, అతని భావన లోకి ప్రవేశించి కావ్యానందాన్ని పొందవలసివస్తుంది భావ కవిత్వంలో. ఇటువంటి ఆనందం పొందటానికి చదువరికి ముఖ్యంగా కావలసింది సహృదయత. ఈ సత్యాన్ని గుర్తించక మహా పండితులు, తార్కికులు, అత్యంత మేధాసంపన్నులైన అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరులు భావకవిత్వంపై తీవ్రమైన దాడిచేశారు. దీనికి జవాబుచెప్పక మళ్ళీ కవిత్వం

రచించటమే తగినపని అని దేవులపల్లి కృష్ణశాస్త్రి ప్రభృతులు భావించారు. కాలం కవులపక్షమే వహించింది, ఉమాకాన్త విద్యాశేఖరులు తార్కికంగా లేవనెత్తిన ప్రశ్నలు కాలగర్భంలో కలిసిపోయాయి.

భావకవిత్వపు వెలుగును భరించలేని అసూయాగ్రస్తులైన సనాతన వాదులు కొందరు యీ కవిత్వాన్ని హేళన చెయ్యటం మొదలు పెట్టారు. "కొయ్యబొమ్మలె చూచువార"నీ, "సల్లమందుకే గాని కళ్ళు విప్పర"ని కవులు తిరస్కరించిన పండితులు వీళ్ళు. వీరికి ప్రతినిధి శ్రీ అనంతపంతుల రామలింగస్వామి కృష్ణపక్షాన్ని, మొత్తం భావకవిత్వాన్ని హేళన చేస్తూ 'శుక్లపక్షము' రచించారు. 'పేరడీ'వంటి రచన కాదిది. కేవలం అధిక్షేప రచనే. భావకవిత్వ మహోద్యమంలో సూర్యకాంతిని మూకుడుతో అడ్డుకోవాలనుకొనే 'దివాంధత్వం' యీ కావ్యంలో కన్పిస్తుంది. భావకవుల కవితారథం కింద యీ కావ్యం నలిగిపోయింది.

## భావ కవిత్వ పరిధిలో ఇమడని ప్రతిభా సంపన్నులైన కొందరు నవ్యకవులు ప్రగాఢమైన ప్రతిభావంతులు - విశ్వనాథ

ఇరవైయవ శతాబ్దపు కవులలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణ అతిగాఢమైన ప్రతిభగలవారు, చేపట్టిన సాహితీ ప్రక్రియలన్నిటిలో రత్నమాణిక్యాలను వెలికి తీసినవారు. మల్లాది రామకృష్ణశాస్త్రిగారి మాటల్లో చెపితే విశ్వనాథ "దేశముపట్టనంతటి కవి". అమేయమైన భావనాశక్తి, అమితవేగవంతమైన ధారాశుద్ధి, అద్వితీయమైన లోక పరిశీలనాశక్తి వీరి కవిత్వంలో విశిష్టగుణాలు.

బాల్యదశలో రాసిన 'ప్రాంశుస్తవము' (శృంగారవీథి) చదివితే వీరెంత భావుకులో తెలుస్తుంది. శ్రీరాయప్రోలు 'ఆంధ్రావళి'తో ప్రభావితులై ఆంధ్రపౌరుషము, ఆంధ్రప్రశస్తి రచించారు. మల్లంపల్లి వారికి అంకితమిచ్చిన 'ఆంధ్ర ప్రశస్తి'లో అంకితం పద్యాలూ, "చిత్రరథస్వామి శ్రీ రథోత్సవములో తెలుగుపిల్లలు కత్తి త్రిప్పిరెపుడో,

ఏ రెండు జాముల ఇసుని వేడిమివచ్చి కలిసిపోయెనొ త్రిలింగ ప్రభువుల" - మొదలైన పంక్తులలో భావాలు విశ్వనాథ కవితా వైశిష్ట్యాన్ని వెల్లడిస్తాయి.

భావకవులలో విశ్వనాథ స్థానం ప్రత్యేకమైనదే. "చిన్ని మబ్బులు" అనే ఖండకావ్యంలో "కన్నె కాటుకకళ్ళు, చిన్నినాధునిచూచి, కదలువాడినవేళ, కందళించినవేళ, ఆకాశమధ్యాన, అటునొక్క మబ్బు, మెరపులా మెరిసిందిలే, వెలుగులో వారిసిందిలే" అనే తలపులు విశ్వనాథ భావనా రామణీయకాన్ని చక్కగా వెల్లడిస్తాయి. 'నీరథము' అనే ఖండకావ్యం ఆధునిక తెలుగు కవిత్వంలో అత్యుత్తమ గీతంగా చెప్పదగినది. ఇంకా భ్రష్టయోగి, కేదారగౌళ, గిరికుమారుని ప్రేమగీతాలు, వరలక్ష్మీ త్రిశతి, శశిదూతం, మా స్వామి, ఋతుసంహారం" అన్నీ రసవంతమైనవే. శ్రీజలసూత్రం పేర్కొన్న 'పాషాణపాకం'లో లేవు. రసాస్వాదకులు తనివితీరా ఆస్వాదించదగినవి ఇవి.

విశ్వనాథవారి కావ్యాలన్నీ వొకయెత్తు, 'కిన్నెరసాని పాటలు' ఒక్కటీ ఒక యెత్తు. కిన్నెరసాని అనే కొండవాగు వీరికి కావ్యవస్తువై తెలుగు జాతికి రసవత్కావ్యాన్ని ప్రసాదించింది. కిన్నెర నొకస్త్రీగా, ఉద్విగ్నహృదయగా భావించి, ఆమెపుట్టుక, కిన్నెరసడకలు, కిన్నెర నృత్యము, కిన్నెరసంగీతము, కడలిపొంగు, కిన్నెరదుఃఖము, గోదావరీ సంగమము, కిన్నెరవైభవము శీర్షికలతో మహాకావ్యం రచించారు. లలితకళలన్నీ చక్కగా సమన్వయం పొందిన అత్యద్భుతకళా ఖండమిది. "ఎడమచేతనీ కొంగును ఒడిచిపట్టుకొంటి చెలీ! తడిచేతను కొంగులేక తడబడితిని ప్రియురాలా! ఓహో కిన్నెరసానీ!" అనే పంక్తులు చదవగానే అనిర్వచనీయమైన రసానుభూతి నిలువెల్లా పులకింపజేస్తుంది.

విశ్వనాథవారి సాహితీ ప్రస్థానంలో 'రామాయణ కల్పవృక్షము' రచన ఒక మలుపు. అక్కడనుండీ ఆయన నవ్యకవిత్వం వదిలిపెట్టి సంప్రదాయాభిమానులై, తాత తాతలనాటి కతలు తప్పిపోయటం

మొదలుపెట్టారు. రాశిలోనేగాక గుణంలోకూడ రామాయణ కల్పవృక్షం యీ శతాబ్దిలో వెలసిన గొప్పగ్రంథాలలో వొకటి. కాల మహాప్రవాహం ఎంతటి ప్రతిభావంతులైనప్పటికీ విశ్వనాథవారి కోసం వెనుకకు మరలదు కదా! ఆయన సంప్రదాయాభిమానం కాలానికి ఎదురీదటమే అయింది.

విశ్వనాథవారి కవిత్వం మహాబలిపురపు రాతిరథాలవంటిది. తాను కదలకుండా మనల్ని కదిలిస్తుందంటారు శ్రీశ్రీ. కవితాశిల్పంతో యీ యుగకవులను అత్యంత ప్రాభావితం చేసిన విశ్వనాథ కవిత్వం ఎంత తరచినా తరగని మహాసముద్రం.

## శిలల్ని ద్రవింపజేసిన కొడాలి సుబ్బారావు

వీరరస ప్రధానమైన చారిత్రక కావ్యము 'హంపీ క్షేత్రము రచించి ఉత్తమ కవిగా గణుతికెక్కిన వారు శ్రీ కొడాలి సుబ్బారావు. హంపీ శిథిలాలను చూచి వీరి హృదయం ఘూర్ణిల్లినది ఆ సందర్భంలో వీరు పలికిన "శిలలు ద్రవించి యేడ్చినవి శీర్ణములైనవి తుంగభద్రలో

పల గుడి గోపురంబులు సభా స్థలులైనవి
కొండముచ్చు గుం
పులకు చరిత్రలో మునిగిపోయిన దాంధ్ర వసుంధరాధి పో
జ్జ్వల విజయ ప్రతాప రథసంభొక స్వప్న కథా విశేషమై"

అన్న పద్యం సహృదయుల కెన్నటికీ మరపురాదు.

చారిత్రక కావ్యాల్లో రాణా ప్రతాపసింహ చరిత్ర, శ్రీ శివ భారతముల కంటె ముందుగా వెలువడినది హంపీ క్షేత్రము (రచనా కాలం 1933.) మహావీరులు, ధర్మపరులు విద్యానగర ప్రభువుల ఏలుబడిలో సాంస్కృతికంగా వైభవోపేతంగా విలసిల్లిన 'హంపి' మహమ్మదీయుల దాడిలో ఛినాభిన్నమైనది. ఈ ఇతివృత్తం ఆలంబనంగా 'హంపీ క్షేత్రము' రచించారు. రాజ వంశాల క్రమంలో కథ చెప్పటంగాక కవి ఆవేశంతో ఆయా స్థలాల పూర్వ వైభవాన్ని తలచుకొని నేటి

దుస్థితికి బావురుమన్న పద్ధతిలో రచన సాగింది. కావ్యమంతా ఆవేశపరవశుడైన కవి తలపులు పరితను యూడ్చుకుపోయినట్లు సాగిపోతుంది.

"నేటి కాలపు ప్రతిభాశాలురగు కవులకు వ్యుత్పత్తి లోపము కనబడుచున్నది. కాని వారి ప్రతిభ యీ లోపించిన వ్యుత్పత్తిని కప్పివేయునంత యుత్కృష్టమైనది. అట్టి నేటి తెలుగు కవులు ముగ్గురు నలుగురలో కొండాలి సుబ్బారావుగారొకరు. వచ్చిన కవిత్వము పూర్వజన్మము నుండి. వచ్చిన భాష ఏటి కెదురీది నేర్చినది" అని విశ్వనాథ సత్యనారాయణగారు సుబ్బారావుగారి ప్రతిభను గురించి తెలిపారు[41]. కవిత్వము పూర్వజన్మ నుండి సంక్రమించినదనే మాట వివాదాస్పదమైనది. హంపీ శిధిలాలను చూచిన కవి అనుభూతి గాఢతరమై, గుండెలు ఘూర్ణిల్లి, ఆవేశంతో పలకటంచేత వచ్చిందేనని తలచవచ్చు.

"గౌతమీ గర్భ పంకం బెండబెట్టిన చాళుక్య వర్చస్సు వెలుగు" అనే కవితా ప్రవాహంలో, కవి ప్రయోగించిన శబ్దాల సాధుత్వాసాధుత్వాల చర్చకు చోటులేదు. "ఏదేవి చిలికెనో ఈ పాలమీగడ విట్ఠలాలయ శిలావేదులందు/ఏ జోదుచిందెనో ఈ రక్త గంధము నరసింహ దేవు పేరురము మీద"; "పాడుచున్నది రిచ్చపడి కోకిలాంగన అష్టదిగ్గజము లేమైరి. రారు" మొదలైన పద్యాలు ఎన్నిసారులు చదివినా తనివి తీరనివి. హంపీ క్షేత్రంలో శ్రీ సుబ్బారావు తన గాఢతరమైన అనుభూతి చేత సహృదయులకు పారవశ్యం కలిగించారు.

## వీర రసావేశం కల్పించిన రాణా ప్రతాపసింహ చరిత్ర

శ్రీ దుర్భాక రాజశేఖర శతావధాని గడియారం వేంకట శేషశాస్త్రి గారితో జంటగా అవధానాలుచేసి, తర్వాత అవధానాలకు స్వస్తి చెప్పి కావ్య నిర్మాణానికి పూనుకొన్నారు. వీరమతీ చరిత్ర, చండనృపాల చరిత్ర మొదలైన కావ్యాలు రచించినప్పటికీ వీరి శక్తికి తార్కాణగా నిలిచిన కావ్యం 'రాణాప్రతాప చరిత్ర'. అక్బరుపాదుషా నెదిరించి ఇరవై

41. హంపీ క్షేత్రము పీఠిక-విశ్వనాథ సత్యనారాయణ.

అయిదు సంవత్సరాలు స్వాతంత్ర్య దీక్షతో పోరాటం జరిపిన భారత వీరుడు రాణాప్రతాపుని కథను రాజశేఖర శతావధానిగారు వీరరస స్ఫోరకంగా రచించారు.

భారత స్వాతంత్ర్య సంగ్రామం ముమ్మరంగా జరుగుతున్న సమయంలో రాజశేఖర శతావధానిగారి 'రాణాప్రతాప చరిత్ర' (రచనా కాలం 1943) దేశభక్తులందరికీ ఉత్సాహాన్ని కలిగించింది. రాణాప్రతాపుని శత్రువైన అక్బరును ప్రతి నాయకునిగా చిత్రించటంలో కవి మిక్కిలి నేర్పు చూపించారు. ఏ మాత్రం అక్రమానికి పాల్పడక అక్బరు సుగుణాలను వర్ణించారు. ప్రతాపుని స్వాతంత్ర్య కాంక్ష ముందు అక్బరు సుగుణాలు లెక్కలోవి కావని కవి అభిప్రాయం. కవి ప్రతాప సింహునితో తాదాత్మ్యం వహించారు. "ప్రతాపుని చరిత్రమును వర్ణన సేసి జగానఁ జాటఁగన్" ఆ వీరుడు తనను ఆవహించి యీ సత్కార్యాన్ని సాధింపజేసినట్లు చెప్పుకున్నారు.

'రాణా ప్రతాప సింహ చరిత్ర' కావ్యాన్ని గురించి శ్రీ మధునా పంతుల సత్యనారాయణశాస్త్రి "ఈ కావ్యమును మించు కావ్యములు పుట్టుచున్నవి. ఇంత యావేశముగల కవిత బయలుదేరుట మాత్రము కష్టము. అభినవ చరిత్ర కావ్య నిర్మాతలలో నీయనమొదటి వాడనుటలో నాక్షేపణముండదు. నన్నయ తిక్కన పోతనాదుల కవితా శైలుల నల వఱచుకొని, క్రొత్త పోకడలు పెక్కు లాకళించుకొని, చక్కని యితి వృత్తమేరుకొని, యుగమున కనుగుణుడైన నాయకునిసంపాదించుకొని, తియ్యని చిక్కని తెనుగులో నిట్టి యుదాత్త చరిత్ర కావ్యము సంతరించి తెలుఁగు మాతకు గానుక వెట్టిన శ్రీ రాజశేఖర కవి కృతార్థ జీవి" అని భావించారు[42]. బృహత్కావ్య రచనకు కాలం చెల్లిపోలేదన్న ఆశను కల్పిస్తూ ఆధునిక యుగంలో వెలువడిన తొలి 'మహా కావ్యం' "రాణా ప్రతాప సింహ చరిత్ర".

42. ఆంధ్ర రచయితలు - మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి - అద్దేపల్లి అండ్ కో-రాజమహేంద్రవరము-350 వ పేజీ-ద్వితీయ ముద్రణ.

'నవ్య' కవులకీ కావ్యం ఆదర్శం కాకపోయినప్పటికీ, సంప్రదాయాభిమానులైన కొందరికి బృహత్కావ్యాలు రచించటానికి ఉత్సాహాన్ని కల్పించినది 'రాణా ప్రతాప సింహ చరిత్ర.'

## చారిత్రక మహాకావ్యం "శ్రీశివ భారతము"

ఆధునికకాలం మహాకావ్యరచనకు అనువైనది కాదనే అపవాదంగా వెలసినది శ్రీగడియారము వేంకటశేషశాస్త్రిగారి 'శ్రీశివభారతము' "A long poem is a contradiction in terms" అనే మాట యీ కావ్య విషయంలో సత్యంకాదు. చారిత్రక కావ్యాల్లో చరిత్రకున్నంత ప్రాధాన్యం రసానందానికి వుండదనే ఆరోపణను త్రోసిరాజని యీ కావ్యం మిక్కిలి రసవంతంగా వెలసినది.

చరిత్రనుంచి ఇతివృత్తాన్ని. స్వీకరించటమే గొప్పకాదు. ఆ పనిని రామలింగారెడ్డి, దువ్వూరి రామిరెడ్డిగారలిదివరకే చేశారు. కాని చరిత్ర నేర్పిన గుణపాఠాన్ని మనస్సుకి పట్టించుకొని, పారతంత్ర్యాన్ని నిరసించి స్వాతంత్ర్య కాంక్షను అణువణువునా రగుల్కొల్పిన మహాకావ్యం 'శ్రీ శివభారతము'.

మహావీరుడైన శివాజీ కథ చెప్పేటప్పుడు సహజంగా మహమ్మదీయుల దురాగతాలను నిరసించవలసి వుంటుంది. కాని దేశ చరిత్రను శ్రద్ధాళువై అధ్యయనం చేసిన గడియారము వారు మిక్కిలి సంయమనంతో ఔచితీ శోభితంగా, ఇస్లాము మతాన్నిగాని, దాని అనుయాయుల్ని గాని దూషించకుండ, అప్పటి ప్రభువులదుర్మార్గాలను మాత్రమే వర్ణించారు. శివాజీని ఉన్నతుణ్ణి చేయటానికి మహమ్మదీయులు పిరికిపందలని గాని, చరిత్రలో జరగని దాన్ని జరిగినట్లుగాని ఆయన వర్ణించలేదు,

అవధాన పంచాననులైన గడియారం వారు ధారా శుద్ధి కుంటువడనీయని పద్యాలతో-తిక్కన, శ్రీనాథ మహా కవులను తలపించే రచన చేశారు. శివాజీ చరిత్రకు 'శ్రీ శివ భారతము' అని పేరు పెట్టటం

ఔచితీ శోభితంగా వున్నది. శివాజీ చరిత్ర మహాభారతంలాగే సంక్లిష్టమై, ధర్మాధర్మ చర్చలకు తావిస్తూ, రసవంతంగా వుంటుంది. "క్రొత్త క్రొత్త మార్గములలో నడకలలో పద్యములను ప్రయోగించు పరీక్షా దృష్టి వీరికి లేదు. ఉన్నవి వాడుక పడినవి చాలునను నియమము వీరికి గలదు.[43]" సామాన్యంగా అందరికీ తెలిసి, వాడుకలో వున్న వృత్తాలనే వీరు స్వీకరించారు.

'శ్రీ శివభారతము'లో "శివాజీ ప్రథమ గోరక్షణ విజయము; రామదాసు దర్శనము; ధర్మోపదేశము; శివాజీ పాదుషా కొల్వునకేగుట; శివాజీ చెఱసాలనుండి వెడలి రాయగడముఁ జేరుట; తానాజీ నిర్యాణము-శివాజీ సంతాపము" మొదలైన ఘట్టాలు ఎన్ని మారులు చదివినా మళ్ళీ మళ్ళీ చదవాలనిపించే రసవద్ఘట్టాలు.

"చదినితి మీ శివ గీతము పొదుగున మొగమిడినలేఁగ పోల్కి-" అని శ్రీ రాయప్రోలు పలికినట్లు సహృదయులీ కావ్యాన్ని తమితో పఠించి, తృప్తిని కలిగించే రసానందం పొందగలరు.

## కైత సింగార మెరిగిన కవి ఏటుకూరి

కృషీవల జీవనాన్ని కావ్య వస్తువుగా స్వీకరించిన వారిలో శ్రీ దువ్వూరి రామిరెడ్డి, ఏటుకూరి వేంకట నరసయ్య, తుమ్మల సీతా రామమూర్తి గారలు ప్రసిద్ధులు. కవి స్వయంగా సేద్యం చేసిన అనుభవాలు, రైతుల వ్యవసాయ కూలీల కష్ట సుఖాలు శ్రీ ఏటుకూరి రమణీయంగా వర్ణించారు. కావ్య వస్తువు నెన్నుకోవటంలో కవి తబ్బిబ్బు పడనక్కరలేదంటారు.

"సారెకు మంచుబొట్టు చెవి జంపున ముత్తెములట్లు
వ్రేలఁ జే
జారిన పగ్గమూని యెర చాలునఁ గోడెసదల్చి మేఁడిపై

43. 'శ్రీ శివభారతము' పీఠిక-రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ.

భారము మోపి కష్టపడు భాగ్యము చూడఁగదోయి ! 
కైతసిం
గారము కింతకన్నఁ దగు ఘట్టము తీర్చెదవా ! 
కవీశ్వరా !''—

కవి కర్షకుడైన నాఁడుగాక సుఖ పారవశ్య మహిమాతిశయంబులు గోచరించునా ! అని కర్షక జీవితాన్ని కొనియాడిన ఉత్తమ కావ్యం 'క్షేత్ర లక్ష్మి'. మాగాణి వ్యవసాయంలో నాజూకు, సుఖ జీవనానికి అలవాటుపడి శ్రమ కోర్వని తత్వాన్ని, మిక్కిలి శ్రమపడినా కడుపు నిండని మెట్ట వ్యవసాయదారుల కష్టాన్ని అమాయకత్వాన్ని హృద్యంగా యీ కావ్యంలో రచించారు.

''కారు మొయిలు వచ్చి కాల్గుర్వివ్వి గర్జించి
రైతు గుండెకాయ జాయిచేసె
ఇంక తేపటగ్గి యే తెంచుఁగాఁ బోలు.
జెమట మీఁద నిప్పు లుమియుటకును''-రైతు జీవితంలో బాధలను అనుభవించి పలికిన వీరి ప్రతి పద్యమూ హృదయాన్ని రసార్ద్రం చేస్తుంది. వెన్నెల రాత్రులు ఆరు బయట హరి కథలు వినే గ్రామీణ ప్రజలకు వారి కథనే 'రైతు' హరికథగా రాసి యిచ్చారు శ్రీ ఏటుకూరి,

తెలుగుజాతి మహేతి హాసమన దగిన 'పలనాటి వీర భారతము'ను రచింపదలచి మగువ మాంచాల, అలుగురాజు (రెండు భాగాలు), నాయకురాలు రచించి, పూర్తి చేయకుండానే శ్రీ ఏటుకూరి మరణించారు. వీర రసాన్ని చక్కగా పోషించిన కొద్దిమంది ఆధునిక కవులలో వీరు ప్రముఖులు.

బ్రహ్మనాయని వైష్ణవాభిమానాన్నిగాని, నాగమ్మ శైవ మతాభి మానాన్నిగాని శ్రీ ఏటుకూరి సమర్థించలేదు. పలనాటి పతనానికి

ఇరువురూ కారకులేనని ఈయన భావించారు. వీరు రచించిన 'రుద్రమదేవి' కావ్యం మాత్రం వీరరస పోషణలో సంతృప్తి కలిగించదు.

శాంత శృంగారాది రసాలు కమనీయంగా జాలువారిన "ప్రేమా లోకము, సిద్ధాశ్రమము, త్రివేణి" వీరి ఇతర కృతులు.

దీప్తిగల తెలుగుపద్యం ఏది విన్నా వీరరసోత్కర్ష కలిగించే ఏ ఘట్టం చదివినా, రైతునుగురించిన ప్రసక్తి ఎక్కడ వచ్చినా శ్రీ ఏటు కూరి కవిత్వం మనస్సులో మెదులుతుంది.

## 'శారద వరించిన' కవి జాషువా

సంప్రదాయచ్ఛందస్సులలో ఆధునిక భావాలతో ఉత్తమ కావ్యాలు రచించిన కవి శ్రీ గుఱ్ఱం జాషువా. దరిదాపు అర్థశతాబ్ది కాలం నిరంతరం కవిత్వం రచించి, ఆధునిక కవిత్వాన్ని ఆయన సుసంపన్నం చేశారు. ఆధునిక కవుల ఊహాలపల్లకీ అనదగిన 'వైతాళికులు' కావ్య సంకలనంలో జాషువాగారి పేరెక్కడా కానరాకపోవటం వింత! శ్రీ ముద్దుకృష్ణ ఎందు చేతనో జాషువాగారినేగాక ఏటుకూరి, తుమ్మల వంటి ప్రసిద్ధులైన ఆధునిక కవులను కూడ వదిలిపెట్టి ఆ సంకలనానికి వెలితి కల్పించారు.

'భారతి' పత్రిక ప్రారంభమైన కొత్తరోజుల్లోనే జాషువాగారి ఖండకావ్యాలు ఆంధ్రులను ఆనందింపజేశాయి. ఖండకావ్య ప్రక్రియ శ్రీ గురజాడతోనే ప్రారంభమైనప్పటికీ, ఖండ కావ్యం పేరు వినగానే జాషువాగారి ఖండకావ్యాలే జ్ఞాపకం వస్తాయి. ఈ ప్రక్రియకు జాషువా అంతులేని గౌరవం సమకూర్చారు. వీరి ఖండకావ్య సంపుటులలో "గిజిగాడు, శిశువు, మాతృమూర్తి, బుద్ధుడు, శ్మశానము" మొదలైనవి ఎన్నటికీ మరపురానివి. దేశభక్తి ప్రబోధకమైన వీరి సీసపద్యాలు ఎందరికో మార్గదర్శకమైనాయి.

ప్రారంభదశలో జీవికకై నాటకాలు రచించినా, ఆయన ప్రతిభ ఖండకావ్యాల్లో, "పిరదౌసి, ముంతాజమహల్, గబ్బిలము"వంటి కావ్య

ల్లోనే బాగా ప్రస్ఫుటమైంది. పారసీకకవి పిరదౌసి దయనీయమైన జీవితగాథను శ్రీ జాషువా ఉత్తమ కావ్యంగా తీర్చిదిద్దారు. ఈకావ్యంలో ప్రకృతి వర్ణనలు భావకవుల కవిత్వానికి దీప్తినిచ్చాయి-తాజమహల్ సౌందర్యాన్ని ప్రశంసించే కావ్యాలెన్నో వచ్చాయి. కాని తెలుగులో తాజమహల్‌పై వచ్చిన కావ్యాలలో నేటికీ జాషువాగారి 'ముంతాజమహల్' శ్రేష్ఠమైనదని చెప్పవచ్చు.

"రాణి విడిచిపోయె రాజు నొంటరిఁజేసి,
రాజు విడిచిపోయె రాజ్యరమను
రాజ్యరమయు విడిచె రాజులఁ బెక్కండ్ర
తాజి విడువలేదు రాజసంబు" అనే పద్యం యీ కావ్యమంతటికీ విలువైనది.

అంటరానితనం భారతదేశమంతటా పాకిన తీవ్రమైన జాడ్యం. దీన్ని గూర్చి దరిదాపు భారతీయ భాషలన్నిటిలో కవులు కావ్యాలు రచించారు. కాని శ్రీ జాషువా రచించిన 'గబ్బిలము' భారతీయ భాషలన్నిటిలో ప్రత్యేకమైనదని చెప్పవచ్చు. ఇక్కడ కవి భగవంతుడికి తన మొఱ వినిపించటానికి ఎన్నుకొన్న దూత 'గబ్బిలం'. అంటరానివాని నీడసోకటానికి దేవాలయ ప్రాంగణంలో కూడ వీలులేని కాలంలో గబ్బిలము గర్భగుడిలో ప్రవేశించి దేవుని స్పృశించగలిగింది. కాబట్టి పూజారిలేని వేళ దేవుని చెవిలో తన మొఱ విన్పించమని శ్రీ జాషువా గబ్బిలాన్ని దూతగా పంపారు.

"పామునకుఁ బాలు, చీమకుఁ బంచదార
మేపుకొనుచున్న కర్మభూమిం జనించు
ప్రాక్తనంబైన ధర్మదేవతకు కూడ
నులికిపడు జబ్బుగలదు వీడున్నచోట."

అనే మాటలు సనాతనవాదుల 'ధర్మదృష్టి'ని నిగ్గదీసి ప్రశ్నించాయి. భావకవులకు, అభ్యుదయ కవులకు సమకాలికులైన జాషువాగారు ఏ కవితోద్యమంతో సంబంధం పెట్టుకొనక, తనకు తానే ఒక ఉద్యమమై నిలిచారు. సాంఘిక దురాగతాలను ధిక్కరించి, మాతృదేశ

ఔన్నత్యాన్ని కొనియాడిన జాషువాగారి కవిత్వం జరామరణ భయం లేనిది. నవ్యకవిత్వానికి ఆదరం వున్నన్నాళ్ళూ జాషువా కవితకు ఆదర గౌరవాలు లభిస్తాయి.

## గ్రామజీవన శోభ తుమ్మల కవిత్వం

భాషలో సంప్రదాయాభిమాని, భావనలో ఆధునికులు శ్రీతుమ్మల సీతారామమూర్తి బాపూజీ మార్గాన్ని అనుసరించి జాతీయోద్యమ కవిగా ప్రసిద్ధి కెక్కారు. తెలుగుజాతి అన్నా, తెలుగుభాష అన్నా వీరాంధ్ర పౌరుషం వీరిని ఆవేశిస్తుంది. "పఱిగపంట; ధర్మజ్యోతి, ఆత్మార్పణము, రాష్ట్రగానము" మొదలైన వీరి కృతులు స్వాతంత్ర్యానికి పూర్వమే మిక్కిలి ప్రసిద్ధి పొందాయి. బాపూజీ 'ఆత్మకథ'ను పద్యకావ్యంగా రచించి' 'మహాత్ముని ఆస్థానకవి' అనే ప్రశంస పొందారు.

తెలుగుదేశపు గ్రామజీవన శోభను కమనీయంగా వర్ణించిన ఖండకావ్యం "సంక్రాంతి తలఁపులు" శ్రీ తుమ్మల కవిత్వంలో విశిష్ట మైనది. సంక్రాంతి పండుగను ఆధునిక కవులు పెక్కుమంది వర్ణించారు గాని, రైతు జీవితానికి పంటల పండుగతో సంబంధాన్ని వర్ణించటంలో శ్రీ తుమ్మల అందరినీ మించిపోయారు. తెలుగువారి భోజన పదార్థాలు తుమ్మలవారి వర్ణనలో రసవంతాలై చవులూరిస్తాయి.

ప్రకృతి వర్ణనలో శ్రీ తుమ్మల ప్రత్యేకతను సూచించే ఖండ కావ్యం 'చుక్కలు'.

> "కాలెడి పొట్టతో విరతిగానని చింతలతో విశీర్ణమై
> సోలెడిమేనితో బడుగుఁ జూపులతో నిజరక్తమాంస
> కాశము లర్థమత్తులకుఁగానిచటన్ బలివెట్టి రెవ్వరా
> మాలలు మాదిగల్ గగనమంటప మెక్కిరియిట్లు చుక్కలై?"

అంటరాని తనం ఘోరమైనదని మనసా, వాచానమ్మి, సర్వో దయ వాదియై కవిత్వంలో గాంధేయ సిద్ధాంత ప్రచారం గావించారు.

విభవనామ సంవత్సరంలో (1932) ఒకనాటి మునిమాపు వేళలో తుమ్మల వారికి ఆదికవి వాల్మీకికి ఎదురైన దృశ్యమే తటస్థపడింది. ఒక బోయవాడు మావిగున్నపై చెరలాడుతున్న పెంటిగువ్వను వధించిన దృశ్యం చూచి కలతపడి శ్రీ తుమ్మల 'ఆత్మార్పణము' కావ్యం రచించారు.

స్వాతంత్ర్యం రాక పూర్వమే ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం కావాలని వీరావేశంతో 'రాష్ట్రగానం' రచించారు శ్రీ తుమ్మల. తెలుగు వారిలో ఐక్యమత్యం కొరవడి తగవులాడుకొంటున్నప్పుడు వీరి పద్యాలు చురకలై, నాయకుల స్వార్థానికి చెంపపెట్టు పెట్టాయి.

రాసినది తిరిగి చూడకూడదనే కవులపద్ధతిని వీరు ఆమోదించరు. రాసిన పద్యంలో ప్రతిపదాన్ని పట్టిచూచి, దాన్ని లక్షణవేత్తలు అంగీకరిస్తేనే వీరు ప్రచురిస్తారు. వ్యాకరణం మీద అపరిమితమైన గురి వున్నప్పటికీ వీరి ఆధునికతా దృష్టికి శాస్త్రాభిమానం అడ్డురాలేదు.

## 'ప్రేమోపనిషత్తు' సౌందరనందము

"తొలకరి, సౌందరనందము" కావ్యాలతో నవ్యకవిత్వాన్ని తేజోమయం చేసిన జంటకవులు శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు, పింగళి లక్ష్మీకాంతము గారలు. భావకవిత్వం కేవలం ఊహాప్రేయసిని గురించి రాసే కవిత్వమనే అపప్రథను వీరు దూరం చేశారు. దువ్వూరి రామిరెడ్డి గారి 'కృషీవలుడు' తర్వాత వీరి 'తొలకరి' వెలువడింది. 'తొలకరి' గ్రామ జీవనశోభను వెల్లడించే మధురమైన కావ్యం. దీనిలో సంక్రాంతి దృశ్యాలు రమణీయంగా వర్ణింపబడ్డాయి. ఇంకా "జొన్నచేను, కవితా సామగ్రి" మొదలైన ఖండకావ్యాలు కూడ చిరస్మరణీయమైనవి.

పింగళి – కాటూరి కవులు పరిణత దశలో రాసిన మహాకావ్యం 'సౌందరనందము'. దీనిని 'ప్రేమోపనిషత్తు'ని మెచ్చారు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ. అశ్వఘోషుని సౌందరనందాన్ని రేఖామాత్రంగా

గ్రహించి, ప్రాచీన కవిత్వంలోని వర్ణనాపటిష్ఠతను, ఆధునిక భావచిత్రాల లోని సౌందర్యాన్ని స్వీకరించి యీ కావ్యం రచించారు.

శాంత, శృంగార, కరుణ రసాలు సౌందరనందములో చక్కగా నిర్వహింపబడ్డాయి.

"ఊబిలోఁ గాళ్లుదిగఁబడి, యొరమెడను
మలఁచి బయలాలకించు గోమాతవోలె
దల్లడిలుచున్నదీ విశ్వధాత్రి, రాచ
బిడ్డనికి నీకుఁదగునె యుపేక్షసేయ?" అని నందుని హెచ్చరించిన బుద్ధునిబోధ భారతదేశపు అహింసాతత్వాన్ని చక్కగా వ్యక్తీకరించింది. గాంధీయుగంలో వెలువడిన 'సౌందరనందము' సంఘంలో శాంతి, అహింసలను పాదుకొల్పటానికి తోడ్పడింది. ఈ కావ్యాన్ని కవులు అద్యతనాంధ్ర కవిప్రపంచ నిర్మాతలు చెళ్లపిళ్లవారికి అంకిత మిచ్చారు.

ఆధునికాంధ్ర కవిత్వంలో వెలసిన మహాకావ్యాలలో 'సౌందర నందము' ఇతివృత్తము, రసము, నిర్వహణ అన్నిటిలో విశిష్టమైనది.

## కవికొండల ప్రకృతి కవిత్వము

కంటికి కనిపించిన ప్రతి వస్తువూ కవితామయమని తలచి, సామాన్య దృశ్యాలను, సామాన్యజనులను అర్థమయ్యేలాగ వర్ణించి చెప్పటంలో శ్రీ కవికొండల వెంకటరావు ఘనులు. సుందర ప్రకృతికి నిలయమైన గోదావరి మండలంలో నది, కాలువ, చెట్టూ, పుట్టా, పడవలు, ఆకాశంలో తేలిపోయే మబ్బులూ అన్నీ కవికొండల వారి కవిత్వపు 'కవిలె కట్టలు' లో అందంగా వర్ణింపబడ్డాయి. కష్టజీవుల బ్రతుకుగాథలను వర్ణించటంలో వీరి ప్రత్యేకత కన్పిస్తుంది. భావకవులలో శ్రామికులపై సానుభూతిగల కవులు అరుదు. వారిలో కవికొండల ప్రముఖులు.

## ఆధునికతనుండి సంప్రదాయానికి - నోరి

సాహితీసమితి సభ్యులు శ్రీ నోరి నరసింహశాస్త్రి భావకవిత్వపు తొలిదశలో 'గీతమాలిక' రచించి కాల్పనిక కవిగా ప్రసిద్ధికెక్కారు. పద్య గేయ నాటికల రచనలో శ్రీ నోరి సిద్ధహస్తులు. కాలం గడిచినకొద్దీ యీయన సంప్రదాయంపై మమకారం పెంచుకొని, సనాతనవాదులై ఆధునిక కవితకు దూరమైనారు.

## కాల్పనిక కవిత్వంనుండి అభ్యుదయానికి ప్రయాణం

## స్వేచ్ఛా విహంగం శ్రీశ్రీ

అభ్యుదయ కవితా ప్రస్థానాన్ని సాగించిన శ్రీరంగం శ్రీనివాస రావుగారు కాల్పనిక కవిగా కవిత్వరచన ప్రారంభించారు. ఆయన రచించిన 'ప్రభవ' భావకవిత్వమే. అయితే ఆయన ఆ రోజుల్లో కూడ ఊహా ప్రేయసిని వర్ణించటం, వియోగ గీతికలు పాడటంకాక' ప్రణయంలో ప్రకృతిలో నూతనత్వాన్ని దర్శించారు. ''స్వేచ్ఛావిహగము, విద్యున్మాలికలు, మూగతలపులు,'' మొదలైన కావ్యఖండికలలో ఆయన కవితా వైశిష్ట్యం తొంగి చూస్తూనేవుంది. 'ప్రభవ' రచించే నాటికి ఆయనపై విశ్వనాథ, కృష్ణశాస్త్రిగారల ప్రభావం గాఢంగా వున్నది. 1929 లో 'సుప్తాస్థికలు' 'గీతం రచించాక, ప్రపంచ పరిస్థితులను అవగాహన చేసుకొన్న శ్రీశ్రీ అభ్యుదయ కవిగా అవతరించారు. ఆయన మహాప్రస్థానంలో గీతాలు ఎక్కువ భాగం 1930-40 మధ్య రచించినవే.

'మహాప్రస్థానం' 1950లో గాని ప్రచురితం కాలేదు, ఈ లోపలే శ్రీశ్రీ కవిత్వం యువతరాన్ని విడువక పట్టుకున్నది. అభ్యుదయోద్యమ నేతయై ఆ తర్వాత ఆధునిక కవిత్వాన్ని ఆయనే నడిపించాడు. 'నయాగరాకవులు', ఆరుద్ర, రమణారెడ్డి, అనిసెట్టి, పఠాభి, బైరాగి, అజంతా ఆనాటి నవ్యకవులందరూ శ్రీశ్రీ ప్రభావానికి లోనైన వాళ్ళే.

చలంగారన్నట్లు "ఈనాటి కవిత్వమంతా ఏమిటి? ఎందుకు వుంది? ఏం చేస్తోంది?" అని ధిక్కరించి అడిగే తెలుగుప్రజకు శ్రీశ్రీ కవిత్వం ప్రత్యుత్తరం. కొద్ది రోజుల్లో నేడు విర్రవీగే కవులు ప్రతివొక్కరూ శ్రీశ్రీ నీడకింద నించుని తమ ఉనికిని సమర్థించుకోవలసిన గతి వొస్తుంది." [44] చలంగారి వాక్కు నిజమైంది. శ్రీశ్రీ నీడకింద చాల మంది కవులు మఱ్ఱిచెట్టుకింద మల్లె తీగల్లా నిలువలేకపోయారు. అయితే నేం, ప్రపంచపు బాధ తనలో పలికించిన శ్రీశ్రీ తెలుగు కవితకు అంతర్జాతీయ ఖ్యాతి తెచ్చారు.

చలంగారు మరొక గొప్పమాట కూడ అన్నారు - "ఎవరినించి దొంగిలించామో వాళ్ళని క్షమించడం కష్టం." [45] శ్రీశ్రీ ప్రభావంతో కవిత్వం రచించి, ఆ ప్రభావంలోనుంచి బయటపడలేక, ఆయనను ఆక్షేపించటానికి కూడ ఆయన మాటలనే అరువు తెచ్చుకునే కవులకు చలంగారి మాట బాగా వర్తిస్తుంది.

అభ్యుదయ రచయితల సంఘం 1943 లో స్థాపింపబడింది. 1930 ప్రాంతాలనుండి భావకవిత్వంతో మొఖం మొత్తిన కవులు కొత్తదనం కోసం అన్వేషించసాగారు. సమాజంలో అన్నివైపులా అలుముకున్న ఆకలి, దారిద్ర్యం దీన జనుల ఆర్తరావాల్లో భావకవుల ఊహాప్రేయసుల గురించిన తలపులు, విరహవర్ణనలు అర్థరహితంగా తోచాయి. శ్రీపతాభి 1939 లో తాను కలకత్తాలో చూచిన దుర్భర దృశ్యాలను గురించి చెప్పి తన కొక్కసారిగా రవీంద్రుని కవిత్వం, భావకవుల ఉపమానాలు అన్నీ అర్థ రహితంగా తోచాయని చెప్పారు.

**44-45 'యోగ్యతాపత్రం' శ్రీశ్రీ మహాప్రస్థానానికి చలం రచించిన పీఠిక- విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్.**

స్వాతంత్ర్య పోరాటం ముమ్మరమైన తర్వాత నాయకులు ప్రజలకు ధైర్యాన్ని నూరిపోయసాగారు. స్వరాజ్యం వస్తే అన్ని కష్టాలూ గట్టెక్కుతాయనీ, అందాకా ఓర్పు వహించమని చెప్పసాగారు. ఆధునిక కవులు కూడ బ్రిటీషుపరిపాలన తొలగిపోతే ప్రజలు శాంతి సౌఖ్యాలతో జీవిస్తారని కలలు కనసాగారు. ఇంతలో దేశ విభజన అనివార్యమని తేలింది. 'తెల్ల దొరలు', 'నల్లదొర'లకు పరిపాలన అప్పగించి పోతున్నారుగాని, కష్టజీవుల కష్టాలు గట్టెక్కాలంటే శ్రామికులు తిరుగుబాటు చెయ్యక తప్పదని క్రాంతదర్శులైన కొందరు కవులు గ్రహించారు. ఈ ఆశ నిరాశల మధ్య స్వాతంత్ర్యోదయమైంది.



రెండవ అధ్యాయం

# స్వాతంత్ర్య భావోదయం - తెలుగు కవుల ఆనందగీతాలు

## బాపూజీ నిర్యాణం - కవుల బాష్పాంజలి

ఎందరో మహానుభావుల త్యాగఫలితంగా 1947 ఆగస్టు 15వ తేదీన భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. 1857 లో ప్రథమ స్వాతంత్ర్య పోరాటం నుండి జరిగిన ఉద్యమాలన్నీ సాహిత్య రంగంలో కన్పిస్తాయి. గాంధీజీ భారత స్వాతంత్ర్య సంగ్రామానికి నాయకత్వం వహించక ముందు నుంచీ కూడ తెలుగు కవుల్లో స్వాతంత్ర్య కాంక్ష కన్పిస్తుంది. లోకమాన్య బాల గంగాధరతిలక్ 'స్వరాజ్యం నా జన్మహక్కు' అని చాటిన తర్వాత సంపూర్ణ స్వాతంత్ర్య వైపు కవులు దృష్టి సారించారు. గాంధీజీ ప్రవేశపెట్టిన అహింస, ఖద్దరు, విదేశీ వస్తువుల బహిష్కరణ, సహాయ నిరాకరణ, సత్యాగ్రహం, అస్పృశ్యతా నివారణ, హిందూ ముస్లిము సమైక్యత మొదలైన వాటిలో బాపూజీ చూపిన మార్గంలో నడిచారు. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వంటి వారొకరిద్దరు ఖద్దరు, హిందీ ప్రచారం, అహింస వంటి ఆలోచనలను వ్యతిరేకించారు. గాంధీజీ మెచ్చుకోకపోయినా భగత్సింగ్, నేతాజీ, అల్లూరి సీతారామరాజు వంటి మహావీరుల త్యాగాలను కవులు కొనియాడారు. మన దేశానికి స్వాతంత్ర్యం రావటానికి ముఖ్య ప్రేరణలేవి? అనే విషయంలో చరిత్రకారులలో భిన్నాభిప్రాయాలున్నాయి. కేవలం అహింసా సిద్ధాంతమే మనకు స్వతంత్రం తెచ్చి పెట్టిందనటం సత్యంకాదు. అహింస అమిత శక్తిమంతమైన ఆయుధం. మార్టిన్ లూథర్ కింగ్ వంటి స్వాతంత్ర్య వీరులు దీని శక్తిని గమనించారు. హింస తప్పదని నమ్మిన విప్లవ

వీరులను అన్ని దశలలోను కవులు గుండెలకు హత్తుకున్నారు. మన స్వాతంత్ర్యం కేవలం రాజకీయ స్వాతంత్ర్యమే కాని భావ స్వాతంత్ర్యం కాదని కొందరు మేధావులు తలంచారు. తరతరాల బానిసత్వం తొలగిపోయి, చిన్న చిన్న రాజుల పీడ వదలిపోయి, ఆ సేతు శీతాచలం ఒక్క పరిపాలన కిందికి వచ్చిన శుభ సమయం భారత చరిత్రలో అత్యంత ఆనందదాయకం కదా! రసావేశపరులైన కవుల కంఠాలు ఖంగుమని మ్రోగి, స్వాతంత్ర్యోదయాన్ని కమనీయంగా గానం చేశాయి.

భారత కవికోకిల శ్రీమతి సరోజినీ నాయుడు ప్రథమ స్వాతంత్ర్య దినోత్సవంనాడు ఆకాశవాణి ఢిల్లీ కేంద్రం నుండి ఆంగ్లంలో చేసిన ప్రసంగం భారతీయులందరి మనస్థితిని చక్కగా వెల్లడిస్తున్నది.

"Oh world of free nations! on this day of our freedom, we greet you. oh, world of nations not yet free, on the day of our freedom we pray for your freedom in the future"

స్వతంత్రం వచ్చిన ఆనంద సమయంలో యింకా బానిసత్వంలో మగ్గుతున్న దేశాల దుస్థితికి సానుభూతి చూపి, వారి స్వాతంత్ర్యంకోసం ప్రార్థిస్తామన్న సరోజినీదేవి హృదయం ఎంత విశాలం! బాపూజీ నాయకత్వంలో అహింసా సిద్ధాంతాన్ని ఆమోదించిన సరోజినీదేవి, "Ours has been an epic struggle, covering many years and costing many lives." అని ఎందరో మహావీరుల ప్రాణ త్యాగాల్ని గుర్తించి గౌరవించారు. "Mahatma Gandhi, our prophet of non-violence, our general of victory, he taught us a new way of deliverance from evil He had no device of his banner excepting non-violence" అహింసా సిద్ధాంతాన్ని మహాయుధంగా స్వాతంత్ర్య సమరాన్ని నడిపిన బాపూ శక్తిని ఆమె ప్రశంసించారు. "The battle of freedom is over. The struggle for peace begins" అని కూడ ఆమె ఆ సమయంలో అన్నారు. హిందూ మహమ్మదీయ మతకలహాలు జాతికి

తీరని నష్టం కలిగిస్తున్న తరుణంలో ఆమె తగిన హెచ్చరిక చేశారు. ఒక విధంగా యీవిషయంలో ఆంధ్రులు అదృష్టవంతులే, ఆ సమయంలో ఆంధ్రదేశం మతకలహాలలో నిమగ్నం కాలేదు. కాని కొద్ది కాలంలోనే నైజాం నవాబు ఇండియన్ యూనియన్‌లో చేరటానికి యిష్టపడక హిందూ మహమ్మదీయుల సఖ్యతను ఛేదించి, కాశిం రజ్వీ అనే మతోన్మాదిని రెచ్చగొట్టి, 'రజాకార్' దళాలతో ఆంధ్రదేశాన్ని బీభత్సం చేశాడు. ఆ పోరాటంలో ఆంధ్ర మహాసభ కృషి ఫలితంగా ప్రజలు మత భేదాలు మరచి సమైక్యంగా నిలిచారు.

భారత స్వాతంత్ర్యం రాబోతున్న శుభ సమయంలో సుప్రసిద్ధ పత్రికా సంపాదకులు శ్రీ నార్ల వెంకటేశ్వరరావు "జాతీయ స్వాతంత్ర్యం అకారణంగా పోదు, అవలీలగా రాదు; అప్రయత్నంగా నిలువదు."[1] అని హెచ్చరించారు. గతంలో భారత ప్రజల అనైకమత్యం, స్వార్థం, చైతన్య రాహిత్యం వలననే స్వాతంత్ర్యం కోల్పోయామని గుర్తుచేశారు. భారత స్వాతంత్ర్యాన్ని కేవలం రాజకీయ నాయకులే సాధించి పెట్టలేదన్నారు. రాజారామమోహనరాయ్, దయానంద సరస్వతి, కేశవ చంద్రసేన్, వివేకానంద మొదలైన మత సంస్కర్తలు, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, మహాదేవగోవింద రనడే, సర్ సయ్యద్ అహ్మద్‌ఖాన్, కందుకూరి వీరేశలింగం పంతులు మొదలైన సంఘ సంస్కర్తలు, బంకిం చంద్రఛటర్జీ, రవీంద్రనాథ్ టాగూర్, సర్ మహమ్మద్ ఇక్బాల్ మొదలైన కవులు, రచయితల కృషిని స్మరించమని ఉద్బోధించారు. "మన జాతికి జాతి ఆకలిగొని వున్నది. దానికి స్వాతంత్ర్యం సాక్షాత్కరించ వలసింది అన్నం రూపంలోనే" అని హెచ్చరించి, మానవుని ప్రాథమిక అవసరాలైన అన్న వస్త్రాలు, నివాసం అనేవి సమకూర్చలేకపోతే అది స్వాతంత్ర్యమే కాదన్నారు. "పెట్టుబడి దారులకు మరింతగా లాభాలు, చదువుకొన్న వారికి మరికొన్ని ఉద్యోగాలు, పదవీ వ్యామోహం గల వారికి దాని పరితృప్తికై బహుళావకాశాలు-ఇంతే కానుంటే ఆగస్టు 15 వ

1. 'స్వాతంత్ర్య భానూదయ వేళ' ఆంధ్రప్రభ - దినపత్రిక - 'సంపాదకీయ వ్యాసాలు' - ఆగస్టు 6 నుండి 15 వరకు - 1947.

తేదీన జరుగనున్నది స్వాతంత్ర్య భానూదయం కాదు'' అని మరి మరీ హెచ్చరించారు. కాని 33 ఏళ్ళ స్వాతంత్ర్యానంతరం దేశస్థితిని పరికిస్తే పరిస్థితులు ఆశాజనకంగా లేవనే చెప్పవలసి వుంటుంది. ''మన స్వాతంత్ర్యం మేడిపండు; మన దారిద్ర్యం రాచపుండు'' అని ఆ తర్వాత కాలంలో కవి ఆరుద్ర పలికిన మాటలు మన స్వాతంత్ర్య నిజ స్వరూపాన్ని తెలియజేస్తాయి.

కవులు ఎప్పుడూ అల్పసంతోషులే. స్వాతంత్ర్య దిన శుభ సందర్భంలో వర్తమానాన్ని భవిష్యత్తుని తలచుకొని పులకించి, ఎన్నో కలలుకన్నారు, ఎన్నో ఆశలు పెట్టుకున్నారు. ప్రథమ స్వాతంత్ర్య దిన సంరంభంలో తెలుగు కవుల వాణిని ఒక్కింతగా యీ సందర్భంలో జ్ఞాపకం చేసుకోవటం బాగుంటుంది.

శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి ''రేయియంచుల పొర్లిపోయినట్లు వెలుగు విరిసినట్లు, స్వాతంత్ర్య దీప్తి వెలుగొందినదన్నారు. భారతీయులు ముక్త చైతన్య ధారతో హిమగిరి శృంగంలాగ తల పైకెత్తుకోగలరని భావించారు. అసలొకప్పుడైనా బానిస జీవితం గడిపినందుకు ''కొన్ని నూరేండ్లు బానిసడన్నమాట - గుండెలోన దొలిచిన కుళ్ళి యేడ్తు''నని వాపోయారు. తూరుపుపడమర లొక్క కౌగిట కరిగిపోయినట్లు స్వాతంత్ర్యం వచ్చిందని తలచారు. ఇకమీదట ''కరుణ సరిహద్దులు చెరపగలుగుతుంది; జగత్కుటుంబంలో పరపీడన వుండదు; పచ్చి నెత్తురు త్రావనీదు'' అని ఆశలు కల్పించారు. ''భావికాల సుఖ శాంతి బ్రతుకులు పరపించి, ప్రతి మానవు శిరమున నుజ్వలమకుటము పెట్టు''మని, సృష్టిలో ''మానవుడే మకుటధారి'' అనీ - మానవత్వానికే తుది విజయం అనీ చాటారు. ''ఏ మహాత్ముని చేయి ఈరేయి చెరసాల తలుపులూడలాగె తెలియకుండ'' అని మహాత్ముని పూజ్యభావంతో స్మరించి, మానవులంతా కలిసిమెలిసి వుండగలరన్న ఆశను వెల్లడించారు.

శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు [3] నల్వదికోట్ల గొంతుక జయశ్రీ గీతి విప్పారె/మంగళ తూర్యమ్ములు మ్రోసె, భారతము మింటన్ దోచె

మువ్వన్నియలు" అని ఆనందోత్సాహాల్ని ప్రకటించారు. స్వాతంత్ర్య సంపదను అందరికీ పంపమనిచెప్తూ "తండ్రి తాత ముత్తాతలు తరతరమ్ము జేసిన తపస్సు పండి నీ చేతికందె/పాడి మొదపట్లు చేపె నీ భరతధాత్రి పాలు పొంగించి పంచరా పాయసమ్ము" అని పండుగనాటి సంరంభాన్ని ఎదలో నిలిపారు. భారతజాతి ఆత్మగౌరవం కలది. "ఒరుల కలిమి కాసింపదు- ఒరుకష్టము దినెడినైచ్యమొల్లదు" అనీ-, యింకా-

"పాడియు పంటయుం గలిగి, పాడిదొరంగక,కల్గినంతలో
వేడిన రిత్త పుచ్చక, నివేదన సేయని భుక్తి నొల్ల, కె
గ్గాడక, సర్వభూతహితయౌ శుభ శీలకు స్వస్తిగీతముల్
పాడరె పల్లె పల్లెలను వాడలవాడల పుణ్యగేహినుల్"

అని ధార్మిక జీవనాన్ని గడపమని ప్రబోధించారు.

ఎదురు చూచిన స్వాతంత్ర్యోత్సవపు ఆనందంతో శ్రీ నాయని సుబ్బారావు "కారు మబ్బుల నల్లకప్పు వేసిన నింగి/పారతంత్ర్యతమస్సు పాము కొన్న రాత్రి/కలికి రాయంచ రెక్కలు విప్పుకొనియెనో/తెలి తమ్మి పూల రేకులు కప్పుకొనియెనో/ఎన్నాళ్ల కెన్నాళ్లకీ మహోదయ దీప్తి/కన్నారగాంచు భాగ్యము గల్గె మనకహా" అని జయగానం చేశారు. స్వేచ్ఛా సుధా జలధిలో దాస్య పంకాన్ని కడిగివేయుడని ఉత్సాహ పరచారు. పృథ్వీరాజు, రాణా ప్రతాపుడు, శివాజీ, సిపాయీల తిరుగు బాటులో పాల్గొన్న వీరులను స్మరించి బోసినోటి తాతయ్య వలన మనకు అబ్బిన స్వాతంత్ర్య నిష్ఠను నిల్పుకోవలసిందని ప్రబోధించారు.

"ధూత దుర్భర దాస్యదురిత సంతమసమ్ము
స్వాతంత్ర్య నవయుగోద్భవ దివ్య రాగమ్ము
జనని చన్మొనల స్వేచ్ఛా పయస్సు బికెనో
జనని కన్గొనల విశ్వ శ్రేయమురలెనో." అని తల్లి

పాలు త్రావిన బిడ్డ ఆనందాన్ని వెల్లడించారు స్వాతంత్ర్యోదయవేళ పొందిన ఆనందాన్ని శ్రీ నాయని మధురమైన రీతిలో వ్యక్తం చేశారు.

2,3,4. భారతి - సెప్టెంబరు - 1947.

అఖండ భారతం చీలికలై పోయినందుకు శ్రీ గడియారం వేంకట శేషశాస్త్రి వగచారు. స్వదేశ సంస్థానాలకు బ్రిటిషువారు స్వయం నిర్ణయాధికారం యివ్వటం ఆ ప్రజలను నూతిలో త్రోయటమేనని భావించారు. ఈ స్వాతంత్ర్యం ప్రథమ కక్ష్య మాత్రమేననీ, సంపూర్ణ స్వాతంత్ర్యం తర్వాత ఏర్పడుతుందని ఆశించారు.[6] మన జాతీయ పతాకకు, మన మహాత్ములకు, వారి పాలన సూత్రములకు ప్రజావళికి కల్యాణములౌ గాక అని ఆశీస్సులు పలికారు.

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ జాతీయ పతాకాన్ని ఎగురవేయటానికి ఆత్మ బలిదానం చేసిన పుణ్యమూర్తులను స్మరించారు. దారుణ మారణాస్త్రాలతో పోరుసల్పిన హిట్లరు నాశనమైన విధాన్ని, మూరెడు కర్ర చేకొనకుండానే గాంధీజీ విజయాన్ని సాధించటాన్ని పోల్చి గాంధీ విజయాన్ని కొనియాడారు. ''

కులతత్వ భేదంపు కుటిలత్వములులేక మతవిభేదంబుల మాటలేక
రాష్ట్రాభిమానంపు రగడలు లేకుండ భాషా విభేదంబు పట్టులేక
ధనిక దరిద్రుల తారతమ్యములేక అధికారమోహంపు టాశలేక
వ్యవసాయ కార్మిక వ్యత్యస్తములు లేక స్త్రీపురుష విభేదరీతి లేక
భారతాంబ స్వాతంత్ర్యంబు బడయుకొఱకు శాంతి సమరంబు
పూనిక్కమై సలిపినటులె

భరతదేశాభివృద్ధికై పాటుపడగ దీక్ష గొనగవలెనింక దేశ ప్రజలు'' అని ఆకాంక్షించారు. ఆమె ఆశించిన ఫలితాలను భారతదేశం యింకా సాధించవలసిన స్థితిలోనే వున్నది.

శ్రీశ్రీ స్వాతంత్ర్య దినోత్సవం నాడు రేడియోలో వినిపించిన 'మహాసంకల్పం' యీ నాటికీ రసవంతమైనదే.[7] భూతకాలాన్ని చక్కగా

6-6. భారతి-సెప్టెంబర్ 1947.

7. 'మహాసంకల్పం' - శ్రీ శ్రీ సాహిత్యం - మూడు (కావ్య విభాగం 1945-1969 - 30వ పేజీ

బేరీజు వేసుకొని, వర్తమానంలో స్థిరంగా నిలిచి భవిష్యత్తును దిద్దుకో వాలనే కవివాణి యీ గీతంలో వున్నది. "ఇది నా స్వాతంత్ర్య దిన/మహా సంకల్పం/విధిగా వికసించే/చరిత్రకొక కృతజ్ఞత/ప్రజలకు నివాళి/ప్రభవించిన నూతన భారత/పతాక కభివాదం/భవిష్యదుజ్జ్వల భర్మయుగానికి ఆహ్వానం" అని తన స్వప్నాన్ని ఇలా వర్ణించారు. ఉత్సాహ ప్రవాహంలో సాగిపోతున్న తనకు "ఒక మహావట వృక్షం/హఠాత్తుగా నడిచినట్లుగా/ఒకే ఒక్క మానవమూర్తి" కనిపించాడు. "ఎంచేతో అతని ముఖంమీద/ఎప్పుడూ ఉండే పసిపాప నవ్వులేదు," ఆ ముఖం స్వతంత్ర భారతదేశపు సగటు మనిషిది. అతడి యోగక్షేమాలకు అంతా పూచీపడాలన్నారు. "భగవంతుని ప్రార్థించిందికి, పాతవి గుంజాలించిందికి" ఇది సమయం కాదు. ఆవేశం ప్రకటించిందికి ఇది అసలే తరుణంకాదు - "రా ! నేస్తం ! పోదాం/చూదాం/మువ్వన్నెల జెండా పండుగ/రా ! నేస్తం, లేదాం చూదాం! మనభారత జన సౌభాగ్యం-అటు చూడు సముద్రం, నేస్తం/హర్షానికి పర్యాయపదం/ఇటు చూడు విహాయస నేత్రం/దుఃఖానికి అధ్యాహారం "అని ఆ ఆనందాన్ని శ్రీశ్రీ వాక్కు అమోఘంగా జ్వలించింది." మనుష్యుడే నా సంగీతం-, మానవుడే నా సందేశం" అన్న మహాకవి వాక్కు సరిహద్దుల్లేని సకల జగజ్జనుల నుద్దేశించినది కావటం గర్వకారణం.

భారతదేశ స్వాతంత్ర్యం మహాత్ముడు కోరిన రీతిలో రాలేదు. ఇండియన్ యూనియన్, పాకిస్తాన్‌లుగా విభజించి బ్రిటీషువారు స్వాతంత్ర్యం ప్రకటించారు. దేశవిభజన తర్వాత జరిగిన కల్లోలాలు ఒక పెద్ద పీడకల. స్వాతంత్ర్యం కోరిన తీరులో కాకపోతే మానె, అసలు కోరిక తీరింది అని ప్రజలు తృప్తిపడవలసి వచ్చింది. ప్రథమ స్వాతంత్ర్య దినోత్సవం నాడు జాతిపిత బాపూజీ వేడుకల్లో పాల్గొనలేదు. మతమౌఢ్యంతో హత్యలకు తలపడిన మతోన్మాదులను శాంతింపజేయ టానికి కల్లోలిత ప్రాంతాల్లో పర్యటిస్తున్నారు.

"స్వాతంత్ర్య దినోత్సవమునాటి వైభవం దీపావళి ఉత్సవవైభవ మును మించిపోయింది. ఊరూరా, ఇంటింటా స్వాతంత్ర్యజ్యోతులు వెలిగినవి. భారత విజయపతాకలు ఎగిరినవి. స్వాతంత్ర్య నినాదములు మారుమ్రోగినవి; జయఘంటలు నినదించినవి. కాని ఇల్లలుకగానే పండుగ కాలేదన్న సామెతకూడ ఒక వంక స్ఫురణకు వచ్చుచున్నది" అని 'భారతి' పత్రిక సంపాదకీయంలో నలువంకలా నాలుకలు చాచుకొని వున్న కాలమేఘ మాలికలను చూపి- ప్రజలలో జితించిపోయిన విద్వేషోద్వేగాలను తొలగించుకోవలసిందిగా కోరింది.

## "మహాత్ముని ఆస్థానకవి" తుమ్మల

శ్రీ తుమ్మల సీతారామమూర్తి 1936 లో గాంధీజీ స్వీయచరిత్రను పద్యకావ్యంగా రచించటం ఆరంభించి 'ఆత్మకథ' పేరుతో దాన్ని బాపూజీ మరణానంతరం వెలువరించారు. 'The story of my experiments with truth' అని గాంధీజీ స్వీయచరిత్రకు పెట్టుకున్న పేరు. అది సార్థకమైన సత్యకథనం. దానిలో కల్పనలకు, వర్ణనలకు అవకాశం అంతగా వుండదు. వేలూరి శివరామశాస్త్రిగారు వచనంలోకి అనువదించిన గాంధీజీ స్వీయచరిత్రను తుమ్మలవారు పద్యకావ్యంగా తీర్చిదిద్దారు.

'ఆత్మకథ' కావ్యాన్ని ప్రశంసిస్తూ శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి "విషయము గాంధి మహాత్ముని స్వీయచరిత్రము. లోకారాధ్యమైనది. తమశైలి యించుమించు ఆంధ్ర మహాభారత ప్రతిబింబము. ఇంతకంటె నెక్కువగాఁ జెప్పుటకు సాధ్యముకాదు. అవసరమును లేదు ... తుమ్మల సీతారామమూర్తి మహాత్మునియొక్క ఆస్థానకవి. ఈ స్థానము శాశ్వతము" అన్నారు. తెలుగులో గాంధీమహాత్ముని గురించి చాల కావ్యాలు, ఖండకావ్యాలు వచ్చాయి. కాని మహాత్ముని ఆస్థానకవి పదవి శాశ్వతంగా తుమ్మలవారిదే ననటానికి సందేహంలేదు.

మహాత్ముడు స్వీయచరిత్రలో సత్యగోపనం చేయక వెల్లడించిన "దొంగతనము-ప్రాయశ్చిత్తము; పితృనిర్యాణము; నామహావమానము"

వంటి ఘట్టాలను ఆసక్తికరంగా, రసవంతంగా రచించారు శ్రీ తుమ్మల. మహాత్ముని గుజరాతీ రచనకు ప్యారేలాల్, మహాదేవదేశాయ్ గారలు ఇంగ్లీషులో చేసిన అనువాదం అలంకారభారం లేకుండ, నిసర్గసౌంద ర్యంతో భాసించినట్లే, తుమ్మలవారి తెలుగుపద్యాలు నిరాడంబరంగా నడి చాయి. కాకపోతే గోపాలకృష్ణ గోఖలే పేరును 'గోకులు' అనటం ఛందస్సులో ఇమడ్చవలిసి రావటంచేతనే, ఛందోబద్ధమైన రచనలపై తుమ్మలవారికున్న మక్కువచేత నామవాచకాలను రూపుమార్చి పద్యాల్లో ఇరికించటం జరిగింది. "నా కృతులన్నింట నుత్తమము, పవిత్రమునైన యీ కావ్యము నా సారస్వతానుభూతికి, నా తెనుఁగుదనమునకు మూద లగా రూపెత్తుట నా భాగ్యమని తలంతును" అని ఆత్మకథ రచనపై శ్రీ తుమ్మల సంతృప్తిని ప్రకటించారు.

స్వీయ చరిత్రను గాంధీజీ 1918 వ సంవత్సరంలో ముగించారు. ఆ తర్వాత జగమెరిగిన కథను 'మహాత్మ కథ' పేరుతో శ్రీతుమ్మల రచించారు. శ్రీతుమ్మల కావ్యరచన 'ఆత్మార్పణము'తో ప్రారంభమైంది. వాల్మీకి కవికివలె తుమ్మలవారికి కూడ "విషాద జనకమగు నిషాద చేష్టి తమే" కవిత్వ రచనకు ప్రేరకమైంది, వాల్మీకికి రాముడు కావ్యనాయకు డైనట్లు తుమ్మలవారికి గాంధీజీ నాయకుడయ్యాడు. "రామభక్తుడు గాంధి-గాంధి భక్తుడు రాముడు" అని శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రి తుమ్మలవారి కావ్యవస్తు స్వీకారాన్ని మెచ్చుకున్నారు,

"జలియన్‌వాలా బాగ్ ; మహాత్ముడాంధ్రదేశమునఁ బర్యటిం చుట; చౌరీ చౌరా దుండగములు; బాపూవేదన; పెదనందిపాడు పన్నుల నిరాకరణము; అల్లూరి సీతారామరాజు, మహాత్ముఁడు దండికిఁజేరుట; తోట నరసయ్య మగఁటిమి; సుభాష్‌చంద్రబోసు వీరగాధ: దుర్దినము వచ్చినది; రామ ! రామ !" వంటి ఘట్టాలు మహాత్మకథలో మళ్ళీ మళ్ళీ చదివిస్తాయి. ఆత్మకథలో కవికిలేని స్వాతంత్ర్యం మహాత్మకథలో లభిం చటంచేత తుమ్మలవారి వర్ణనాపైదగ్ధ్యం చేవదేరింది. గాంధేయవాదియై. 1920 ప్రాంతాలనుండి ఇప్పటిదాకా గాంధీపథంలో పయనిస్తున్న తుమ్మల వారి సత్యదీక్ష కవితా శిల్పానికి మెరుగులు దిద్దింది.

"గాంధి యుగమ్మునఁ బుట్టితి, గాంధి నడుపు
నుద్యమంబుల నలఁగితి నోపినంత
గాంధినీక్షించితిని, గాంధి కవిత వ్రాయఁ
గంటి నీ జన్మమునకు నీ పంటచాలు"

అని సంతృప్తితో నిట్టూర్చిన కవి ధన్యజీవి.

మహాత్ముని దివ్య సందేశాన్ని విని, పులకించి, ఆచరణకు ప్రబోధానికి పూనుకొన్న కవులెందరో వున్నప్పటికీ వారిలో తుమ్మలవారి స్థానం ఉన్నతమైనది, గాంధీజీహత్య కవికి పిడుగుపాటైనది. 'మహాత్మ కథ' చివరి ఘట్టంలో గాంధీజీ నిర్యాణాన్ని—

"ఏ గుండె సూనృతాహింసన తపోఽర్చులిన్ని నాళ్ళోర్చె
నే గుండె దీర్ఘోపవాసభర ముద్వహించుట నేర్చె
నే గుండె విశ్వహార్దమున నార్ద్రిత నెనసి జాల్వాఱె
నా గుండెపైఁ గాల్చెనతని తమ్ముండ యగ్నిగోళమ్ము
పలికినట్టి పల్కు బ్రదికిన బ్రదుకును
గట్టకడకు సార్థకమ్ము గాఁగ
రామ ! రామ ! యనుచు రక్తంపు మడువునఁ
కూలెగాంధి మోడ్పుఁగేలుతోడ"

అని ఆర్తితో వర్ణించారు. పురుషోత్తముడైన మహాత్ముని కథను తెలుగులో ఉత్తమ కావ్యంగా తీర్చిన శ్రీ తుమ్మల కవితావైశిష్ట్యం చిర స్మరణీయమైనది.

"గాంధిమహాత్మ కుండనగఁ గారణజన్ముడు" అని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు భావించారు.[8] శ్రీ రామనామం భక్తులను మైమరపించి నట్లు గాంధినామం కూడ కవులను పులకింప జేసింది.

"ఏమి మహిమంబు గలదొ నీ నామమందు
'బాపు' అనిపేరు వీనుల బడినయంత

నిలుపునను నాదు మేనెల్ల పులకరించు
జల్లుమని నాదు హృదయంబు జలదరించు
సర్వ సారస్వత ప్రపంచంబునందు
గాంధి యనియెడి వర్ణయుగంబు తోడ
సాటి వచ్చెడు వేఱొక్కమాట గలదె
మార్దవంబున, మధురిమ, మంజులతను!
భువన 'మోహన'మైన నీ ముద్దుపేరు
రామనామము కంటెను రమ్యమగుచు''

అని నాళము కృష్ణారావుగారు తన్మయులై గాంధీ నామోచ్చారణతో పులకించిపోయారు.[9] ''ప్రేమలోఁ బరమస్థాన మలంకరించినది నీ సత్య స్వరూపంబు'' అని శ్రీ బుచ్చి సుందరరామశాస్త్రి గాంధీజీని సత్యమూర్తిగా తలచారు.[10] ''జీసస్, మహమ్మదు, కృష్ణులు వాని జతకు వత్తురేమొ ఎంచగా'' అని విశ్వసుందరమ్మగారు గాంధీజీని అవతార మూర్తిగా భావించారు.[11] శిబి, కర్ణుడు, జీమూత వాహనుడు, భీష్ముడు వంటి త్యాగధనులకు గాంధీజీ సమానుడని శ్రీ పళ్ళెపూర్ణ ప్రజ్ఞాచార్యులు ఊహించారు.[12] ''నలుబది కోట్ల భారత జనమ్ముల ప్రాణములోని ప్రాణము'' గాంధీజీ అని శ్రీ ధనకుధరం భావించారు.[13]

శ్రీశ్రీ గారు 'గాంధీజీ' అనే గీతంలో ''కర్పూర ధూపంలాంటి/కాలం కాలుతూనే వుంటుంది/ఎక్కడో ఎప్పుడో పాడిన పాట/ఎప్పుడో ఎందుకో నవ్వేపాప/బాంబులవర్షాలు వెలిసిపోయాక/బాకుల నాట్యాలు అలసిపోయాక/గడ్డిపువ్వులు హాళసగా నవ్వుతాయి/గాలిజాలిగా నిశ్వసిస్తుంది''అని గాంధీజీ అహింసా సిద్ధాంతపు ఔన్నత్యాన్ని వర్ణించారు.[14] తర్వాత ''ఖడ్గాన్ని రద్దు చేస్తుంది ఖడ్గం/సైన్యాన్ని తినేస్తుంది సైన్యం/పొలంలో హలంతో రైతు నిలుస్తాడివాళా రేపూ'' అని హింసను

8, 9, 10, 11, 12, 13— 'కావ్యాంజలి' : గాంధీ సాహిత్య ప్రచురణాలయము : హైదరాబాదు 20

14 'గాంధీజీ'' ఆంధ్రజ్యోతి - 1946 - ఫిబ్రవరి

ద్వేషించి అహింసపై మక్కువ చూపారు. ఈ గీతంలో ఎక్కడా గాంధీజీ పేరును స్మరించకుండానే గాంధీజీ శక్తిని వెల్లడించటం విశిష్ట మైన కావ్యశిల్పం.

బాపూ నిర్యాణం - కవుల బాష్పాంజలి

మతోన్మాది నాథూరామ్‌గాడ్సే గాంధీజీని హత్యచేసిన దుర్దినాన భారతీయాత్మ తల్లడిల్లిపోయింది. భారతీయ భాషలన్నిటిలో కవులు గాంధీజీ మరణానికి దుఃఖించి, గాడ్సేను శపిస్తూ విషాదగీతాలు రాశారు. అహింసను ప్రబోధించిన మహాత్ముడు మతోన్మాది హింసకు బలియై పోవటం ఘోరం. గాంధీజీ దృష్టిలో "అహింస అంటే చేతగాని తనం కాదు. హంతకునిముందు లొంగిపోవటం గాదు. హంతకుని ఆత్మను లొంగదీసుకోవటం. మతోన్మాదులకు సర్వమానవత్వాన్ని బోధించి ఆత్మత్యాగం చేసిన అహింసా జ్యోతి గాంధీజీ. అహింసా జ్యోతి అంటే అజేయమూ, ఆదర్శమూ, అనుపమానమూ-అయిన ఆత్మజ్యోతి.[15]"

"బాపూజీ మనకు మరో హిమాలయం - మరో తాజమహలు - మరో గంగానది" ఆయన మరణం తెలుగు కవులకు అశనిపాతమైంది. ఆనాటి కవుల అశ్రుతర్పణాన్ని గమనిస్తే కరుణరసం జాల్వారిన తీరు గోచరిస్తుంది.

"అది తలపోయరాని హృదయ ప్రవిదారి విషాద వాచ్యకా
స్పదమయి పంచఖండములు వావురుమన్న పిశాచివేళ-ము
ప్పదివదికోట్ల భారత తపస్సముదాయము భస్మరాశియై
చిదికిన ఘోర దుర్దినమిపి వచియింపగ జిహ్వలాడునే!"

అని బిగ్గరగా విలపించారు శ్రీజాషువా.[16] "ఒక త్రుటిలో ప్రపంచమట్టిట్టాగిన-దొక్కొక యశ్రువర్షిణా/ప్రకృతి ద్రవించి యేడ్చె నది" అని శ్రీ ఏటుకూరి వేంకటనర్సయ్య మహాత్ముని మరణానికి ప్రకృతి విలపించినదన్నారు.[17] "ఎంతబలిగోరె స్వాతంత్ర్య కాంత!" అని శ్రీ పువ్వాడ శేషగిరిరావు నివ్వెరపోయారు.[18]

"రూపుమాసినదీ వొక్కరుడవె గాదు/భారతీయుల మానవత్వమె
మహాత్మ !
తుపాకిగుండు హతిచే హారామ! హారామ ! యంచీవంచుంగయి
మోడ్చి
కూలఁబడ దండ్రీ ! నేల క్రుంగెనో, దివం బావట్లార్చెను,"

అని శ్రీ వేలూరి శివరామశాస్త్రి భారతజాతి అర్తరావాన్ని ప్రతిధ్వనించారు. [19]

"ఉయ్యాలలో నూగుచున్న ముద్దుబిడ్డలేచి కెవ్వున కేకవై చెనేమి :
పాకలోలేగకు పాలిచ్చు గోవు అంబాయంచు గొంతెత్తి
యఱచెనేమి :
జలజల ప్రవహించు జమున నిస్తబ్ధయై నిలిచి కన్నుల నీరు
నింపునేమి :
చకచక పొలము దున్నుకొని పోయెడిరైతు నాగలిముందుకు
సాగదేమి

కోటలో ఆరుగంటలు కొట్టబోవు
వానిహస్తాలు గడగడ వడకు నేమి
ఏ మహాత్ముని గుండెపై నెక్కిచనెనొ
కాల పురుషుని రథ రథాంగములు నేడు"

అని 'కరుణశ్రీ' గాంధీజీ మరణించిన తరుణంలో ప్రకృతివైపరీత్యాలను కవితాత్మకంగా వెల్వరించారు. [20] "ఒక్కపరిస్ కబళించె మానవాభ్యుదయమునెల్ల - ఇంక ధరతోర్వర కాత్మశమించునా ప్రభూ !" అని శ్రీధనకుధరం మహాత్ముని మరణంవలన గాయపడిన ఎదతో పలవరించారు -

16 నుండి 20 వరకు - అహింసాజ్యోతి; కవితా సంకలనం; ప్రభు అండ్ కంపెని, గుంటూరు.

గాంధీజీ హత్యావార్తను శ్రీ దాశరథి నిజామాబాదు జైల్లో వుండగా విన్నారు. గాంధీజీ జననము, మరణము కూడ కాలగమనంలో చిత్రమైనవిగా ఆయన తలచారు.

> "కాలసవిత్రి వందల యుగమ్ముల భీషణ గర్భవేదన
> జ్వాలలలో సుఖప్రసవ సౌఖ్యము నందెను నీవు భూమిపై
> కాలిడగానె; భారత జగజ్జననీ నయనాల నేత్రులో
> జాలయిపారె నీవు దివిషత్పుర మార్గములందు కాలిడన్".

గాంధీజీ పెంచి పోషించిన మత సహనమే ఆయన ప్రాణాలు తీసినదని వాపోయారు.

'మహాత్ముడిక మనకు లేడు' అని తెలిసినపుడు శ్రీ కుందుర్తి ఆంజనేయులు "అన్న చావు విని తమ్ములు/నిశ్చేష్టప్రతిమలైరి/తండ్రి మరణవార్తను విని/తనయులు కన్నులు వాల్చిరి/పితామహుడి మృతిని విని మా/పసిపాపలు కెవ్వుమనిరి" అని అందరికీ ఆప్తబంధువైన మహాత్ముని మరణానికి శోకించి "మహాత్మునికి శాంతి!"ని కోరారు.

బాపూజీ దివ్యజీవనమేగాక మరణం కూడ కవులకు కావ్యవస్తువైంది. ఆయన జీవితంలో వీర, శాంత, అద్భుత, కరుణ రసాలు కవులకు ప్రేరణ అయ్యాయి. ఇప్పటికీ కవులకు గాంధీజీ సరికొత్త కావ్యవస్తువే.



మూడవ అధ్యాయం

# తెలంగాణ పోరాటం - కవుల హృదయావేదన

తెలంగాణలో కుతుబ్షాహి సుల్తానుల కాలంలో ఆంధ్రభాషకు కవిత్వానికి ఆదరం లభించింది. సారంగుతమ్మయ వైజయంతీ విలాసము, పొన్నిగంటి తెలగన యయాతి చరిత్ర, మల్లారెడ్డి షట్చక్రవర్తి చరిత్ర, అద్దంకి గంగాధరకవి 'తపతీసంవరణోపాఖ్యానము' ముస్లిము ప్రభువుల ఆదరణలో వెలువడినవే. కాని ఆ తర్వాత వచ్చిన అసఫ్జాహీల పరిపాలనలో దాదాపు రెండువందల సంవత్సరాలపాటు తెలుగు దేశంలో కోటిమంది ప్రజలకు మాతృభాషలో రచన చేయటానికి వీలు కలుగలేదు. పాఠశాలల్లో ఉర్దూ, అరబ్బీ, ఫారసీ భాషలనే నేర్చుకోవలసి వచ్చింది. తెలుగువారు తమ నేలమీద తామే పరాయివారైనారు. గద్వాల, వనపర్తి, అమరచింత మొదలైన సంస్థానాల అధిపతులు తిరుపతి వేంకట కవులవంటి కొందరు కవులను సత్కరించినా, మొత్తంమీద సాహిత్య జ్యోతి మినుకు మినుకుమంటూ చమురు చాలని దీపంలాగ వెలిగింది.[1]

ఈ శతాబ్ది ప్రారంభంలో (1901) శ్రీ కొమర్రాజు వేంకట లక్ష్మణరావు, మునగాల రాజా, రావిచెట్టు రంగారావుగారల ప్రోద్బలంతో 'శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయము'ను స్థాపించారు. వారే హనుమకొండలో రాజనరేంద్ర భాషానిలయాన్నికూడ స్థాపించారు. ఈ గ్రంథాలయాల స్థాపనతో కొందరు ప్రజలు విద్యావంతులై సమాజ పరిస్థితులను అవగాహన చేసుకున్నారు. తెలంగాణ ఆర్థికంగా, వైజ్ఞానికంగా

1. తెలంగాణలో జాతీయోద్యమాలు - దేవులపల్లి రామానుజరావు - ద్వితీయ ముద్రణ - జూన్ 1967.

చాల వెనుకబడి వుంది. ఎంత వెనుకబడివుందో తెలుసుకోవాలంటే "ఆ కాలంలో బియ్యం గిర్నీలులేవు. గానుగతో తీసిన నూనె వాడేవారు. కూలీలు జొన్నలు, సజ్జలు వాడేవారు. పండుగల సమయాననో లేక వైద్యుడు పథ్యం చెపితేనో శర్కర వాడేవారు. కిరోసిన్ గ్రామాలకు రాలేదు. గ్రామవాసులు గానుగలో తీసిన ఆముదాన్ని దీపాలకు వాడే వారు. కూరగాయలు అమ్మే ఆచారంలేదు. ఎవరూ కొనేవారు కారు. టొమాటో లుండేవికావు. తింటే జలుబు చేస్తుందని వాటిని వాడేవారు కారు" అని శ్రీ మందుముల నరసింగరావుగారు "ఏభై సంవత్సరాల హైదరాబాదు" గ్రంథంలో పేర్కొన్న అంశాలనుబట్టి తెలుసుకోవచ్చు.

కొమర్రాజువారి 'విజ్ఞానచంద్రికా గ్రంథ మండలి' వెలుగుతో క్రమంగా చీకటి చెదరిపోయింది. ఈ గ్రంథమాల వరవడితో గోల కొండ, కిన్నెర, కాకతీయ, కృషిప్రచారిణి, విజ్ఞానప్రచారిణి మొదలైన గ్రంథమాలలు, చౌకధరల్లో సామాన్యులకు అందుబాటులో వుండే పుస్త కాలను ప్రచురించిన "దేశోద్ధారక, ఆంధ్రకేసరి, అణా" గ్రంథమాలలు సాహిత్యవ్యాప్తికి దోహదం చేశాయి. సాధనసమితి, సాహితీమేఖల వంటి సాహిత్యసంస్థలు రచయితల్లో సృజనాత్మకశక్తి బహిర్గతం కావ టానికి తోడ్పడ్డాయి. క్రమంగా పత్రికలు స్థాపించబడ్డాయి. తెలుగులో పత్రిక వెలువరించటం రాజద్రోహంగా పరిపాలకులు భావిస్తుండేవారు. సురవరం ప్రతాపరెడ్డిగారి సంపాదకత్వంలో వచ్చిన గోలకొండ పత్రిక, నీలగిరి, తెలుగు పత్రికలు కొంత సాహిత్య చైతన్యాన్ని కలిగించాయి. తర్వాత కాలంలో "సుజాత, తెలుగుతల్లి, విభూతి, శోభ" మొదలైన పత్రికలు తెలంగాణ రచయితలకు పట్టుగొమ్మలైనాయి.

శ్రీయుతులు మాడపాటి హనుమంతరావు, ఆదిరాజు వీరభద్ర రావు, సురవరం ప్రతాపరెడ్డిగారల వంటి విద్వాంసులు తెలుగు భాషోద్ధ రణకు నిర్విరామకృషి చేశారు.

## ఆంధ్రోద్యమము

నిజాం పరగణాలో అత్యధిక సంఖ్యాకులైన ప్రజలు ఆంధ్రులే అయినా ఆంధ్రభాషకు గౌరవం లేకపోయిందానాడు. 1921 లో హైదరా

బాదులో సంఘ సంస్కరణ సభలు మహారాష్ట్ర విద్వాంసుడైన కార్వే అధ్యక్షతన జరిగాయి. ఆ సభలో ఒక న్యాయవాది తన ఉపన్యాసాన్ని తెలుగులో ప్రారంభించగానే సభ్యులు ఎగతాళి చేశారు. ఆ సంఘటన ఆంధ్ర మేధావులలో కదలికతెచ్చింది. ఆనాడే బూర్గుల రామకృష్ణారావు, మాడపాటి హనుమంతరావు, ఆదిరాజు వీరభద్రరావు మొదలైన పెద్దలు పూనుకొని ఆంధ్రసంఘాన్ని స్థాపించాలనుకొన్నారు. 1922 లో 'ఆంధ్ర జనసంఘము'ను స్థాపించారు. అది కేవలం గ్రంథాలయములను స్థాపించ టంవంటి సాంస్కృతిక సంఘంగానే పనిచేసింది.

నానాటికీ నిజాం పరిపాలన దుర్భరమైంది. జాగీర్దారుల, భూస్వాముల క్రౌర్యమూ, అమీన్, పటేల్, పట్వారీల పీడనా ప్రజలకు భరింపరానివైనాయి. జాగీర్దారుల మందిరాలు దివ్యహర్మ్యాలై వెలయగా ప్రజలు నీటి ఎద్దడికి గురై, త్రాగటానికి మంచినీరు కూడ దొరకని దుస్థితికి గురయ్యారు. సేద్యానికి కాలువలు, చెరువులు, బావులు తవ్వించటం పోయి జాగీర్దార్లు పేదరైతులు ఎముకల్ని పిండివేసి, పండించిన పంటలో చాల భాగాన్ని శిస్తుకింద జమకట్టుకోసాగారు. నిస్సహాయులైన ప్రజలకు సాయం చేయటానికి 1930 లో 'ఆంధ్రమహాసభ' స్థాపించబడింది. క్రమంగా సంగం (ఆంధ్ర మహాసభకు తెలంగాణ ప్రజలు పెట్టుకున్న పేరుఇది) తెలంగాణ ప్రజల జీవితంలో ఒక భాగమైంది. ఆంధ్ర మహాసభ సభ్యులు చూపిన సాహసం, చేసిన త్యాగాలు ఎంత వర్ణించినా తనివి తీరనివి.

ఆనాడు తెలంగాణలో 1951 లెక్కల ప్రకారం "తెలుగు మాట్లాడే ప్రజల సంఖ్య 90 లక్షలు. మరాఠీ మాట్లాడేవారి సంఖ్య దాదాపు 45 లక్షలు. కన్నడం మాట్లాడేవారు 20 లక్షలు. ఉర్దూ మాట్లాడేవారు 21 లక్షలు."[2] హైదరాబాదు నగరం మినహా సంస్థానంలోని ఏ భాగంలోనూ ఉరుదూ మాట్లాడే ప్రజలు జనాభాలో అత్యధిక సంఖ్యాకులుగా లేక

2. **వీర తెలంగాణా విప్లవ పోరాటాలు – గుణపాఠాలు; పుచ్చలపల్లి సుందరయ్య – 1973.**

పోయినా, నైజాం రాజు ముస్లిం కావటంచేత ఉరుదూభాషను రాజభాషగా చేశారు, అన్ని స్థాయిల్లోను కోర్టు భాషగా, పరిపాలనా భాషగా చేశారు. ప్రాథమిక దశనుండి బోధనాభాష కూడ అదే. అందువల్ల తెలుగుభాష, సంస్కృతి పూర్తిగా నిరాదరణకు గురియైన సంగతి వేరుగా చెప్పనక్కర లేదు.

నిజాం పాలనలో భూస్వాములు కిరాతకంగా రైతులనుండి పన్నులు వసూలు చేసేవారు, చాకలి, మంగలి, కమ్మరి, కుమ్మరి మొదలైన వివిధ వృత్తులవారి చేత అన్యాయంగా వెట్టిచాకిరీ చేయించుకునేవారు. పన్నులు చెల్లించలేని రైతుల భూములను స్వాధీనం చేసుకోవటంతో భూస్వాములవద్ద భూమి అపరిమితమైపోయింది. జన్నారెడ్డి ప్రతాపరెడ్డి కుటుంబానికి లక్షన్నర ఎకరాల భూమి వుండేదంటే యిక భూస్వాముల అధికారమెంతో వూహించుకోవచ్చు. వెట్టిచాకిరీతో కృశించి పోయిన ప్రజలు ''బాంచను - నీ కాల్మొక్కుతా దొరా'' అని మాట మాటకు అంటూ భూస్వాముల పాదాల దగ్గర నికృష్టంగా బ్రతుకుతూండేవారు. అక్కడి ప్రజాజీవితాన్ని పలనాటి సీమనుండి వెళ్ళి తెలంగాణలో స్థిరపడిన శ్రీతిరునగరి సీతారామాంజనేయులు అనే ప్రజాకవి ''ప్రజలంతా గ్రామంలోని నలుగురైదుగురు పెత్తందార్లకు బానిసలై బ్రతుకుతున్నారు. దారుణమైన వెట్టిచాకిరి, అంతకన్నా దారుణమైన అధికార్ల జులుం, నిత్యం తన్నులు, తిట్లు, కచ్చేరిచావిళ్ళవద్ద వంగబెట్టి మూపున బండలు, బండలేకాదు రైతులమూపున గ్రామవెట్టిని ఎక్కించి తొక్కించేవారు. పండిన పంటనంతా 'లెవీ'లనీ 'తావాను'లనీ, 'నాగూ'లనీ, 'నజరానా'లనీ దోచుకునేవారు. బూడిదపట్టీ, పెండ్లిపట్టీ, సమర్తపట్టీలు సరేసరి. అది మధ్యయుగాలనాటి భూస్వామ్య దోపిడీ. బొడ్డుపల్లెను కోల్పోయి వడ్డెరాజులచేతిలో శ్రీనాథకవి కూడా అలాంటి యమదండనలను చవి చూసి వుండడు. అవి ఇక్కడ నిత్యకృత్యాలు ''[2-A] అని వివరించారు.

2-A. 'తెలంగాణా పోరాట సాహిత్యం' - తెలంగాణ పోరాట పాటలు - రెండవ సంపుటి పీఠిక; కె.వి. రమణారెడ్డి; విప్లవ రచయితల సంఘం ప్రచురణ, 1977.

ఆంధ్ర మహాసభ ఏర్పడిన జాతీయోద్యమం వృద్ధిచెంది దేశ ముఖుల జాగీర్దార్ల, పటేల్, పట్వారీల దౌర్జన్యాల్ని దోపిడీని ఎదిరించే దశకు ప్రజలు చేరుకున్నారు. ఆంధ్ర మహాసభ మొత్తం పదమూడు మహాసభలను జరుపుకుంది. ఒక విధంగా చూస్తే ఆంధ్ర మహాసభ చరిత్ర తెలంగాణలో జాతి పునరుజ్జీవన చరిత్ర అని చెప్పవచ్చు.

విసునూరి దేశముఖ్ రామచంద్రారెడ్డి దౌర్జన్యాలను ప్రతిఘటించి ప్రజలు ఐకమత్యంతో నిలిచినప్పుడు, దేశముఖ్ దౌర్జన్యానికి తలపడి తన గూండాలచేత ప్రజల నాయకుడైన దొడ్డి కొమరయ్యను చంపించాడు. ఈ సంఘటన 1946 జులై 4 వ తేదీన జరిగింది. ఆ గ్రామ ప్రజలంతా ఏకమై దేశముఖ్‌ను, అతని కొడుకును, గుండాలను గ్రామంనుండి తరిమి కొట్టారు. కొమరయ్య మరణవార్తను పత్రికల్లో చదివి తెలంగాణ వెలుపలనున్న ప్రజలు సంస్థానంలో జరుగుతున్న దౌర్జన్యాలను గురించి కొద్దిగా తెలుసుకున్నారు. తెలంగాణలో సాయుధ పోరాటం కొమరయ్య మరణంతో ఆరంభమైందని చెప్పవచ్చు. 1951 అక్టోబరు 21 న భారత కమ్యూనిస్టు పార్టీ సాయుధ పోరాటాన్ని విరమించింది. ఈ అయిదేళ్ళ కాలం ఆంధ్ర చరిత్రలో ప్రజాచైతన్యం ఉవ్వెత్తుగా పొంగి ప్రవహించిన కాలం. సాహిత్య చరిత్రలో యీ కాలాన్ని ప్రజాసాహిత్యానికి బంగారు రోజులుగా చెప్పుకోవాలి.

'ఆజాద్ హైదరాబాద్' ముస్లిం సామ్రాజ్యమని, అసఫ్‌జాహీ పాలనలో ప్రతి ముస్లిమూ ఒక పాలకుడేనని, ఈ ప్రభుత్వాన్ని కాపాడా లనేది దేవుని ఆజ్ఞయని, అందువల్ల రజాకార్ సైన్యంలోచేరి హిందు వుల నెదుర్కొనటం ప్రతి ముస్లిము యొక్క పవిత్ర కర్తవ్యమని పేర్కొంటూ 'ఇత్తెహాద్-ఉల్-ముస్లిమీన్' నాయకుడు కాశిం రజ్వీ నాయకత్వాన రజాకార్ సైన్యం ఏర్పాటు చేయబడింది.''[4]

తెలంగాణ - నా అనుభవాలు: జ్ఞాపకాలు'
కమ్యూనిస్టు పార్టీ ప్రచురణ - 1972.

4. వీర తెలంగాణ విప్లవ పోరాటాలు - గుణపాఠాలు; పుచ్చలపల్లి సుంద రయ్య - 1973.

## మూడవ అధ్యాయం

రజాకార్లు తమ నెదిరించినవారిని చిత్రహింసలకు గురిచేయ సాగారు. రజాకార్లకు నిజాం ధనము, ఆయుధాలూ పోలీసు సహాయమూ అన్నీ లభిస్తూండేవి. కాని ప్రజలు సమైక్యంగా నిలిచి హిందూ ముస్లిము భేదాలు లేకుండా రజాకార్లను ఎదిరించి పోరాడారు. వారికి నాయకత్వం వహించింది ఆంధ్ర మహాసభ. గెరిల్లా పోరాట దళాలను నిర్మించి, ప్రజల్ని సాయుధుల్నిచేసి, పోరాటాన్ని సాగించటంలో ప్రతి గ్రామమూ ఒక దుర్భేద్యమైన దుర్గమైంది. ఆనాటి పోరాటంలో కవులనుండి, కళా కారులనుండి సామాన్య కార్యకర్తలనుండి, ముఖ్యంగా ఆవేశపరవశులైన వీరులనుండి ఎంతో సాహిత్యం వెలువడింది. 30 సంవత్సరాల తర్వాత ఆ సాహిత్యాన్ని పరిశీలించి చూస్తే నేటికీ అది ఉత్తమ సాహిత్యమని పిస్తుంది.

'గాథ కవిత్వానికి పర్యాయపదం'. గాదలో పోరాటంలో ప్రజలు "ఆందోళనమా ఊపిరి, తిరుగుబాటు మా వేదాంత"మని నమ్మి తమ కష్టాలను పాటల్లో, కవితల్లో వివిధ సాహితీ ప్రక్రియల్లో వెలువరిం చారు. వర్గశత్రువును శపిస్తూ దూసుకువచ్చిన ఈటెల్లాంటి పాటల్ని పాడుకున్నారు. వాటితో వెల్లిపోయినా, సాహిత్య విలువలకు ఏమీ కొదవ లేదు. వాడీ, వేడీ వాటికి మరింత విలువ చేకూరుస్తున్నాయి. జీవిత విమర్శ కవిత అయితే ఆనాటి పాటలు జీవితపు బాధల్ని చీల్చుకొని వీరావేశంతో వెలువడినవి.

తెలంగాణ పోరాటానికి సంబంధించి రెండు రకాల సాహిత్యం వచ్చింది. ఒకటి పోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొని, బాధల్ని చవిచూచి మహోద్రేకంతో రచించిన సాహిత్యం. రెండవది తెలంగాణకు వెలుపల వుండి పోరాటాన్ని గురించి తెలుసుకొని వారితో ఏకత్వాన్ని ప్రకటిస్తూ (త్వమేవాఽహమ్) వారి కష్టాలకు కావ్యరూపమిచ్చింది.

### తెలంగాణ పోరాటం పాటలు

ముందుగా పోరాటం మధ్యలో నిలిచిన వీరులు వెలువరించిన తెలంగాణ పోరాటం పాటలు పరిశీలిద్దాం. తెలంగాణ ప్రజలు అమరజీవి

కొమరయ్యపై పాటలు పాడుకుని, ఆ వీరుడు చూపిన మార్గంలో పయ నించారు. "అమరజీవి నీవు కొమురయ్యా! అందుకో జోహార్లు కొము రయ్యా! లంచగొండుల అండదేశముఖులకు నుండ/న్యాయరక్షణ కొరకు నడుము బిగించితివి / గుండాల తుపాకిగుండ్ల కెదురుగపోరి / బలియైన వీరుల్లో కొమురయ్యా/మొదటి తెలుగోడవోయ్ కొమురయ్యా! / నీవె మాకెల్లపుడు కొమురయ్యా!/మార్గదర్శిగవుండు కొమురయ్యా!.... నీ పేరు నిలుపకనె కొమురయ్యా/నిదురైన మేంబోము కొమురయ్యా!" అన్న పాట తెలంగాణ పోరాటంలో మార్మోగింది.

పోరాట నాయకత్వం సోవియట్ రష్యా మార్గాన్ని అనుసరించింది. చైనా విప్లవం అప్పటికింకా పూర్తిగాకపోయినా చైనా నాయకత్వం కూడ ప్రజలకు ప్రేరణ అయింది. "రష్యవుంది/చైనవుంది, రైతుకూలి రాజ్యముంది/రక్తమొలికిన అమరవీరుల/రైఫిలుంది, తుపాకి వుంది/కష్ట జీవుల సంగముంది/కల్సిపోరుతె, రాజ్యముంది" అనే పాట రైతు, కూలీ లకు వ్యవసాయ విప్లవంపై నమ్మకం, రష్యా చైనాల మార్గంపై గురి వున్నట్లు తెలుపుతుంది.

"కాలమ్మె మారింది / కనిపెట్టి తిరగండ్రో / కొవ్వెక్కిన గొట్టె పోతు/కుండకు తల గుద్దినట్టు/సంఘపోల్ల తెరువొస్తె/సావు పిచ్చి కుక్క సావు" అని ఆంధ్ర మహాసభ శక్తిని తెలుసుకుని మెలగమని శత్రువు లను హెచ్చరించారు. "తెలంగాణమ్మున గడ్డిపోచయు సంధించెనో కృపాణమ్ము" అని శ్రీ దాశరథి చెప్పినట్టు ప్రజాచైతన్యం వెల్లువై తోచింది.

భూస్వామి మీద పాటలో "కూలీల దోచుకొని భూసామి/కలి సొచ్చెనంటాడురా సామి/మనజొన్న కోతని మన జొన్న యేతని/వూరించి వుబ్బించి వూడిగము చేయించి/తాలు తరుగిస్తాడు భూసామి/వేలు వెను కేస్తాడురా సామి/పా తప్పుకిందని, పదుగురితొపాటని/పని వత్తిడిలో తన పబ్బాన్ని గడుపుకొని/పేచీలు పెడుతాడు భూసామి" అని భూ స్వాముల దోపిడీ స్వరూపాన్ని ఒక అజ్ఞాతకవి చక్కగా తెలియజెప్పాడు.

"ఏరన్న రాకముందె ఏరువాక వచ్చేరన్నా
యవరింట్ల వుందువన్న బువలేని జీతగాడా"

అని 'పోరాడు జీతగాడా' పాటలో అన్ని ఋతువుల్లోనూ కష్ట పడి పండించిన జీతగాడు -

"పండిన కూరగాయ పంటిన కొరకడాయె
కమ్మని కందిపప్పు, కనరాని నేతిబొట్టు
ఉప్పాకె నీమొగాన, గాపొప్పరి జీతగాడ"

అని వ్యంగ్యంగా జీతగాడి దుస్థితిని ఎత్తిపొడవటం ఆనాటి పాలేర్ల దుస్థితికి యధార్ధ చిత్రణం.

"ఈ చేలు మనవెనన్న - పోరాడు జీతగాడా
కాజేసి దొరలుమిన్న - పోరాడు జీతగాడా
నీ సంఘశక్తితోడ - పోరాడు జీతగాడా"

అని పోరాటానికి పురికొల్పిన గీతాలెన్నో వచ్చాయి.

పోరాటపు పాటల్లో ఐన్నా రెడ్డి ప్రతాపరెడ్డి పాట మిక్కిలి ప్రసిద్ధి చెందింది.

"బండెనుక బండికట్టి/పదహారు బండ్లుకట్టి/ఏ బండ్ల పోతవు
కొడకో/నా కొడక ప్రతాపరెడ్డీ!

దొడ్లన్నీ కాలిపోయె/ఎడ్లన్నీ ఎల్లిపాయె/ఇకనైన లజ్జలేదా
కొడకో/నా కొడకా ప్రతాపరెడ్డీ!

గొల్లోల్ల గొర్లువాడిసె/రైతోళ్ళ బియ్యం వాడిసె/ఇకనేమి
తింటవు కొడకో/నా కొడకా ప్రతాపరెడ్డీ!

పెదపందీ సూరిగాడు/సినపంది మల్లిగాడు/మీ ఇద్దర్ని
తింటం కొడకో/ నా ప్రతాపరెడ్డీ!

గొడ్డళ్లు నూరుకోని/గొంగట్లో బెట్టుకోని/కత్తుల్లో నూరుకొని
కడుపుల్లో దోపుకోని/ఏ బండ్ల పోతవు కొడకో
నా కొడకా ప్రతాపరెడ్డీ

దొల్లీన రక్తమంతా/దొల్లల్లో పోసుకోని/చిల్లీన రక్తమంతా
సీసాల్లో పోసుకొని/ఏ బండ్ల పోతవుకోడకో/నా కొడక
ప్రతాపరెడ్డీ –

ప్రజల ధాటికాగలేక దేశముఖ్ పల్లెనుండి పలాయనం చిత్తగిస్తున్నప్పుడు ప్రజలు మహోత్సాహంతో పాడుకొన్న పాట ఇది. ఏ అజ్ఞాత కవో అప్పటికప్పుడు ఆశువుగా కల్పించి పాడి ప్రజలను పురికొల్పి పాడించిన పాట ఇది. 'నా కొడకా' అనే తిట్టూ ప్రజల భాషలో-వాళ్ళకు ఊతపదాలైన బూతుమాటల్లో వుండటం సహజమే,

నిజాం నవాబును తిడుతూవచ్చిన మరొక పాట కూడ బాగా ప్రసిద్ధి పొందింది.

"నైజాము సరకరోడ/నాజీల మించినోడ/యమబాధలు
పెడితివి కొడుకో/నైజాము సరకరోడ

పండీన పంటనంత/తిండికైన ఉంచకుండ/తీసుకెళ్ళినావు
కొడుకో/నైజాము సరకరోడ .

చుట్టూ సూర్యపేట/నట్టానడుమ నల్లగొండ/అవతాల
గోలకొండ/గోలకొండ ఖిల్లకింద/నీగోరి కడతాం కొడకో/
నైజాము సరకరోడ !—

ఈ పాట ఒక్కటే చాలు, నిజాము ప్రభువుమీద ప్రజలకు ఎటువంటి వ్యతిరేక భావముదోండే తెలియజెయ్యటానికి ! ఇక ఆ నిరంకుశ పాలన ఎటువంటిదో ఊహించుకోవచ్చు. శ్రీ కుందుర్తి అన్నట్లు "అది తెలంగాణ కాదు, హేలంగాణ."

పీడిత ప్రజల విముక్తికి, రజాకార్ల దుర్మార్గాలకు స్వస్తి చెప్ప టానికి తెలంగాణ సంస్థానాన్ని ఇండియన్ యూనియన్‌లో అంతర్భా గంగా మార్చటానికి స్వతంత్ర భారత ప్రభుత్వం, జవహర్‌లాల్ నెహ్రూ, వల్లభాయ్ పటేల్‌గార్ల నాయకత్వంలో హైదరాబాదుపై 'పోలీస్ యాక్షన్' చలపెట్టారు. జనరల్ చౌధురీ ఆధిపత్యంలో 1948 సెప్టెంబరు 13 వ తేదీన భారతసైన్యం హైదరాబాదులో ప్రవేశించింది. నిజాం నవాబు సులభంగానే లొంగిపోయాడు. 1948 సెప్టెంబరు 18 వ తేదీన తెలంగాణ ఇండియన్ యూనియన్‌లో భాగమైంది.

ప్రజలు యూనియన్ సైన్యాలకు స్వాగతం చెప్పారు. తాము వెట్టి చాకిరినుండి, బానిసత్వం నుండి, భూస్వాముల దౌర్జన్యాల నుండి స్వతంత్రమౌతున్నామని తలచి హర్షించారు. కాని జరిగింది మరొకటి.

నైజాం భారత ప్రభుత్వానికి లొంగిపోయినప్పుడు భారతప్రభుత్వం అతనికి ప్రత్యేక సౌకర్యాలను కల్పించింది. నవాబుకు 'రాజ ప్రముఖ్' పదవి యిచ్చి గౌరవించింది. అంతేగాక జాగీర్దార్లను, భూస్వాములను గ్రామాలకు పంపించి పాత అధికారాలను పునరుద్ధరించటానికి పోలీసు బలగాన్ని పంపించింది. దీనితో ప్రజల ఆగ్రహావేశాలు తిరిగి విజృం భించాయి. తాము విరమించిన పోరాటాన్ని విరమించక కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో తిరిగి ఆయుధాలను చేపట్టి యూనియన్ సైన్యంపై పోరాటాన్ని సలిపారు.

ఖైదీగావున్న ఒక రైతుబిడ్డ జైలుగోడమీద ఆనాటి తమ దుస్థి తిని యథాతథంగా పాట రూపంలో రాశాడు.

''ఖైదీలం మనమంతా ఖైదీలం
స్వతంత్ర భారత ప్రభుత్వ ఖైదీలం ''ఖైదీలం

నిరుపేదలు బీదలు రైతులకై
నిల్చిన పాపాలకే మనమంతా ''ఖై దీలం

మలమలమాడే ప్రజలను దోచే
దోపిడిగాంధ్ర నెదిర్చినందుకు "ఖైదీలం
నాజీ నిజాం నరకాసురుడితో
రాజీబేరం వలదన్నందుకు "ఖైదీలం

ఈ పాట ప్రజాహృదయంలో చెలరేగిన ఘర్షణకు చక్కని

భారతజాతి ప్రియతమ నాయకులు నెహ్రూ, పటేల్‌గారలు నిజాముకు అతని తాబేదార్లకు అనుకూలంగా నిలవటంతో తెలంగాణ ప్రజలు వారిని కూడ ద్వేషించారు. వారిని ఆక్షేపించే పాటలు గూడ వచ్చాయి.

తెలంగాణ పోరాటంలో ప్రజల్ని విద్యావంతుల్ని చెయ్యటానికి పాటలేగాక వీధి భాగవతాలు, గొల్లసుద్దులు, ఉయ్యాలపాటలు, చుట్టు కామడు పాటలు యింకా అనేక జానపద కళారూపాలు కూడ తోడ్ప డ్డాయి. ప్రజల హృదయాల్లోని వెతలను, సెగలను, పొగలను నులి వెచ్చగా అందించే తెలంగాణ పోరాటం పాటలు యీనాటికీ వేలకొద్దీ ప్రజల నాల్కలపై నిలిచి వున్నాయి. ఆధునికాంధ్ర కవిత్వంలో ప్రజా సాహిత్యానికున్న శక్తికి యీ పోరాటం పాటలు చక్కని నిదర్శనాలు.

కన్నతల్లివంటి భూమిని రక్షించుకోవటానికీ, దేశముఖ్, జాగీ ర్దార్ల భూస్వాముల వెట్టిచాకిరీ నుండి విముక్తి పొందటానికీ ప్రజలు సాగించిన పోరాటంలో విద్యనేర్వని నిరక్షరాస్యులు కూడ కవులయ్యారు. తెలుగు కవుల హృదయావేదనలను, కవులుగా వారు ప్రతిస్పందించిన విధాన్ని తెలుసుకుందాం. ముందుగా వారిలో పోరాటంతో ప్రత్యక్ష పరిచయమున్న కవుల రచనలను చూద్దాం.

5. ఈ అధ్యాయంలో ఉదాహరించిన పాటలన్నీ 'తెలంగాణ పోరాట పాటలు' విప్లవ రచయితల సంఘం ప్రచురించిన రెండు సంపుటాలనుండి స్వీకరిం చాను వారికి నా కృతజ్ఞత

## కైతతో ప్రజలను మేల్కొలిపిన కాళోజీ

తెలంగాణ పోరాటం నాటినుండి నేటివరకు ప్రజల తలలో నాలుకై ప్రజాకవిగా గణుతికెక్కినవారు శ్రీ కాళోజీ నారాయణరావు. "కాళోజీ అంటే కన్నీరు." ప్రజలందరూ ఆయనకు ఆప్తులే. ఏవొక్కరికి కష్టం వచ్చినా ఆర్ద్రమైన మనస్సుతో, జాలువారే కన్నీటితో ఆర్తుల సమక్షంలో నిలిచే దయామూర్తి ఆయన. అన్యాయం ఏ రూపంలో వున్నా దాన్ని ప్రతిఘటించటానికి వెనుదీయని కవి. శత్రువు ఎంతబలవంతుడైనా ఎదిరించటానికి ఆయనకున్న సహాయుడం నైతికబలం. స్వార్థ త్యాగానికి ఆయన పెట్టింది పేరు.

ఆయన కవిత్వంలో వ్యంగ్యం సామాన్య పాఠకులకు, చదువు రాని వారికి గూడ, ఒక్కసారి వింటే అర్థమయ్యే రీతిలో వుంటుంది. శిల్పం లేదనిపించే విశిష్టమైన శిల్పం ఆయన కవిత్వంలో వున్నది. ఆయన మాటలు, ఉపన్యాసాలు అన్నీ కవితామయమే. ఆయన కవిత్వం విని మనసారా నవ్వని శ్రోతలుండరు. ఆ నవ్వువెనక చేదునిజం తలపుకు వచ్చి గుండెల్ని పట్టుకుంటుంది. తెలంగాణ పోరాటంలో ఆయన నిజాము నెదిరించి పోరాడారు. ప్రజల్ని రాజకీయంగా చైతన్యవంతుల్ని చెయ్యటానికి ఆయన విస్తృతంగా తెలంగాణమంతా పర్యటించారు. తెలంగాణలో రహదారులన్న ఆయనకు అరచేతిలో రేఖలవంటివి.

ఆంధ్ర మహాసభలు తెలంగాణను జాగృతం చేస్తున్న శుభసమయంలో ముగ్గురు నారాయణరావులు రంగంమీదికి వచ్చారు. వారు శ్రీకాళోజీ నారాయణరావు, శ్రీ కొమరగిరి నారాయణరావు, శ్రీకోదాటి నారాయణరావు. వీరిలో కొమరగిరి, కోదాటి గారలు గాంధేయవాదులుగా, గ్రంథాలయోద్యమ నాయకులుగా ప్రసిద్ధులు. కాళోజీ ప్రజాకవిగా ప్రసిద్ధులు.

నిజాం ప్రభుత్వం బలం పుంజుకుంటున్న ప్రజోద్యమాన్ని గమనించి, ప్రజల కళ్ళనీళ్ళు తుడిచే బూటకపు సంస్కరణలను (ఇస్లాహాత్) ప్రవేశపెట్టింది. ఆ సంస్కరణల్లో మోసాన్ని వెల్లడిస్తూ-

"నేటుగాను రెండు కండ్ల/మేటి మాటలెందుకు ?
కాదు అనుచు చాటుగాను/కండ్లు గీటుటెందుకు ?
పంక్తిభోజనము పెట్టి/పక్షపాతమెందులకు ?
ఉప్పుసరికి సరివేసి వండిన/పప్పుభోజనం బెందులకు ?"

శ్రీ కాళోజీ పలికినమాటలు పాలకుల మోసాన్ని బట్టబయలు చేశాయి. ఆయన ఉపయోగించిన ఉపమానాలు ఆహ్లాదాన్ని కలిగించాయి. వాస్తవస్థితిని గుర్తించేలాగ చేశాయి. ఆయన ఉపయోగించే ఉపమానాలన్నీ సామాన్యులకు సైతం నిత్యజీవితంలో ఎదురయ్యేవే. ఆయనను వేమనవంటి కవిగా ప్రజలు ఆదరించారు.

"కైతచేత మేల్కొల్పకున్న
కాళోజీ కాయము చాలింక"- అని దృఢమైన ప్రతిజ్ఞచేసిన కవి కాళోజీ. 'నా గొడవ' అని పేరుపెట్టి (ఆయన కావ్యసంపుటాలన్నిటికీ అదే పేరు) కోటిమంది ప్రజల గొడవను, బాధలను వ్యక్తం చేశారు. ఐదుకోట్ల మంది ప్రజలకు ఆయన ఆప్తులయ్యారు.

రజాకార్లు విజృంభించినపుడు కాళోజీ వారి నెదిరించి, ప్రజలను ఉత్తేజపరుస్తూ-

"నవయుగంబున నాజీవృత్తుల/నగ్ననృత్య మింకెన్నాళ్లు ?
పోలీసు అండను దౌర్జన్యశక్తులు/పోషణ బొందేదెన్నాళ్లు ?"

అని గర్జించారు. ఈ గర్జన తెలంగాణమంతా ప్రతిధ్వనించింది. నల్లగొండ జిల్లాలో నిరక్షరాస్యులైన రైతులు పొలాల్లో నాట్లువేస్తూ కలుపుదీస్తూ యీ గేయాన్ని ఆలపించిన సంఘటన లున్నాయి. "ప్రజాశక్తికి పరీక్ష సమయము/ప్రతీక్ష మనకిం కెన్నాళ్లు" అన్న ఆయన ప్రశ్నకు సమాధానంగా వీరులు పిడికిళ్ళు బిగించి శత్రువు నెదుర్కోవటానికి సిద్ధమయ్యారు.

వరంగల్లు కోటలో రజాకార్లు మొగలయ్య అనే కాంగ్రెస్ కార్యకర్తను పట్టపగలు దారుణంగా హత్య చేశారు. కాళోజీ అన్యా

యాన్ని ఎదిరించినందుకు వరంగల్లులో ప్రవేశించరాదని ప్రభుత్వం నిషేధాజ్ఞను జారీ చేసింది. సర్ మీర్జా ఇస్మాయిల్ (అప్పటి హైదరాబాదు ముఖ్యమంత్రి) మొగలయ్య హత్య తర్వాతకొన్నాళ్లకు వరంగల్లు సందర్శించే కార్యక్రమం ఏర్పాటు చేసుకున్నప్పుడు కాళోజీ ఆయనకు రాసిన కవితాలేఖ మన లేఖా సాహిత్యంలో చిరస్థాయిగా నిలువదగినదని శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు భావిస్తున్నారు.[6]

ఆ లేఖలో—

''కోటగోడల మధ్య ఖూనిజరిగినచోట- గుండాల శక్తులు
గోచరించినవా ?
బాజార్లో బాలకుని బల్లెంబుతో బొడుచు- బద్మాషు నేమైన
పసిగట్టినావా ?
మొగలయ్య భార్యతో, మొగలయ్య మాతతో/మొగమాటమును
లేక ముచ్చటించితివా ?''

అని ప్రశ్నించటం కాళోజీ ధైర్యాన్ని ఆయన వాక్కులో ప్రస్ఫుటమయ్యే సత్యసౌందర్యాన్ని వెల్లడిస్తుంది.

పేదరైతును పీల్చి పిప్పిచేస్తున్న పాలనా వ్యవస్థ అంతమొందవలసిందేనని కాళోజీ ఎలుగెత్తి చాటారు.

''పండించు ప్రాణాలు పస్తుపడ్డాక/పాడురాజ్యాన్ని కాపాడ
కుంటేమి ?
రక్షించు వారలే భక్షించినాక/విష్ణువని రేని సేవింపకుంటేనేమీ ?''

అని 1942 లో నిజాము నెదిరించి పల్కటం ఎంతసాహసమో ఊహించుకోవచ్చు. కాళోజీ నిఘంటువులో లేనిదే భీతి.

''బాధ్యతలేని ప్రభుత్వ భటులు - పెట్టేబాధలు చాలింక
బాధ్యతగల పరిపాలనలేక - బ్రతికిన బ్రతుకులు చాలింక

ప్రజాకవి కాళోజీ - దేవులపల్లి రామానుజరావు - యువభారతి ప్రచురణ 'నా గొడవ'కు పీఠిక - 1974.

హద్దుమీరి అధికారవర్గము - ఆడిన ఆటలు చాలింక
రాజు పేరిట అరాజకమునను - జరిగిన పూజలు చాలింక'

అని అధర్మానికి స్వస్తి చెప్పమని నిజాం రాజు ఆటకట్టిస్తూ 'షా' చెప్పిన కాళోజీ కవిత ప్రజాహృదయాలకు ప్రీతి పాత్రమైంది.

''ప్రజాశక్తిపై పందెమువేసిన - ప్రభుత్వ మేపాటిగ నిల్చున్''

అని కదలిపోతున్న నిజాం రాజు సింహాసనం కూలిపోకతప్పదని కాళోజీ క్రాంతదర్శియై పలికారు.

''అయ్యబానిసను, అనిన పౌరుడే/
అయ్య గొంతుక నట్టే అదుమున్''

అని తెలంగాణ బడుగుమానిసి బలవంతుడై అన్యాయాన్ని అరికట్లగలడని ముందుచూపుతో పలికారు.

శ్రీ కాళోజీ ఆశాజీవి, ''ఉదయం కానే కాదనుకోవడం నిరాశ,

ఉదయించి అట్లానే వుండాలనుకోడం దురాశ'' అని ప్రవక్తవలె పలికారు. శ్రీశ్రీ ''కాళోజీని కాడ్వెల్, లూయీ ఆరగా వంటి ప్రజాకవులతో పోల్చారు. ''కాళోజీ నిఖిలాంధ్రకవి. అందులో యెట్టి సందేహమూ లేదు. ఆయనకు తెలంగాణా అంచులు గోడలుగా అడ్డు నిలువజాలవు.... ఇది విశాల జగత్తు ప్రజలందరి గొడవ'' అని శ్రీశ్రీ 'నా గొడవ' ప్రాశస్త్యాన్ని వివరించారు.[7]

అన్యాయమని తాను నమ్మినదాన్ని ఎదిరించి పోరాడటంలో కాళోజీ యీ నాటికీ సాహసికులే. కవిత్వమే ఆయన ప్రచార సాధనం; పనిముట్టు, ఆయుధం, అన్నీ. ఆయన కవిత్వంలో ఆలంకారికులు, విమర్శకులు కావ్యశిల్పం కోసం వెతికి ప్రయోజనంలేదు. ప్రజా హృదయాన్ని చేరుకునే ఆయన రచనా ధోరణి కావ్యశిల్ప మర్యాదలకంటె భిన్నమైనది. జానపద కవుల శైలికి సన్నిహితమైనది.

---

7. శ్రీశ్రీ ప్రశంస - 'నా గొడవ' (ప్రథమ ముద్రణ)ను ఆవిష్కరణ జరుపుతూ 12-1-53న అలంపురం సభలో పలికిన మాటలు.

## మహోంధ్రోదయకవి దాశరథి

'నా తెలంగాణ కోటి రతనాల వీణ' అని పలికిన శ్రీ దాశరథి తెలంగాణ ప్రజల హృదయంలో బాధల్ని ప్రతిస్పందింపజేస్తూ గళం సారించారు. ఆయన రచించిన 'అగ్నిధార' నిజాంరాజు దుర్మార్గాలను కార్చిచ్చై దహించింది. స్వయంగా తెలంగాణ పోరాటంలో పాల్గొన్న వీరుడు శ్రీ దాశరథి. ఆంధ్రమహాసభ యువవీరుల్లో ప్రముఖుడు. 'ఆంధ్ర మహాసభకు అరుదెంచుడీ జనులార' అని తొలియౌవన దశలోనే మహాసభ కార్యకర్తయై ప్రజలను మేలుకొమ్మని వైతాళిక గానం చేశారు. ''కళ్ళల్లో కోపం ఒళ్ళంతా కవిత్వం''తో తరతరాల బూజు నిజాం రాజును ఖబడ్దార్ అని హెచ్చరించి ''ముసలి నక్కకు రాచరికంబు దక్కునే''అని ఎలుగెత్తిచాటారు, ''తెలంగాణము రైతుదే రైతుదే రైతుదే'' అని ముమ్మాటికీ నొక్కి చెప్పారు.

తెలంగాణ విముక్తి సమరంలో శ్రీ దాశరధి కంఠం నిప్పులు కురిసింది. తన ఇరవై యేళ్ళ వయస్సులోనే దాశరథి నిజాం రాజు చెర సాలలో ఖైదీ అయ్యారు. నిజామాబాదు జైల్లో శిక్షననుభవిస్తూ ఒక నాడు జైలు గోడమీద బొగ్గుతో -

''ఓ నిజాము పిశాచమా ! కానరాడు
నిన్ను బోలిన రాజు మా కెన్నడేని
తీగెలను తెంపి అగ్నిలో దింపినావు
నా తెలంగాణ కోటి రత్నాల వీణ''

అనే పద్యం రాశారు. ఈ పద్యం మొదట తెలంగాణలో, ఆ తర్వాత ఆంధ్రదేశ మంతా మార్మోగింది. అదే జైలులో వున్న శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి యీ పద్యాన్ని బాగా ప్రచారంలోకి తెచ్చారు. జైలు అధికారులు గోడమీద పద్యాన్ని చెరిపివేసినప్పుడల్లా మరో గోడమీద ఆళ్వారుస్వామి గారీ పద్యాన్ని మళ్ళీ మళ్ళీ రాస్తూండే వారట !

''నిజాం రాష్ట్రంలో ప్రభుత్వ నిరంకుశత్వం, ప్రజల అగచాట్లు, భారత స్వాతంత్ర్యం, భారత సైన్యాల ప్రవేశం, నైజాం ప్రభుత్వపతనం ఇవన్నీ నా రచనకు పునాదులు'' అని దాశరథి స్వయంగా చెప్పుకున్నారు.[8]

''నిజాం ప్రభుత్వం ఈ అగ్గిపిడుగును ఇనుప గొలుసులతో బంధించింది. ఓరుగల్లు నగరవీధుల్లో నడిపించి హింసించింది. నిజామాబాదు సెంట్రల్ జైలులో నిర్బంధించింది. బందిఖానాలో రామదాసులా ఆక్రందింపలేదు దాశరథి: బడబాగ్నిలా ప్రజ్వలించాడు '' అని శ్రీజి,వి. సుబ్రహ్మణ్యం దాశరథి దేశభక్తిని కొనియాడారు.[9]

నెల్లికుదురు (మానుకోట తాలూకా) గ్రామంలో పోలీస్ స్టేషన్ నుంచి తప్పించుకుని అడవిలోపడి పరుగెత్తినప్పుడు, గుఱ్ఱాలమీద నలభై మంది సైనికులు దాశరథిని వెదకుతూ వెంటాడారట. వరంగల్లులో ఆంధ్ర మహాసభ వేదికపై నుండి ఆయన ఉపన్యసిస్తున్నప్పుడు రజాకార్ దుండగులు వేదికను తగలబెట్టారట.[10] తెలంగాణను నిజాం ఉక్కుపిడికిలి నుండి విముక్తం చేయాలని కోరుతూ -

''అవి తెలంగాణమందు దావాగ్ని లేచి
చుట్టుముట్టిన భీకరాశుభదినాలు
అవి నిజాము నృపాలుని అండదండ
చూచుకొని నిక్కినట్టి పిశాచికలలు
నాడు మానవతీ సయనమ్ములందు
నాగసర్పాలు తలలెత్తి నాట్యమాడె

పురాస్మృతులు : అగ్నిధార పీఠిక : దాశరథి కవిత - మహాంధ్ర ప్రచురణలు - 1977.

జి. వి. సుబ్రహ్మణ్యం - కవితాలహరి; యువభారతి ప్రచురణ.

10. పురాస్మృతులు : అగ్నిధార పీఠిక: దాశరథి కవిత - మహాంధ్ర ప్రచురణలు - మద్రాసు - 1977.

నాడు మానవతా నవ నాగరకత
తన్నుతిన్నది రాక్షసత్వమ్ము తోడ
తరతరాల స్వప్నాల సుందర ఫలమ్ము
స్వైర భారతభూమి చూపడెనొ లేదొ
విషము గుప్పించినాడు, నొప్పించినాడు.
మా నిజాం రాజు. జన్మ జన్మాల బూజు

అని పలికిన - దాశరథిగారి పద్యాల్లో భావాలు కోటిమంది ప్రజల మనో భావాలే. వాటిని ఇంత శక్తిమంతంగా వెల్లడించిన కవి, కేవలం కవిత్వానికే పరిమితమైపోక, పోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొని, లాఠీ దెబ్బలు రుచిచూసి, జైలు జీవితపు బాధలనుభవించి, పోలీసుల తుపాకీల నుండి ప్రాణాలతో బయటపడిన సాహసమూర్తి,

పేదరైతుల పక్షం వహించిన శ్రీ దాశరథి -

"ప్రాణములొడ్డి ఘోర గహనాటవులన్ బడగొట్టి మంచి మా
గాణములన్ సృజించి, ఎముకల్నుసి జేసి పొలాలు దున్ని, భో
షాణములన్ నవాబునకు స్వర్ణము నింపిన రైతుదే, తెలం
గాణము రైతుదే; ముసలి నక్కకు రాచరికంబు దక్కునే"

అని ఖండితంగా పలికారు. పేదల కష్టాలు చూచి కరిగిపోయి తిరుగుబాటును ప్రకటిస్తూ -

"చింతలతోపులో కురియు చినుకులకున్ తడిముద్దయైన బా
లెంతయొడిన్ శయించు పసిరెక్కల మొగ్గను వోని బిడ్డకున్
బొంతలు లేవు కప్పుటకు బొంది హిమంబయిపోవు నేమొ! వా
యింతును రుద్రవీణ పయి నించుక వెచ్చని అగ్నిగీతముల్,"

అని అగ్నిగీతాలు రచించారు. 'రెండువందల యేండ్ల చరిత్ర పుటల కప్పుకొనియున్న గాఢాంధకారమెల్ల' యూనియన్ సైన్యాల రాకతో 'తూరుపు మిట్టనుండి పారివచ్చిన వెలుతురు వాగు' కొట్టుకొని పోయెనని తెలంగాణ విముక్తిని వర్ణించారు.

"కోటి తమ్ములకడ రెండుకోట్ల తెల్గుటన్నలను గూర్చి వృత్తాంత మందజేసి, మూడుకోటుల నొక్కచే ముడిబిగించి" మహాంధ్రోదయా నికి కవిగా స్వాతంత్ర్య వీరునిగా తన వంతు బాధ్యతను నిర్వర్తించారు.

"మూగవోయిన కోటితమ్ముల గళాల
పాట పలికించి కవితా జవమ్ము కూర్చి
నా కలానకు బలమిచ్చి నడిపినట్టి
నా తెలంగాణ కోటి రత్నాల వీణ"

అని దాశరధిగారు పలికినట్లే ఆయనవాణి నందుకొని తెలంగాణలో యువతరం కవులు విజృంభించారు. ఆనాడు ప్రతి యువకకంఠమూ దాశరథికి ప్రతిధ్వనే.

"నేనురా తెలగాణ నిగళాలు తెగగొట్టి ఆకాశమంత యెత్తరిచి నాను" అనీ దాశరథితో కలిసి యువకవులు బృందగానం చేశారు.

తెలంగాణ స్వాతంత్ర్య సమరం ముగిసిన తర్వాత దాశరథి-

"పాటలు బాడితిన్ తెలుగుబాబులు నిద్దుర మేలుకోగ, పో
రాటము నేయగా, కరకు రాచరికమ్మును కూల ద్రోయగా
కోటిగళాల నొక్కకడ గూర్చితి, విప్లవ శంఖ మొత్తితిన్
నాటికి నేటికిన్ తెలుగు నాటను కాంతి పతాక లెత్తితిన్"

అని సంతృప్తిని ప్రకటించారు. తనను కనిపెంచిన కరుణామయి తెలంగాణకు వీరపుత్రుడై సేవచేసి తల్లిరుణం తీర్చుకొన్న ధన్యుడు శ్రీ దాశరథి.

## సంస్థానం వెలుపలనుండి పోరాటాన్ని సమర్థించిన కవులు

తెలంగాణ పోరాట వివరాలు నిజాం ప్రభుత్వపు ఆంక్షలవల్ల సంస్థానం వెలుపలవున్న ప్రజలకు చాల ఆలస్యంగా గాని తెలియరాలేదు. దొడ్డి కొమరయ్యను విసునూరి దేశముఖ్ గూండాలు హత్యచేసిన వార్తను, వరంగల్లులో మొగలయ్యను రజాకార్ దుండగులు పట్టపగలు

చంపివేసిన వార్తలను ఆనాటి దినపత్రికలు ప్రకటించటంతో ప్రజల్లో సంచలనం ప్రారంభమైంది. భావావేశం పొందిన కవులు నిజాం రాజు దుర్మార్గాలను, రజాకార్ల దౌర్జన్యాలను ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ, నిరసన తెలియజేస్తూ కావ్యాలు రాశారు. వారిలో శ్రీయుతులు ఆరుద్ర, సోమసుందర్, కుందుర్తి, రమణారెడ్డి, గంగినేని, రెంటాల మొదలైన వారు తెలంగాణ పోరాటంపై రసవంతమైన కవిత్వం రచించారు.

## ఆరుద్ర 'త్వమేవాఽహమ్' - తెలంగాణ ప్రజలతో ఏకీభావం

నిజాం సంస్థానంమీద యూనియన్ ప్రభుత్వపు పోలీసు చర్య ప్రారంభం కాకముందే 'ఆరుద్ర'గారు 'త్వమేవాఽహమ్' రచించారు. 1948 వ సంవత్సరం జూలై పదవతారీఖు కృష్ణా పత్రికలో "నాకాసిగ్గు! నాస్త్రీత్వం ఎప్పుడో పోయింది" అనే పతాకలో ఒక "రజాకార్లచే చెరచ బడ్డ స్త్రీ కథనం" పడ్డాది. దాని వివరాలు ఇవి. సుమారు పన్నెండు రోజులక్రిందటి విషయం. రైలు గుడివాడదాటి వెడుతోంది. ఇందుపల్లి సమీపంలోకి వచ్చింది. రైలుపెట్టెలోవున్న ప్రయాణీకులు హైదరా బాదు విషయాలు చెప్పుకుంటున్నారు. రజ్వీదురంతాలు, కాందిశీకుల కష్టాలు వర్ణించి విషాద భరితులవుతున్నారు.

ఇంతలో ఆ పెట్టెలోవున్న ఒక వనిత లేచి నిలబడింది. వలువలు తీసివేసింది, నగ్నంగా నిలబడింది." "అదేమిటి, తప్పుకాదూ" అని అడిగిన వారితో "తప్పా, నాకు తప్పా, ఏ నోటితో చెప్తున్నారా మాట, నేను ఆడదాన్నా? నైజాం కిరాతకులు నన్ను వారం రోజులు నగ్నంగా చెట్టుకు కట్టేసి అట్టేపెట్టారు. నా స్త్రీత్వాన్ని ఆనాడే దొంగిలించారు. నా ఆడతనం ఆనాడే పోయింది. ఇంకా ఆడదానినంటారేమిటి? చూడండి నా వంటి నిండా గాయాలు" అని తన విషాదగాథ వినిపించింది, "ఆ వార్త చదివాక 'త్వమేవాఽహం' మొదలెట్టా" అని ఆరుద్రగారు కావ్యప్రేరణను గురించి తెలిపారు.[11]

11 కవి హృదయం (దాశరథికి లేఖ) - త్వమేవాఽహమ్ - రెండవ ముద్రణ - 1962.

పోలీసు చర్యకి పూర్వం తెలంగాణ అంతర్యుద్ధంలోని స్పెయిన్ దేశం లాంటిది. 'స్పేనిష్ సివిల్‌వార్' యూరప్‌లో మేధావులను కదిలించింది. తెలంగాణ భారత కవులను కదిలించింది. హరీంద్రనాథ్ చటోపాధ్యాయ రచన Tales of Telangana ను ఆరుద్ర అనువాదం చేశారు.

ప్రత్యక్షంగా చూచి, పాల్గొని, అనుభవించి రాసింది కాకపోయినా ఆరుద్రగారి కావ్యం తెలంగాణ ప్రజలతో 'నీవే నేను' అని ఏకత్వాన్ని ప్రకటించింది. వారి బాధల్ని హృదయ విదారకంగ ప్రతిస్పందింప జేసింది. దీన్లోవున్న కావ్యశిల్పం క్లిష్టమైనది కావటంచేత ఆలోచనా పరులైన పాఠకులు మెచ్చినంతగా దీన్ని సామాన్య పాఠకులు అర్థం చేసుకోలేరు. అసలు కావ్యమంతా చదివిన తర్వాత గూడ శ్రీశ్రీగారి కావ్యానికి రాసిన 'ఒక లఘుటిప్పణి', కవి హృదయం (ఆరుద్ర దాశరథికి వ్రాసిన లేఖ) చదవకపోతే యీకావ్యం తెలంగాణ పోరాటం గురించి రాసినదని తెలుసుకోవటం కష్టం –

ఆరుద్రగారి కావ్యానికి మొదట 'తెలంగాణ' అని పేరు పెట్టారట. ఏనుగుబొమ్మ గీసి 'ఏనుగు' అని పేరుపెట్టినట్లనిపించి శ్రీశ్రీగారు భావస్ఫోరకంగా వుంటుందని త్వమేవాఽహం (నీవేనేను) అని పేరు పెట్టమని సూచించారట.

"బ్రెయిన్‌లో బ్రెన్‌గన్/రెయిన్‌లా ఆలోచనల ట్రెయిన్/స్ప్రయినల్ కార్డులో స్పెయిన్" అని పర్వతదశతో ప్రారంభమయ్యే యీ కావ్యంలో స్పెయిన్ అనే మాట స్పేనిష్ అంతర్యుద్ధాన్ని మనసులో పెట్టుకొని రాసిందే, తెలంగాణ ప్రజల కష్టాలు ఆరుద్రగారి బ్రెయిన్ స్టెన్‌గన్ రెయిన్‌లా ఆలోచనలు కురిసి – ఆవేశం ట్రెయిన్ కదిలి కావ్యరూపం ధరించింది. కవి హృదయాన్ని గమనించి చూస్తే "చెయిన్సులో మగాళ్లు/చెరచబడ్డ ఆడవాళ్ళు/చెదపురుగులు/మదమెక్కిన సోల్జర్లు" అన్న పంక్తులకు అర్థంబోధపడుతుంది. చెట్లు, చిట్టెలుకలు అంటే పెద్ద చెట్లవంటి సాయుధులై సోల్జర్లను చిట్టెలుకలవంటి సామాన్య పౌరులేం చేయగలరు? ఆ పరిస్థితుల్లో ప్రజలు చిన్నచిన్న

చీమలు బలవంతమైన సర్పాన్ని చంపినట్లు - ఎదురు తిరిగి, పోరాడి నిజాం సైనికుల దుర్మార్గాలకు స్వస్తి చెప్పాలని కవి భావం. దీన్ని "చిన్నచిన్న చీమలు / బలవంతమైన సర్పం / భయంకరమైన స్వప్నం అనే పంక్తుల్లో సూచించారు. ఈ విధంగా వివరిస్తూపోతే త్వమేవాఽహమ్ కావ్యమంతా వివరణను కోరుతుంది. తెలంగాణలో బాధలు పడుతున్న సామాన్యుల గురించి రాసిన యీ కావ్యం యింత ప్రౌఢంగా, క్లిష్టమైన శిల్ప సంవిధానంతో వుండటమేమిటనే ప్రశ్న ఎదురౌతుంది.

"....టెక్నిక్‌లేని కవిత్వాన్ని నేను ఊహించలేను. ప్రత్యేక సంవిధాన రహితవాక్య సందేహాన్ని, వాక్శుద్ధి - ధారాభాషావైదుష్యాలని పోనాడని మాటల దొంతరని నేను కవిత్వంగా ఎంచలేను" అని కవిత్వాన్ని గురించి ఆరుద్రగారి నిశ్చితమైన అభిప్రాయం.[12] కవివ్యుత్పన్నుడూ, ప్రతిభావంతుడూ అయినప్పుడు పాఠకులు శ్రమ కోర్చి కవి హృదయాన్ని అందుకోలేకపోతే ఎవరికి నష్టం? "అంధక జన దూషితంబులు ఘనంబులు గావె రత్నముల్!" ఆరుద్రగారి త్వమేవాఽహమ్ విశిష్టతను పాఠకులు, విమర్శకులు గుర్తించారు.

ఆధునిక ప్రపంచంలో టి. యస్. ఇలియట్ 'The Waste-Land' కావ్యానికున్న విలువ ఆధునికాంధ్ర కవిత్వంలో ఆరుద్రగారి త్వమేవాఽహమ్ కావ్యానికున్నది.

తెలంగాణ పోరాటానికి విముక్తి మార్క్సియ మార్గంలోనే లభిస్తుందని ఆరుద్ర భావించారు. పైథాగరస్‌థియరీ పద్ధతిలో ABC అనే త్రిభుజంలో $\angle CAB = 90$ డిగ్రీలుఅయినప్పుడు $CB^2 = AB^2 + AC^2$ అనేది పైథాగరస్‌థియరీ) సమస్యను పరిష్కరించుకోవాలన్నారు. "దత్తాంశాలను పరిశీలించండి/చిన్నచిన్న చీమలూ వగైరా ఆడుగు భుజం/[ఉత్పత్తిని దోపిడిచేసే పరాన్నభుక్కులు) లంబం/ఈ భుజాల

12 కవి హృదయం (దాశరథికి లేఖ)-త్వమేవాఽహమ్ - రెండవ ముద్రణ - 1962

పరస్పర సంఘర్షణల ఫలితం/ఈ భుజాల కర్ణంమీది చతురస్రం'' అని ఆశారేఖా గణితం రీత్యా ఋజువు చేసుకోమన్నారు. సమస్యకు మరో పరిష్కారం గడియారం నడిచే పద్ధతిలో సూచించారు. గడియారం మన సంఘం. గంటలు శ్రీమంతులు, నిమిషాలు మధ్య తరగతివాళ్ళు. సెకండ్లు 'అలగా'జనం. ఇసకగడియారం, నీటి గడియారం పాతకాలపు సంఘాలు. స్టాప్ వాచీ విప్లవాన్ని 'టైం' చేసే సాధనం. సాంకేతికమైన యీ కావ్యంలో ''స్వర్గారోహణ సమయంలో/కాలుజారి పడతామన్న భయం నుంచి/ఏంగ్ జుయిటీ పెనుపట్టునుంచి/కన్ఫ్యూజన్ కనుకట్టునుంచి/మము బ్రోవుమని చెప్పవే సీతమ్మతల్లీ ! మము బ్రోవుమని చెప్పవే'' అని కాల స్వరూపాన్ని ఆవాహన చేశారు.

స్పెనిష్ అంతర్యుద్ధం, ఎందరో మేధావులు కవులు కళాకారులు ప్రజలకు తోడ్పడినా విజయవంతం కాలేదు. కాని తెలంగాణ పోరాటం ఎందరో వీరులను కవులను చేసింది. కవుల, కళాకారుల తోడ్పాటు యుద్ధ రంగంలో సైనికులకు 'మార్చింగ్ బాండ్'లాగ అమరింది.

'త్వమేవాఽహమ్' కావ్యానికి శ్రీశ్రీ ఒక లఘుటిప్పణి సమకూర్చారు. అందులో జ్ఞాపకం పెట్టుకోవలసిన విషయాలు రెంటిండిని చెప్పారు. ''1, భారతదేశం అంతట్లోకి రాజకీయంగా ఎక్కువ చైతన్యం చూపిస్తున్న ప్రదేశం ఆంధ్రభూమి.

2. నవ్య కవిత్వానికి ఈ నాడు ఇండియా అంతటికీ అగ్రస్థానం తెలుగుభాషది. మొదటి విషయాన్ని తెలంగాణా విప్లవంవంటి ఘటనలు ఋజువు జేస్తాయి. రెండో విషయానికి ఆరుద్ర వ్రాసిన 'త్వమేవాఽహం' వంటి కావ్యాలు తార్కాణాలు'' అని ఆరుద్ర కావ్యాన్ని ప్రశంసించారు. ఇంకా శ్రీశ్రీ ''ఆరుద్ర తన ఛందస్సుల చేత అందంగా చాకిరీ చెయ్యించుకోగలడు''[13] అని కూడ మెచ్చుకొన్నారు.

''నిర్దేశించిన భావాలను/వాక్యాలు బట్వాడా చెయ్యవు'' అని ఆరుద్రకవి అసమర్థతను గురించి చెప్పినా, ఆయన భావావేశం త్వమే

---

13. ఒక లఘుటిప్పణి : ంగం శ్రీనివాసరావు; త్వమేవాఽహమ్ - ప్రథమ ముద్రణ - 1949

వాఽహమ్‌లో చక్కని కావ్యరూపం దిద్దుకొన్నది. "చిరంజీవి మానవునకు మృత్యువు'అనే భాగంలో "తుపాకులు బహిరంగంగా/మనుష్యులను వెక్కిరిస్తాయి/విశాలలోకం సర్కస్‌లోపల/నియంతల నోట్లో/ప్రజాజీవితం తెగుతుంది" అనే మాటలు నిజాం ప్రభుత్వంలో కకావికలైన ప్రజాజీవితవర్ణనే. "నాగేటి చాలుల్లో/కార్మికనాయకుల పుర్రెలు/దొరుకుతాయి" అనే భావం నిజాం కిరాతకులచే చంపబడిన వీరుల త్యాగాన్ని ఉద్దేశించినవి. 'నీటి గడియారం'లో" నువ్వు ఎక్కదలచుకొన్న రైలు

ఎప్పుడూ ఒక జీవితకాలం లేటు" అనే ఉపమానం ఆధునిక కవితలో చిరస్మరణీయంగా నిలిచిపోయింది. "మా జీవితాలకల్లా/సారె గదిలోనిదే రొమాన్సు/పెద్ద దొరముందు/మాట్లాడడమే ఎద్వెంచరు/ఇంక్రిమెంటే మోక్షం" అనే పంక్తులు మధ్య తరగతి చేతగానితనాన్ని అవహేళన చేసి కార్యదీక్షకు పురికొల్పుతాయి.

'సెకండ్లు' అనే భాగంలో శ్రీ ఆరుద్ర బుర్రకథ శైలిలో "భళానోయి భళి తమ్ముడూ/భళానోయి భళిదాదానా/నక్కలు తిరిగే తోటలో/నాలుగు స్తంభాల కోటలో/రాకాసి రాజొకడుండెరా" అని నిజాం రాజు దురాగతాలను, రజాకార్ల దౌర్జన్యాలను గుండెలు కరిగేలాగ వర్ణించారు.

'త్వమేవాఽహమ్'లో ఆరుద్రగారుపయోగించిన ఇంగ్లీషు మాటలు సామాన్య పాఠకులకు కఠినంగా తోస్తాయి. ఆధునిక కాలంలో ఇంగ్లీషు తెలుగు కలిసిన మణి ప్రవాళ భాష వొకటి వాడుకలో వున్నప్పటికి - ఇంగ్లీషు మాటల్ని మాటి మాటికి సంభాషణలో ఉపయోగించే వారికి కూడ అర్థంగాని ఇంగ్లీషు పదాలు, పుస్తకాలు, సంఘటనల 'రిఫరెన్సు'లూ యీ కావ్యంలో అడుగడుగునా కన్పిస్తాయి. ఇలియట్ రచించిన The Wasteland కావ్యాన్ని చదివి అర్థమైందని చెప్పగలిగిన వాళ్ళు అరుదైనట్లు, త్వమేవాఽహమ్ చదివి అర్థమైందని ఘంటాపథంగా చెప్పగలిగిన సహృదయులు అరుదే.

## వజ్రాయుధ కవి సోమసుందర్

తెలంగాణ పోరాటాన్ని గురించి పత్రికల్లో చదివి, ప్రజలనుండి తెలుసుకొని కవితావేశం పొంది శ్రీ ఆవంత్స సోమసుందర్ 'వజ్రాయుధం' రచించారు.

"ఖబడ్దార్, ఖబడ్దార్ నైజాం పాదుషాహే
బానిసత్వ విముక్తికై హిందూ ముస్లిం పీడిత శ్రమజీవులు
ఏకమైరి"

అని నిజాం రాజును ఖబడ్దార్ అని హెచ్చరించిన అభ్యుదయ కవి శ్రీ సోమసుందర్.

'బానిసల దండయాత్ర' లో

"తెలగాణ ! తెలగాణ ! ధీరులకు మొగసాల
తెలగాణ ! తెలగాణ ! విప్లవోజ్జ్వల గాధ"

అని ప్రజాశక్తిని ఆవాహన చేసి "కదలండి కదలండి/కదలి పోరాడండి/కాకతీయుల శౌర్య/పటిమ చూపించండి" అని తెలంగాణ ప్రజలను ఉత్సాహపరచారు. "రాక్షసులు, రాక్షసులు/రాజీలు పడ్డారు ఘోర హత్యకు మనల గురిచేసినారు," అని నిజాం రాజు, రజాకార్లు కలిసి పీడిస్తున్న వైనాన్ని వివరించారు. "హైదరాబాదుఖిల్లా/లోని తొర్రలో పుర్రెలో/దాచుకొన్నాడంట ! రాక్షసుడు ప్రాణాలు; దేశముఖు కుక్కలను/కాపలాలుంచాడు." అని నిజాం పిరికితనాన్ని దేశముఖుల 'స్వామి భక్తి'ని ఎద్దేవా చేశారు. సంస్థానం విముక్తం కాకమునుపే మన విశాలాంధ్రలో/స్వర్గమును నిలపండి ! అని ఆశావాదంతో పలికారు.

"తమపై స్వారీచేసే/దేశముఖుల ప్రతిఘటించి/ప్రజాకోటి పోరు తోంది ఖబడ్దార్ ! ఖబడ్దార్ ! సూర్యపేట, బాలేముల/వీరులకాలే హృదయపు ఆశలు శాంతించుతాయ్ - అమరుడు మా కొమరయ్య/అనంతయ్య అనంతుడే/అజేయులై, ప్రకీర్తులై/చిరస్థాయి నిలుస్తారు, చరిత్రలో

చరిత్రలో చిరస్థాయి వహిస్తారు" అన్నారు శ్రీ సోమసుందర్. వాచ్యార్థ ప్రధానమైన యీ కవిత్వం శిల్ప నైపుణ్యంలో గొప్పది కాక పోయినా, పోరాట తీవ్రతను ప్రతిస్పందించటంచేత గొప్ప కవితగా పేరు పొందింది. ఆరుద్రగారి 'త్వమేవాఽహమ్' చురుకైన పాఠకులకు గూడ కొరకరానికొయ్య అయితే, సోమసుందర్ గారి 'వజ్రాయుధం' వ్యంగ్యమూ ధ్వనివంటి ఆలంకారిక మర్యాదల్ని వదలిపెట్టి సత్య సౌందర్యంతో ప్రకాశించింది.

"ఒక వీరుడు మరణిస్తే
వేలకొలది ప్రభవింతురు
ఒక నెత్తుటి బొట్టులోనె
ప్రళయాగ్నులు ప్రజ్వరిల్లు
ఖబడ్దార్ ! ఖబడ్దార్"

పంక్తులు కవితాభిమానుల కంఠాల నుండి పదేపదే విన్పిస్తాయి.

"నైజాం కీచకుడా/నీ పీచమణచ ప్రజలంతా/ఒక పిడికిట, ఒక గొంతుక, ఒక మ్రోతై ధ్వనిస్తారు/మృతవీరుల స్మరిస్తారు/నవయోధుల సృజిస్తారు/ఖబడ్దార్, ఖబడ్దార్" అన్న సంకల్ప శక్తి గొప్పది.

"బానిసజన శల్యములను
పేర్చికూర్చి నిర్మించిన
నీ రాక్షస సింహాసన
మదిగదిగో కదులుతోంది !
మెషిన్ గన్లు, మర ఫిరంగి
తుపాకులూ, విషవాయువు
ప్రజాశక్తి నాపలేవు
ఖబడ్దార్ ! ఖబడ్దార్-"

పంక్తులు రక్తాన్ని ఉప్పొంగింపజేస్తాయి. పోరాటం ముగిసిన యింత కాలానికి గూడ శరీరాన్ని పులకింపజేస్తాయి. మనస్సును వెచ్చని జ్ఞాపకాలతో నింపి, ఆనాటి త్యాగ ధనులను జ్ఞాపకానికి తెస్తాయి.

"అతడెవరు? అతడెవరు? జనగామలో జమ్మి/కొమ్మపై
ఎక్కాడు
అతడెవరు? అతడెవరు? గాండీవమును వెదకు విజయుడల్లె
నున్నాడు
అతడా? తెలగాణ! గెరిల్లాల నాయకుడు/అతడే ప్రజా సమర/
ఉద్యమోత్సాహకుడు!"

తెలంగాణా గెరిల్లా యోధుల సాహస కృత్యాలను కళ్లకు కట్టించి, సంస్థానం వెలుపల వున్న ప్రజలకు పోరాట స్వరూపాన్ని ప్రదర్శించారు.

గెరిల్లా వీరుల దాడుల్ని వర్ణించేచోట - అర్ధరాత్రి దాడులకై వచ్చిన ముష్కరులను పసిగట్టి గెరిల్లా వీరుడు/గుహ లోపల కునుకు తున్న/తోటి పులుల మేల్కొల్పెను/నిద్దుర లేవండోయ్ కామ్రేడ్స్! పందులు చొరబడుతున్నాయ్! ముగ్గురు వీర గెరిల్లాలో! ముగ్గురు విప్లవ వీరులు/సింహం కొదమలవలె/కొండ కొమ్మ కెగబ్రాకిరి-ధణా ...ధణా ధన్-కీడులోక మంతరింప/మూడు తుపాకులు పేలెను"-నిజాము సైనికులు, రజాకార్లు కలిసికట్టుగా దాడిచేస్తే-వారికి ప్రతిగా ప్రజాయోధుల సమరాన్ని సంస్థానం వెలుపల ఎంతో దూరంలో వుండికూడ కవి దూర దర్శినిలో ఆ సమరాన్ని చూచినంత స్పష్టంగా, వీర రసస్ఫోరకంగా రచించారు.

నైజాం దుండగీడు మూకలు కురిపించిన రైఫిల్ జ్వాలలకు బలియై పడిపోయిన వీరులు కడసారి పలుకులుగా "తల్లీ ఏడువకమ్మా! మళ్ళీ జన్మన్నది మాకుంటే/చల్లని నీ కడుపున జన్మిస్తాం" అని కోరుకున్నారట. "నాజీ నైజాం రాక్షస రజాకార్ల, పోలీసుల ద్రోహుల రక్తంతో/మన తమ్ముల ఆత్మశాంతికి/దోసిళ్లతో తర్పణమిద్దాం" అని

శ్రద్ధాంజలి ఘటించి శ్రీ సోమసుందర్ ఆంధ్రులందరి మనోగత అభిప్రాయాలకు కవితా రూపమిచ్చారు.

'మార్చింగ్ సాంగ్స్'లో వుండే విలక్షణమైన శైలి సోమసుందర్ గారి కవితలో వున్నది. గొంతెత్తి చదవటానికి అనువుగా, కవితా శిల్పం కంటె ఉద్యమావేశం అధికంగా కన్పిస్తుంది. క్రాంత దర్శియై శ్రీ సోమసుందర్ "భవిష్యత్తు స్వరూపాల/చరిత్ర గతి లిఖిస్తోంది/విశ్వవాణి గొంతుకలో/కొత్త జీర పలుకుతోంది/ఈ యాగం ఫలిస్తుంది/రాక్షస సంహారోత్సవ/మహాక్రతువు ఫలిస్తుంది/ప్రయత్నాలు ఫలిస్తాయి/బందిపోటు పిశాచాలు/నశిస్తాయి నశిస్తాయి/తెలుగుగడ్డ సుఖిస్తుంది/ఈ యాగం ఫలిస్తుంది" అని పలికారు. కమ్యూనిస్టు పార్టీ నడిపిన భూమి పోరాటాన్ని వీరు సమర్ధించారు.

తెలంగాణ విప్లవ పోరాటాన్ని వర్ణించిన 'వజ్రాయుధం' ఆధునికాంధ్ర కవిత్వంలో ఉత్తమ అభ్యుదయ కావ్యాలలో వొకటిగా చెప్పుకోదగినది.

## తెలంగాణ మహేతిహాసం-కుందుర్తి 'తెలంగాణ'

తెలంగాణ పోరాటాన్ని కావ్య వస్తువుగా స్వీకరించిన అభ్యుదయ కవుల రచనల్లో కుందుర్తి ఆంజనేయులుగారి 'తెలంగాణ' కావ్యం దరిదాపు చివరిదని చెప్పవచ్చు. (1956 లో అచ్చయింది). ఐతే యీ కావ్యం విప్లవ పోరాటాన్ని వర్ణించటంలో కావ్య శిల్ప మర్యాదల దృష్ట్యా ఉత్తమమైనది.

"బహుశా యిదే మొదలనుకుంటాను
గేయాలు తెచ్చిన కొత్త వెలుగు
ఆధునిక యుగంలో ఒక పూర్ణ కావ్యంగా
బ్రతుకును వర్ణించటం"

అని శ్రీ కుందుర్తి చెప్పుకున్నట్లు, పూర్తిగా వచన కవిత్వంలో వచ్చిన మొదటి కావ్యమిది. సంస్కృత సమాస భూయిష్టమైన శైలికీ,

ఆంగ్ల శబ్దాలను విరివిగా వాడటానికీ ఆయన వ్యతిరేకి. చేట తెలుగు మాటలతో అక్షరాస్యులై కవిత్వంపై ఏ మాత్రం ఆసక్తి వున్న పాఠకులకైనా ఆయన కవిత్వం ఆహ్లాదకరంగా వుంటుంది.

'తెలంగాణ' కావ్యం తెలంగాణ ప్రజల జీవితేతిహాసం. పద్దెనిమిది పర్వాల్లో యీ కావ్యం రచించి తెలంగాణ జన జీవిత మహాభారతంగా దీన్ని రూపొందించారు. కావ్యం ఆసాంతమూ చదివితే తెలంగాణలో ఆనాడు ఏమి జరిగిందీ కళ్ళకు కట్టినట్టు కన్పిస్తుంది. తెలంగాణ ప్రజలపై సానుభూతి కలుగుతుంది. కుందుర్తి ప్రయోగించిన ఉపమాలంకారాలు, వర్ణనలు నేటికీ మరపురానివే.

బ్రిటీషువారు భారతదేశాన్ని ఆక్రమించుకొని ఒకే పరిపాలన కిందకు తెచ్చాక స్వదేశ సంస్థానాలు ఎలా వున్నాయంటే,

"దేశ పటాన్ని కొరికేసినై
సామంతుల చిట్టెలుకలు"

అని వర్ణించారు. ఈ వర్ణన ఒక్కసారి మనస్సులో నిలుపుకుంటే ఆనాటి దేశ స్థితిని కవి వర్ణించిన తీరు ఎంత ప్రతిభావంతమైనదో తెలుస్తుంది.

"దేశంలోని సంస్థానాలన్నిటిలో/హైదరాబాదు పెద్దది/భూస్వామి కంబాధల్ని ప్రజలు సహించిన/చిట్టచివరి హద్దు అది." ఆనాటి హైదరాబాదు మనదేశం కడుపులో పుట్టిన మహావ్రణంగా కుందుర్తి అభివర్ణించారు. నిజాం నవాబుగారి దర్బారులో "ఆస్థాన కవి రేడియో గారు" కపట వార్తలతో సంస్థానం వెలుపలి ప్రజలను మభ్యపుచ్చారు. ప్రజలు మూడు శతాబ్దాల బానిసత్వం తర్వాత "క్రమ క్రమాగత చైతన్య ధనుష్పాణులై, సమాజ సమిష్టి ప్రయోజన నిశిత బాణులై" ఆంధ్ర మహాజన సంఘపు నిర్వహణలో నిజాం నెదిరించచూసుకున్నారు. 'బీజోత్పన్న' పర్వంలో శ్రీ కుందుర్తి, నిజాం నవాబు ప్రజల్ని పీల్చి పిప్పి చేసిన విధాన్ని వర్ణించారు. 'సంఘోటయ' పర్వంలో 'ఆంధ్ర

మహాసభ' తెలంగాణలో ఆవిర్భవించిన విధాన్ని కవి మనోజ్ఞంగా వర్ణించారు. ''ఉదయం నిద్ర లేచాక/సమయం చూసి కొడిచే ప్రొద్దులాగా/ప్రతి పల్లె హృదయంలో/ఒక వాక్కున్న ఉదయం ఉంది/ ..ప్రతిపల్లె రహస్య జీవితంలో/ఒక రాత్రి పాఠశాల ఉంది/ ...తూటాలు, తుపాకులకు అభేద్యమైన అశాంతి అరణ్యంలో కాలం వలలో పట్టుబడ్డ/కోటి కోరల కొదమ సింహం సంఘం'' తెలంగాణలో కోటి మంది ప్రజలు కొదమ సింహపు కోటి కోరలుగా ఊహించటం కవి భావనాశక్తికి మంచి నిదర్శనం. చరిత్రగమనాన్ని ఆపేసి, సమతను వరించిన సంఘం ''క్రమ గమనాన్ని కాదని స్వేచ్ఛను వరించిన మన కవిత్వం''లా (వచన కవిత్వంలాగ) వుందనటం కవికి స్వేచ్ఛా జీవితంపై గల మక్కువను తెలుపుతుంది.

ప్రజోద్యమం కోటి కిరణాల సూర్యకాంతిలా వ్యాపించిందని 'ప్రజోద్యమ' పర్వంలో వర్ణించారు. ''అణగారిన దరిద్ర జీవితాలమీద/చైతన్యానికి యెంతో మక్కువ/మన కాలంలో అన్ని యంత్రాలలాగే చరిత్రకూ వేగం ఎక్కువ.'' అందరూ ఆలోచించి పెట్టుకున్న ''సంఘం సందర్శించని పల్లె లేదు/బెదరని దేశముఖుల దివాణం లేదు.'' ప్రచార దళాలు ప్రజా కళా రూపాల్లో ఆంధ్ర మహాసభ సంఘం ఆశయాలను ప్రచారం చేశాయి. చీకటి దివాణాల్లో నివసించే ముసలి దివాంధాలు సంఘం సూర్యుణ్ణి వెక్కిరించాయి. జాగీర్దార్లు, దేశముఖులు తమకు రక్షణ కల్పించమని నిజాంను వేడుకున్నారు. ఫలితంగా ''ప్రతి పల్లెలో యిప్పుడు ఒక పటాలం ఉంది/ప్రతి యింటి మీద పోలీసు నిఘా ఉంది.'' సూర్యాపేట, వాలేములలో ప్రజల్ని రెచ్చగొట్టటం జరిగింది. ఆ తర్వాత నిజాం సైనికులు చేసిన దుర్మార్గాలు అన్నీ యిన్నీ కావు. నేల మీదికి విసిరేసిన రబ్బరు బంతి కసికొద్దీ పైకి లేచినట్టు ప్రజలు ప్రతిఘటన ప్రారంభించారు.

మొదటిసారి పత్రికలు దేశముఖుల గూండాలు హత్యచేసిన కొమరయ్య ఫోటోను ప్రచురించాయి. ఆ తర్వాత ఎంతో మంది అమర

వీరులు నేలకొరిగారు. ఆంధ్ర మహాసభను నిజాం ప్రభుత్వం నిషేధించింది.

"సంఘం అక్కడి ప్రజల కంట్లో వత్తి
సంఘం శత్రువు మీదికి ఎత్తిన కత్తి-"

దాన్ని కాపాడుకోవటానికి, మత వైరాలు లేక ప్రజలు ఐక మత్యంతో నిలిచారు. సంఘవీరులను అడవిలో దాచి వారికి అన్నీ అమర్చి, శత్రువుతో తలపడ్డారు. సంఘ వీరులను పట్టి ఇవ్వమని సైనికులు ప్రజలను హింసించసాగారు. సంఘ నాయకులను పట్టి ఇస్తే పెద్ద బహుమానాలు ప్రకటించారు. శ్రీ కుందుర్తి వ్యంగ్యంగా యీ అంశాన్ని "నీతిని సజీవంగా పట్టిచ్చిన వారికి/పెద్ద బహుమానం ప్రకటించారు" అని వర్ణించారు. సైనికులు ప్రజా జీవితాన్ని అల్లకల్లోలం చేశారు.

"తెలంగాణను వర్ణించటానికి
తెలుగులో మాటలు చాలవు
. దానిని హేలంగాణా అంటున్నాను"

అని శ్రీ కుందుర్తి అప్పటి పరిస్థితిని సరిగా తెలిపారు.

"పదహారేండ్ల పసుపు చీర పమిట చెంగుమీద
ప్రశ్నల దారాలు లాగుతున్నాడు పోలీసు అధికారి"—

ఈ మాటల్లో వున్న వ్యంగ్యం సులువుగా బోధపడేదే. అజ్ఞాత వీరులెక్కడ వున్నారో చెప్పమన్న మిషతో అమాయకపు ఆడపడుచుల్ని మానభంగాలకు గురిచేసిన పోలీసు అధికార్ల దౌర్జన్యం రక్తాన్ని ఉడుకెత్తిస్తుంది. పోలీసుల అన్యాయాన్ని ప్రతిఘటించి-

"పాపాన్ని కండ్లతో చూడలేనివాళ్ళు
ప్రాణాలతో సహా వెళ్ళిపోయారు

పాపాల్ని చూడచాలకున్న వాళ్ళల్లో
పన్నెండు మంది చచ్చి చూడలేకపోయారు".

గృహదహనాలు, లూటీలు ఒకటేమిటి సమస్తమైన అరాజకం ప్రభుత్వ అండదండలతో విజృంభించింది. దేశముఖులు ప్రజల దాడికి తట్టుకోలేక, బస్తీకి మకాం ఎత్తేశారు.

గెరిల్లా పోరాటంలో ప్రజల సంఘటిత శక్తిని, పోరాటంలో నేర్పరితనాన్ని పోలీసుల భీరుత్వాన్ని శ్రీ కుందుర్తి రమణీయంగా వర్ణించారు.

"ఈ నేల ఎవరిది ? కోటి ప్రజల సొత్తు గదా
కొందరు వద్దంటే ఒప్పుకోని చరిత్రా !
ముందుకు పదా !"

అన్న శ్రీ కుందుర్తి కవితా శక్తి ప్రస్తుతించదగ్గది. చరిత్ర గమనంలో నిలిచి, దాన్ని ముందుకు పదమని శాసించిన కవి ఋషి తుల్యుడే.

"మనం నివసించే భూమి గుండ్రంగా ఉంది
భూస్వాముల చేతుల్లో"

అని ధ్వని పూర్వకంగా పలికి ఆ భూమి కోటి ప్రజల సొత్తని - దాన్ని అనుభవించే హక్కు భూస్వాములది మాత్రమే కాదని తెగేసి చెప్పిన కవి శ్రీ కుందుర్తి.

నిజాము అధికారాన్నుండి ప్రజల్ని విముక్తం చేశాక ప్రజలు సుఖశాంతులతో విలసిల్లినట్లు శ్రీ కుందుర్తి యీ కావ్యాన్ని ముగించారు. శ్రీ చేకూరి రామారావు యీ ముగింపు సరియైనది కాదంటూ "యూనియన్ మిలిటరీ నైజాం రాజ్యం మీద పోలీసు చర్య తీసు కున్నది. ప్రజల కంట్లో వత్తులైన సంఘ నాయకులను వేటాడింది. అంతకుముందు జరిగిన ఘోరాలను తలదన్నే ఘోరాలు జరిగినై. సత్యా

హింసల దత్తపుత్రులే యీ ఘోరాలు చేశారు. పట్నాలకు పారిపోయిన దేశముఖులు ప్రజల నుంచి మళ్ళీ భూముల్ని లాక్కున్నారు. తమ దోపిడీని మళ్ళీ ప్రారంభించారు. తెలంగాణ విప్లవం-కారణాలు ఏమైతే నేం-అప్రసనాస్యం చెయ్యాలిసివచ్చింది. ఇవి వాస్తవాలు. పోలీసు చర్యకు పూర్వపు వాస్తవాలను అంత బాగా గ్రహించిన కవి, తరువాత వాస్తవాలను గ్రహించలేడని అంటే కవి ప్రతిభనే శంకించటమవుతుంది. కాని ''అధర్మం తుంచేసి ధర్మ ప్రతిష్ఠాపన''కోసం జరిగినట్టుగా పోలీసు చర్యను చిత్రించారు కవి. ఇది ఈ కావ్యంలో పెద్ద లోపమే'' అని విమర్శించారు.''[14] శ్రీ చేకూరి రామారావు విమర్శసరియైనదే. తెలంగాణ పోరాటం నాటి వాస్తవాలను కళాత్మకంగా ఉత్తమ కావ్యంగా తీర్చిదిద్దిన కవి, పోరాటం తర్వాత వాస్తవాలను మరుగుపరచి, ప్రజలు సుఖంగా వున్నారని 'ఉపసంహార' పర్వంలో పల్కటం, (తెలంగాణ' మొదటి ముద్రణ 1956) అదీ 1956 లో పలకటం న్యాయంకాదు. ప్రజా పోరాటం సమసిపోయిన విధాన్ని వివరిస్తేనే యీ కావ్యానికి నిండుదనం వస్తుంది.

కవిత్వంలో వ్యంగ్యం బిగువు సడలకుండా, అభ్యుదయ భావాలతో వచన కవిత్వంలో రచించిన 'తెలంగాణ'ను 'తొలి తెలుగు విప్లవ కావ్యం'గా గౌరవించవచ్చు.

## ''తెలంగాణ కనుపాపలు పడగలు''-రమణారెడ్డి 'భువనఘోష'

తెలంగాణ పోరాటంలో పాల్గొన్న వీరయోధుల స్మృతి చిహ్నంగా, ప్రజలు సమాయత్తమై దుర్మార్గాన్ని ఎదుర్కొనవలసిందని శ్రీ కె.వి. రమణారెడ్డి 'అడవి; భువన ఘోష' కావ్యాల్లో ప్రబోధించారు. ''తెలంగాణ నవ/తెలంగాణనన !... తెలంగాణ కనుబొమ్మలు సంధ్యలు/ తెలంగాణ కనుపాపలు పడగలు/తెలంగాణ జనకార్యము వీర్యము/ తెలంగాణ జవనాశ్వము సింహము'' అని కల్లా కపట మెరుగనిసామాన్య జనులు వీరయోధులై నిలిచిన విధాన్ని ఆయన చక్కగా వర్ణించారు.

14. 'తొలి తెలుగు విప్లవ కావ్యం తెలంగాణ'. చేకూరి రామారావు - కుందుర్తి సన్మాన సంచిక-1975

యాదవరెడ్డి, కొమరయ్య, లక్ష్మీనరసయ్య, రఘుపతిరెడ్డి, మేరయ్య, చిన్నారెడ్డి, ఎల్లయ్యవంటి వీరులను, పోరాటంలో బలియైపోయిన త్యాగ ధనులను పేరుపేరునా తలచి, వారి స్మృతికి జోహారు చేశారు.

తెలంగాణ ప్రతి గుడిసె కప్పుపై /గుడిసె కొప్పుపై /గుడిసె కొమ్ముపై /తామ్రమ చూడు డొంకెక్కి, నిక్కి''నట్లు దినమణి పుదయించి నట్లు 'ఆంధ్ర మహాసభ' ప్రతి ఇంట్లోనూ సూర్యకాంతివంటి చైతన్యాన్ని ప్రసరింపజేసిందని రమణారెడ్డిగారు సంగపు సేవను గురించి తెలిపారు.

''కంటిలోపల నిప్పు/రొమ్ముపై డప్పు/వేవేల చేజేతులాడించి/.... రండి పోరండి పోరండి, పోరండి.-''ప్రజలంతా సంఘటిత శక్తితో పోరా డమని ఉత్సాహపరచారు.

''స్త్రీలు: మాశీలపు డక్కా మజ్లీన్ వొలిచిన ఓ దుశ్శాసనుడా !
పాచ్చాలు కదూ తమరు/మా మానాచ్ఛాదనాల
నొలిపింతురు !

మీర్జాల హామీరలు/జనపదాల గాంౢడింతురు !
దేశముఖులు మీకేమి/సభాలలో నెత్తురు తోడుతారు !

....తేతెండి, వడిసెలలు, రాలు రువ్వండి
పోపొండి మిరపపొడి కళ్ళ కుప్పండి''

అని స్త్రీలు విజృంభించి, శత్రువులను ఎదిరించిన సాహసాన్ని మైమరచి వర్ణించారు. ''ఏడ్చి యేడ్చి ఒక కోటి కళ్లు శాపాలు కురిసినాయా ! రాలు కురిసినాయా''-అని దీనంగా, ఉద్రేకంగా ప్రజా వెల్లువను ప్రతిబింబించారు.

చరిత్రకారుడు తెలంగాణ పోరాటాన్ని ''శ్రావణాకాశాన మిరు మిట్లు గొలిపి/శిశిరమున నునుకెంపు చివురులను తొడిగి/భాస్వంతమైన తారా ! ఓ కాంతిధారా !'' అని అభివర్ణిస్తాడని రమణారెడ్డిగారు భావించారు.

ప్రజలు అన్యాయాన్ని ఎదిరించి పోరాడిన ప్రతి సందర్భంలోను శ్రీ రమణారెడ్డి కవిగా వారిని ఉత్సాహపరుస్తూనే వున్నారు. ఆయన కవిత్వంలో సంస్కృత సమాసాడంబరమూ, క్లిష్టమైన అన్వయమూ, భావనలో గజిబిజి పాఠకులను కలవరపెడతాయి. అయినప్పటికీ అభ్యుదయ భావుకులు శిరోధార్యంగా గ్రహించవలసిన భావాలు రమణారెడ్డిగారి అడవి, భువనఘోష కావ్యాల్లో వున్నాయి. తెలంగాణ పోరాటం జరుగుతున్న కాలంలోనే రమణారెడ్డిగారు ప్రజల్ని చైతన్యవంతుల్ని చెయ్యటానికి ప్రయత్నించారు. కవిత్వం సుబోధకం కాకపోయినా సంకల్పం దొడ్డది.

## "మృత్యువుపై సమరం : తెలంగాణ సంగీతం"- గంగినేని 'ఉదయిని'

కమ్యూనిస్టు పార్టీని నిషేధించినపుడు అభ్యుదయ కవిత్వం యువతరాన్ని ఉగ్రూత లూగిస్తున్నప్పుడు శ్రీ గంగినేని వెంకటేశ్వరరావు కొన్నాళ్లు రాజకీయంగా రహస్య జీవితం గడిపారు. సిద్ధాంత బలంతో, పోరాటపు అనుభవంతో శ్రీ గంగినేని 'ఉదయిని' కావ్యం రచించారు. "ఒక బానిసదేశం తుపాకిపట్టి పోరాడకుండా స్వాతంత్ర్యం రాదు. ఒకవేళ ఎవరైనా, ఎక్కడైనా వచ్చిందంటే అది ఏదైనా కావచ్చు కాని స్వాతంత్ర్యం మాత్రం కాదు. అంచేతే తెలంగాణంటే నాకు అపారమైన గౌరవం, ప్రేమ. చైనాకు యానాన్ - పరిపూర్ణ స్వాతంత్ర్యానికి వీర రక్త బలిదానంతో రాస్తాపోస్తే-కార్మిక కర్షక స్వర్గం ప్రసాదిస్తే-భారతదేశానికి తెలంగాణా అదే పనిచేసింది; చేస్తూంది" (మృత్యువుపై సమరం; తెలంగాణా సంగీతం; 'ఎర్రజండాలు' ముందుమాట) అని తెలంగాణ తిరుగుబాటును కొనియాడారు, తెలంగాణా రక్త తర్పణచేసి భారతదేశ శిరోభూషణంగా చేసింది తెలుగు జాతిని" అని తెలంగాణ సీమను పూజ్య భావంతో స్మరించారు. పోరాటం తర్వాత తెలంగాణలో విస్తృతంగా పర్యటించి, ప్రజల అనుభవాలను తెలుసుకుని ఉత్తేజితులై ఎర్ర జండాలు (యధార్థ గాథలు - వచనం) ఉదయిని రచించారు.

"దిన గండాలు దాటలేక/దరిద్ర మహాజనావళి/మండీరణ జండా ఎత్తినది" అని తిరుగుబాటులో ప్రజాశక్తిని ఆవేశంతో ఉత్తేజ కరంగా తెలిపారు.

"దయాధర్మం/ఉరితీసే ఉదయం/ఒక్కనాటికైనా వద్దు" అని రాత్రి సమయమే పోరాటానికి అనువైనదని గెరిల్లాలకు వివరిస్తారు. "జాగ్రత, కామ్రేడ్స్/బ్రతుకు జాగ్రత! ముందుబాట జాగ్రత! నెత్తి మీద బరువు జాగ్రత! మన బ్రతుకు జాగ్రత!" అని గెరిల్లాలను హెచ్చరిస్తూ పోరాటంలో తీసుకోవలసిన జాగ్రతలను, మెళకువలను బోధించారు. "ప్రపంచాన్ని వెలిగించే/పతాకను నిలబెట్టండి" అని గెరిల్లాలకు ఉత్సాహం కలిగించారు. ఆనాటి పోరాటంలో వీరావేశంతో రసమయ గీతాలు రచించిన శ్రీ గంగినేని, అభ్యుదయోద్యమం చల్లారిన తర్వాత కవిగా మిగలలేదు. ఆ తర్వాత ఆయన ఏమీ రాసినట్లు లేదు.

## "పగలేయి నిజాంకోట" - రెంటాల 'సంఘర్షణ'

భారత ప్రభుత్వం నిజాం రాష్ట్రంపై పోలీసు చర్య జరపకముందే శ్రీ రెంటాల గోపాలకృష్ణ ప్రజలను ఉత్సాహపరుస్తూ,

"పగలేయి నిజాం కోట
ఎగరేయి ఎర్రబావుటా!
పగబట్టి త్రాచులా
పసిగట్టి రేచులా
పదండి విరుచుకొని
విరుచుకొని పదండి"

అని పోరాటంలో పాల్గొంటున్న ప్రజల చైతన్యాన్ని ఉద్దీపింప జేశారు.

"ఖబడ్దార్! నిజాం/కామ్రేడ్స్ ఇత్తజాం/తీయండి నైజార్! దెబ్బకే హజార్" అని నిజాంను హెచ్చరిస్తూ ప్రజల్ని సమరానికి

సన్నద్ధం కావలసిందని శ్రీ రెంటాల కోరారు. నిజాము రాజును 'దొంగ తోడేలు, కసాయి, కట్లపాము' అని వర్ణించి కనిపెట్టి ఉండండని ప్రజల్ని హెచ్చరించారు.

"నల్లగొండలో నిండివున్న జనం/నల్లమల గండిలో మండు తున్న బలం/నడిపించు, నడిపించు/నైజాం ఖిల్లాకు" అని నిజాం కోటను బద్దలు కొట్టవలసిందని ప్రజల్ని విజయోత్సాహుల్ని చేశారు.

"బూజెక్కిన ఈ సాంఘిక
శాసనాలు ఛేదించండోయ్
తెలుగుజాతి శౌర్యం ధైర్యం
పోతపోసి నిలపండోయ్"

అని ప్రబోధించిన శ్రీ రెంటాల 'సర్పయాగం' అభ్యుదయ కావ్యాలలో గణుతింపదగినది. పరీక్షిన్మహారాజు సర్పయాగంలో సర్పాలన్నీ ఆహుతి అయినట్లు ప్రజా కంటకులు, దోపిడీదారులు ప్రజలు చేస్తున్న పోరాట మహాయజ్ఞంలో సర్పాలై మాడి మసి అయిపోక తప్పదని శపించారు.

శ్రీ రెంటాల 'సంఘర్షణ, సర్పయాగం' కావ్యాలు అభ్యుదయ కవిత్వపు మహోద్యమంలో సహృదయుల్ని ప్రజల సమస్యల వైపు, ముఖ్యంగా తెలంగాణలో పీడనకు చిత్రవధలకు గురౌతున్న ప్రజల సమస్యల వైపు మళ్ళించాయి. కవి ఎప్పుడైనా అధర్మం పెచ్చరిల్లిన చోటనే సంభవిస్తాడని తన కావ్యాల ద్వారా ఋజువు చేశారు శ్రీ రెంటాల.

## 'వీర తెలంగాణ విప్లవ గాథలు' - హరీన్

సుప్రసిద్ధ భారతీయ కవి శ్రీ హరీంద్రనాథ చటోపాధ్యాయ జన్మస్థలం హైదరాబాదు. ఆయన భారతీయ కవికోకిల సరోజినీదేవి సోదరుడు. తెలంగాణ పోరాటం జరుగుతున్న కాలంలో ఆయన ఇంగ్లీషులో రచించిన Tales of Telangana కావ్యాన్ని శ్రీ ఆరుద్ర 'వీర తెలంగాణా విప్లవ గాథలు' పేరుతో తెలుగు చేశారు. (పుచ్చలపల్లి

సుందరయ్యగారి 'వీర తెలంగాణా విప్లవ పోరాటం - గుణపాఠాలు' పుస్తకానికి అనుబంధంగా చేర్చబడింది.)

"అమాయకుల హత్యలతో/సతుల మానభంగాలతో/బరువు తాళ లేని జనత/తిరిగి చిందు నెత్తురుతో/తడిసిన యీ అమరగాథను విలేఖించనిండు" అని హరీన్ కలాన్ని కన్నీళ్లలో ముంచి యీ కావ్యాన్ని రాశారు ! 'దేహమొణుకు ఎలుకలాటి దేశముఖులు' గూండాల అండతో, తుపాకుల బలంతో ప్రజల్ని ఎన్నాళ్లు అణచి వుంచగలరు ?

భూస్వాముల దౌర్జన్యాన్ని వర్ణిస్తూ "తప్పుడు పత్రాలపైన/ అప్పుల పత్రాలపైన/రైతాంగం నిశానీలు/రచ్చకీడ్చి వేయించెను. అటు పిమ్మట వాళ్ళ బ్రతుకు అన్ని దిశల బంధించెను"—ఈ దౌర్జన్యంలో భూస్వాములకు అండగా నిలిచిన పోలీసు బలగాన్ని "శాంతి భద్రత లందున సొంతంగా మర బొమ్మలు/హింసానందులు/మూర్ఖులు!" అని ఎగతాళి చేశారు. దోపిడీదారు ప్రజల ఆస్తి పాస్తుల్నేగాక విద్యను, రాజకీయ చైతన్యాన్ని కూడ దొంగిలించి వాళ్లను అజ్ఞానంలో ముంచేశాడు.

"హఠాత్తుగా విప్లవమ్ము
అరుదెంచే అతిథికాదు
అది అభేద్యమైన దొడ్డ
అగ్నిపర్వతమువంటిది-"

సమయం వచ్చి లావా విరజిమ్మేదాక వేచి వుండాల్సిందే.

తెలంగాణం తేనె మాగాణమే. దానిలో నీటి వసరులు కల్పించక, రైతులు ఎముకల నుసిజేసి పండించిన కొస్త పంటనూ, శిస్తుల కింద, అప్పుల కింద, నజరానాల కింద జమ కట్టుకుని నేలను రాతి మయం, నిస్సారం చేశారు.

ప్రజల పక్షాన నిలిచి శ్రీ హరీన్ "మానవుడా నీ కొసగిన/ మహిత ధనము జీవితమ్ము" అని అభయమిచ్చి "తీరాలూ సరిహద్దులు/ చెరిపేసిన నవలోకం/చెడుపులేని నవలోకం/శ్రామిక సామ్రాజ్యమగును/ శ్రామికులే సామ్రాట్టులు" అని కష్ట జీవుల పాలిటి కల్పవల్లిగా నిలిచారు.

రాములనే వెర్రిబాగుల గొర్రెకాపరి స్వేచ్ఛా జీవి. "పాట అతనికి పాల బువ్వ/పాట అతనికి సర్వలోకము/నింపునెపుడు పాట లాతని/నెత్తురందున టంకారము" అతనికి భూమి వాసనలన్నీ తెలియును/ప్రొద్దు చూస్తే గంట చెప్పును/ఎన్నడూ నెహ్రూ గురించి విన్నాడే కాడు." ఏమీ ఎరుగకవాడు ఎర్రజండా మీద కీర్తన పాడి నందుకు పోలీసులతన్ని కిరాతకంగా హింసించారు. వాని గాథను హరీన్ కరుణ రసాత్మకంగా రచించారు.

మరో గాథలో ఒక దేశముఖ్ దౌర్జన్యాన్ని సవిస్తరంగా వర్ణించారు. "రెండున్నర వేల పూల రేకులు నలిపేసిన" భయంకర కాముకుడాతడు. ఇన్నాళ్లూ అతనికి లొంగి వున్న గ్రామస్తులు నిటారుగా నిలిచి నెత్తురుకొక కొత్త చేవ పట్టించుకున్నారు. దేశముఖ్‌ను మట్టు పెట్టారు.

వేరొకగాథ కుమరయ్యది. దీన్ని శ్రీ హరీన్ రమణీయంగా రచించారు. "పైరు పచ్చగాఉంటే/పస్తుల నరకం లోపల/పడుతున్నాం మనమెందుకు?/అన్నాడిది కుమరయ్య విన్నారిది ప్రజలు?" "దొర మబ్బులు పుట్టించడు/దొరవానలు కురిపించడు/తోలుకుపోతాడు పంట/ అన్నాడిది కుమరయ్య/విన్నారిది ప్రజలు-మనం బ్రతుకు శవాలము/ మనకన్నా కుక్కలకే/మంచి కూడు దొరుకుతుంది" అని కూడ అన్నాడు. ఫలితంగా అతనిమీద దుండగీంద్ర గుండ్లవాన కురిసింది. ఒళ్ళంతా తూట్లు పడగా నేలతల్లి ఒడిలో ఒదిగిపోయి ప్రజాహృదయాలలో చిరంజీవి అయినాడు.

పోలీసులు స్త్రీలను చెరపట్టి వీరుల జాడలు తెల్పమని హింసించ సాగారు. తొడల లోపల జలగలు దూర్చి రక్తం పీల్పించారు. తుచ్ఛులు మీ కన్న ఈ/పిచ్చి జలగలే మెరుగు సంతోషముగా వీటికి/సంతర్పణ చేస్తాను" అన్న వీరవనితను కన్నభూమి వీర తెలంగాణా. "మీ పాపం పండుతుంది/మీ రాజ్యం కూలుతుంది....ఇది జోస్యం కాదు/ఇతిహాసపు గతి తర్కం, ఈ పత్రం ప్రకటించును/ఇలలో అంతిమ విజయం" అని సంకల్పించిన వీర వనితల త్యాగభూమి తెలంగాణ.

పోరాటాన్ని అధ్యయనం చేసి, ప్రపంచానికి తెలంగాణ విషాద గాథలను చాటాలన్న దీక్షతో శ్రీ హరీన్ రచించిన గాథలను శ్రీ ఆరుద్ర మిక్కిలి ప్రతిభావంతంగా తెనిగించారు.

ఈ ముప్పై సంవత్సరాలలో తెలంగాణ జాగృతమైంది. సాంస్కృతికంగా ముందంజ వేస్తున్నది. ప్రజలు వెనుకటివలె అమాయ కంగాలేరు. తమ మేలు కోరేవారెవరో తెలుసుకోగలుగుతున్నారు. ఇప్పుడు తెలంగాణనుండి వస్తున్న కవిత్వం చూస్తే అది ఆంధ్రదేశంలో ఇతర ప్రాంతాలనుండి వస్తున్న కవిత్వానికి ఏమీ తీసిపోదు. కొన్ని సమ యాల్లో రాజకీయంగా, సాంస్కృతికంగా తెలంగాణమే నాయకత్వం వహిస్తున్నది. శతాబ్దాల బానిసత్వం తొలగిపోయి ప్రజలు స్వేచ్ఛను అనుభవిస్తున్నా, ఇంకా తమ న్యాయమైన హక్కులకోసం పోరాడు తున్నారు. త్వరలో తెలంగాణ తేనెమాగాణమై, ఆర్థికంగా సాంఘికంగా అభివృద్ధి పొందుతుంది.



నాల్గవ అధ్యాయం

# స్వాతంత్ర్యానంతర సాహిత్యంలో

## సంప్రదాయ కవిత్వ స్వరూపం

తొమ్మిది శతాబ్దాలపాటు తెలుగు కవిత్వంలో సాగిన కవిత్వ సంప్రదాయాలను యీ శతాబ్దిలో గూడ కవులు కొనసాగిస్తున్నారు. 'సమకాలికులంతా ఆధునికులు కారు' అని టి. ఎస్. ఇలియట్ పేర్కొన్నట్లుగా ఇప్పుడు తెలుగులో రాస్తున్న కవుల నందరినీ ఆధునికులన టానికి వీల్లేదు. పురాణాలను, ఇతిహాసాలను ఆంధ్రీకరించేవారు, మత గ్రంథాలను, భక్తుల చరిత్రలను, పూర్వకాలపు ఔన్నత్యాన్ని వెల్లడించే ఇతివృత్తాలను తీసుకొని శతాబ్దాలుగా వస్తున్న సంప్రదాయ ఛందస్సుల్లో రచిస్తున్నవారు నేటికీ వున్నారు. ఇకముందు కూడ వుంటారు. సంప్రదాయబద్ధులైన కవులలో కొందరికి వెనుకచూపు ఎక్కువ. మరి కొందరికి సంప్రదాయమూ, ఆధునికతా రెండూ కావాలి. ఇంక కొందరు సమ కాలంలో జీవిస్తూ, నేటికాలపు వైజ్ఞానిక పురోగమనాన్ని, సంఘ సంస్కరణలను, ఆధునిక భావచేతనను ఏవగించుకుంటూ రచనల్లో పాతరాతి యుగాల అవశేషాలను మిగులుస్తుంటారు. రానురాను ఎవరినేనా 'సంప్ర దాయవాది' అంటే అదొక తిట్టుగా ఆధునికుల పద్య వాడుక వచ్చేసింది. సంప్రదాయమంటే అనూచానంగా వస్తున్న ఆచార వ్యవహారాలూ, అల వాట్లే గదా ! వీటిని ఏవగించుకోవలసిందేనా ? అంటే కాదనే జవాబు.

'మంచిగతమున కొంచెమేనోయ్' అని మహాకవి గురజాడ పలికినట్లుగా సంప్రదాయంలో మంచిని స్వీకరించి, ప్రతిభావంతులైన కవుల రసవంతమైన కావ్యాల్లో ఆనందాన్ని స్వీకరించడానికి అభ్యంతరం వుండ

నక్కరలేదు. ఆధునిక కవులలో తరచుగా కానరాని కవన శిల్పం, శబ్దం మీద అధికారం, లోతైన భావాన్ని అన్వయ కాఠిన్యం లేకుండ చెప్ప గలగటం, ముఖ్యంగా శబ్దాలు అర్థంచేత ఎంత చెప్తాయో, వాటి సవ్వడి చేత కూడ అంత భావాన్ని అందించగల్గటం (sound echoeing sense) వంటి సుగుణాలు సంప్రదాయ కవులలో కానవచ్చినంత ఎక్కువగా ఆధునిక కవులలో కానరావు.

సంప్రదాయమొక జీవనది. అది ఇంకి పోదు. కాకపోతే కాల గమనాన్ని బట్టి దాని గమనం మారుతూంటుంది. కొన్నిసార్లు పాత సంప్రదాయాలే బలపడి సరికొత్త రూపంలో కొత్త సంప్రదాయాలుగా రాణిస్తాయి.

'సంప్రదాయం నిలిచే వుంటుంది హమేషా' అని శ్రీ శ్రీ పలికినట్లుగా సంప్రదాయం మనకు అస్తిగతమై, వారసత్వంగా అంటి పెట్టుకొని వస్తూంటుంది. అన్ని సంప్రదాయాలూ అనుసరణ యోగ్యా లనటానికి వీల్లేదు. కొన్ని చెడ్డ సంప్రదాయాలు తొలగిపోవటంమంచిదే అనిపిస్తుంది. ఇప్పుడెవరూ 'సహగమనాన్ని' సమర్థించేవాళ్ళులేరు. ఆ దురాచారాన్ని ఖండించవలసిన అవసరం మాత్రం ఎవరికి వుంది? కవులు ఇప్పుడు "వెలనాటివాడ కవితకు వెలనాటినవాడన్" అనే పద్ధతిలో కులాన్ని గురించి గర్వంగా చెప్పుకోవటంలేదు. అప్పకవి లాగ శూద్రులు రాసిన కావ్యాలు ఆదరణ యోగ్యాలు కావని ఎవరూ నిరాక రించటంలేదు. కాని సమాజంలో వేళ్లూనిన కులతత్వం వెర్రితలలు వేస్తూనే వున్నది. కులతత్వాన్ని నిరసించి సమానత్వాన్ని కోరటం ఆధునిక కవులు ఏర్పరచిన నూతన సంప్రదాయం. "ఎల్ల లోకము లొక్క ఇల్లై) వర్ణ భేదము లెల్ల కల్లై" సుఖ శాంతులతో నిండాలని ఆధునిక కవులు కాంక్షిస్తున్నారు.

ఒక కావ్యంలో సంప్రదాయ బలమే అధికమైనప్పుడు గూడ, సహృదయులు దాన్ని తృణీకరించటం వివేకమైన పనికాదు. ఆధునిక

కవిత్వం వేయి రేకులు విరిసిన పద్మం అనుకుంటే ఆ పద్మం తొడిమ లేకుండా నిలిచి వుండదని గుర్తుంచుకోవాలి.

ప్రతి కవిత్వోద్యమమూ అంతకుముందు స్థిరపడిన కవితా సంప్రదాయాల మీద తిరుగుబాటు చేస్తుంది. అంతమాత్రంచేత పాత కవిత్వ సంప్రదాయాలు తుడిచి పెట్టుకుపోవు. వాటిలో మంచిని నమ్మి, చిత్తశుద్ధితో, ప్రతిభతో, కావ్య రచన చేస్తున్న కవులున్నప్పుడు, వారి రచనలకు ఆదరం వుంటుంది. ఆధునిక కవిత అందంగా, స్థిరంగా, బలమైన పునాదులు మీద నిలిచి వుండాలని కోరుకుంటే పునాదిని నిందించటమెందుకు? కవి స్వీకరించిన వస్తువు, కవి జీవించిన కాలంలోది కాకపోవచ్చు. కాని వస్త్వాశ్రయమైన కవిత్వంలో కవి ప్రవేశించకుండ వుండలేడు. కథ జరిగిన కాలంలోకి కవి వెళ్ళి ఆ దేశ కాల పరిస్థితులలో నిమగ్నుడైనప్పుడే సంప్రదాయ కవిత్వం రక్తికడుతుంది. ఈ అంశాన్ని టి. ఎస్. ఇలియట్ "The emotion of art is impersonal. And the poet cannot reach this personality without surrendering himself wholly to the work to be done. And he is not likely to know what is to be done unless he lives in what is not merely the present, but the present moment of the past, unless he is conscious, not of what is dead, but of what is already living" అని చెప్పారు.[1]

కవిత్వోద్యమాలు ఝుంఝూ ప్రభంజన ధాటితో వస్తాయి. వాటి కెదురు నిలిచిన దుష్టసంప్రదాయాలు విరిగి, కూలి, వ్రేళ్ళతోసహా పెకలించుకుని కొట్టుకుపోతాయి. కాని ఆ ప్రభంజనాల్ని తట్టుకున్న శాశ్వత విలువలను పెంపొందించే సంప్రదాయాలు మాత్రం నిలిచి వెలుగొందుతాయి. ఆధునికత విపరీతమై, వెర్రితలలు వేసినప్పుడు సంప్రదాయమే శరణ్యమయ్యే ఘట్టాలూ జీవితంలో ఎదురౌతాయి. సంప్రదాయాలూ వాటిపై జరిగే తిరుగుబాట్లూ కాలగమనంలో అనివార్యంగా జరిగేవే.

1. Tradition and the Talent (Essay) - T. S. Eliot.

శ్రీ సి. నారాయణరెడ్డి చెప్పినట్లు "సంప్రదాయము ప్రాణవంతముగా నుండుటకు ప్రయోగమే చక్కని సాధనము."[2]

పురాణేతిహాసాలు రాసినా, ప్రబంధాలు రచించినా, శతకాలు, ద్విపదలు ఏ సంప్రదాయాన్ని అనుసరించినా అందులో సమకాలికమైన ఆలోచనాధోరణి కన్పించి తీరాలి. అప్పుడే ఆ కవితకు సార్థకత. ఆట వికుల్ని గురించి రాసినా, ఆదిమ మానవుల్ని గురించి రాసినా అందులో ఆధునిక భావచేతన కన్పించాలని ఆర్థర్ కోస్లర్ ఒక సందర్భంలో అన్నారు.

ఈ కాలంలో రామాయణ, భారత గ్రంథాలు రచించినా, ప్రబంధాలు శతకాలు మొదలైన సంప్రదాయ ప్రక్రియల్లో ఏ రచన చేసినా అందులో ఇరవయ్యవ శతాబ్ది ఆలోచనారీతి ప్రతిబింబించాలి. భక్తి, వైరాగ్యం, నమ్మకం ఏదైనా పాఠకుని ఆలోచనారీతికి వెగటనిపించక, రోతకల్పించక, ఆనందం కల్పించాలి. అప్పుడే ఆ రచనకు విలువ వుంటుంది.

"రోజూ కనపడే నక్షత్రాల్లోనే
రోజూ కనపడని కొత్తదనం చూచి
రోజూ పొందని ఆనందానుభూతి
పొందడం అంటేనే కవిత్వం
మనకంటే లక్షయేండ్లు పెద్దది
మన నెత్తిమీదున్న ఆకాశం
దూది పింజెల్లాంటి కొత్త మబ్బుల్తో
తొంగి చూడ్డమే పునర్నవం"[3]

అన్నారు శ్రీ దాశరథి. సంప్రదాయం పాతదేకావచ్చు. కాని దాన్ని అనుసరించే కవి కంఠంలో అనుభూతి కొత్తది కావాలి. లేకపోతే

2. ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయము : ప్రయోగములు - సి. నారాయణరెడ్డి - ప్రథమ ముద్రణ - 1967.

3. పునర్నవం - 'దాశరథి కవిత' - మహాంధ్ర ప్రచురణలు - 1977.

ప్రాచీన కవిత్వానికి పేలవమైన ప్రతిధ్వనే అవుతుంది. సంప్రదాయంలో వేళ్ళూని కవితా కుసుమాల ద్వారా పరిమళాలు వెదజల్లే కవితకే ఆదరం లభిస్తుంది.

ఇరవైయవ శతాబ్ది తెలుగు కవిత్వంలో మున్నెన్నడూ లేనంత ప్రక్రియా వైవిధ్యం కన్పిస్తున్నది. ఇందులో సంప్రదాయ పద్ధతిలో వచ్చిన కావ్యాల శక్తిని తక్కువగా అంచనా వేయకూడదు. స్వాతంత్ర్యానంతరం తెలుగులో వచ్చిన సంప్రదాయ కవితలో వైశిష్ట్యాన్ని ఆధునిక దృష్టిని, ధర్మ ప్రబోధాన్ని గురించి తెలుసుకోవటం అవసరం. ఈ శతాబ్దం ఆరంభంనుండి కవిత్వం రచిస్తున్న శ్రీ రాయప్రోలు సుబ్బారావు అభినవాంధ్ర కవితకు ఆచార్యులు. కాని సంప్రదాయ కవితకు దూరంకాని మహాకవి. ఆయనతో ప్రారంభించి స్వాతంత్ర్యానంతరం తెలుగులో వచ్చిన సంప్రదాయ కవిత్వపు తీరు తెన్నులను గమనిద్దాం.

## "తెలుగుతోట చల్లని పందిళ్ళలో వాల్మీకి గోమతల్లికను పితికిన" రాయప్రోలు 'సుందరకాండ'

"ఏ దేశమేగినా ఎందుకాలిడినా/ఏ పీఠ మెక్కినా ఎవ్వరెదురైన/పొగడరా నీ తల్లి భూమి భారతిని" అని జాతీయతా భావస్ఫోరకమైన దేశభక్తిని ప్రబోధించిన కవిత్వం రచించారు శ్రీ రాయప్రోలు సుబ్బారావు. గురజాడతో ప్రారంభమైన నూతన కవితా రీతిని కొనసాగించాలని శ్రీ రాయప్రోలు, శ్రీలు పొంగిన జీవగడ్డయి/పాలుపారిన భాగ్యసీమయి/వరలినది యీ భరతఖండము/భక్తి పాడర తమ్ముడా! వేదశాఖలు వెలసెనిచ్చట/ఆది కావ్యంబలరె నిచ్చట" అని ఆదినుండి సంప్రదాయాన్ని గాఢంగా అభిమానించిన కవి శ్రీ రాయప్రోలు. మంచి గతమున కొంచెమేనని ఆయన ఎప్పుడూ తలచలేదు. గత కీర్తిని వర్ణిస్తూ, గొంతెత్తి చదవటానికి వీలైన సీసపద్యాల్లో రచించి ఆధునిక కవులకు మార్గదర్శకులయ్యారు. "ఏ మంచి పూవులన్ ప్రేమించినావొ/జనియించినాడవీ స్వర్గ ఖండమున" - యీ దేశంలో పుట్టటానికి పూర్వ జన్మలో మంచి పువ్వుల్ని ప్రేమించి ఉంటావన్న రమ్యమైన ఊహ

చేశారు. "ఓడల జెండాలు ఆడునందాక/సూర్యుని వెలుతురు సోకు నందాక" ఆంధ్రతేజం వ్యాపిస్తుందని పులకలెత్తించారు.

సంప్రదాయ సిద్ధంగా వ్యాప్తిలోవున్న కవి సమయాలను, ఉపమాలంకారాలను, ముఖ్యంగా శృంగార రసపోషణను ధిక్కరించి, తిరుగుబాటుచేసి నూతన సంప్రదాయాలను ప్రోదిచేసే లాక్షణిక గ్రంథం 'రమ్యాలోకమ్' రచించారు.

"హారముభారమై వనవిహార సుమాపచయ ప్రియోత్సవా
చారము క్రూరమై మధురసాయన రుచ్యపదార్థ కల్పితా
హారము కారమై నవహిమాంబు కదంచిత చందనాద్యలం
కారమువైరమై వెతలగాసిలితిన్ నినుబాసి నెచ్చెలీ"

(లలిత కావ్యంనుండి)

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు మెచ్చిన యీ పద్యంలో సంప్రదాయంతోపాటు, సరిసమానంగా ఆధునికభావసౌందర్యం వెల్లివిరుస్తున్నది.

స్వాతంత్ర్యానంతరం వారు రచించిన 'దూత మత్తేభం'లో (కాళిదాస మహాకవి మేఘసందేశానికి అనువాదం) పద్యరచనలో యతి ప్రాసలు పాటించలేదు. సనాతన సంప్రదాయాలన్నింటిని గుడ్డిగా అనుసరించనక్కరలేదని భావించి భావ వ్యక్తీకరణకు అడ్డుగా వున్నాయనిపించి, యతి ప్రాసలను పాటించలేదు. స్వాతంత్ర్యానంతరం రాయప్రోలు వారి లేఖిని మందగమనం సాగించింది కాని ఆగిపోలేదు. 88ఏళ్ళ వృద్ధాప్యంలో కూడ వారు రచనలు చేస్తున్నారు. ఇటీవల వారు వయసుకు తగ్గట్టే తిరుగుబాటు ధోరణిలోగాక, ఆవేశం చల్లబడి, వార్ధక్య చిహ్నమైన భక్తి రచనలు వెలువరిస్తున్నారు. సుందరకాండ, సౌన్దర్య లహరి, రాస పంచాధ్యాయి అను కృష్ణలీలా దర్శనము మొదలైన రచనలు సంప్రదాయ ప్రీతిని వెల్లడిస్తున్నాయి. వీటిలో అభినవ కవిత కన్పించదు.

వాల్మీకి రామాయణంలో సుందరకాండకు రాయప్రోలువారు గేయ రూపమైన అనువాదం చేశారు. బ్రహ్మానందయతికి, గురుదేవు రవీంద్రుడికి, 'శుచిమతి' వారి పిన్నిగారికి నమస్కరించి, 'నన్నయ బ్రహ్మ'ను ప్రార్థించి, వాల్మీకి మహాముని శ్లోకాలను గేయ రూపంలో రచించారు. 'కాళిదాసు శృంగారము, భవభూతి కరుణము, జయదేవుని విరహము, త్యాగరాజు నాద బ్రహ్మరీతి' వీరికి ఆదర్శం. "తెలుగు తోట చల్లని పందిళ్లలో వాల్మీకి గోమతల్లి కను పితికి" పితికి రాయప్రోలు పంచిన కవితామృత క్షీరధార 'సుందర కాండ'.

సుందరకాండకు ఇప్పటికి ఎన్నో అనువాదాలున్నాయి. పద్యంలో వచనంలో వున్నన్ని అనువాదాలు గేయాల్లో లేవు. "పాఠ్యే గేయేచ మధురం రామాయణమ్" - గేయ రూపంలో అనువాదం రామకథకు మరింత మాధుర్యం సంతరించి పెడుతుందనటంలో సందేహంలేదు - స్త్రీల రామాయణపు పాటల్లో యీ రహస్యం ఏనాడో వెల్లడైంది. రామ కథను స్త్రీలు స్వతంత్రించి మార్చి పాటలుగా పాడుకున్నారు. రాయప్రోలు వారు సంప్రదాయ విధేయులై వాల్మీకిని అనువదించటం చేత కవిత్వంలో కల్పనలు లేవు. భక్తులకు, రామాయణం పారాయణం చేసేవారికి తప్ప ఆధునిక కవితాభిమానులకు వీరి సుందరకాండ అనువాదంలో ప్రత్యేకత ఏమీ కన్పించదు.

"కష్ట నష్టములు, గండ కత్తెరలు, ఆధివ్యాధులు, వ్యధలు, వేదనలు, దీనిని చదివిన తీరునని" తలచి వీరీ అనువాదానికి పూనుకున్నారు. పూర్వ కవితా మర్యాదలపై తిరుగుబాటుచేసి, అభినవ కవితకు ఆచార్యులై రెండు దశాబ్దాలు భావ కవిత్వంలో వెలుగులు విరజిమ్మిన కవి, సంప్రదాయానికి పూర్తిగా వశులై, ఆధ్యాత్మిక దృష్టితో యీ కావ్యాన్ని రచించటం వింతగా తోస్తుంది.

మారుతి రావణాంతః పురంలో ప్రవేశించినప్పుడు రాణివాస స్త్రీలు మైమరచి నిద్రిస్తున్న దృశ్యాన్ని వాల్మీకి రమణీయంగా తీర్చిదిద్దారు.

"రేలంతయు తమ ప్రియుల కౌగిలిం
తల నలిగిన నెలతలగపడిరి, మే
నుల వన్నెలు సిగ్గులను ముసుగుపడ
పువ్వుల పొర్లిన గువ్వలగోమున"

మొదలైన గేయాల్లో రాయప్రోలు వారి అనువాదం హాయిగా తోస్తుంది.

రాసపంచాధ్యాయి, సౌన్దర్య లహరి కూడ రాయప్రోలు వారి అనువాద నైపుణ్యాన్ని తెలిపేవేగాని, కవితా శక్తికి నిదర్శనమైనవి కావు. ఆయనలో యింకా ఉత్తమ కవిత్వ రచనాశక్తి,

"కడిగిన మృగమద పాత్రిక."

విడువని పరిమళము పగిది" ఏ కొంతో మిగిలి వున్నది.

## విశ్వనాథ సంప్రదాయాభి నిరతి

సంప్రదాయశక్తి మూర్తీభవించిన మహాకవి శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, స్వాతంత్ర్యానికి పూర్వమే ప్రారంభించి 1961 లో 'శ్రీ మద్రామాయణ కల్పవృక్షము' పూర్తి చేశారు. ఈ శతాబ్దిలో వెలువడిన కావ్యాల్లో రాశిలోనేగాక గుణంలోకూడ గొప్ప కావ్యం. వాల్మీకి రామాయణానికి వ్యాఖ్యానప్రాయమై, భాస, కాళిదాస, మురారి, రాజశేఖర, దిఙ్నాగ మొదలైన రామాయణ కథాభాష్యకారుల మేలిగుణాలను పుణికి పుచ్చుకొని శ్రీ విశ్వనాథ కల్పవృక్షం రచించారు.

"వ్రాసిన రామచంద్రు కథ వ్రాసితి వంచనిపించుకో వృథా
యాసముగాక కట్టుకథ లైహికమా ? పరమా ? యటంచుఁదాఁ
జేసిన తండ్రి యాజ్ఞయును జీవుని వేదన రెండునేకమై
నా సకలోహవైభవ సనాథము నాథ కథన్ రచించెదన్"

అని రామాయణ రచనాప్రేరణ గురించి తెలిపారు. 1934 లో మల్లాది రామకృష్ణశాస్త్రిగారు విశ్వనాథవారిని "దేశము పట్టనంతటి మహాకవి" అని ప్రశంసించారు.

"నాది వ్యవహారభాష, మంథరము శైలి" అని విశ్వనాథవారు వ్యావహారికంలో రాస్తున్నామని అన్నారుగాని ప్రౌఢగంభీరమైన వారి శైలి కొన్నిచోట్ల కొరకరాని కొయ్యగా కన్పిస్తుంది. శ్రీ జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి విశ్వనాధవారి శైలిని "పాషాణపాకం"గా అభివర్ణించారు. రామాయణ కల్పవృక్షమంతా పాషాణపాక అనుకుంటే అది పెద్ద పొరపాటు. ఇందులో ద్రాక్ష, నారికేళ, కదళీపాకాలన్నీ వున్నాయి.

కవి ప్రతిభలోననుండు, గావ్యగత శ
తాంశములయందు తొంబదియైనపాళ్ళు
ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవకథా దృతిని మించి"

అని కథ చెప్పటంకంటె రసపోషణలోనే కవి ప్రతిభ వున్నదని తలచారు.

'ఋషివంటి నన్నయ్య రెండవ వాల్మీకి' అని భావించి విశ్వనాథ వారు నన్నయ్యగారి కవితామార్గంలో నడిచారు. "తన యెదయెల్ల మెత్తన, కృతప్రతి పద్యము నంతకంటె మెత్తన" అయిన చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి శిష్యులు కావటంచేత పద్యరచన విశ్వనాథవారికి వెన్నతో పెట్టిన విద్యే. తనవంటి శిష్యుడుండటం వేంకటశాస్త్రిగారికి గర్వకారణమని విశ్వనాథవారు చెప్పిన పద్యం-

"అలనన్నయ్యకులేదు తిక్కనకు లేదా భోగమస్మాదృశుం
డలఘుస్వాదు రసావతారధిషణాహంకార సంభారదో
హలబ్రాహ్మీమయమూర్తి శిష్యుడైనాడన్నట్టి దావ్యోమపే
శల చాంద్రీమయకీర్తి చెళ్లపిళ వంశస్వామి కున్నట్లుగన్"-

అనేది వివాదాస్పదమయినదే అయినా, విశ్వనాథవారి ప్రౌఢ గంభీరశైలికి నిలువుటద్దం వంటిది.

రామాయణ కల్పవృక్షంలో ఉదాత్త కల్పనలు చవిచూడాలంటేనే దానికొక ప్రత్యేక గ్రంథం రాయవలసి వుంటుంది.

"ఎదకు పురాంధ్ర సంస్కృత కవీశ్వర భారతి దీప్తి కల్గినన్
సదమల బుద్ధికిన్ బహుళ శాస్త్ర రహస్య వివేక మబ్బినన్
మదికి నుదాత్తకల్పనల మక్కువ కల్గిన విశ్వనాథ శా
రద సకలార్థదాయిని సురద్రువు రామకథన్ భజింపుమీ"

అని ఆత్మ విశ్వాసంతో విశ్వనాథవారు పల్కటం సమంజసమే. కావ్యా వతారికలో ముక్త్యాల యువరాజు వర్ణనలో ఉపయోగించిన 'కుది మట్టమైన బొమ్మ'వంటి పదబంధాలు విశ్వనాథ ముద్రను నిలబెడతాయి.

బాలకాండలో శ్రీరాముని బాల్యం, అహల్యా శాప వృత్తాంతం, మేనకా విశ్వామిత్రం, శివధనుర్భంగం విశ్వనాథవారు రమణీయంగా తీర్చిదిద్దారు. అయోధ్యకాండలో మంథర దుర్బోధ, అరణ్యవాసానికి రావద్దని రాముడు సీతను వారించే ఘట్టమూ చక్కగా రచించారు. కాని గుహుడు, శబరి పాత్రలు విశ్వనాథవారి రచనలో విశిష్టమైనవిగా తోచవు. అరణ్యకాండలో మారీచుడు లేడిగా మారటం, రాముడు లేడిని పట్టుకొనే ప్రయత్నాన్ని కవి వివిధ వృత్తాలతో ఛందో వైవిధ్యం ప్రదర్శిస్తూ రచించారు. కిష్కింధకాండలో సంపాతి వార్ధక బాధను వివరించే సందర్భం, సుందరకాండలో 'రామచంద్రవిరహాకృతి'యైన సీత అశోకవనంలో దుఃఖించిన తీరు, రావణుడు సీతను వ్యామోహపరచే ప్రయత్నం కవి మిక్కిలి కౌశలంతో రచించారు. యుద్ధకాండలో రావణుని తేజస్సుకు ఆశ్చర్యపడిన శ్రీరాముని తలపులను కమనీయంగా వర్ణించారు.

రామాయణ కల్పవృక్షంలో వున్నంత ఛందో వైవిధ్యం మన పూర్వ సాహిత్యంలో ఒక్క తిక్కన స్త్రీపర్వంలో మాత్రమే వున్నది.

రామాయణ కల్పవృక్షాన్ని శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రి లడ్డుండతో పోల్చారట. "దీనిలో మీగడ, ఏలకిపొడి, కమ్మని నెయ్యి, కుంకుమ పువ్వు ఇంకా సుగంధాలన్నీ వున్నాయి. కాని పళ్లూడిపోయే రాళ్లు కూడ అక్కడక్కడ తగులుతాయి" అన్నారట. ఈ మాట సత్యమే. విశ్వనాథవారి భావావేశం మహాకవి కూడ ఓపలేనిదే. 'ఏను మనస్సన్యా

సిని' అని అన్నారుగాని ఆ స్థితికి చేరుకోకముందే రామాయణం రచించి నట్లు కనపడుతుంది. "దీపికాలాతము వోలె సుంతయు విలంబనమోర్వదు, నిత్యవేగి నాచేతము శబ్దమేరుటకుఁ జిన్నము నిల్వదు భావ తీవ్రతన్" అని వారు చెప్పుకున్నట్లే కొన్ని దోషాలు అక్కడక్కడా దొరలాయి. వీటిని వారి భక్తులు సమర్థింప జూస్తారుగాని, రస నిర్వహణలో, ఔచిత్య పోషణలో దొరలిన దోషాలు సహృదయులకు ఇబ్బంది కలిగిస్తాయి. వాటిని గురించి వివరంగా చర్చించటానికి ఇక్కడ అవకాశం చాలదు.

మొత్తంమీద విశ్వనాథవారి గుణదోషాలు రెండూ అనితర సాధ్యాలే. తెలుగులో రంగనాథ, భాస్కర, మొల్ల రామాయణాల తర్వాత తెలుగువారు చిరకాలం ఆదరించే మహాకావ్యం 'శ్రీ మద్రామా యణ కల్పవృక్షము.'

జీవించినంత కాలమూ కలం ముడిచిపెట్టక నిర్విరామంగా కావ్య రచన చేసిన విశ్వనాథవారి కావ్యాలన్నీ వైవిధ్యంతో కూడినవే. కాని కవిత్వంలో ఏకాగ్రత తక్కువై, శిథిల బంధాలూ, కొన్నిచోట్ల కవితా వేశం తక్కువైన వర్ణనలూ ఎదురౌతాయి. "నా కావ్యములకు ప్రబోధక ములు మూడు విషయములు. మొదటిది ఎవడో నాకీ కావ్యము వ్రాసి పెట్టు అని అడగటం; రెండవది అంతః ప్రబోధము; మూడవది మనస్సులో కొన్ని భావములు పేరు కొన వానికొక రూపమియ్యవలెనను కొనుట" అని విశ్వనాథ తన కావ్య ప్రేరణకు కారణాలను పేర్కొన్నారు. వీటిలో మొదటి కారణం వలన రాసినవి 'ఝాన్సీరాణి'; 'కుమారాభ్యుదయము'; 'విశ్వనాథ మధ్యాక్కరలు' మొదలైనవి. ఇంకా స్వాతంత్ర్యానంతరం విశ్వనాథవారు రాసిన కావ్యాల్లో 'రురు చరిత్రము; ప్రద్యుమ్నోదయము; శివార్పణము; శ్రీకృష్ణ సంగీతము; గోపికా గీతలు; భ్రమర గీతలు ప్రసిద్ధమైనవి. ఇవిగాక వారు రాసిన నవలలు, విమర్శ గ్రంథాలు కోకొల్లలు. ఏ రచన చేసినా విశ్వనాథ వారు సనాతన భారతీయ ధర్మాన్ని ప్రచారం చెయ్యటానికి తమ శక్తిని వినియోగించారు. రామాయణ కల్పవృక్ష రచనకు పూర్వం వారి కావ్యాల్లో లభించే రసానందం ఇక్కడ పేర్కొన్న కావ్య రాశిలో లభించదు.

*ఝాన్సీరాణి* :- ఝాన్సీ లక్ష్మీబాయిని ఆడుపులిగా వర్ణించారీ కావ్యంలో-ఆమెలో చెలరేగిన ప్రతాపాగ్నిని, పొంగిన ప్రేమామృతాన్ని రసవంతంగా తీర్చారు. ప్రతి అధ్యాయంలో ఆద్యంతాలలో కాలాన్ని వర్ణించి కావ్యానికి నిండుతనం చేకూర్చారు.

శ్రీ గడియారం వేంకట శేషశాస్త్రి 'శివ భారతము' రచించి చారిత్రక కావ్యాలకు గౌరవం కల్పించారు. శ్రీ విశ్వనాథ శివాజీని భక్తునిగా, యోగిగా, మహా వీరునిగా చిత్రించి యీ కావ్యానికి ఆధ్యాత్మిక వాతావరణం కల్పించారు. శివ భారతముతో పోల్చినపుడీ కావ్యం పేలవంగా తోస్తుంది.

*కుమారాభ్యుదయము*. దేవసేన, కుమారస్వాముల ప్రణయ గాథ ఇది. ఈ కావ్యంలో కవి నాయికా నాయకుల నిద్దరినీ కర్షకులను చేసి పంటలు, సాగులు, వంతెనలు మొదలైన పథకాలతో ఆధునికత్వాన్ని జొప్పించారు.

*రురుచరిత్రము* : రురుడు, ప్రమద్వరల వృత్తాంతం మహా భారతంలో వున్నది. విశ్వనాథవారు రురుని యోగిగా చిత్రించారు. ఆ యోగి తన శక్తితో మరణాన్ని జయించాలనుకుంటాడు. అతన్ని ఆప్రయత్నం నుండి మరల్చటానికి, అతని తపశ్శక్తిని తగ్గించటానికి ప్రమద్వరమరణాన్ని కల్పించి, రురుడు తపశ్శక్తితో ఆమెను బ్రతికించు కొనేటట్లు చేయటం దైవ లీలగా వర్ణించారు. విశ్వనాథవారి ఖగోళ విజ్ఞానం, పాముల గురించిన పరిజ్ఞానం యీ కావ్యంలో కన్పిస్తాయిగాని సహృదయులు పొందే కావ్యానందం మాత్రం తక్కువే.

*ప్రద్యుమ్నోదయము*: రుక్మిణీకృష్ణులకు అనిరుద్ధుడు జన్మించటం, ఉష అనిరుద్ధులకు ప్రద్యుమ్నుడు ఉదయించటం ప్రసిద్ధమైన కథ. దీనినే మీ మార్చకుండ, చెప్పుకోదగిన కల్పనలేవీ లేకుండ విశ్వనాథవారు 'ప్రద్యుమ్నోదయము' రచించారు. దీనిలో విశ్వనాథవారి ప్రతిభయే మాత్రమూ కన్పించదు.

*శ్రీకృష్ణ సంగీతము; గోపికాగీతలు; భ్రమర గీతలు*

చిన్ననాడే 'ప్రాతః స్తవము' రచించి మహాభక్తులకు మాత్రమే సాధ్యమనిపించే కవితా శక్తిని ప్రదర్శించిన విశ్వనాథవారు 'శ్రీకృష్ణ సంగీతము' అనే బృహత్కావ్యం రచించారు. కవి తనను ఒక గోపికగా భావించుకొని రాసిన కావ్యమిది. భ్రమర గీతలు, గోపికా గీతలు కూడ భక్తి ప్రధానమైన రచనలే. భ్రమర గీతలు మిక్కిలి ప్రౌఢమైన కావ్యం. కవి స్వయంగా ప్రతి పద్యానికి వ్యాఖ్య కూడ రచించారు. ఇటువంటి కావ్యాలు ఏ కొద్ది మంది పండితులకో తప్ప ఇతరులకు రుచించవు.

*పంచశతి :* చాటు పద్యాలవంటి ఐదువందల పద్యాల సంకలన మిది. హాస్య, శృంగారాలు మేళవించి చమత్కారజనకంగా రచించిన పద్యాలిందులో వున్నాయి. చమత్కారాన్ని మించిన ప్రయోజనంగూడ కవి ఏమీ ఈ రచనవల్ల ఆశించినట్లు కన్పించదు.

*విశ్వనాథ మధ్యాక్కరలు :* మున్నంగి వేణుగోపాలస్వామి పై శతకం రచించమని ఆ గ్రామవాసులు కోరగా పూనుకొని 'మున్నంగి వేణుగోపాల' మకుటం మధ్యాక్కరకు తప్ప మరే వృత్తానికీ సరిపోక పోవటం చేత విశ్వనాథ మధ్యాక్కరలో ఆ శతకం రచించారు. ఆ తర్వాత మధ్యాక్కరల్లో మరి తొమ్మిది శతకాలను రచించారు. ఆ శత కాల సమాహారమే విశ్వనాథ మధ్యాక్కరలు.

"కోరి, కబేలాకు, మందగాఁ దోలికొని పోవుచుండ
దారి ప్రక్కనయున్న పచ్చిగడ్డిపైఁ దారాడు పసుల
తీరుగా నున్నది జనుల భోగాశ ! తెలివి సర్వమ్ము
చూఱపుచ్చెదవు, శ్రీశైల మల్లికార్జున మహాలింగ !

వంటి పద్యాలు విశ్వనాథవారి భావ గాంభీర్యాన్ని తెలియజేస్తాయి.

ప్రతిభావ్యుత్పత్తులు ఒకదానితో ఒకటి స్పర్ధ వ్యహించినట్లు విశ్వ నాథవారి కవిత్వంలో పరుగులు తీశాయి. వైవిధ్యమూ, వైశిష్ట్యమూ

రెండూ వున్నాయి ఆయన కవిత్వంలో. గాంభీర్యమూ లాలిత్యమూ రెండు గుణాలూ ఆయన కవిత్వంలో భాసిస్తాయి. సంప్రదాయమూ, ఆధునికతల్లో మాత్రం ఆయన ప్రయాణం ఆధునికత్వం నుండి సనాతనత్వానికే.

ఆధునిక నాగరకత తెచ్చిన మార్పులకు కంటగించుకొని వేద కాలాన్ని ఆరాధిస్తూ ఆయన రచన చేశారు. మాతృగర్భమెంత సురక్షితమైనదైనా మనిషి తిరిగి అక్కడికి చేరటం సాధ్యంకానట్లు విశ్వనాథవారు కోరిన వైదిక ధర్మ పునఃప్రతిష్ఠాపనమూ సాధ్యంకాదు.

"ఒక మహా జలపాతం ఉన్నచోట విద్యుత్తు పుడుతుంది. అది దీపాలు వెలిగిస్తుంది, యంత్రాలు నడిపిస్తుంది. దాని శక్తి పరిమితం, అనుపమితం. ఆ జలపాతం వంటికవి శ్రీ విశ్వనాథ సత్యనారాయణ. గత శతాబ్ది శిఖరాంచలాల పుట్టి, నోరెత్తి హోరెత్తి ఈ శతాబ్దంలో కంటూ చొచ్చుకొని ప్రవహించినదీ జలపాతం" అని శ్రీ ఇంద్రగంటి శ్రీకాంతశర్మ విశ్వనాథవారి సాహితీమూర్తిని చక్కగా రూపుకట్టించారు.[3] ఇంతకు మించిన వివరణ మరొకటి అక్కరలేదు.

సంప్రదాయ కవితా మాధుర్యం చవి చూడాలంటే అది విశ్వనాథ కవిత్వంలో పుష్కలంగా లభిస్తుంది.

## జాషువా - సంప్రదాయంలో ఆధునికత.

ఆధునిక కవుల్లో జాషువాగారి కొక విశిష్టస్థానమున్నది. సంప్రదాయ ఛందస్సుల్లో ఆధునిక భావాలతో ఉత్తమ కావ్యాలు రచించిన కవి శ్రీ జాషువా. ఈ శతాబ్దంలో కవితాభిమానుల్లో జాషువాగారి కవిత్వపు జల్లుల్లో జలకమాడనివారు లేరు. రసప్లావితులై తనిసి కొనియాడనివారు లేరు. ఆధునిక కాలం బృహత్కావ్య రచనకు అనువైనది కాదనే

3. **సాహిత్య పరిచయం - ఇంద్రగంటి శ్రీకాంత నవోదయ పబ్లిషర్స్ - 1978, (1875-1975).**

తలంపుతో కాబోలు ఆయన లఘుకావ్యాలు, ఖండ కావ్యాలే రచించారు. అంటరానితనం అనే దురాచారం ఆయన్ను చాల బాధించింది. కాని 'శారద' ఆయన్ను వరించింది. తనలేఖినితో రవ్వలు రాల్చి తెలుగు కవితా సరస్వతికి అమూల్యా లంకారాలు సమకూర్చారు.

యౌవన దశలో శ్రీ జాషువా జీవికకోసం "ధృవవిజయం, హిమ దమార్క పరిణయం, చిదానంద ప్రభాతం, రుక్మిణీ కళ్యాణం, మీరాబాయి, తెరచాటు నాటకాలు రచించారు. ఇవి సంప్రదాయ పద్ధతికి చెందిన పద్య నాటకాలు. ఆయన ప్రతిభకు నిదర్శనమైనవికావు. ఆయన ప్రజ్ఞకు తార్కాణగా చెప్పదగినవి ఖండకావ్యాలూ, పిరదౌసి, గబ్బిలము, ముంతాజమహలు కావ్యాలే.

స్వాతంత్ర్యానంతరం జాషువాగారు రచించిన కావ్యాలు గబ్బిలము, పిరదౌసి, ముంతాజమహలుతో సరితూగగలవి కాకపోయినా ఉత్తమ కావ్యాలుగా ప్రస్తుతించదగ్గవి. 'బాపూజీ; నేతాజి; కాందిశీకుడు; కొత్త లోకము; స్వప్న కథ; నాగార్జునసాగరము; ముసాఫిరులు; క్రీస్తు చరిత్ర, నాకథ కావ్యాలు ఆయన కీర్తికి జేగంటలే.

జాతిపిత మహాత్మగాంధీ మరణించిన సందర్భంలో జాషువా కవి రచించిన కావ్యం 'బాపూజీ'. "భారత స్వేచ్ఛకై వ్యయించక మహాత్ముడు దాచుకొన్న రక్తకణములేదు." ఆయన రుణం భారత జాతి తీర్చుకొనలేనిది, అని జాషువా సమర్పించిన అశ్రుతర్పణమే 'బాపూజీ' కావ్యం.

సుభాస్‌చంద్రబోస్ బ్రిటీషు పోలీసుల కనుగప్పి భారతదేశం నుండి తప్పించుకొని, విదేశాల నుండి పోరు నడిపించిన వీరగాథను శ్రీ జాషువా 'నేతాజీ' కావ్యంగా రచించారు. "బోసు మహా త్యాగి. అతని త్యాగముతో దేశమతనికి ఋణపడ్డది. నేడు మనము చూఅలాడు స్వేచ్ఛా స్వరాజ్యమునకు సుభాసుబాబు రత్న స్తంభమై నిలిచినాఁడు" అని పూజ్యభావంతో నేతాజీని స్మరించారు. గౌతమ బుద్ధుడు అంతః పురము నుండి నిష్క్రమించిన ఘట్టాన్ని జ్ఞాపకం చేసేవిధంగా సుభాసు

కలకత్తా నగరం నుండి ఇల్లు వెడలిపోయిన ఘట్టాన్ని రమణీయంగా రచించారు.

'కాందిశీకుడు' కావ్యం బర్మాలో నివసించే ఒక ఆంధ్రుడు యుద్ధ సమయంలో ప్రాణ భీతితో భారతదేశం పారిపోయి వచ్చిన కథ. అతడు పారిపోయివస్తున్నప్పుడు అతని కాలికి ఒక మానవ కపాలం తగులుతుంది. ఆ కపాలం కాందిశీకుడితో సంభాషిస్తుంది. యుద్ధ మహాగ్ని జ్వాలలకు కలవరపడిన కాందిశీకుడు మొదట బుద్ధుని అహింసా సిద్ధాంతాన్ని నిందించి, చివరకు కపాలంతో సంభాషించిన తర్వాత అహింసయే మంచిదని తలుస్తాడు. అహింసా సిద్ధాంతంపై కవికిగల మక్కువను వెల్లడించే కావ్యమిది.

కావ్య రచనకు పెద్ద ప్రేరణ యేమీ లేకుండానే ఉబుసుపోకకు రచించిన కావ్యం 'స్వప్న కథ', ఇదే సంపుటిలో 'అనాథ' అని ఒక బిచ్చుగత్తె దీన గాథను చేర్చారు. ''సల సల క్రాగి చిందిన కన్నీటి బిందువు'' 'అనాథ' అని కవి స్వయంగా తెలిపారు. రెండు కావ్యాల్లోనూ కవి చిన్న కథల్లో హృద్యమైన భావాలను వెల్లడించారు.

'కొత్త లోకము' కావ్యంలో కవి అరవై యేళ్ల చూచిన జీవిత నాటకంలో ప్రత్యక్షరం, ప్రతిపదం రసభరితం, భావస్ఫోరకమని తలచారు. ''సత్యం దెబ్బతిని, ధర్మం దసిలి నాటకం రసాభాసకాగ నాటకకర్త (భగవంతుడు) నిందకు గురియైనాడు. సృష్టికర్తకు ఎదురు నిలిచి, కవి యీ సృష్టిలో వ్యత్యాసాలను సరిదిద్దుకోమని హెచ్చరిస్తాడు.

''రాజు మరణించె; నొకతార రాలిపోయె
కవియు మరణించె; నొకతార గగనమెక్కె
రాజు జీవించె ఱాతి విగ్రహములందు
సుకవి జీవించె ప్రజల నాలుకల యందు''

వంటి పద్యాలు జాషువాగారిలో కవితా శక్తి సన్నగిలిపోలేదని విస్తాయి. 'ముంతాజ మహలు'లో ''రాణి విడిచిపోయే రాజు నొంటరి

జేసి'' అనే పద్యానికి పై పద్యం దీటుగా కన్పిస్తుంది. ''నవ్వవు జంతువుల్, నరుడు నవ్వును, నవ్వులు చిత్తవృత్తికి దివ్వెలు'' అంటూ ''కొన్ని నవ్వులు ఎటు తేలవు'' అని ఆహ్లాదకరమైన వర్ణనతో మనస్సును ఆకట్టుకొంటారు.

ప్రక్క ఇంటి దంపతులకు జన్మించిన ముద్దుపాప కవికి కావ్య వస్తువుగా తోచింది. ఇహానికి, పరానికి ప్రయాణించే రెండాత్మల సమావేశం 'ముసాఫిరులు' కావ్యంలో కథా వస్తువు. సమకాలిక సంఘంపై కవికి వున్న అసంతృప్తిని యీ కావ్యం ద్వారా ప్రకటించారు.

''విశ్వమానవ గోత్రేయ వీరులైన
కవులకున్ కర్మబంధంబు కట్టబెట్టి
పులుముచుందురు తలమీద కులమురంగు
తొలగిపోవదు లక్ష సబ్బులకు గూడ''

అని ఆవేదనతో వెలువడే తలపులు గుండెల్లో గుచ్చుకుంటాయి.

''మానవ నిర్మితమైన మహోన్నత దేవాలయంగా నాగార్జున సాగర్ ప్రాజెక్టు''ను పండిత నెహ్రూ అభివర్ణించారు. బౌద్ధయుగం నుండి నేటి దాకా నాగార్జుని కొండ పరిసర ప్రాంతాలను 'నాగార్జున సాగర్' కావ్యంలో వర్ణించారు. శ్రీనాథ మహాకవిని తలపించే పద్య రచన యీ కావ్యంలో కన్పిస్తుంది. పలనాటి సీమను యీసడించుకొన్నాడని, శ్రీనాథుని సంబోధించి-

క్రమతన్ విచ్చిన వేయిరేకుల దళత్కంజాత
మాంధ్రప్రదేశము, నందిప్పటి పల్లెనాటి ప్రజలైశ్వర్యంబు
వీక్షించి
ఘంటము చేపట్టుము, నైషధ ప్రముఖ నానా కావ్య నిర్మాతృ
చంద్రమ !
శ్రీనాథ మహాకవీ ! దొరకవన్నా నీకు జొన్నన్నముల్''

**అని సున్నితంగా మందలించారు.**

ఏసుక్రీస్తును దేవుని బిడ్డగానేగాక మహామానవునిగా నిరూపిస్తూ రచించిన కావ్యం 'క్రీస్తు చరిత్ర'. బైబిల్ ఆధారంగా గ్రహించినా, కేవల క్రైస్తవమతదృష్టితో జాషువాగారు యీ కావ్యాన్ని రచించలేదు. "ముళ్ళ కిరీటంబు ముద్దాడెనే తండ్రి మణికిరీటోజ్వలన్మస్తకమున" అని శిలువపై క్రీస్తుసహింసించిన దురంతాన్ని కరుణామయంగా వర్ణించారు. చావు పుట్టుకలు లేని తండ్రికి మరణదండన విధించిన మానవుల అజ్ఞానానికి జాలిపడ్డారు శ్రీ జాషువా.

అన్నిమతాలవారు చదివి ఆనందించదగిన కావ్యం క్రీస్తుచరిత్ర.

పద్యాల్లో స్వీయ చరిత్ర రచించిన కొద్దిమంది కవులలో శ్రీ జాషువా ప్రముఖులు. మండువేసవిలో పండు వెన్నెలరాత్రి ఆరు బయట ప్రక్కపరచుకొని, వేడిగాడ్పులు; పిండి ఆరబోసినట్లున్న వెన్నెల అనుభవిస్తూ "నా జీవితం కూడ ఇలాగే వెన్నెల, వడగాడ్పు మిశితమై సాగిపోతున్నది. వడగాడ్పు నాజీవితమైతే, వెన్నెల నా కవిత్వం" అన్నారు. ('కవిసుత నివేదన' : హేమలతా లవణం). తనను హీనకులంలో పుట్టినవానిగా చిన్నచూపుచూచి చంద్రనిప్పులు చెరగిన సంఘాన్ని ఎదిరించి పండువెన్నెల కురిపించిన మహాకవి జాషువా.

"ప్రసిద్ధాంధ్రకవులు మ్రోయించిన కవితా వీణలు నా పసితనంలో నన్నాకర్షించాయి. నేనూ ఒకవీణ మ్రోయించాలి అనుకొన్నాను. ప్రయత్నం మీద నాకు లభించినది వీణకాదు, సితార: అది నా కవిత-వినిపించినది ప్రజలకు కాని ప్రభువులకు కాదు" అని కవి తన కవిత్వం సాధించిన పరమార్థాన్ని వివరించారు.

జాషువాగారు భావ విప్లవాన్ని కోరారుగాని భాషా విప్లవాన్ని కోరలేదు. గిడుగు, గురజాడల ప్రభావం వీరిపై ప్రసరించలేదు. భావ ప్రకటనకు ఛందోబద్ధమైన పద్యాన్నే ఎన్నుకొన్నప్పటికీ జాషువాగారు భావనలో ప్రాచీనులు కారు. ప్రాచీన కవులనుండి శబ్ద ప్రౌఢిమను,

హేతువాదయుగ కవులనుండి విప్లవఆవేశాన్ని, విశ్వసాహిత్యావలోకనం వలన జాతి మత కులభేదాలను విస్మరించి వసుధైక కుటుంబ భావనకు దోహదం చేశారు. ప్రాచీన కవుల విరహ వర్ణనలూ, చంద్ర, మలయానిల, మన్మథాది దూషణలు ఆయనకు రుచింపలేదు. భావకవులవలె ప్రేయసిని హృదయేశ్వరిని చేసుకొని, ఆమెను పూజాపీఠంపై ప్రతిష్ఠించి, అమలిన శృంగారాన్ని వ్యాపింప జెయ్యటాన్ని కూడ హర్షించలేదు. అభ్యుదయ కవులు ఆశించే సమసమాజ నిర్మాణాన్ని కూడ ఆయన కోరలేదు. శ్రీజాషువా వర్ణభేదాలను గురించి ఆక్షేపించారు గాని వర్గసంఘర్షణ గురించి ఆలోచించలేదు. భాష, ఛందస్సుల విషయంలో ప్రాచీనుల్నే అనుసరించారు. ఆయన భావ ప్రకటనకు ఛందస్సు అడ్డురాలేదు. ఛందస్సుల అశ్వహృదయం తెలిసిన నిపుణుడు శ్రీ గుఱ్ఱం జాషువా.

సమకాలిక కవితోద్యమాలకు దూరంగా, ఆదునిక భావచేతనతో సంస్కరణాదృష్టితో మానవత్వపు విలువల్ని పెంపొందింప జూచిన కవి శ్రీ జాషువా. తనకుతానే ఒక కవిత్వపీఠమై కవితా మార్గంలో పెక్కు మందికి గురువు అయినారు.

## తుమ్మల - వ్యాకరణ సమ్మతమైన వాక్కు - భావనలోఆధునికత

ఈ శతాబ్ది ఆరంభంలో (1901) హాలికుల ఇంట జన్మించి,చిన్ననాడు మడికొక్కపూట, బడికొక్కపూటగా విద్యనేర్చి, ముప్పదేడులు కష్టించి, సేద్యంచేసి, కవితా వ్యవసాయం చేసి విత్తనాల ధాన్యం వంటి శ్రేష్ఠమైన కవిత రచించినవారు శ్రీ తుమ్మల సీతారామమూర్తి. భాషా వ్యాకరణాలలో మిక్కిలి నిష్ఠాపరులు. కవిత్రయాన్ని, చిన్నయసూరిని దీక్షగా అనుసరిస్తారు. భాషలో ఎంత సంప్రదాయాభిమానులో భావనలో అంత ఆధునికులు. చిన్ననాటనే బాపూజీ మార్గాన్ని అనుసరించి రాట్నం వడికి, ఖద్దరు విక్రయించి, స్వరాజ్యోద్యమంలో పాల్గొనిన జాతీయకవి. దేశభక్తులు. తెలుగు జాతిఅన్నా, తెలుగుభాష అన్నా వీరాంధ్రపౌరుషం తెలుగుదనపు తీవ్రత వీరిని ఆవహిస్తాయి. తిక్కన తెనుగుదనం

వీరికి ఆదర్శం. పండితులు వీరి కవితాశక్తిని తిక్కనకెనయైనదని మెచ్చి 'అభినవ తిక్కన' అని బిరుదిచ్చారు. కాని శ్రీ తుమ్మల వినయశీలియై బిరుదును త్యజించి 'తెనుగు లెంక'గా తమను తెలుపుకున్నారు.

"పఱిగపంట, ధర్మజ్యోతి, ఆత్మార్పణము, రాష్ట్రగానము" మొదలైన వీరికృతులు మిక్కిలి ప్రఖ్యాతి వహించాయి, 'ఆత్మకథ'ను తెనిగించి, మహాత్మకథను రచించి వీరు గాంధి కవిగా విఖ్యాతిపొందారు." "సంక్రాంతి తలపులు, వరినాట్లు"వంటి కావ్యఖండికలు కృషీవల జీవితంపై వీరికి గల మమకారాన్ని ప్రతిబింబిస్తాయి.

స్వాతంత్ర్యానంతరం తుమ్మలవారు నిర్విరామంగా కావ్యాలు రచించి సాహిత్య సేవచేస్తూనే వున్నారు. పైరపంట, ఉదయగానము, శబల, సర్వోదయగానము, నేను, నా కథలు, ఎక్కట్లు మొదలైన కావ్యాలు రచించి ఆధునికకవితలో సంప్రదాయరీతికి అధునాతన భావనకు పట్టుగొమ్మై నిలిచారు

"పైరపంట, ఉదయగానము," పఱిగపంట, రాష్ట్రగానము పద్ధతిలో రచించినవి. ఖండకావ్య సంపుటాలు. చెరకు ముక్కలవంటి ఖండకావ్య సంపుటి 'శబల'. "సంక్రాంతి తలపులు, రైతు మొఱ, పశువైద్యము" మొదలైనవి కృషీవల జీవన వర్ణనలు; వివేకానందుడు, వినోబాభావే, హరి సర్వోత్తమరావు, రంగా వంటి విశిష్ట వ్యక్తుల జీవితాల్లో ఉత్తమ గుణాలను కొనియాడినవి యీ సంపుటిలోవున్నాయి. వీరు రచించిన 'సంక్రాంతి తలపులు' చిరస్మరణీయమైన మధురమైన ఖండకావ్యం. అటువంటిదే'వరినాట్లు'మరొకటి."కూటికిలేని సోమరులకున్ సరిపోవునుగాని సేద్యపుంబాటున మున్గితేలు బలభద్రులకున్ బడి కొల్వుగిట్టదు" అని తీర్మానించుకొనిన కష్టజీవి.

మహాత్మగాంధీ, వినోబాభావేలు ప్రబోధించిన సర్వోదయము సీతారామమూర్తిగారికి ఆదర్శం. 'సర్వోదయగానము'లో వినోబాభావే

ఉపన్యాసాల్లో దొరలిన సూక్తులను 'భావే చక్కట్లు' అనేపేరిట పద్యాలు అల్లారు. భావే పాదయాత్రలో తటస్థించిన సన్నివేశాలకు కవితా రూప మిచ్చారు. 'పేదలు' అనే కావ్యఖండిక యీ సంపుటికి తలమానికం. 'కొత్త సంక్రాంతి' లో కవి పేదల కడుపునిండిన పండుగే పండుగ అంటారు.

"బిచ్చగాండ్రులేని ముచ్చులేని కటారి
లేని దొరతనము లేని కుట్ర
లేని యీ రసమ్ము లేని దేశావధి
లేని పండువిది ఫలింపవలయు"నని కవి ఆకాంక్షించారు.

ముక్తకమనే సంస్కృత పదాన్ని విడిచిపెట్టి తెనుగుదన మంటే ప్రత్యేకాభిమానం గల శ్రీ తుమ్మల అప్పుడప్పుడు తాను రచించిన ముక్తకాలకు 'ఎక్కట్లు' అనిపేరు పెట్టారు. ఎదుటనున్న సమాజాన్ని సమీక్షించి తనకు నచ్చిన వాటిని తగునని, నచ్చనివాటిని తగవని పలికిన ము కకాలివి.

ఒక అధికారిని చూడబోయినప్పుడు, ఆ అధికారి కవిని 'Who are you?' అని తూష్ణీ భావంతో ప్రశ్నించాడట. అప్పుడు అప్రయత్నంగా-

"రాష్ట్రసిద్ధి కొఱకు రక్తంబు గార్చిన
కవిని నేను, గాంధి కవినినేను
బఁశలిబడలి తల్లిబాస కూడెమునేయు
కవిని నేను, దేశికవిని నేను"అని జవాబిచ్చారట శ్రీతుమ్మల.

శ్రీ తుమ్మల తమ అనుభవాలు, జ్ఞాపకాలను చిన్నచిన్న కథలుగా రచించిన కావ్యం 'నా కథలు'. సత్య ప్రకటన స్వీయ చరిత్రలకు ప్రాణం. శ్రీ తుమ్మల తన జీవిత కథలను వివరించే పట్టున సత్య ప్రకటనకు అత్యంత ప్రాముఖ్యమిచ్చారు. సత్యవాక్కును కవిత్వంగా భాసింప జేయుటం చాలకష్టం. పెద్దల నుండి వారసత్వంగా తనకు అబ్బిన

సత్య దీక్షను విడిచిపెట్టక పోవటం తప్ప, తన ప్రజ్ఞయేమీ లేదని సౌజన్యంతో పలికారు.

'నా కథలు'లో "నారయ్యదివ్వె, తప్పెటబ్బాయి, కూలివలదు, నా నాగలినాకుతేదా, పొలము బువ్వ", మొదలైన అనుభవాలు తుమ్మల వారి ప్రతిభచేత రసవంతమై మళ్ళీమళ్ళీ తలచుకొనే విధంగా వున్నాయి. సహాయ నిరాకరణ సందర్భంలో ఎన్నుకట్ట వద్దన్న గాంధీజీ సందేశాన్ని వూరూరా స్వయంగా తప్పెటవేసి చెప్పి, శిక్షకు గురై 'తప్పెటబ్బాయి'గా పేరు తెచ్చుకున్నారు. కుహనా నాగరకుడొకడు తుమ్మలవారి ముతక ఖద్దరువేషాన్ని చూచి భ్రమపడి తనపెట్టెను ప్రక్క గ్రామం వరకు మోసుకొనివస్తే రెండణాల కూలి యిస్తాననగా, నిస్సంకోచంగా ఆ పని చేసి, కూలి మాత్రం వద్దన్నారు. ఆ నాడు ఆ గ్రామంలో జరిగినసభలో తుమ్మల వారిని అతిధిగా గుర్తించి ఆ నాగరకుడు పశ్చాత్తప్తు డయ్యాడట. స్కూలు ఆవరణను పాకీదొడ్డిగా ఉపయోగిస్తున్న అజ్ఞానపు స్త్రీలకు బుద్ధిరావటానికి తానుస్వయంగా గోతులు తవ్వి వాటిని ఉపయోగించు కొమ్మని అభ్యర్థించిన గాంధేయవాది శ్రీసీతారామమూర్తి.

"సంప్రదాయము మీదభక్తి, ఆధునికత మీదనసురక్తి, తుమ్మల వారితత్త్వము యొక్క స్థూలమయిన సమాహార స్వరూపము" అన్నారు శ్రీ తూమాటి దొణప్ప. "మహాత్ముని ఆస్థానకవి' తుమ్మలవారి కవిత్వము గాంధీజీ వాణివలె సత్యసౌందర్య శోభితమై తెలుగునాట కల కాలము నిలిచి వెలుగగలదు.

## మధునాపంతుల-ఆంధ్రజాతి మహేతిహాసం 'ఆంధ్ర పురాణము'

బృహత్కావ్య రచనకిది కాలంకాదనే అపోహ వ్యాపించి వున్న కాలంలో 'శ్రీ శివ భారతము; 'రాణాప్రతాప చరిత్రము' వచ్చి ఆ అపోహను చెదరగొట్టాయి. ఆంధ్ర చరిత్రను ఆమూలాగ్రంగా బృహత్కావ్యంగా రచించటానికి సంకల్పించి శ్రీ మధునా పంతుల సత్యనారాయణ శాస్త్రిగారు 'ఆంధ్ర పురాణము' రచించారు.

4 నా కథలు - 'సమీక్ష' - తూమాటి దొణప్ప - 1973

శ్రీ మధునా పంతుల ప్రసిద్ధమైన రాజవంశాల పేరిట కావ్య విభాగం కావించారు. ఆంధ్ర పురాణమును తొమ్మిది పర్వాలుగా విభజించుకున్నారు. అవి "ఉదయ, సాతవాహన, చాళుక్య, కాకతీయ, పునః ప్రతిష్ఠా, విద్యానగర, శ్రీకృష్ణదేవరాయ, విజయ, నాయకరాజ పర్వాలు." ఇక్ష్వాకులు, శాలంకాయనులు, బృహత్పలాయనులు, విష్ణుకుండినులు, పల్లవులు మొదలైన రాజవంశీకుల చరిత్రను సాత వాహన పర్వంలో ఇమిడ్చారు. ముసునూరి ప్రోలయ, కాపయ నాయకులతో పాటు రెడ్డి రాజుల చరిత్రను పునః ప్రతిష్ఠా పర్వంలో తెలిపారు. ఆంధ్ర చరిత్రలో స్వర్ణయుగమనదగిన విద్యానగర రాజవంశ చరిత్రను విద్యానగర, శ్రీకృష్ణదేవరాయ, విజయ పర్వాలు మూడిటిలో విపులంగా వర్ణించారు.

చరిత్ర పూర్వయుగమనదగిన పురాణాలలో కథలను విశ్వసించి 'ఐతరేయ బ్రాహ్మణము' కాలం నాటినుండి ఆంధ్రుల కథను స్వీకరించారు. చారిత్రక కావ్యాలు హేతు సమ్మతంగా వుండటం మంచిది. 'శ్రీ శివ భారతము' చరిత్రకు కావ్య రూపం కల్పించటంలో అభూత కల్పనల జోలికి పోలేదు. పురాణాలను గురించి సుప్రసిద్ధ హేతువాది శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరి "పిట్ట కథలకునివి యెల్ల పుట్టినిండ్లు; టక్కునేర్పెడి కవుల గంటాల వ్రాత కాదనగరాదు ప్రాచీన కవులుగాన" అన్నారు. ఆధునిక కాలంలో శాస్త్ర విజ్ఞానం ఊహాకందనంతటి వేగంతో పురోగమిస్తున్నప్పుడు కట్టు కథల్ని నమ్మి చారిత్రక కావ్యాల్ని రచించటం సమంజసం కాదు. 'ఆంధ్ర పురాణము' అని పేరు పెట్టు కొనటం చేతనేమో మధునా పంతులవారు ఐతరేయ బ్రాహ్మణంలో హరిశ్చంద్ర కథవంటి వాటిని, చారిత్రకంగా విశ్వసించటానికి వీలులేని వాటిని గూడ స్వీకరించారు.

శ్రీ మధునా పంతులవారి వాక్కు సంస్కార పూరితమైనది; శుచియైనది. ఎక్కడా ఛందో వ్యాకరణ, అలంకార దోషాలకు పాల్పడనిది. అట్లని రసాన్ని జారవిడుచుకున్నదికాదు. నన్నయ

మొదలుకొని పూర్వాంధ్ర మహాకవుల కవితావేశం ఆవహింపగా కావ్య రచనకు పూనుకున్నట్లు తెలిపారు. యాగ పశువుగా బలి ఇవ్వవలసిన కన్న బిడ్డను చూచి హరిశ్చంద్రుడు 'నవ్వుగాని నవ్వు' నవ్వినట్లు వర్ణించారు. నవ్వుగాని నవ్వు అనే పదబంధం తిక్కనను తలపిస్తుంది. దీపకర్ణి మహారాజుకు సాతవాహనుడు దొరికిన కథను, హాల మహారాజు రసికతను, లీలావతీదేవి సంస్కృత భాషాభిమానాన్ని బాగా వర్ణించారు. గుణాఢ్యుని కావ్య హోమాన్ని కరుణామయంగా చిత్రించారు. చాళుక్య పర్వంలో భారతావతరణ ఘట్టంలో నన్నయ రచన సాగించిన పద్ధతినీ, ఆయన మరణించిన తర్వాత నిలిచిపోయిన భారత రచనను గురించి నేర్పుతో వివరించారు. కాకతీయ పర్వంలో తెనుగురాణి రుద్రమ్మ ధీశక్తి, ఓరుగల్లు వైభవాన్ని కమనీయంగా వర్ణించారు. శ్రీనాథ డిండిముల శాస్త్రార్థ ప్రౌఢినీ, శ్రీకృష్ణదేవరాయల భువన విజయ విశేషాలను, విజయ యాత్రలను వివరించే ఘట్టాల్లో మధునా పంతుల వారి లేఖిని రవ్వలు రాల్చింది.

భోగైకమయమైన నాయక రాజపాలనలో తెలుగుజాతి విలసిల్లిన విధాన్ని, తెలుగు కళలు వాసించిన రీతినీ కన్నులకు కట్టించారు. సాధారణంగా పురాణాల్లో కన్పించే దైవభక్తికి మారుగా దేశభక్తి ఆంధ్ర పురాణములో కన్పిస్తుంది. ఆంధ్ర జాతి కీర్తి గౌరవమును చిరకాలం నిల్పగల కావ్యమిది.

### *శ్రీఖండము: చైత్ర రథము*

మధునా పంతులవారి ఖండకావ్య సంపుటులు 'శ్రీఖండము, చైత్ర రథము' అనే రెండు సంపుటాలుగ వచ్చాయి. వీరి హృదయంలో కదలిన ప్రతి రాగాలాపన ఛందోమయానందమైనదే. అది ఆకాశవాణి రజతోత్సవమైనా, ఉగాది పండుగైనా, రాష్ట్రావతరణ మహోత్సవమైనా ప్రపంచ తెలుగు మహాసభలైనా వారి వాణి సుసంస్కృతమైన ఛందోమయ రీతిలోనే పలుకుతుంది.

'గోపికా శోక' భావ కవితా ఛాయగల భక్తి భరితమైన ఖండ కావ్యం.

"ఒక్కతె మోమునందిలక మొక్కత తీరుచు: నోర్తుగొల్లతన్
జక్కిలిగింత పెట్టునొకచాన; యొకర్తుత యోర్తు సుందరిన్
జెక్కిలి మీటు; నొక్కచెలి చేడియనోర్తుకఁ గౌఁగిలించు స
మ్యక్కల నాత్మ సంగత నిజాధిప గోపకిశోరభావనన్"

రమ్యమైన గోపికాక్రీడను మనస్సుకు హత్తుకునేలాగ రచించిన వీరి కవితాశక్తి అత్యద్భుతం.

సమకాలిక సంఘంలో విలయతాండవం చేస్తున్న ఆకలి,దారిద్ర్యం వంటి సమస్యలు మధునా పంతులవారిని కలవరపెట్టినట్లు కన్పించదు. బృహత్కావ్య రచనా దీక్షలో వున్న వీరు ఆ సమస్యల్ని గురించి పట్టించుకోలేదనే చెప్పాలి. ఆంధ్ర పురాణము ఒక్కటీచాలు వీరిని సుకవిగా ప్రస్తుతించటానికి. నాయక రాజపర్వం తర్వాత చరిత్రను గూడ రచించి ఆంధ్ర పురాణానికి సమగ్రత చేకూరిస్తే మరింత బాగుంటుంది.

## గడియారం - వీరరసోత్కర్ష కలిగించే 'రఘునాధీయము'

'శ్రీ శివభారతము'తో ప్రఖ్యాతులైన శ్రీ గడియారము వేంకట శేషశాస్త్రి, ఆ తర్వాత చాలకాలంవరకు కావ్యమేదీ రాయలేదు. ఒకప్పుడు శ్రీ శివభారతము ఆయన రాయలేదనే అపప్రథ కూడ వ్యాప్తిలోకి వచ్చింది. తనలో ఇంకా కవితాశక్తి మిగిలివున్నదని చాటటానికన్నట్లు ఆయన 'రఘునాధీయము' రచించారు. గడియారం వారికి మొదటినుండీ వీరరసమంటే మక్కువ. శివాజీలాగే రఘునాథరాయలు కూడ హైందవ ధర్మ ప్రతిష్ఠాపనకు కంకణం కట్టుకొన్న వీరుడు. శత్రువులను ఓడించి రాజ్యవిస్తరణ చేసిన మహారాజు.

దక్షిణాపథంలో శ్రీకృష్ణదేవరాయల తర్వాత సాహితీ సమరాంగణాలు రెండిటిలో సవ్యసాచియైన సార్వభౌముడు. కవి పండిత

పోషకుడు. ఆయన భవ్యచరితను కావ్యంగా తీర్చిదిద్దారు శ్రీ గడియారం వారు. వారి శ్రీశివభారతముతో పోల్చిచూచినప్పుడీ కావ్యం పేలవంగా తోస్తుంది. కాని ఆధునిక కాలంలో వస్తున్న సంప్రదాయ కావ్యాలతో పోల్చిచూస్తే మాత్రం గడియారం వారి ధారాశుద్ధిగల పద్యరచన, రసపోషణ, ఔచితీనిర్వహణ యీకావ్యంలో కూడ ఇంపుగొలుపుతాయి.

## పుట్టపర్తి భక్తికవిత్వం - పండరిభాగవతం-
## జనప్రియ రామాయణం

భవ్యకవితావేశంతో శివతాండవం రచించి శ్రీ పుట్టపర్తినారాయణాచార్యులు తెలుగుకవితలో కొత్త రీతిని యేర్పరచారు. శ్రీ తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి యీ కావ్యంలో "కల్పన అతిలోకము, సంగీత సాహిత్య నాట్యసంకేతములు సరసముగా, సలక్షణముగా ఈ కృతిలో యిమిడిపోయినవి. అర్థము గంభీరము; ఆశయము అత్యుదాత్తము. నాదృష్టిలో ఆధునిక సారస్వతమువ ఇటువంటి గేయకృతి ఇంకొకటిలేదు" అని మెచ్చుకున్నారు. పూర్ణమ్మకథ, కిన్నెరసాని పాటలు, యెంకిపాటలు, వంటి గేయకావ్యాలున్నప్పటికీ శివతాండవం'లో భక్తిభావం దీనికొక ప్రత్యేకతను చేకూరుస్తున్నది. శివతాండవాన్ని ఒకసారి చదివినా,విన్నా ఆ ఆనందాన్ని కలకాలం నిలుపుకుంటాము. "మనము లెక్కేమిటి, పరవశత్వమున శ్రీపతియే చెమరుస్తాడు" అని శ్రీపాద గోపాల కృష్ణమూర్తిగారు యీ కావ్యాన్ని ప్రశంసించారు.

స్వాతంత్ర్యానంతరం శ్రీనారాయణాచార్యులు రచించిన కావ్యాల్లో "మేఘదూతము, షాజీ, సాక్షాత్కారము, పండరి భాగవతము, జనప్రియ రామాయణము" ప్రసిద్ధమైనవి.

'మేఘదూతము' నారాయణాచార్యులుగారి చేతిలో ఆధునికరూపం ధరించింది. కారాగార బంధితుడై మానవుడొకడు తన ప్రియురాలికి మేఘుని ద్వారా సందేశం పంపటం ఇందులో కథ. కాళిదాస మహాకవి మేఘదూతలో వలె కాకుండా యీ మానవుడు తన ప్రియురాలి ఇంటికి

బొమ్మని చూపినట్లోవ ఆంధ్రదేశంలో పట్టణాలన్నిటిని చుట్టివస్తుంది.'' తెలుగు ఊరులు తెలుగు వారలు ప్రతిఫలించే మహాకావ్యం నాకుకావలె, నాకు కావలె'' అని శ్రీ దాశరథి ఒకప్పుడు కోరారు. శ్రీ నారాయణాచార్యులుగారి మేఘదూతము తెలుగు దేశంలో ప్రజల కష్టసుఖాలను ప్రతిబింబించే కావ్యం.

''వాడె కమ్మరి చూడు/దౌర్భాగ్యముల గూడు
కొలిమి నూదుచున్నవాఁడూ/తనపొట్ట
కోసమై నవయుచున్నాడూ/అల్లంత
దూరాన నదెవాని తొయ్యలిని గనుగొమ్మ
జీరాడు చనులతో చీరనోచని చాన!

తెలినవ్వులందములఁ/జిలికింప మొగముపై
పాలకై యేడ్చు చున్నాడూ/బుడుతండు
పట్టుదల నెత్తికొన్నాడూ/ఆ తల్లి
చనుబాలనిచ్చునో / దనయురమ్ము జీల్చి ర
క్తంబు లేద్రావునో! ధనికులే మెరుగుదురు''-

కరుణ రసాన్ని జాల్వారిస్తూ ప్రవాహగతిలో లయబద్ధంగా సాగిపోతుంది మేఘదూతం.

'సాక్షాత్కారము' తులసీదాసు రామాయణాన్ని ఆలంబనంగా చేసికొని రచించిన కావ్యం. మహాభక్తుడు ఆర్తితో పలవరించిన విధంగా పద్యాలు గీతాలతో మనోహరంగా రచింపబడిన కావ్యమిది. తులసీదాసు శ్రీరామ సాక్షాత్కారాన్ని పొందటం ఇందులో ఇతివృత్తం.

''పురువుగ పుట్టనిమ్ము వగపుట్టము నా మది, కాననంబులోఁ
దరువుగఁ బుట్టనిమ్ము వగదట్టదు నామది, జీవితేశ ! శం
కల మృదు భావనాంబర వికస్వర ! తావక రమ్యనామ బం
ధుర మననంబు నిమ్ము దయతో-మరియన్యముఁ గోరరాప్రభూ!',

అని వేడుకునే తులసీదాస హృదయం నారాయణాచార్యులుగారి వాక్కులో పునీతమైంది.

పారసీ భాషలో మధురమైన కవిత రచించిన 'షాజీ' కవి జీవిత గాథ 'షాజీ'. జహంగీరుకు సమకాలికుడు షాజీ. నూర్జహాన్ సౌందర్యాన్ని తిలకించిన అపరాధానికి షాజీని మొగలు సైనికులు బంధిస్తారు. షాజీ ఏ మాత్రం వొణకడు. సౌందర్య దృష్టి దోషంకాదని చక్రవర్తికి బుద్ధి చెప్పి, "జ్ఞాన భూముల దిరుగు పైగంబరులను ఇనుప బేడీలు పడజేయవ"ని చెప్పి వెళ్లిపోతాడు. షాజీ జహంగీరు నెదిరించి పలికిన సూనృత వాక్యాలు రుచి గొల్పుతాయి.

శ్రీ నారాయణాచార్యులు స్వయం కృషితో ఇంగ్లీషు నేర్చుకొని, ఇంగ్లీషులో 'Leaves in the Wind' అనే కావ్య సంపుటాన్ని రచించారు. శ్రీ హరీంద్రనాథ చట్టోపాధ్యాయ యీ కావ్యాన్ని ప్రశంసించారు. బహుభాషలునేర్చి, ఇతర భాషల నుండి తెలుగులోకి, తెలుగు నుండి ఇతర భాషలలోకి శ్రీ పుట్టపర్తి విస్తృతంగా అనువాదాలు చేశారు.

ద్విపదలో రచించిన బృహత్కావ్యం 'పండరి భాగవతం.' ఇరవై నాలుగు వేల ద్విపదల్లో భాగవత కథను భక్తి భావ భరితంగా రాశారు. కల్పనల్లో పెద్దగా విశేషాలేమీ లేకపోయినా యీ కావ్యం భక్తులకు తృప్తినిస్తుంది.

తెలుగులో రామాయణాలకు కొదవలేదు. గేయ రామాయణాలు మాత్రం కొంత తక్కువగా వున్నాయి. పాఠ్యేగేయేచ మధురమైన రామాయణాన్ని సామాన్య జనులు పాడుకోవటానికి అనువుగా రచించారు. రామాయణ కల్పవక్షంలో లాగ విశేషమైన కల్పనలు లేక పోయినా, ఆస్వాదయోగ్యమైన కథామృతం రామభక్తులు గ్రోలగలరు.

శ్రీ పుట్టపర్తి విప్లవ భావాలతో కవిత్వం రచించినట్లే భక్తి భావాలతో కూడ రాశారు. మార్క్సు, అరవిందులు, తులసీదాస్‌వంటి విభిన్న వ్యక్తుల ప్రభావం, వారి అభిప్రాయాల సమన్వయమూ నారాయణాచార్యుల వారి కవిత్వంలో కన్పిస్తాయి.

## వానమామలై - సంప్రదాయ మహాకావ్యం 'పోతన చరిత్రము'

ఒక మహాకవి చరిత్రను సమర్థుడైన మరొక కవి రచించటం మన సాహిత్యంలో చాల అరుదైన సంగతి. పిరదౌసి కవి జీవితాన్ని కావ్యంగా రచించి శ్రీ జాషువా తెలుగు సాహిత్యాని కొక కొత్త అందాన్ని సమకూర్చారు. 'తెలుగుల పుణ్యపేటి' పోతన మహాకవి చరిత్రను శ్రీ వానమామలై వరదచార్యులు పన్నెండు ఆశ్వాసాల్లో వేలాది పద్యాల్లో రచించారు. ఆధునిక కవిత్వంలో సంప్రదాయ పద్ధతికి ఆదరం వున్నదని యీ కావ్యం ఋజువు చేస్తున్నది.

ప్రాచీనాంధ్ర కవుల చరిత్రలు స్పష్టంగా తెలియవు. 'కవి జీవితాలు' వంటి గ్రంథాల్లో కొంత ప్రయత్నం జరిగినా, వాస్తవికత కంటె నమ్మటానికి వీల్లేని కట్టు కథలు అందులో ఎక్కువగా వున్నాయి. చిరకాలంగా తెలుగు దేశంలో వినవస్తున్న పోతన చరిత్రకు కల్పనలు జోడించి శ్రీ వానమామలై వరదాచార్యులు యీ మహా కావ్యం రచించారు.

హాలికుడై, సహజ పండితుడై భాగవతాన్ని రచించిన పోతన చరిత్ర పవిత్రమైనది. శ్రీ వరదాచార్యులు చాల సంవత్సరాలు శ్రమించి యీ కావ్యం రచించారు. కాని వీరు స్వీకరించిన పెక్కు అంశాలను చరిత్రకారులిప్పుడు నిరాధారాలని త్రోసిపుచ్చుతున్నారు. అందులో ముఖ్యమైనది పోతన శ్రీనాథ మహా కవులిరువురు బావ, బావమరదులనే జనశ్రుతి చారిత్రకంగా యథార్థమైనది కాదు.

'పోతన చరిత్రము' ప్రారంభంలో 'శ్రీమద్భాగవతము' తెలుగున వెలయటానికి పూర్వం దేవలోకంలో ఇంద్రోపేంద్రుల మధ్య జరిగిన వివాదము అంటూ ఒక కల్పన చేశారు. పోతనపై వరదాచార్యులుగారి భక్తికిది నిదర్శనమైనా 'చరిత్రము' అని పేరున్న కావ్యంలో ఇటువంటి కల్పనలు సొగసనిపించవు. పోతన జననాన్ని, చిదానందయోగి పోతనకు రామతారక తత్వోపదేశం చేయటం వరదాచార్యులుగారు కలకండ

పలుకులతో రచించారు. పోతన వివాహితుడైన తర్వాత భార్యతో ప్రవర్తించిన తీరు కళా పూర్ణోదయంలో సుగాత్రీశాలీనుల వృత్తాంతాన్ని పోలి వున్నది.

సర్వజ్ఞ సింగ భూపాలుని ఆస్థానంలో శ్రీనాథ పోతనలిరువురు ఆశువుగా ఉద్యాన వర్ణన చేసిన ఘట్టం యీ కావ్యంలో మిక్కిలి శోభాయమానంగా వున్నది.

"పొంగి కైలాస గిరిఁ బాఱు గంగనీరు
కామధేనువు పాలమీగడల తీరు
మూకుళల మూసి ముక్కంటి ముద్రవేసి
తీర్థము ప్రసాదమనియిందు దింపిరెవరో"

అని శ్రీనాథుడు నారికేళాన్ని వర్ణించిన తీరు;

మానితసూన సౌరభ రమాకృత మారుతయాప్యమాన మీ
మ్లాన సుమ ప్రమోదకరమౌ ఖరిత ద్విజ సామగాన మా
పీన లతావితానము నభీష్ట ఫలప్రద భూజరాజ సం
స్థాన మహీన మివ్వన విధానముగానము క్షోణినెందునున్"

అని ఉద్యానవనాన్ని పోతన వర్ణించటమూ, వారి వారి స్వభావానుగుణంగా, కవితా రీతులకు తగిన విధంగా వున్నాయి. పోతన కవిత్వమంటే వరదాచార్యులుగారికి వున్న అపారమైన గౌరవాన్ని సర్వజ్ఞ సింగభూపాలుడు పోతన కవిత్వాన్ని గురించి ప్రశంసా పూర్వకంగా-

"పూలను మల్లికాలతకు, మూలములందును షీరజాతికిన్
వాలెము నాకులందు మరువమ్ముకు దారువునన్ బటీరవృ
క్షాళికి సౌరభమ్ములయుఁగాని భవత్కవితాలతాంగనన్
గ్రాలు పరిమళమ్ములు సుఖప్రదమై సకలాంగకమ్ములన్"

అని పలికిన మాటల్లో నివేదించుకున్నారు. సర్వావయవాల్ని పులకింపజేసే ఉత్తమ కవిత్వం పోతనలో వున్నట్లే వరదాచార్యులుగారి కవిత్వంలో కూడవున్నది.

లలిత కళలన్నీ ఎదిగి పూచినపాదు 'పోతనచరిత్ర.' కొండపల్లి శేషగిరిరావుగారివంటి చిత్రకారులు, శ్రీనటరాజరామకృష్ణవంటి నాట్యకళా కోవిదులు యీ కావ్యాన్ని చదివి పరవశించి చిత్రాలు, నాట్యాలు సమకూర్చటం యీ కావ్యం ఘనతను మరింత చక్కగా వెల్లడిస్తున్నది. 'భోగినీలాస్యము' కవిగారి పాండిత్యానికి లయజ్ఞానానికి ముఖ్యంగా సహృదయుల్ని ఆవేశపరవశుల్ని చేయగలిగిన కవిత్వానికి నిలయమైన ఉజ్జ్వల ఘట్టం.

"ఎదనీరు గాఁగ శారదయేడ్చు కాటుక కన్నీరు దుడుచు పోతన్న నేను" అని వరదాచార్యులుగారు కవిస్తుతిలో విన్నవించుకున్నట్లే కరుణరస ఘట్టాల్లో వీరు పోతనను తలపిస్తారు. పోతన జన్మించిన తెలంగాణమే ఆయన జీవిత చరిత్రను మహా కావ్యంగా మలచిన కవికి కూడ జన్మస్థలం కావటం విశేషం.

భారతస్వాతంత్ర్యానికి పూర్వమే యీకావ్యం రచింప బడినా, చాల ఆలస్యంగా 1966లో గాని ప్రచురింపబడలేదు. ఊహతెలియగల పాఠకోత్తములు పోతన చరిత్రను చదివి లోనారసి కవితామృతాన్ని తనివి తీర గ్రోలగలరు.

## నాయని ఆర్తగీతం 'వేదనా వాసుదేవము' - జన్మభూమోహపటిమ 'జన్మభూమి'

పద్యాన్ని గుండెలు చీల్చుకొనిపోయేలాగ రచించిన భావకవి శ్రీ నాయని సుబ్బారావు. 'సౌభద్రుని ప్రణయ యాత్ర, ఫలశ్రుతి, మాతృగీతాలు భావకవితాశాఖకు చెందినవి. స్వాతంత్ర్యానంతరం ఆయన రచించిన కావ్యాల్లో 'వేదనా వాసుదేవము, జన్మభూమి' సంప్రదాయ పద్ధతిలోవి. జీవితానుభవాలను గానం చేశాక శ్రీ నాయని అంతర్ముఖులై రచించిన కావ్యం 'వేదనా వాసుదేవము'. జన్మభూమోహపటిమచేత తాను జన్మించిన పొదిలె సీమ మహిమలను, అందచందాలను, ఆ సీమతో తనకున్న విడరాని బంధాన్ని 'జన్మభూమి'లో వర్ణించారు.

'వేదనా వాసుదేవము'లో కవి కన్నులు మూసుకొని శిఖిపింఛ మౌళిని మదిని నిల్పుకొనగబోతే తన ఇంద్రియాలు వశం కాకున్నాయని

వాసుదేవునకు విన్నవించుకున్నారు. "బలి చక్రవర్తి ఒక్క పాదమైనా దక్కటంచేత పాతాళాన్ని చేరుకున్నాడు, కేవలం ఒక్క అంగుళమైనా యియ్యలేని నిర్భాగ్యుడను నేనేమౌదు"నని వాపోయారు. ఇంద్రియోద్రేకాలు జేబుదొంగల వంటివని చమత్కరించారు. సంసారాన్ని అగ్గి పెట్టెతో, అందులో వుంచిన అకులను తృష్ణాసంరంభంతోను, తన నొక జీరంగిగాను పోల్చుకోవటం హృద్యంగా తోస్తుంది. స్తుతి, వ్యాజస్తుతి, భక్తి ప్రపత్తులు యీ కావ్యంలో కలగలసిపోయి వున్నాయి. ఈ రచన విశ్వనాథవారి 'మా స్వామి' శతకంతో పోల్చదగినది.

నాయని వారిది సంతృప్తితో నిండిన జీవితం. అసంతృప్తిని-

"నా పత్నీ రమణీ సుధా ప్రణయి తానందమ్ములందేలితిన్
నా పుత్రీ విదుషీమణీ విసర విన్యాసమ్ములంబొంగితిన్
నా పుట్టిల్లును పండెనీదు చలువన్ మానాథ! సంసార సౌ
ఖ్యా పూర్ణమ్ముగ నేమి కావలయు నయ్యా యింక నాకిచ్చుటన్"

అని భగవంతునికి కృతజ్ఞత ప్రకటించి తృప్తిగా తనువు చాలించారు.

జన్మస్థలానికి సంబంధించిన గాథలను దండ కవిలెలు, స్థానిక చరిత్రల నుండి సేకరించి 'జన్మభూమి' రచించారు. జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి' సూక్తి సుబ్బారావుగారి కవితకు బాగా అన్వయిస్తుంది. పొదిలె సీమలో నేరేడు చెట్లు, నాగజెముళ్ళు, వరిమళ్ళు, అకు మడులు, బావులు, చెట్లు, పుట్టలు ఒకటేమిటి సమస్త ప్రకృతి కవికి సుందరమై భాసించి ఆయన కలం నుండి వర్ణోజ్వల చిత్రాలుగా రూపుదిద్దుకొన్నాయి. అవతారిక, ప్రకృతి ఖండము, తటాక ఖండము, ధరణీధర ఖండము, శక్తి ఖండము, శివ ఖండము అనే ఆరు విభాగాలుగల చెరుకుగడ ఇది. సహృదయులు శ్రమపడిన కొద్దీ రసాన్ని చవిచూడగలరు.

శక్తి ఖండంలో పొదిలెమ్మ కథ కావ్యానికంతటికీ గుండెకాయ వంటిది-కరుణరస ప్రధానమైన యీ గాథ సహృదయులకు మరపురానిది.

పొదిలెమ్మ పంట కళ్లంలో నూర్పిడి రాతి కింద మిరపపండులాగ చితికి పోయిన ఘోర కలిని హృదయాలు ద్రవించేలాగ వర్ణించారు శ్రీనాయని.

## ముదిగొండ వీరభద్రమూర్తి-స్వాతంత్ర్య సమరగాథ 'వందేమాతరమ్'

భారత స్వాతంత్ర్య సమర గాథను శ్రీ ముదిగొండ వీరభద్ర మూర్తి 'వందేమాతరమ్' అనే బృహత్కావ్యంగా రచించారు. 1806 నుండి 1906 వరకు జరిగిన భారత స్వాతంత్ర్య సంగ్రామాన్ని 18 ఖండాలలో మహా భారత మహేతిహాసం స్ఫురించే విధంగా రచించారు. బెంగాల్ కరవులో ప్రజల దుస్థితిని శ్రీ వీరభద్రమూర్తి బాగా వర్ణించారు. స్వాతంత్ర్య సమరంలో పాల్గొని కుటుంబ జీవితాన్ని, ఆరోగ్యాన్ని, ఐశ్వర్యాన్ని, ప్రాణాన్ని త్యాగం చేసిన అతిరథ, మహారథులకు 'వందేమాతరమ్'లో శ్రద్ధాంజలి ఘటించారు. స్వాతంత్ర్య సమరంలో పరోక్షంగా జాతిని ఉత్తేజపరచిన రామకృష్ణ పరమహంస, వివేకానందుడు, దయానందుడు మొదలైన విజ్ఞానవేత్తలను స్తుతించారు. రవీంద్ర, అరవింద, బంకింబాబువంటి కవిచంద్రుల తోడ్పాటును కీర్తించారు. అనాటి ప్రజల ఆవేశాన్ని త్యాగశీలతను కొనియాడారు. స్వాతంత్ర్యోద్యమంలో ఉజ్జ్వల ఘట్టాలను చరిత్రకారులవలె తేదీలు దస్తావేజులతో గాక, కమనీయమైన కల్పనలతో తీర్చిదిద్దారు.

## ఇంద్రగంటి - కాకతీయ శౌర్యోజ్జ్వలగాథ - 'కీర్తితోరణము'

హనుమదింద్రగంటివారి కవిత్వం ఆహ్లాదకరమైనది. దశారామము రచించిన ముప్ఫైయేళ్ల తర్వాత కవిగారి గళద్వారాలు మెత్తగా తెరుచుకుని ఆలోచనామృతమై, అణచి పెట్టబడిన ఆవేశంతో 'కీర్తితోరణము' వెలువడింది. 'సృష్టిలో తీయనిది స్నేహమేనోయీ' అని పలికిన కవి వాక్కు మధురమైనది. పాండిత్యంవల్ల ప్రతిభయే మాత్రం కుంటువడని కవి శ్రీ ఇంద్రగంటి. తెలుగుదేశంలో తలెత్తిన కవితోద్యమాల జీవసారాన్ని గ్రహించి, తిరిగి సంప్రదాయ కవితను అభిమానించారు.

కాకతీయుల చరిత్రను మథించి, జనశ్రుతిని మన్నించి, రసం, సంఘట నలు వున్నచోట విపుల పరచి 'కీర్తితోరణము' రచించారు. ఓరుగంటిలో చారిత్రకశిథిలాలను చూచి, ఆనాటి రాజ్యవైభవాన్ని స్మృతికి తెచ్చుకుని యీ కావ్యం రచించారు. కట్టుకథలకు ప్రాధాన్యమివ్వక చరిత్రను గౌరవించారు, "కాకతీయుల రసజ్ఞత ఒక్క పద్మమై వేయి రేకులు చాచి విచ్చెననగ" కీర్తితోరణము రచించి శ్రీ ఇంద్రగంటి చారిత్రక కావ్యాల లో మరొక వెలుగు కంబాన్ని నిలిపారు.

## పింగళి - కాటూరి : 'ఆత్మలహరి' : 'పన్నీటిజల్లు'

సౌందరనంద కావ్యరచనతో ప్రసిద్ధులైన పింగళి - కాటూరి కవులు స్వాతంత్ర్యానంతరం వేర్వేరుగా కావ్యాలు రచించారు. వీటిలో కాటూరి వారి గుడిగంటలు - పౌలస్త్యహృదయం విశిష్టమైనవి. దేవాలయాల్లో హరిజన ప్రవేశాన్ని సమర్ధించి, భగవంతుడు హరిజనులకే సన్నిహితు డని చెప్పిన కావ్యం గుడిగంటలు. రామాయణంలో రావణ పాత్రను సరిగా అర్థం చేసుకొని శ్రీకాటూరి పౌలస్త్యుని హృదయంలో తలపులను చక్కగా ఆవిష్కరించారు. రాముని చేతిలో మరణించటానికి ఎదురు చూచిన రావణుని రామభక్తునిగా నిరూపించారు. శ్రీకాటూరి వివిధ సందర్భాల్లో రచించిన ఖండ కావ్యాలు 'పన్నీటి జల్లు' లో వున్నాయి. వీటిలో చెళ్లపిళ్లవారు ఉద్యోగ విరమణానంతరం బందరు వీడిపోయే సందర్భంలో రాసిన వీడ్కోలు ఎప్పటికీ మరపురానిది.

శ్రీపింగళి లక్ష్మీకాంతం స్వతంత్రంగా రచించిన కావ్యం 'ఆత్మల హరి'. పరిపూర్ణమైన వర్ణ చిత్రానికీ రేఖా చిత్రానికీ భేదం వున్నట్లే వీరి 'ఆత్మలహరి' పరిపూర్ణమైన జీవిత చరిత్ర కాదుగాని రేఖా చిత్రం వలె వీరి విలక్షణ వ్యక్తిత్వాన్ని చక్కగా ప్రదర్శించే కావ్యం.

## కరుణశ్రీ - సంప్రదాయంలో నవ్యతాదృష్టి : 'విజయశ్రీ కరుణశ్రీ ఉదయశ్రీ'

సంప్రదాయంపై గౌరవము, నవ్యత్వంపై అనురక్తి కలిగిన కవి శ్రీకరుణశ్రీ. "విజయశ్రీ, కరుణశ్రీ" కావ్యాలు ఆయనకు ప్రాచీన గాథలపై గల మక్కువను తెలియజేస్తాయి. మహాభారతకథలో అర్జునుని

వీరత్వాన్ని అభిమానించి, అతడిని నాయకుణ్ణిచేసి రచించిన కావ్యం 'విజయశ్రీ'. కరుణరసాన్ని గాఢంగా అభిమానించిన జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు గౌతమబుద్ధుని కథలో కరుణరసానికి ఆకర్షితులు కావటంలో ఆశ్చర్యం లేదు. బుద్ధుని జీవితగాథను సమగ్రంగా రచించ తలపెట్టి, అందులో మొదటి భాగాన్ని మాత్రం రచించి 'కరుణశ్రీ' పేరుతో ప్రకటించారు. మిగిలిన భాగాలను ఆయన పూర్తి చేయలేదు. 'ఉదయశ్రీ'లో "తపోభంగము: కుంతీకుమారి; ధనుర్భంగము: ఊర్మిళాకుమారి: అనసూయాదేవి : సతీసావిత్రి మొదలైన ఖండ కావ్యాలు పూర్వ కథలపై కరుణశ్రీగారికి గల మక్కువను తెలుపుతాయి. ప్రాచీనగాథలను రచించేటప్పుడు అన్వయక్లిష్టత లేని ఆహ్లాదకరమైన శైలిని అవలంబించటంవల్ల, ఆ కథలకు అనన్యసామాన్య ప్రచారం లభించింది. ముద్దులు మూటగట్టే పదబంధాలలో కరుణశ్రీ పద్యం అందంగా అల్లించిన పూల పందిరిలా వుంటుంది. సంప్రదాయ కవితామాధుర్యాన్ని, భావకవితా సౌందర్యాన్ని, అభ్యుదయ కవుల ప్రగతిశీలమైన భావాలను ఆదరించి కరుణశ్రీ తన కవిత్వసీమను విశాల తరం చేసుకున్నారు.

**పాణ్యం నరసరామయ్య - 'స్వాతంత్ర్యవీరుడు' ఉయ్యాలవాడ నరసింహారెడ్డి**

భారతదేశంలో 'సిపాయిపితూరీ'కి పదిసంవత్సరాలు ముందే ఇంగ్లీషువారి "జనస్థానపు దర్బారు నోర్వలేక యెదిరించిన" వీరుడు ఉయ్యాలవాడ నరసింహా రెడ్డి. ఈ వీరుని స్వాతంత్ర్య పోరాట గాథను శ్రీపాణ్యం నరసరామయ్య 'స్వాతంత్ర్యవీరుడు' కావ్యంలో తీర్చిదిద్దారు. బుడ్డావెంగళరెడ్డి, సర్దారు పాపడు, చిన్నపరెడ్డి మొదలైన ప్రజానాయకుల కథలు వీర రసోద్దీపకాలు. వారి కథల్లాగే నరసింహారెడ్డి కథ కూడ రక్తం ఉప్పొంగింపజేస్తుంది. ఈ కథను వీరరస ప్రధానంగా రచించి శ్రీనరసరామయ్య భారతస్వాతంత్ర్య చరిత్రలో నరసింహారెడ్డి త్యాగాన్ని ధైర్యాన్ని చిరస్మరణీయం చేశారు.

**బోడేపూడి వేంకటరావు-బౌద్ధ కళాక్షేత్ర ప్రశంస**

బౌద్ధ కళాక్షేత్రమైన నాగార్జునకొండ వైభవాన్ని కీర్తిస్తూ శ్రీ బోడేపూడి వెంకటరావు 'కళాక్షేత్రము' కావ్యం రచించారు. ప్రశంస'

అవతారము, చరిత్ర అనే మూడు ఖండాలుగా యీ కావ్యాన్ని విభజించారు. నాగార్జున కొండలో శిల్ప కళా కౌశలాన్ని ప్రశంసించేది మొదటి ఖండము. బుద్ధుని జీవిత గాధను వర్ణించే ఖండము రెండవది. చరిత్ర ఖండములో బౌద్ధ మతోత్పత్తి, వ్యాప్తి, పరిణామములను వర్ణించారు. ఆధునికాంధ్ర కవిత్వంలో చారిత్రకేతివృత్తాన్ని గైకొని రచించిన పద్య కావ్యాలలో ఇది సొగసైనది. శ్రీ వెంకటరావు టాల్‌స్టాయ్ రచించిన నీతి కథ ఆధారంగా 'తృష్ణావర్తము' అనే చిన్న కథా కావ్యాన్ని కూడ రచించారు. నిర్దుష్టమైన భాష, కమనీయమైన కల్పనలు ధారా శుద్ధి గలిగిన పద్య రచనతో శ్రీ వెంకటరావు పద్య రచన ఆనందం కలిగిస్తుంది.

## బెళ్లూరి-'వివేకానంద చరిత్ర'

పుణ్య శ్లోకుల చరితను కావ్యాలుగా మలచటం కష్టతరమైన పని. అందులో కల్పనలకంతగా వీలువుండదు. అతిశయోక్తులు పలికితే పుణ్య మూర్తుల కీర్తిని వ్యాపింపజేయటంపోయి, అభూత కల్పనలతో కావ్యం ఇంపు గొల్పదు. జాతీయ పునరుజ్జీవనానికి దోహదం చేసిన వివేకానందుని జీవిత గాధను శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి ద్విపదలో రచించారు. చికాగో నగరంలో అఖిల మతముల సభలో వివేకానందు డొనర్చిన ఉపన్యాసం విశ్వవిఖ్యాతి పొందినది. ఆ సభ సమావేశమైన తీరును వివేకానందవాణిని శ్రీనివాసమూర్తిగారు సౌమ్య గంభీర నాదంతో కమనీయంగా రచించారు. వీరే రచించిన మరొక కావ్యం 'కొండవీటి రెడ్డిరాజ్య మహోదయము'. శీర్షికకు తగినట్లుగానే చారిత్రక అల్లిన రసమయ కావ్యం.

## వజ్ఝల కాళిదాసు - 'ఆంధ్ర మహావిష్ణువు'

పురాణ ప్రసిద్ధమైన ఆంధ్ర మహావిష్ణువు కథను శ్రీ వజ్ఝల కాళిదాసు ద్విపదలో రచించారు. "తెల్గు మాట చందమ్ములో కులుకు, తెల్గునుడుల యందములఁ గ్రొందళుకు, తెల్గువాణి విన్యాసంపు హొయలు, తెల్గు పల్కు గ్రొన్ననల తేనియలు" కమనీయ రస తరంగములుగా

ఆంధ్ర మహా విష్ణువులో ప్రవహింపజేశారు. నిశుంభునితో ఆంధ్ర మహా విష్ణువు చేసిన యుద్ధాన్ని శ్రీ కాళిదాసు వీరరస స్ఫోరకంగా వర్ణించారు. ఆంధ్ర జాతి ప్రాచీనతను తెలిపే యీ కావ్యం రసవంతమైనది. వీరే 'శాతవాహన సంభవము'కూడ రచించి ఆంధ్రచరిత్రపై సహృదయులకు మక్కువ కలిగించారు.

## దేవులపల్లి రామానుజరావు-'పచ్చ తోరణము'

శ్రీ దేవులపల్లి రామానుజరావు రచించిన ఖండ కావ్య సంపుటి 'పచ్చ తోరణము' తెలంగాణ నుండి సంప్రదాయ పద్ధతిలో వచ్చిన రస వత్కావ్యాలలో వొకటి. శ్రీ రాయప్రోలు సుబ్బారావు "పచ్చ తోరణము అంతా పచ్చగా లేదు. అక్కడక్కడ కట్టెట్టని రేకులున్నవి. అకలంక ధవళములైన పత్ర పుష్పాదులును కలవు. కదంబ కల్పనలో ఇలాటి మిశ్ర రూప రామణీయకం తప్పదేమో!" అన్నారు ('ఉపనేచని'-'పచ్చ తోరణము' పీఠిక). తెలంగాణ ప్రజలను చైతన్య వంతుల్ని చెయ్యటంలో కవిగా శ్రీ రామానుజరావు పాత్రగణనీయమైనది. ఈ సంపుటిలో ఓరుగల్లు, కాపుకన్నె, తొలకరి, మహాత్ముడు, కాపురము మొదలైన ఖండ కావ్యాలు రసవంతంగా వుంటాయి.

## పల్లా దుర్గయ్య-'పాలవెల్లి'

శ్రీ పల్లా దుర్గయ్య రచించిన 'పాలవెల్లి' తెలంగాణ నుండి వచ్చిన ఉత్తమ ఖండ కావ్య సంపుటులలో విశేషంగా చెప్పదగినది. దీన్లో కర్షకా, మారు, వర్షాభ్రము, కవిసమ్రాట్టు మొదలైనవి ఆహ్లాదకరమైన కావ్య ఖండికలు. మతాన్ని గురించి శ్రీ దుర్గయ్య తలపు "మానసిక తిమిరముల మాపునవి మతములును, మనసు చీకటి సేయు మతమ్ములవి తమములగు" అనేది ఆలోచనాత్మకమైనది. నిర్దుష్టమైన భాషలో ఆచితూచి ప్రయోగించటం దుర్గయ్యగారి ప్రత్యేకత. వీరిదే 'గంగిరెద్దు' కావ్యం కూడ ప్రసిద్ధమైనది మరొకటుంది. కథాకావ్యాల్లో 'గంగిరెద్దు' రసవంత మైనదిగా ఎన్నదగినది.

శ్రీ 'సిరి' ప్రెగడ భార్గవరావు 'భార్గవానందలహరి' అనే కావ్య సంపుట మొకటి ఆలోచనామృతమైన కవిత్వంతో నిండి వున్నది. ప్రాచీన కవుల శబ్ద ప్రౌఢి, భావకవుల ఊహాలాలిత్యం భార్గవరావుగారి కవిత్వంలో మురువు గొల్పుతాయి.

## విశ్వనాథ వేంకటేశ్వర్లు-'కాళిందీ పరిణయము'

శ్రీ విశ్వనాథ వేంకటేశ్వరులు రచించిన 'కాళిందీ పరిణయము' 'భావతత్త్వ కావ్యము', 'అంభోవాదము' అనే తత్త్వశాస్త్ర ప్రాతిపదిక మీద రాయబడిన కావ్యమిది. "కాళింది తొలినాటి విరజీ నది; అంభ స్వరూప. సృష్టి వికారములోని ప్రథమ స్వరూపమైన యంభః స్వరూప మునకును భగవంతునకును నిత్య విరహము, నిత్య సంయోగము. ఇది పరమ రహస్యము. ఈ కావ్యము ఆ తత్త్వము మీఁద నాధారపడి వ్రాయబడినది" అని విశ్వనాథ సత్యనారాయణగారు అంభోవాదమును వివరించి, కావ్య ప్రాశస్త్యాన్ని వివరించారు. కాళింది, శ్రీకృష్ణుల ప్రణయము, విరహము, సమాగమములతో కావ్యం ప్రబంధ పద్ధతిలో నడుస్తుంది. దీనికున్న తాత్త్విక ప్రాతిపదికవలన ఇది విలక్షణమైన కావ్యంగా రూపు దాల్చింది.

## పువ్వాడ శేషగిరిరావు-'గోవత్సము-తాజమహాలు-దారా'

శ్రీ పువ్వాడ శేషగిరిరావు రచించిన 'గోవత్సము-తాజమహాలు, ధారా కావ్యాలు సంప్రదాయ పద్ధతిలో వచ్చిన మధురమైన రచనలు. వీరి పద్య రచన గొంతెత్తి శ్రావ్యంగా ఆలపించడానికి వీలుగా వుంటుంది. నిర్దుష్టమైన భాష, కుంటువడని ధార, అహ్లాదకరమైన భావన శేషగిరిరావు గారి కావ్యాల్లో కన్పిస్తాయి. 'గోవత్సము' కరుణరసం జాల్వారే అద్భుత రచన. మొగలాయి ప్రభువుల ఆలోచనలు; ఎత్తుపై ఎత్తులను తెలిపే చారిత్రక కావ్యం 'దారా' పఠితలకు ఆసక్తి గొలుపుతుంది.

## మోటూరు వేంకటరావు - 'చకోర సందేశము'

సందేశ కావ్యాలలో శ్రీ మోటూరి వేంకటరావు రచించిన 'చకోర సందేశము' విశిష్టమైనది. మేఘ సందేశ కావ్యాన్ని మనసులో వుంచు

కొని, ఆ పద్ధతిలో చకోరం ద్వారా సందేశం పంపినట్లుగా రచించిన యీ కావ్యం మధురమైనది. ఆహ్లాదకరమైన భావన, ధారా శుద్ధి గలిగిన పద్య రచన, లక్షణ సమ్మతమైన పదప్రయోగం వేంకటరావుగారి కవిత్వాన్ని ఆస్వాదయోగ్యం చేస్తున్నాయి. వీరి 'పద్మినీ భాస్కరము' వర్ణనా చమత్కారంతో, 'సింహ బలి' వీర రస ప్రధానమైన రచనతో ఇంపు గొలుపుతాయి.

## కరుటూరి వారి బృహత్కావ్యాలు

బృహత్కావ్యాలకిది కాలంకాదని ఒక ప్రక్కకవులు తలుస్తున్నా, కొందరు కవులు మాత్రం తాము గైకొన్న ఇతివృత్తాలను సవిస్తరంగా రచించటంలోనే ఆనందం పొందుతున్నారు. శ్రీకరుటూరి సత్యనారాయణ రచించిన "తిష్య రక్షిత; ఆమ్రపాలి; కరుణా సౌగతము" ఇటువంటివే. ఛందోబద్ధమైన రచనపై ప్రీతి, సంప్రదాయంపై మక్కువ వీరి కావ్యాల్లో కన్పిస్తాయి. ఊహల్లో నిశితత్వం లేకపోయినా పద్యంలోధారా శుద్ధి ఇంపు గొలుపుతుంది. కథా కావ్య రచనలో సత్యనారాయణగారు ఒడిదుడుకులు లేక కథను సూటిగా, నాజూకుగా చెప్తారు.

## బుడన్ సాహెబ్ - 'ఖుతుబ్ నామా'

'ఖుతుబ్ షాహీ' వంశపు రాజుల చరిత్రను ప్రబంధ పద్ధతిలో ప్రౌఢమైన 'ఖుతుబ్‌నామా' కావ్యాన్ని రచించిన వారు శ్రీ షేక్ బుడన్ సాహెబ్. సీస పద్య రచనలో వీరు శ్రీనాథుని మార్గాన్ని అనుసరించి, ధారాశుద్ధిగల మధురమైన పద్యాలను రచించారు. "రాము రహీము భేదములు, ప్రాచ్య పశ్చిమ జాతి భేదములు నామ నిషాని భేదములు" లేక విశాల హృదయంతో రచించిన యీ కావ్యంలో కల్పనలు, రచనా రీతి పాఠకుల్ని ముగ్ధుల్ని చేస్తాయి.

## బీర్నీడి ప్రసన్న - 'పృథ్వీభాగవతము'

'మధుమాసము, పృథ్వీ భాగవతము' కావ్యాలు రచించి సంప్రదాయ పద్ధతిలో శ్రీ బీర్నీడి ప్రసన్న ఉత్తమ గ్రంథాలు అందించారు.

సంయుక్తా పృధ్వీ రాజుల వృత్తాంతము పృధ్వీ భాగవతము. ప్రహ్లాదుడు తండ్రిని నెదిరించి విష్ణువు నారాధించినట్లు, సంయుక్త జయచంద్రు నెదిరించి పృథ్వీరాజును వరించటంచేత కావ్యానికి పృధ్వీ భాగవతమని పేరు పెట్టారు. సంయుక్తా విరహము, స్వయం వరానికి వచ్చిన వివిధ నరపాలుర వర్ణనం, జయచంద్రుని పశ్చాత్తాపము మొదలైన కల్పనలతో రసమయం చేశారు. వీర కరుణ శృంగార రసాలీ కావ్యంలో చక్కగా సమన్వయం పొందాయి. జయచంద్రుడు సంయుక్తకు హితవుచెప్తూ పరశురాముని కథ చెప్పి పితృవాక్యం దాటరానిదంటాడు. పుత్రికలకు పితృభక్తియుఁ బుత్రికలకు భర్తృభక్తి ముఖ్యమని సంయుక్త సమాధాన మిస్తుంది. జయచంద్రుడు వాస్తవంగా పశ్చాత్తాపపడినదీ లేనిదీ తెలియదు గాని జయచంద్రుడు పశ్చాత్తాపం పొందినట్లు వర్ణించి ఆ పాత్రను గూడ ఉదాత్తం చేశారు.

శ్రీ బీర్నీడి ప్రసన్న సంప్రదాయ కవితా ప్రియులకు రుచిగొలిపే కావ్యాలు అందించి, రసజ్ఞుల మన్ననలకు పాత్రులయ్యారు.

## వి. వి. యల్. - 'ఆనంద భిక్షువు'

బుద్ధుని శిష్యుడైన ఆనందుని కథను రవీంద్రులు 'చండాలిక'లో అత్యద్భుతంగా చిత్రించారు. ఈ కథను విస్తరించి మనోజ్ఞమైన 'ఆనంద భిక్షువు' కావ్యంగా రూపొందించారు శ్రీ వి. వి. ఎల్. నరసింహారావు. మంత్రశక్తి,ఆత్మశక్తికి సంఘర్షణను వర్ణించటంలో శ్రీ నరసింహారావు రమణీయంగా రచించారు. బౌద్ధమత ఇతివృత్తం తీసుకొని రచించిన యీ కావ్యం రచనారీతిలో, ముఖ్యంగా పద్యరచనలో, ఔచిత్యపోషణలో సౌందర్యానందాన్ని తలపిస్తుంది.

## స్ఫూర్తిశ్రీ - 'మహాశ్వేత'

బాణుని కాదంబరి కావ్యం నుండి మహాశ్వేతా వృత్తాంతాన్ని గ్రహించి, దాన్ని ప్రపంచించి 'మహాశ్వేత' కావ్యంగా మలచారు శ్రీస్ఫూర్తిశ్రీ. ''కాదంబరిలోని ఆయువుపట్టు కవికి దొరికి'' నదని శ్రీమధునాపంతుల సత్యనారాయణశాస్త్రి యీ కావ్యాన్ని మెచ్చుకున్నారు.

సంప్రదాయంలోగల శబ్దశక్తిని, భావ కవిత్వంలోని భావశక్తిని, ఆధునిక పద్ధతి వ్యక్తీకరణను పుణికిపుచ్చుకున్న స్ఫూర్తిశ్రీ "అంతర్వాణి" సూర్యముఖి మొదలైన కావ్యాలు గూడ రచించారు. "కవితయే దివ్య చింతనము, కవితయే నుతియుగానమ్ము, కవిత యొక్కటియె యర్చనము, కవితయే యారాధనమ్ము" అని భావించే "స్ఫూర్తిశ్రీ" కవితా కళా రహస్య మెరిగిన కవి.

## చాగంటి - 'హేమమాలి'

మేఘ సందేశ కావ్యానికి పూర్వకథను శ్రీ చాగంటి గోపాల కృష్ణమూర్తి 'హేమమాలి' కావ్యంలో రమణీయంగా చిత్రించారు. 'సౌందరనందం'కావ్యసౌందర్యాన్ని తలపింపజేసే యీ కావ్యం శృంగార రస నిర్వహణలో ఔచిత్య శోభితమై అలరారుతున్నది. 'హేమమాలి' అనే యక్షుడు తన ప్రియురాలితో కలిసి 'చైత్రరథము'లో విహరించి, స్వామి కార్యనిర్వహణలో తెలియక చేసిన పొరపాటుకు, కుబేరుడు హేమమాలిని శపించటం ఇందులో ఇతివృత్తం. ఈ కావ్యంలో వర్ణనలు కమనీయమైన చిత్రాలవలె మురువు గొలుపుతాయి, సంప్రదాయంలో మాధుర్యాన్ని చవిచూడాలంటే 'హేమమాలి' కావ్యం తప్పక చదవాలి.

## అధిక్షేప హాస్యరస ప్రధానమైన కావ్యం-
## 'ఈ జంట నగరాలు హేమంత శిశిరాలు'

'క్రీడాభిరామం' వంటి కావ్యం ఆధునిక కాలంలో లేని లోటును తీర్చటానికా అన్నట్లు శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య "ఈ జంట నగరాలు హేమంత శిశిరాలు" రచించారు. హైదరాబాద్, సికిందరాబాద్ నగరాల్లో జీవితాన్ని, క్రీడాభిరామ కావ్యంలో లాగే వరుసగా హాస్యరస స్ఫోరకంగా రచించారు. పద్య రచనలో శ్రీ ఉత్పల శైలి రమ్యమైనది. "సంప్రదాయసిద్ధమై, నవీన భావబద్ధమైన" యీ కావ్యం ఆధునిక కవితలో అధిక్షేప హాస్యానికి ఏకైక ఉదాహరణగా పేర్కొనవచ్చు.

కాలి చెప్పు తెగిపోతే కుట్టించుకోలేని సాధారణ కుటుంబి; పాత పుస్తకాలమ్మే దుకాణం; జంటనగరాల్లో తారసిల్లే 'పైరవీ'లు: సిటీ బస్సులదగ్గర పోకిరీ కుర్రాళ్ళ సకిలింతలు, ఖరీదైన హోటళ్ళలో కేబరే నృత్యాలు, ఈతకొలనుల్లో ఈదులాడే సుందరులు, నగరంలో దర్శనీయమైన స్థలాలు, కవి సమ్మేళనలు, గానాబజానాలు, అన్నిటినీ పద్యాల్లో చదువరులను సమ్మోహితం చేసే కవితా శిల్పంతో తీర్చిదిద్దారు.

ప్రతి పద్య చమత్కారం శ్రీ ఉత్పలవారి సొత్తు. ఇటువంటి ప్రజ్ఞ ఆధునికుల్లో అతితక్కువ మందికే వున్నది.

కవి, అతని మిత్రుడు నూకరాజు నగరంలో వివిధ దృశ్యాలను తిలకించటం కూడ క్రీడాభిరామాన్ని జ్ఞాపకం చేస్తుంది.

"ద్వ్యర్థి కావ్యంబులో నచ్చు తప్పులున్న
ద్వ్యర్థి కావ్యంబటన్న గౌరవము పొందు"

ననడం లాటి చమత్కారాలు కావ్యంలో పుష్కలంగా వున్నాయి.

మహాకవి మఖ్దూమును-

కష్టజీవుల పర్జన్య గర్జయతడు
గ్రామసీమల నును పైరగాలి యతడు"

అని వర్ణించటం వంటి పదచిత్రాలు ఇంపు గొలుపుతాయి.

ఆధునిక కాలంలో సొగసైన పద్యరచన కరవైపోతుండగా, మిక్కిలి అరుదైన హాస్యరసంతో మేళవించిన ఉత్పల వారి ప్రజ్ఞ కొనియాడ దగినది. సంప్రదాయవృత్తాలలో కవిప్రతిభావంతుడైతే ఎన్నైనా అందాలు పొదగవచ్చు ననటానికి, ఆధునిక భావ వికాసానికి పద్యం అడ్డు కాదనటానికి ఉత్పలవారి కావ్యం మంచి తార్కాణగా నిలుస్తుంది.

## బోయిభీమన్న - కావ్యకుసుమాలు

శ్రీ బోయిభీమన్న రచించిన 'కావ్యకుసుమాలు'; 'అశోకవనిలో రాముడు' మొదలైన కావ్యాల్లో సంప్రదాయ కవిత్వం సొగసుగా దర్శన

మిస్తుంది. సాధారణంగా కవులకు కావ్యవస్తువుగా తోచని 'కుంకుడుచెట్టు' భీమన్నగారి లేఖినీ స్పర్శతో రసవంతమైన కావ్యమైనది. "రావణ వధ తర్వాత శ్రీరాముడు ఒంటరిగా అశోకవనంలోకి వెళతాడు. ఆ సమయంలో రాముని మనస్సు ఏ విధంగా వున్నదీ 'అశోకవనిలో రాముడు'లో శ్రీ భీమన్న హేతుబద్ధంగా, అపూర్వమైన కల్పనాశక్తితో రచించారు. వీరి 'పిల్లీ శతకం' వ్యంగ్య శక్తితో విలసిల్లిన కావ్యం.

## ముదివర్తి కొండమాచార్యులు - 'నారాయణమ్మ'

శ్రీ ముదివర్తి కొండమాచార్యులు రచించిన నారాయణమ్మ 'పూర్ణాహుతి' కావ్యాల్లో సంప్రదాయ పద్ధతిని ఆదరించారు. ముసలమ్మ మరణము, నలజారమ్మ అగ్ని ప్రవేశము కావ్యాల పద్ధతిలో కొండమాచార్యులుగారు నారాయణమ్మ కావ్యాన్ని రచించారు. మూఢ నమ్మకానికి ప్రాణం పొయ్యటమనే దృష్టితో చూడకపోతే వీరి పద్యరచన ధారాళంగా సాగిపోతుంది.

## జ్ఞానానందకవి - 'ఆమ్రపాలి'

శ్రీ జ్ఞానానందకవి బౌద్ధ గాథలలో రమ్యమైన ఆమ్రపాలి కథను తీసుకొని రసవంతమైన కావ్యం రచించారు. జాషువా కవిని తలపించే వీరి సీసపద్యరచన మధురంగా వుంటుంది. ఔచిత్య నిర్వహణలో అప్పుడప్పుడూ వీరు సంయమనం కోలుపోయినా, రసంజాలు వారే కవిత రచించారు. కథాకావ్య రచనలో కథను ఆది మధ్యాంతాలుగా విభజించటంలో మిక్కిలినేర్పు చూపారు. వీరు రచించిన పెక్కుఖండ కావ్యాలు కూడ సంప్రదాయ కవితాభిమానులకు ఆనందం కల్గిస్తాయి.

## శ్రీనివాస సోదరులు - 'ఓరుగల్లు కోట'

శ్రీనివాస సోదర కవులు రచించిన 'ఓరుగల్లు కోట' చారిత్రక కావ్యాలలో విశిష్టమైనది. కాకతీయ రాజుల శౌర్య ప్రతాపాలను వర్ణించే యీ కావ్యంలో పద్యాలు వీర రసోద్దీపకమైనవి. వీరి కవిత్వంలో శాస్త్ర వైదుష్యం, రస నిర్వహణ, ఔచిత్యపోషణ సమపాళ్ళలో మేళవించి పఠితలకు రసానందం కల్పిస్తాయి.

## సంప్రదాయాభిమానులైన మరి కొందరు కవులు - కావ్యాలు

స్వాతంత్ర్యానంతరం వెలువడిన సంప్రదాయ పద్ధతిలో వచ్చిన కావ్యాలు లెక్కకు మిక్కుటంగా వున్నాయి. వీటిలో దిగుమర్తి సీతా రామస్వామిగారి 'స్వామి పుష్కరిణి', కాకర్ల వెంకటరామనరసింహము గారి 'సుజాత'; బాడాల రామయ్యగారి 'కృష్ణ కథా విపంచి', ఉత్పల సత్యనారాయణాచార్యగారి 'కచదేవయాని'; 'చిన్ని కృష్ణుడు'; శోభిరాల సత్యనారాయణగారి 'రాగమయి'; బొడ్డులూరి నారాయణరావు గారి శాంతి పథము; రాధేయుడు; కోటగిరి విశ్వనాథరావుగారి ఖడ్గనారాయణము; ఆదిభట్ల రామమూర్తి గారి 'వరద రాజేశ్వరి'; కాశూరి నరసింగరావుగారి 'అన్వేషణ', యస్వీజోగారావుగారి 'ప్రసన్న కుసుమాయుధము'; కొర్లపాటి శ్రీరామమూర్తి గారి 'సువర్ణరేఖలు'; చేబ్రోలు చిన్మయ బ్రహ్మముగారి 'విశ్వదాభిరామము'; ఉండేల మాలకొండారెడ్డిగారి 'కాంతి చక్రాలు'; ముత్తీవి లక్ష్మణదాసుగారి 'క్వణత్కింకిణి'; వావిలాల రామమూర్తిగారి 'ఊర్మిళ'; కొండవీటి వేంకటకవిగారి నెహ్రూ చరిత్ర, పోలూరి ఆంజనేయ ప్రసాద్‌గారి పోతన మొదలైనవి ఎన్నదగినవి. నాదృష్టికి రాని కృతులు ఇంకా ఎన్నో వుంటాయి.

కాలగమనంలో ఎన్నిమార్పులు వచ్చినా సంప్రదాయ కవిత ఆదరాన్ని పొందుతూనే వుంటుంది.



ఐదవ అధ్యాయం

# భావకవితా సౌరభం

'నవ్యకవిత్వమంటే యేమిటి?' అన్న ప్రశ్న పండితులలో జిజ్ఞాసువులలో యీ శతాబ్దారంభంలో తలయెత్తింది. గీతపద్యాలు చదివి, ఖండకావ్యాలు వినిపించీ యిదే నవ్యకవిత్వమంటే- తెలియకపోతే నీ ఖర్మ అన్నట్టుగా ప్రవర్తించేరు ఆనాటి కవులు. శ్రీపాద గోపాలకృష్ణ మూర్తిగారు యీ విషయాన్ని ప్రస్తావిస్తూ; "వెనకటి కొౕకమారు రాధాకృష్ణ పండితులడిగేరట కొంపెల్ల జనార్దనరావును- నవ్యకవిత్వమని దేనినంటున్నారూ?" అని. జనార్దనరావు నన్నూ అడిగేరు ఆ ప్రశ్నే. వర్ణ్యవస్తు సౌందర్యాన్ని చదువరికి స్ఫురింపజేసే రచన నవ్యము: వర్ణనా చమత్కారాన్ని స్ఫురింపజేసేది ప్రాచీనము అంటిని" అని నవ్యకవితా స్వరూపాన్ని స్థూలంగా నిర్దేశించారు.[1] శ్రీ రాయప్రోలు 'రమ్యాలోకమ్' రచించి నవ్యకవిత్వ లక్షణాలను క్రోడీకరించారు.

భావకవిత్వ మనగానే సౌందర్యం, ప్రేమ, ముఖ్యంగా విశ్వమానవ ప్రేమ తలపుకు వస్తాయి. భావకవిత్వంలో ప్రకృతి, ప్రణయం, ప్రబోధం ప్రాధాన్యం వహించాయి. ఆత్మాశ్రయరీతి భావకవిత్వంలో ప్రాధాన్యం వహించింది. భావంలేని కవిత్వముంటుందా? అని ప్రశ్నించి భావకవిత్వమన్న పేరును కొందరు పండితులు ఆక్షేపించారు. నవ్యకవిత్వమనీ, అభినవ కవిత అనీ పిలవబడుతున్న యీ కవిత్వాన్ని, కవులు భావవ్యక్తీకరణకే ఎక్కువ ప్రాధాన్యమియ్యటాన్ని గమనించి శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు కాబోలు భావకవిత్వమని పేరుబెట్టారు. అప్పటినుండి ఆ పేరే స్థిరమైపోయింది.

---

1. అర్ధశతాబ్ది ఆంధ్ర కవిత్వము - వ్యాసాలు - భారతి - 1962 నవంబరు నుండి 1963 డిసెంబరు వరకు - రచన - శ్రీపాద గోపాలకృష్ణమూర్తి.

ఏదైనా కావ్యం విన్నప్పుడు సహృదయులు దాన్ని భావకవిత్వంగా ఎలా గుర్తిస్తారు? భావకవిత్వ స్వరూపస్వభావాలను గమనించిన విశ్వనాథ, శ్రీశ్రీ గారలు చెరొక విధంగానూ దాన్ని నిర్వచించారు. "కవియొక్క ఒక అవిస్పష్ట వాంఛాంకురము. ఒక అంతర్నిగూఢ తాపము, ఒక చిన్న కావ్యములో ఊదబడిన"చో అది భావకవిత్వమని విశ్వనాథ నిర్వచించారు.[2] "హృదయాలను, మానసాలను కలవరపరుస్తూ అల్లకల్లోలంగా ఘూర్ణిల్లే ప్రమాద ప్రాంతారాలలో కవికి నిరాఘాటంగా విహరించే అధికారం కలదు. అట్టి అతని సంచారాలలో ఏ సమ్మొహూర్తాననో కావ్యగీతం ఒకటి మెరుగులు తీరిన విలక్షణ రచనా ధోరణిలో వెలుగు చూస్తుంది. ఆ గీతం కవి అనుభవించిన రసస్థాయిని సమగ్రంగా పాఠకునిలో ఆవిష్కరించగలుగుతుంది. ఉత్కృష్ట భావగీతానికి నా నిర్వచనం ఇది" అన్నారు శ్రీశ్రీ.[3] రెండు నిర్వచనాలు ఆలంకారికుల కావ్య నిర్వచనాల్లాగ ఖచ్చితమైనవి కాకపోయినా భావకవిత్వ స్వరూపాన్ని మాత్రం సరిగ్గా వెల్లడిస్తున్నాయి. రెండు దశాబ్దాలపాటు కవిత్వ రంగంలో వెలుగులు విరజిమ్మిన భావకవిత్వం పెక్కు శాఖలుగా విస్తరించింది. శ్రీ సి. నారాయణరెడ్డి భావకవిత్వాన్ని (1) ఆత్మాశ్రయరీతి, (2) దేశభక్తి కవిత్వము, (3) ప్రకృతి కవిత్వము, (4) సంఘసంస్కరణ కవిత్వము, (5) భక్తి కవిత్వము (Mystic Poetry), (6) స్మృతి కావ్యాలు (Elegies) – ఆరు శాఖలుగా విభజించారు.[4] వీటిలో ప్రకృతి ప్రణయం, ప్రబోధమే ప్రధానమైనవిగా చెప్పవచ్చు.

ప్రకృతి సౌందర్య వర్ణనలు ప్రాచీనాంధ్ర కవిత్వంలో పుష్కలంగా వున్నాయి. కాని పాఠకుల కన్నులకు కట్టే, మనోగోచరమయ్యే అందచందాలు తక్కువే. సంస్కృత కవులనుండి స్వీకరించిన వర్ణనలు,

---

2. 'లిరికల్ పొయెట్రీ' (వ్యాసము) : విశ్వనాథ : భారతి : అక్టోబరు, 1939

3. మంథపాక పార్వతీశ్వరశాస్త్రిగారి లేఖనుండి : భారతి : జూన్ 1934 - సి.నా రె. గారి 'ఆధునికాంధ్ర కవిత్వము'లో ఉదాహృతము.

4. సి. నారాయణరెడ్డి - ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయము; ప్రయోగములు - 1967.

ఒకరినుండి మరొకరు గతానుగతికంగా అనుకరించిన వర్ణనలూ ఎక్కువ. తెలుగుదేశపు ప్రకృతి సౌందర్యం చాల అరుదుగా కన్పిస్తుంది. శ్రీ రాయప్రోలు తర్వాత వచ్చిన కవుల ప్రకృతి వర్ణనల్లో తెలుగునేల అంద చందాలు కన్నుల పండువుగా కానవస్తాయి. భావకవిత్వమంటే అందమైన కవిత్వమనే అభిప్రాయం రూఢమైపోయింది.

"హేయములు క్లీబములు జుగప్సాయుతములు
రమ్యములు కామి శిల్పదూరంబు లగును"

అని రాయప్రోలు వారు సిద్ధాంతం చేశారు. లోకంలో దానంతట అది 'రమ్య'మైన వస్తువొకటి వుంటుందనే అభిప్రాయం ఈసిద్ధాంతానికి ప్రాతిపదిక. "కావ్యగత రమ్యతకీ లోకంలో కనిపించే అందానికీ అభేదం కల్పిస్తుంది ఈ సిద్ధాంతం. సాహిత్య సిద్ధాంతంగా ఇది తప్పు సిద్ధాంతం" అని శ్రీ వెల్చేరు నారాయణరావు, రాయప్రోలు వారి అభిప్రాయాన్ని ఖండించారు.[5] కాని ప్రాచీన కవిత్వంపై తిరుగుబాటు ప్రకటించిన రాయ ప్రోలు తరానికి, ఇప్పటివారి ఆలోచనారీతికీ భేదం వున్నది. క్షీణయుగ ప్రబంధాల కాముక శృంగారవర్ణనల నుండీ, భాషాభేషజం నుండీ, అరిగి పోయిన శబ్దార్థాలంకారాల నుండి సౌందర్యానికి కళ్లు తెరిపించిన గురజాడ రాయప్రోలుల తరంలో సౌందర్యాన్ని గురించి రాయప్రోలువారు అలా భావించటంలో తప్పులేదు. కాని 1930 తర్వాత వచ్చిన ఆర్థిక సంక్షోభం తర్వాత భావకవుల సౌందర్యదృష్టి ఎబ్బెట్టుగాతోచింది. ఆకలి కళ్ళకు ప్రకృతి సౌందర్యం మరోవిధంగా కన్పించే మాటనిజమే. ఈ సత్యాన్ని రాయప్రోలు వారిమాటల్లో చేప్తే-

"కాల ధర్మానుగతమై జగత్ప్రవృత్తి
మాఱునపుడు వాఙ్మయము మాఱునిజము" (రమ్యాలోకము)

"కవిత్వం అందంగా వుండాలనీ, సుకుమారమైన మాటలు ఉండాలనీ భావ కవిత్వం ఏర్పరచిన నియమం కవిత్వ సామాన్యనియమం

5. వెల్చేరు నారాయణరావు - తెలుగులో కవితా విప్లవాల స్వరూపం - 1978 —'153' వ పేజీ

అయిపోయింది."[6] ఈ నియమం అభ్యుదయ కవితోద్యమ ప్రారంభ దశలోనే తృణీకరింపబడింది.

'ఆదర్శ ప్రణయాన్ని' వర్ణించిన కథలు ప్రాచీన కవిత్వంలో వున్నాయి. వాటిలో చాలాభాగం పురుషాధిక్యాన్ని చాటేవే. స్త్రీపై గౌరవాదరాలు కల్గించవు. స్త్రీని శృంగారమూర్తిగా, ప్రబంధాల్లో అయితే కాముకిగా కవులు భావించారు. కష్టాల్లోవుండి విలపిస్తున్న స్త్రీకూడ కవుల కళ్ళకు అందంగా కన్పించింది; ఆమె ఏడుపు వారికి రాగాలాపనలా తోచింది. క్షీణయుగ ప్రబంధాల్లో అయితే జార శృంగారమూ, ముఖ్యంగా పరకీయా ప్రణయమూ కవులకు కావ్యవస్తువులైనాయి. స్త్రీని హృదయేశ్వరిగా, సోదరిగా, స్నేహితురాలిగా, మాతృమూర్తిగా సంభావించటం భావకవులతోనే మళ్ళీ మొదలైంది.

"కడు హెచ్చు కొప్పు; దానిం
గడువం జనుదోయి హెచ్చు: కటియన్నిటికిన్
గడు హెచ్చు; హెచ్చులన్నియు
నడుమే పసలేదుగాని నారీమణికిన్"

అనే చేమకూర వేంకటకవి 'విజయ విలాసం'లో పద్యానికీ,

"ఆమె నవనీతహృదయ, నాయంతరంగ
శాంతిదేవత, ఆశాపథాంతరాళ
పారిజాతమ్ము ప్రేమజీవన విభాత
కైశికీగీతి, నా తపఃకల్పవల్లి"

అనే వేదుల సత్యనారాయణ శాస్త్రిగారి పద్యానికీ భేదాన్ని గమనిస్తే ప్రణయ భావనలో భావకవుల విప్లవమేమిటో అర్థమవుతుంది. రాయప్రోలు వారి 'అమలిన శృంగార' తత్వాన్ని అనుసరించి భావకవులు కాముక శృంగారానికి స్వస్తి చెప్పారు. పాశ్చాత్యులలో గూడ స్త్రీని వేలంవెర్రిగా అంగాంగ వర్ణనజేసే పద్ధతి లేదని, 'రొమాంటిక్' కవులు

6. వెల్చేరు నారాయణరావు - తెలుగులో కవితా విప్లవాల స్వరూపం - 1978 —'154' వ పేజీ.

ప్రణయాన్ని అతినాజూకుగా, రమ్యంగా, హృదయాహ్లాదకరంగా వర్ణించారని తెలుసుకొని నవ్యులు ఆ మార్గాన్ని అనుసరించారు. కృష్ణ శాస్త్రి, అబ్బూరి, నండూరి, నాయని, వేదుల, బసవరాజు మొదలైనవారు ప్రేమను ముక్తి మార్గంగా తలచారు.

19వ శతాబ్దంలో గూడ కవులు సంస్థానాధీశుల్ని ఆశ్రయించి, వారిని పొగడి, వారిపై కవితల్లి, దినభత్యాలను, వార్షికాలను కానుక లను పొందుతూ వుండేవారు. ఈ శతాబ్దంలో గూడ తిరుపతి వేంకటకవుల 'నానారాజ సందర్శనం' ఆ విషయాన్ని నిర్ధారిస్తుంది. గురజాడ వారి దేశమును ప్రేమించుమన్నా, చిలకమర్తి వారి 'భరతఖండంబు చక్కని పాడియావు' పద్యం, రాయప్రోలు వారి ఆంధ్రాభిమానాన్ని పెంపొం దించే కవితలు నవ్యకవులకు ఆదర్శమయ్యాయి. కవిగా కలంపట్టిన ఆధునికులందరూ మాతృదేశాన్ని స్తుతించసాగారు. విశ్వనాథ, జాషువా, దువ్వూరి, అబ్బూరి, త్రిపురనేని, కృష్ణశాస్త్రి, వేదుల, ఏటుకూరి, కరుణశ్రీ మొదలైనవారు దేశభక్తిని రేకెత్తించే మధురమైన కవిత్వం రచించారు. శ్రావ్యంగా ఆలపించటానికి వీలైన సీసపద్యాలు, గేయాలు రచించారు. జాతీయతాభావం వెల్లివిరిసిన ఆ కాలంలో గరిమెళ్ళ సత్యనారాయణ మొదలైన ప్రజాకవుల రచనలు దేశభక్తులకు నిత్యపారాయణాలైనాయి. చెరసాల పాలు కావటానికి సిద్ధపడిన నాయకుల, కార్యకర్తలనోట యీ పాటలు నిరంతరం ప్రతిధ్వనించాయి.

కన్నడ భాషలో 1920 ప్రాంతాల్లో వెలువడిన ఆధునిక కవిత్వం మన భావకవిత్వాన్ని పోలినది. శ్రీయుతులు డి.వి. గుండప్ప, బేంద్రే, బి. ఎం. శ్రీ కంఠయ్య, పంజెమంగేశరాయరు, గోవిందపాయ్ మొదలైన కవులు 'నవోదయ' ఉద్యమాన్ని ప్రారంభించి నవ్యరీతులను ప్రవేశ పెట్టారు. ''శ్రీ కంఠయ్య గారి ఆధ్వర్యంలో 'తళిరు గుంపు'! బేంద్రేగారి ఆధ్వర్యంలో 'గెళెయరగుంపు'(స్నేహితుల గుంపు) పంజెమంగేశరాయరు ప్రారంభించిన 'మిత్ర మండలి' మొదలైనవి ఆధునికకన్నడ కావ్యానికి

స్ఫూర్తినిచ్చాయి.''[7] శ్రీ డి. వి. గుండప్ప జాతీయవాది. ప్రకృతి, భక్తి, దేశభక్తి ఆయన కవిత్వంలో త్రివేణీ సంగమంలాగ కన్పిస్తాయి. దరిదాపు సమకాలంలో వ్యాపించిన యీ కవిత్వోద్యమాల సంబంధాలను గురించి నిశిత పరిశీలన జరగవలసి వుంది.

భావకవులకు 'స్వేచ్ఛ' ప్రాణప్రదమైనది. వేదనవారి కవిత్వాన్ని ఎప్పుడూ అంటి పెట్టుకునే వుంటుంది. వారి మధురకవితలు ప్రగాఢమైన విషాద వేదనలనుండి వెలువడినవి. భావకవుల 'స్మృతి' కావ్యాలను (Elegies) అర్థం చేసుకుంటే భావకవిత్వంలో విషాదం ఒక ప్రధానమైన భాగంగా తోస్తుంది. సుఖమైనా, దుఃఖమైనా భావకవుల వ్యక్తీకరణలో వున్న లాలిత్యం పదేపదే మనస్సులో కలకవేస్తుంది. కవి అంతర్నిగూఢమైన తాపం సహృదయుల హృదయాన్ని కరిగిస్తుంది.

ఏ విషయాన్ని స్వీకరించినా భావకవులు కాల్పనిక (Romantic) రీతిలోనే తమ భావాలను వ్యక్తం చేస్తారు. అంతులేని వేదనతో నిస్సహాయులై పలవించిన భావకవుల గానం సహృదయులచే కంట తడిపెట్టిస్తుంది.

''భావకవి ఒక వస్తువు విషయంలో, ఒక మూర్తి విషయంలో ఖచ్చితంగా ఉండలేడు. ఎంత హేతుబద్ధంగా ఆలోచించినా, ఎంత అనుభవపూర్వకంగా కవితాసామగ్రిని సిద్ధం చేసుకున్నా తీరా దాన్ని ప్రకటించడానికి వచ్చేసరికి ఒక కాల్పనిక ప్రపంచం, ఒక అలౌకికస్పృహ కవి మనస్సును జబర్దస్తీగా ఆక్రమించేసుకుంటుంది. అప్పుడే ఆ కవి హృదయం సుప్తమందిరాల్ని నిర్మించుకుంటుంది. గాలి పిడికిళ్ళు విసురుతుంది. మనస్సును చిలకనుచేసి మాట్లాడిస్తూ రిక్తసాధనల్ని, సహనశిఖల్ని ఆవిష్కరిస్తుంది. ఇటువంటి ధోరణిని చూచే, పఠిత భావకవిత్వాన్ని గుర్తుపట్టగలుగుతాడు. సధర్మభరమైన ఆంతర్యం కలవాడైతే తన్మయత్వాన్ని పొందగలుగుతాడు'' అని శ్రీమతి నాయని కృష్ణకుమారి

7. కన్నడ సాహిత్య చరిత్ర - ఆర్వీయస్ సుందరం - 163 వ పేజీ.

భావ కవిత్వ తత్త్వాన్ని, దాన్ని పఠిత గుర్తించి ఆనందించే విధాన్ని చక్కగా తెలిపారు.[8]

భావ కవులు ఛందోరీతులలో, పదబంధాలలో, భావ చిత్రాలలో (Images) ఎంతో కొత్తదనాన్ని ప్రవేశపెట్టారు. వెయ్యేండ్ల తెలుగు సాహిత్యంలో గాన యోగ్యమైన పద్యాలు కొల్లలుగా వచ్చాయి. భావ కవుల గీతాలు అగానానికి ఒక లాలిత్యాన్ని ప్రసాదించి 'లలిత సంగీతమై', ప్రాచుర్యం పొందాయి. (Lyrical Poetry) కి గాన యోగ్యత ముఖ్య లక్షణం. ఆ వారసత్వాన్ని భావ కవులు పుణికి పుచ్చుకున్నారు. పాశ్చాత్య దేశాల రొమాంటిక్ కవుల తర్వాత, భావ కవుల మీద విశ్వ కవి రవీంద్రుని ప్రభావం ఎక్కువగా కన్పిస్తుంది. "రవీంద్రుడు ప్రకృతి సౌందర్య యోగి. రాలిన ఆకుల్లో, నిశీధపు నిశ్శబ్దములో, యెడారి దాహములో, మారుతపు నిట్టూర్పులలో, జగత్తంతా వ్యాపించి వున్న చైతన్యపు చలనాలు గుర్తించగల మహా తపస్వి",[9] ఆయన రచనల్లోని ఔన్నత్యాన్ని అందుకున్న కవి శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి. రాయప్రోలు, అబ్బూరి, వేదుల, మల్లవరపు విశ్వేశ్వరరావు మొదలైనవారు రవీంద్రుని మార్గాన్ని అనుసరించారు.

భావకవులు కవిత్వంలో అనిర్వచనీయమైన ఆనందాన్ని అందించ టానికి ప్రయత్నించారు. కవి శబ్దంతో చెప్పేది కొంత భాగమేనని మిగిలినది సహృదయులే ఊహించుకొని ఆ ఆనందాన్ని అందుకోవాలని భావకవులు తలచారు. "మొగముఁగంటిఁ గనులఁగంటి, మొగిలుఁగంటి, పాటవినుచుంటి" (అతనిపాట - కృష్ణ పక్షము) అని కవి చెప్పిన మాట లను ఆధారం చేసుకొని భావాన్ని గ్రహించి, మొత్తం చిత్రాన్ని పూర్తి చేసుకోవాలని కవి ఉద్దేశ్యం. ఇది అస్పష్టమని, అయోమయమనీ

8. 50 ఏండ్ల తెలుగు కవిత్వంలో భావ కవిత్వచ్ఛాయలు - సమాలోచనం- నాయని కృష్ణకుమారి - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురణ - 1980 — 145 వ పేజీ.

9. 'సాహితీ సమితి తరువాతి కవులు' - శ్రీపాద గోపాలకృష్ణమూర్తి - భారతి- 1963 అక్టోబరు.

అనటం సహృదయత్వానికి నిదర్శనం కాదు. పై మాటల్లో రమణీయమైన భావ చిత్రం (Imagery) వున్నదనే సత్యాన్ని సహృదయులు కాదనలేరు. కవిత్వమంటే స్రష్టా స్పష్టమైన అనుభూతిని శబ్దార్థాల ద్వారా అందించటమేనని భావ కవులు అభిప్రాయపడ్డారు. "చీకటిలోనికి దీపికను తీసుకొని రాగలరుకాని, ఎవ్వరూ చీకటినే వెలుతురుగా మార్చలేరు. దీపానికి యెంత చేరువగా రాగలిగితే అంత వెలుతురు లభ్యమౌతుంది. కాని దీపానికి వీలున్నంత దూరంలో నిలిచి, వెలుతురు చాలదని నిందించే వారిని చూసి విచారపడడం కన్న వేరేమీ చేయలేము" అని శ్రీ ముద్దు కృష్ణ భావ కవుల తలపులను సానుభూతితో అర్థం చేసుకోవాలన్నారు.[10] అనిర్వచనీయతకూ అస్పష్టతకు భేదం వున్నది. అస్పష్టత కూడ కావ్య గుణమే. అస్పష్టత అయోమయం కానంతవరకూ దాన్ని ఆమోదించ వచ్చు. అభిద, లక్షణ, వ్యంజనా శక్తులతోపాటు శబ్దానికి మరొక మహత్తరమైన శక్తి కూడ వున్నది. అదే 'ధ్వని'.

"యత్రార్థః శబ్దోవా తమర్థ ముపసర్జనీకృత స్వార్థౌ
వ్యంక్తః కావ్య విశేషః సధ్వనిరితి సూరిభిః కథితః"

(ధ్వన్యాలోకము—1-13)

అని ఆనందవర్ధనాచార్యుడు శబ్ద శక్తులలో విశేషమైన 'ధ్వని' ని నిర్వచించాడు. కావ్యాలు ధ్వని ప్రధానాలనీ, 'రసధ్వని' శ్రేష్ఠతరమనీ పలికాడు. వాచ్యార్థాన్ని మాత్రమే గ్రహించగలిగిన వారికి భావ కవిత్వం అగమ్యగోచరం. లక్ష్యార్థ, వ్యంగ్యార్థాలను గ్రహించగలిగిన వారు సైతం ధ్వనిని అందుకోలేకపోతే వారికి భావకవిత్వం కొరకరాని కొయ్యే అవుతుంది. "ఎవియొ అర్థమ్ముకాని భావగీతమ్ములివి" అని శ్రీ కృష్ణశాస్త్రి భావ కవిత్వంలో అస్పష్టతను స్వయంగా అంగీకరించారు. భావ కవిత్వం హృదయైకవేద్యం. ఆ మాటకొస్తే ఏ కవిత్వమైనా హృదయైక వేద్యమే. ఈ మాట భావ కవిత్వంలో మరింతగా సార్థకమైంది.

10. 'వైతాళికులు' కవితా సంకలనం. ముందు మాట-ముద్దుకృష్ణ—1935.

పాశ్చాత్యులలో William Empson అస్పష్టతను కావ్యగుణంగా అంగీకరిస్తూ, ఒక శక్తిమంతమైన సిద్ధాంతాన్ని ప్రచారంలోకి తెచ్చాడు. 'Seven Types of Ambiguity' అనే తన సిద్ధాంత గ్రంథంలో కవిత్వంలో అస్పష్టతా స్వరూపాన్ని నిరూపించి, అది కవిత్వానికి అత్యంతా వశ్యకమని పేర్కొన్నాడు. " 'Ambiguity' itself can mean an indecision as to what you mean, an intention to mean several things, a probability that one or other or both of two things has been meant and the fact that a statement has several meanings."[11] ఆనందవర్ధనుడు 'ధ్వని' భేదాలను సూచించినట్లే Empson అస్పష్టతాభేదాలను వివరించాడు. ఇరువురూ శబ్దానికి వున్న విశేషశక్తిని గుర్తించి గౌరవించినవారే. భావకవుల కావ్యాలు శబ్దంతో చెప్పిన దానికంటె ఎక్కువగా రమణీయమైన అర్థాలను శబ్దంద్వారా ప్రతిపాదిస్తాయి. ఆ శబ్దాల వెలుగులో సహృదయుడు వర్ణ్యవస్తువును దర్శించి, ఆనందం పొందుతాడు.

భావకవులలో రెండవ తరానికి చెందిన శ్రీ బాలగంగాధర తిలక్ కవిత్వంలో అస్పష్టతను అంగీకరించారు.

> "కవిత్వంలో అబ్స్క్యూరిటీ కొన్ని సందర్భాలలో వుండొచ్చును
> కాని, పాఠకుడికి నీ అనుభూతి ఆకారం హత్తుకోవాలి.
> అది ట్రాన్స్పరెంట్ చీకటై వుండాలి, నిన్ను పలకరించాలి.
> కవిత కొత్త అనుభవాల కాంతిపేటికను తెరవాలి, కదలించాలి"[12]

అన్నారు. భావకవులు అందించిన అనిర్వచనీయమైన ఆనందాన్ని సమకాలిక పండితులు స్వీకరించక, వారి కవిత్వాన్ని ఆక్షేపించారు.

## భావకవిత్వంపై ఆక్షేపణలు

ప్రాచీన కవిత్వంలో శబ్దమూ, దానికి అర్థమూ తెలిస్తే కవిత్వం అర్థమౌతుంది. కవి హృదయం తెలియకపోతే, వ్యాఖ్యాతలు కవి హృద

11. Seven Types of Ambiguity - William Empson.
12. 'నవత - కవిత' - 'అమృతం కురిసిన రాత్రి' - దేవరకొండ బాల గంగాధర తిలక్.

యాన్ని ఆవిష్కరిస్తారు. భావకవిత్వంలో కవి ప్రయోగించి, శబ్దం కంటె కవి అందించదలచిన అనుభూతి ముఖ్యమైనది. హృదయైకవేద్య మైన ఆనందాన్ని మెదడుకు మేతవేసి పొందలేం. ఈ సత్యాన్ని గుర్తించక మహాపండితులు, తార్కికులూ, అత్యంత మేధాసంపన్నులైన కొందరు భావకవిత్వంపై దండెత్తారు. వారిలో శ్రీ అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరులు ముఖ్యులు. సంస్కృతాంధ్ర ఆంగ్లభాషల్లో కోవిదులైన ఉమాకాన్తంగారు చిగురుటాకుల్ని కత్తితో తునిమినట్లు, కఠినమైన తార్కిక పరిభాషలో భావకవిత్వాన్ని దుయ్యబట్టారు. ఒక్కొక్క కవినీ 'చాకిరేవు' పెట్టి ఉతికేశారు. బహుశా అటువంటి పండితులను దృష్టిలో పెట్టుకొనే ఆనందవర్ధనాచార్యుడు ధ్వన్యాలోకంలో-

"శబ్దార్థ శాసనజ్ఞాన మాత్రేణైవ న వేద్యతే
వేద్యతే సతు కావ్యార్థ తత్త్వజ్ఞైరేవ కేవలమ్"

అన్నాడు. తార్కికులకూ, వైయాకరణులకూ, మీమాంసకులకూ కావ్యానందం కలుగదని ఆనందవర్ధనుడు ఆక్షేపించాడు.

"నూతనత్వం కవిత్వధర్మం" అని ఉమాకాన్తంగారు అంగీకరించారు. కాని నూతనత్వపు తేజః పుంజాల్ని ఆయన చూడలేక పోయారు. 'నేటి కాలపు కవిత్వము'లో గుణ దోష విచారణ దృష్టితో గాక దోషైక దృష్టితో పరికించి "విస్తరం, వికారాలు, అనుచితపు పేర్లు, ఊగుడు మాటలు, నిదర్శన పరంపరలు, అయోమయత్వం, పులుముడు, శబ్దవాచ్యత, దృష్టి సంకోచం అనే వాటితో ప్రాయికంగా యీ కాలపు కవిత్వం దుష్టం" అని ముందే ఏర్పరచుకున్న అభిప్రాయాలతో సమకాలిక కవిత్వ పరామర్శ చేశారు. రంధ్రాలెన్నో వున్నాయని తేనె పట్టులో తేనెను విస్మరించినట్టు నవ్య కవిత్వం తెచ్చిన సౌందర్యాన్ని ఆయన విస్మరించారు.

ఉమాకాన్తంగారు ఆరోపించిన దోషాలన్నీ నిజానికి దోషాలే. వారితో తర్కానికి దిగి, ఆ దోషాలను సమర్థించుకోకపోవటం ఆనాటి కవులు చేసిన మంచి పని. లోకంలో సహృదయులపై విశ్వాసముంచి,

కవిత్వం రాయటమే తగిన పని అనీ, అదే ఉమాకాన్తంగారికి జవాబనీ వారు భావించారు. ఉమాకాన్తంగారు భావ కవిత్వంపై ఆరోపించిన దోషాల్లో చాలా భాగం నేటికైనా కవులు జాగ్రత్తపడవలసినవే.

## శుక్ల పక్షము

భావ కవిత్వాన్ని హేళనచేస్తూ శ్రీ అనంత పంతుల రామలింగ స్వామి 'శుక్ల పక్షము' రచించారు. ఇది దేవులపల్లి వారి కృష్ణపక్షాన్ని మనస్సులో పెట్టుకొని వుంచిన శీర్షిక-అస్పష్టమైన భావనతో, అర్థంలేని మాటలను కూర్చి వాటిలో మహదర్థం వున్నదని భావ కవులు చెప్తారని వీరు హేళన చేశారు. నిందాపూర్వకమైన వీరి హేళనను భావ కవులు అదే ధోరణిలో 'శుక్ల నష్టము' అని తిరస్కరించి త్రోసిపుచ్చారు.

భావ కవుల కవితల్లో కొన్ని చోట్ల లోపించిన చిత్తశుద్ధిని, నిజ జీవితంలో వారి ప్రవర్తనను చలంగారు ఆక్షేపించారు. ఒకప్పుడు విను వీథుల్లో విహరించిన భావ కవిత్వం రాను రాను సైడు కాలువల్లో పారుతున్నదని ఆయన వాపోయారు. దేశంలో ఆర్థిక మాంద్యం ముసురుకొనటంతో కాల్పనికవాదం వెనుకంజవేసింది. అభ్యుదయ కవిత్వం ప్రవేశించి ముందడుగు వేసింది. రెండు దశాబ్దాలపాటు భావ కవిత్వం తెలుగు సీమను వెలుగు వెల్లువతో ముంచెత్తింది. తృణ కంకణము, స్నేహలతాదేవి, ఊహాగానము, ఏకాంతసేవ, కృష్ణ పక్షము, ఎంకి పాటలు, బసవరాజు అప్పారావు కృతులు, కిన్నెరసాని పాటలు, తొలకరి, సౌభద్రుని ప్రణయ యాత్ర, శశికళ, మాతృ గీతాలు, దీపావళి, సంధ్యారాగం, కవయిత్రులు బంగారమ్మ, విశ్వసుందరమ్మ, సౌదామనిగారల కృతులూ, ఇంకా కవికొండల వారి గీతాలనూ, తెలుగు జాతి గర్వించదగిన ముత్యాల సరాలను, సువాసనాభరితమైన రంగురంగుల పూలదండల్ని సమర్పించింది భావ కవిత్వం.

స్వాతంత్ర్యానంతరం భావకవిత్వం ఆదరగౌరవాలను మునుపటి లాగ పొందక పోయినా, తన అస్తిత్వాన్ని నిలుపుకుని, మొగలిపొదలో దాగిన పరిమళంవలె కవితా పిపాసువులను సుడివేస్తూనే వున్నది. రాయ

ప్రోలు మొదలుగా భావకవుల పరంపరలో నండూరి, బసవరాజు, బాపిరాజు గారలు స్వాతంత్ర్యం తర్వాత కవిత్వం రచించలేదు. వారిమరణం భావ కవిత్వానికే గాక తెలుగు సాహిత్యానికే తీరని వెలితి.

## రుచుల భేదాన్ని తెలిపే రాయప్రోలు కవిత

అభినవ కవికులగురువు శ్రీరాయప్రోలు సుబ్బారావు భావకవితకు ఆద్యులు. స్వాతంత్ర్యానంతరం ఆయన రచించిన కావ్యాల్లో "కన్నె పాటలు", "మిశ్రమంజరి" లో కొన్ని ఖండకావ్యాలూ భావకవిత్వంలో చేర్చదగినవి.

"ఆనీల నగరిలో అద్దాలవాడ
అద్దాలవాడలో అతితెల్ల మేడ
ఆమేడదాపునకు అమృతంపు కొలను
కొలనులో చక్కగా కులికేటి పువ్వు"

అని సుందరదృశ్య కల్పనతో చదువరులను ఊహాలోకంలో విహరింపజేసే కవిత కన్నెపాటల్లో వున్నది. 'నాలుగు స్తంభాల ఆట'లో-

"నెమలి పింఛెములు విప్పారినగతి
గిరగిర తిరిగే పరికిణీలతో
అరటాకులు తూగాడు విధంబున
పమిటెల చెంగులు పంజల జాఱగ"

కన్నెపిల్లలు ఆడుకున్న దృశ్యాన్ని రాయప్రోలు అత్యద్భుతంగా చిత్రించారు. ప్రకృతి సౌందర్యమూ, వేడుకలు వున్నన్నాళ్ళూ, భావ కవిత్వం పూర్తిగా కనుమరుగు కాదనిపిస్తుంది. పువ్వును వర్ణించిన-

అఱవిచ్చి సిగ్గులన్ కరగేటి పువ్వా
మొగ్గవై మోజులన్ మొలిపించు పువ్వా
పూచి శోభనములో పొందించు పువ్వా
దళముల చక్కిలింతల చొక్కు పువ్వా

మాతల్లి పూజకై మరలవె పువ్వా !
కాపుపడతుక కొప్పు కయిసేయు పువ్వా
తీగెల నుయ్యాల లూగేటిపువ్వా''

అనే పంక్తులు సరోజినీదేవి కవిత్వాన్ని జ్ఞాపకం చేస్తాయి.

ఆంధ్రోద్యమ కవితను ప్రారంభించిన రాయప్రోలు వారు స్వాతంత్ర్యానంతరం రచించిన కవితలో-

''కట్టవమ్మ అఖండ కనకాంబరము మరల
కన్నవారికి తల్లి కండ్ల పండువుగాగ''

అని ఆంధ్రాభ్యుదయాన్ని కాంక్షించారు.

పెండ్లి లగ్నం (మిశ్రమంజరి) హాలిక జీవన శోభను వర్ణించిన మధురమైన ఖండకావ్యం. ''చెరువు నిండినదీయేడు కరువురాదు'' అనే రైతు ఆశనూ,

''శిస్తుకోసము నిరుడు వ్రాసితినినోటు
పెరిగెనది పాము పగవలె - పెయ్యదూడ
నమ్మి తీర్చెదమన్న ప్రాణమ్ముఠాదు''

అనే నిరాశనూ చక్కగా వివరించారు. వెన్నెలరాత్రి పిల్ల పెండ్లి లగ్నాన్ని మనోహరంగా వర్ణించారు.

'రుచులలో భేదం సుతారం. నిమ్మపండు పులుపూ-దానిమ్మపండు పులుపూ ఒక్కటే అనదునాలుక. తేనె తీపికీ చెఱకుపాల తీపికీ ఏదో రవపాలు భేదం లేకపోలేదు. ఇక కావ్యస్వాదము అంతటా ఏకైకంగా ఉండు ననగలమా'' అని రాయప్రోలు వారు నుడివినట్లే కావ్యానందం 'మిశ్రమంజరి'లో భిన్నభిన్న రుచులను కల్పిస్తుంది.

'తృణకంకణము, ఆంధ్రావళి, లలిత, స్నేహలతాదేవి' కావ్యాలు రచించిన నాటి దీప్తి లేక పోయినా, సుకుమారమైన భావనాశక్తి తర్వాత రచించిన భావకావ్యాలలో గూడ తేజస్వంతంగానే వున్నది.

## భావకవిత్వం నుండి దూరమైన కొందరు ప్రసిద్ధకవులు

శ్రీవిశ్వనాథ సత్యనారాయణ 'రామాయణ కల్పవృక్షము' రచనకు పూనుకున్న తర్వాత ఆయనలో భావకవిత్వం వెనుకబట్టింది. "నీరథము, చిన్నిమబ్బులు, మూగనోము, అంధభిక్షువు, ప్రాతః స్తవము మొదలైన ఖండకావ్యాలు రచించిన మనఃస్థితి నుండి ఆయన వెనుదిరిగి తాత తాతల నాటి కతలు తవ్విపోస్తానోయ్ అని సంప్రదాయ కావ్యరచనలో మునిగిపోయారు. వారి సంప్రదాయ కవితలో అక్కడక్కడా భావ కవిత్వం తొంగిచూస్తూనే వుంటుంది.

సౌందరనంద కావ్య రచనతో ప్రసిద్ధులైన పింగళి-కాటూరికవులు స్వాతంత్ర్యానంతరకాలంలో వేర్వేరుగా కావ్యాలు రచించారు. శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు 'గుడిగంటలు-పౌలస్త్య హృదయము, పన్నీటిజల్లు' రచించారు. వీటిలో 'గుడిగంటలు' దేవాలయాల్లో హరిజన ప్రవేశాన్ని సమర్థించి, భగవంతుడు హరిజనులకు సన్నిహితుడని చెప్పిన కావ్యం. 'పౌలస్త్యహృదయం'లో రామునిచేతిలో మరణించటానికి ఎదురుచూచిన రావణుని హృదయాన్ని ఆవిష్కరించారు. 'పన్నీటిజల్లు'లో కొన్ని శ్రీ కాటూరి ఆత్మశాంతి కోసం భగవంతుని ప్రార్థించిన ఖండకావ్యాలు. శ్రీ పింగళి లక్ష్మీకాంతం స్వతంత్రంగా రచించిన కావ్యం 'ఆత్మలహరి'.

భావకవులకు గురు పీఠమై వర్ధిల్లిన శ్రీ తల్లావఝ్ఝల శివశంకర స్వామి ఒకకాలంలో ఇంగ్లీషు సాహిత్యానికి జాన్సన్‌వలె ఆంధ్ర సాహిత్యానికి సభాపతియై నవ్యకవిత్వానికి నూతనమైన రీతులను చూపారు. గేయనాటికలవంటి ప్రక్రియలను ప్రారంభించారు. బహుభాషా కోవిదుడు కావటాన భావకవిత్వాన్ని ఆక్షేపించిన పండితులకు జవాబుచెప్పి, ఇతర భాషల్లోవున్న ఆధునిక రీతులనుచూపి, ఆంధ్రులు ముందంజ వేయవలసిన అవసరాన్ని నొక్కి చెప్పారు. స్వాతంత్ర్యానంతరం ఆయన కృషిచాల భాగం జాతక కథల అనువాదానికి, బాలసాహిత్యానికి పరిమితమై పోయింది. 'పద్మావతీ చరణ చారణ చక్రవర్తి', 'హృదయేశ్వరి' నాటి భావ కవిత్వం ఆయనలో మళ్ళీ మొలకెత్తలేదు.

భావకవిత్వం ఉచ్ఛదశలో వున్నప్పుడు శ్రీ నోరినరసింహశాస్త్రి కొన్ని ఉత్తమ ఖండకావ్యాలు రచించారు. అప్పుడుకూడ ఆయన సంప్రదాయప్రియుడే. ఆ తర్వాత దేవీభాగవతము మొదలైన రచనలు చేశాక ఆయన పూర్తిగా సనాతనుడైనాడు. ఆధునిక కవిత్వంపై ఆయనకు నిరసన భావం కూడ కలిగింది. భక్తిపరమైన కవిత్వానికే ఆయన కలం అంకితమై పోయింది.

## "ప్రతి మనిషీ నడిచే దైవం, ప్రతిపులుగూ ఎగిరే దైవం" - "కృష్ణశాస్త్రిది కవిత"

శ్రీ దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రిని 'కృష్ణపక్షము, ఊర్వశి, ప్రవాసము' రాసిన కవిగానే ఆంధ్ర పాఠకులు చాలాకాలం వరకు గుర్తు పెట్టుకొన్నారు. వారు చిరకాలంగా రాస్తూ వచ్చిన పాటలు, నాటికలు, వ్యాసాలు ఆకాశవాణిలో ప్రసారమైనవి, కొత్తగా రచించినవీ వేర్వేరు సంపుటాలుగా వచ్చాయి. "అప్పుడు పుట్టివుంటే - బహుకాలదర్శనం, పుష్పలావికలు" అనే వచన రచనలు 1965 లోను; "పల్లకీ, శర్మిష్ఠ, ధనుర్దాసు, మేఘమాల, తిరుప్పావై"లు 1975 లోనూ వెలువడినాయి.

కృష్ణశాస్త్రిగారు హృదయవాది. మతాతీతమైన మానవతావాది. భావకవులలో హేమాహేమీలు శిఖరప్రాయులెందరో వున్నా వారిలో కృష్ణశాస్త్రి కైలాసశిఖరం. కాలంతోపాటు కదలివచ్చినకవి. అభ్యుదయ కవితోద్యమం తీవ్రస్థాయి నందుకున్న కాలంలో "దిగిరాను, దిగిరాను దివినుండి భువికి" అన్న కవితను ఆక్షేపించటం ఒక ఫాషనయింది. కాని కృష్ణశాస్త్రిగారు యీ లోకాన్ని 'పిచ్చిఇష్టంతో' ప్రేమించినకవి. జీవనది వలె ఆయన జీవించినంతకాలమూ సౌందర్యమూ, అభ్యుదయ భావనా కలగలిసిన మానవతా వాదంతో రచనలు వెలువరించారు.

ఏ ముహూర్తంలో చలంగారు "క్రిష్ణశాస్త్రిబాధ ప్రపంచానికిబాధ" అన్నారో గాని ఆ మాటలలో గాంభీర్యం చాలామందికి అంతుచిక్కలేదు. కవిత్వంతో కృష్ణశాస్త్రిగారు లోకాన్ని బాధిస్తాడని కాదు చలంగారి తాత్పర్యం. కృష్ణశాస్త్రి హృదయం కదిలి, కన్నులు చెమ్మగిల్లి, గొంతు

ముడివీడిందో, ఆభావం శాశ్వతమై, ఆ అనుభూతి అపారమై, ఆమాటలకు రసస్పర్శసోకి కవితయై గుండెల్లో గూడుకట్టు కొంటుంది. ఇదే కృష్ణ శాస్త్రి బాధ, ప్రపంచపు బాధగూడ.

కృష్ణశాస్త్రిగారి రచనల్లో సామాన్య మానవుని జీవితపు గతుకులు కూడ వున్నాయి. అయితే అవి కవి కాల్పనిక దృష్టిలో నుండి సుంద రంగా వెలువడినవి. రిక్షావాలా, బూట్‌పాలిష్, బహుకాలదర్శనం''వంటి రచనల్లో ఆయన లోకపరిశీలన, బడుగు మానిసులపై సానుభూతి ద్యోతక మౌతాయి.

ఏకేశ్వరోపాసన, రవీంద్రుని భక్తితత్వమూ, సంస్కరణాభిలాషా గోచరించే భక్తిగీతాలు 'మహతి'లో వున్నాయి. తర్వాతకాలంలో ఆయన రాసిన'కోవెల కొలను', 'గుహుడు' 'శబరి' మొదలైన రచనల్లో ఆయన గాఢమైన భక్తి ప్రతిబింబిస్తుంది. యాంత్రిక నాగరకతలో, ముఖ్యంగా విద్యుద్దీపాల కాంతి ఆలయవాతావరణం కలుషితం చేస్తున్నట్లు బాధపడే భక్తుడీయన. ''విద్యుద్దీపాల కాంతికి అవధిఉంది. దుస్పృహమైన స్పష్టత ఉంది. కాగడాల పక్కనే పొంచివున్న చీకట్లు మన అంతరంగాలంత లోతుగా వుంటాయి. కాగడాలు కునుకుతూ దేవాలయాన్ని వింతగా చూపిస్తాయి'' అని కవి సనాతన దృక్పథంతో నాగరకతను వద్దనే తత్వాన్ని ఆధునికులు హర్షించలేరు. 'గుహుడు' లో శ్రీరామునికి వీడ్కోలు చెప్పేటప్పుడు ''గాలిదేవుడు కూడా దిగులువల్ల ఊపిరి బిగ బట్టాడు. గంగానది కంఠం బిగిసిపోయి ఉంటుంది'' అని గుహుని బాధను కృష్ణశాస్త్రిగారు పంచుకుంటారు. శ్రీ ముద్దుకృష్ణ కృష్ణశాస్త్రిగారిని పరిచయం చేస్తూ ''వైష్ణవగీతాలలోని హృదయపక్వత మెదడుకు పట్టించు కున్నాడు. కళాసంపత్తి ఎక్కువ. కవిత్వంకోసం బ్రతుకుతాడు. రుచి గలవాడు'' అని చెప్పిన మాటలు శాస్త్రిగారి శక్తిని చక్కగా వెల్ల డిస్తాయి.

అన్నమయ్య, త్యాగయ్య, క్షేత్రయ్యవంటి వాగ్గేయకారులకు సరి యైన వారసుడు శ్రీ కృష్ణశాస్త్రి. ''ప్రేయసి నోయగమ్మునకు లేదు

శరీరము; లేదు మేను నాతీయని ప్రేమకేని, కలదే యెడబాటిక మాకు?"
అనే ప్రణయానురక్తి;

"హారాలై మెడజుట్టి అంగదములై అంసాళిపై మెట్టి, లే
తోరాలై చెయి పట్టియూగు, చనవెంతోగాని శ్రీజానితో
ధారాళమ్ములు: క్షీరసాగరసుతా ధమ్మిల్ల మాల్యమ్ములన్
హేరాళమ్ములు పీఠికాపురవని హేమంత చేమంతికల్"

(తిరునాళ్ల చేమంతులు)

అని తన పీఠికాపుర చేమంతులు భగవంతుని అలంకరణకు నోచుకున్న ధన్యతను గానంచేసిన భక్తి; నాయుడుగారి చరణ సన్నిధిని శుశ్రూష చేసిన ఫలితంగా- తన గొంతు రవ్వంత కోయిలగాన', తన మనసు ఆవంత ఊయెలకాన- "విశ్వమంతా ప్రాణవిభుని మందిరమే వీధివాకిలి యేది చెల్లెలా" అని పాడిన విశ్వమానవభావనా కృష్ణశాస్త్రి గారి కవితలో రమ్యంగా దర్శనమిస్తాయి. మొట్టమొదటి రిపబ్లిక్ దినోత్సవ సమయంలో తెలుగు కవుల ప్రతినిధిగా ఆయన పలికిన 'స్నేహ క్షీరము'- "ప్రతిగేహగేహాళి పదమాగి, ప్రతి హృదయద్వార తోరణమట్టి త్రోసి/లోనికిజొచ్చి, నాలోని స్నేహక్షీర/మొక్కింత ఒక్కింత ఒలక బోసి/అనుగుసోదర ! మరలిరానా" యటంచు/"మానవులందరినీ ఆత్మ బంధువులుగా తలచి", నాల్గుదిక్కుల, భూభువనమంత లవలేశమును వదలకయె తిరిగి, అందరి క్షేమమూ కోరిన విశ్వకవి. కృష్ణశాస్త్రిగారి కంటికి ప్రకృతి అంతా దైవస్వరూపమే. "నడిచే ప్రతి మనిషీ దైవం ఎగిరే ప్రతి పులుగూ దైవం."

కృష్ణశాస్త్రిగారి భావనాశక్తి షెల్లీని తలపిస్తుంది. "Poetry is indeed something divine. It is at once the centre and circumference of knowledge; it is that which comprehends all science and that to which all science must be referred" అని షెల్లీ కవి శాస్త్రానికి కవిత్వానికి గల సంబం

థాన్ని గురించి అభిప్రాయపడ్డాడు.[13] "నేను హృదయవాదిని. నాకు వేదాంతం తర్కం తలకెక్కవు"[14] అన్న కృష్ణశాస్త్రిగారు శాస్త్రవిజ్ఞానానికి పూర్తి విరోధికాడు. ఆయనకు భావవ్యక్తీకరణలో శాస్త్రపద్ధతి గిట్టదంతే. మనిషిలో హింసాప్రవృత్తి ఆయనకు గిట్టదు. "మనిషిలోనే పెద్ద మడ తుంది/మనిషికే పెడబుద్ధి పుడుతుంది" (అయ్యో మనిషీ) - ఒకొక్కడెందానన్ క్షీరసముద్రమున్న దవధుల్ దాటంగ- ఈ మానవుండే నిర్మాత, విధాత, నేత, మరి తానే భోక్త లోకమ్మునన్" అని మానవ విజయాన్ని వేనోళ్ల కొనియాడి, సాటి మానవుని హింసించి, చంపి, "సహోదరాస్థిపలలమ్ముల్" తినవద్దని మానవుణ్ణి హెచ్చరించారు.

సంస్కరణల విషయంలో కృష్ణపక్షము నాటికే ఆయన కార్యవాది. చాలా మంది అభ్యుదయ కవులకంటె ప్రగతిమార్గంలో సమాజ శ్రేయస్సుకై పాటుపడిన మానవతావాది. "కృష్ణపక్షము, ప్రవాసము, ఊర్వశి" కృతులలో సంఘసంస్కరణ భావాలు కాగడావేసి వెదకినా కన్పించవు. 'మహతి'లో వచన రచనల్లో, 'పల్లకీ' సంపుటిలోని కావ్యఖండికల్లో ఆయనకుగల సంఘసంస్కార భావాలు చక్కగా నిరూపితమయ్యాయి. మనమింకా నాటకాల ప్రాంగణంలోనే వున్నామని ఆయన అభిప్రాయ పడుతుండేవారు. ఆయన రచించిన శ్రవ్యనాటికలు - 'కృష్ణాష్టమి'; ధనుర్దాసు; శర్మిష్ఠ మొదలైనవి రసభరితాలైన ఉత్తమ కావ్యాలు.

సుకుమారమైన హాస్యం కృష్ణశాస్త్రిగారి వచన రచనల్లో మనసు నలరిస్తుంది. ఓ లావుపాటి అబ్బాయిని చూపించి అతడు మేప్‌లో ఆస్ట్రేలియా లాగున్నాడంటారు. మరొక మొద్దబ్బాయిని సుబ్బమ్మవ్వా పిల్లలూ బండెక్కిన తర్వాత పడిపోకుండ ఉండేటందుకు బిరడాలాగ బిగించాడంటారు. 'కవిత్వం వ్రాస్తాడు మావాడు' అంటే "వొద్దు బాబూ వొద్దు. వెంటనే మాన్పించెయ్యాలి, ముదిరితే మహాకష్టం, తనేరాగం

13. 'A Defence of Poetry' – P. B. Shelley.

14. 'మరపురాని మనీషి' - తిరుమల రామచంద్ర - యువభారతి ప్రచురణ 1976 - 92వ పేజీ.

అవీ పెట్టి చదువుతాడా, అభినయిస్తూ" అనేసి ఫక్కున నవ్విస్తారు. ఆయన మామూలు మాటల్లో కూడ కవిత్వమూ, హాస్యమూ కలగలసి పోయి వుండేవి.

"The functions of the poetical faculty are two-fold; by one it creates new materials of knowledge and power and pleasure; by the other it engenders in the mind, a desire to reproduce and arrange them according to a certain rhythm and order which may be called the beautiful and the good"[14A] అని షెల్లీ కవి కావ్యప్రయోజనాన్ని వివరించాడు. కృష్ణశాస్త్రిగారి కవితలో విజ్ఞానమూ, మానవత్వాన్ని పెంపొందించుకునే శక్తి, రసానందమూ పుష్కలంగా వున్నాయని చెప్పవచ్చు. సౌందర్యమూ, సత్యమూ వేర్వేరు అంశాలు కావు. కవిత్వమంటే సత్యసౌందర్యమే- కవితా సత్యాన్ని దర్శించి, హృదయం కదిలితేనే కృష్ణశాస్త్రి రచనకు పూనుకొనేవారు. "నాకు కవిత్వం పుట్టలోని పాములాగ, తెల్లవారి తలుపులు తట్టి వచ్చిపడే అతిధి లాగ, రేకులు విచ్చుతున్న పువ్వులాగ రకరకాలుగా వస్తుంది.... గళ ద్వారపు గడియతీస్తే వస్తుంది" అని ఆయన చెప్పుకున్నారు. విశ్వ శ్రేయాన్ని కోరే కృష్ణశాస్త్రిగారి కవిత్వం ఒక సౌందర్యసీమ. కాటూరి వారన్నట్లు కృష్ణశాస్త్రిగారు 'Perfectionist'. కాబట్టి చిత్రికలు పడ తాడు, మెరుగులు దిద్దుతాడు, నగిషీలు చెక్కుతాడు. అనన్యసామాన్య మైన శిల్పి అనిపించుకుంటాడు. అందంగా తన మనస్సులో దర్శించిన భావాన్ని అందంగా కన్పింపజెయ్యటానికి శబ్దాల్ని నగిషీ పడతాడు. ఆయన Conscious artist అనే చెప్పాలి.

అక్కిరాజు ఉమాకాన్తం గారేకాక ఆ తర్వాతకూడ కొందరు కవి పండితులు కృష్ణశాస్త్రిగారి కవిత్వాన్ని వివిధ విధాలుగా ఆక్షేపించారు. శ్రీ కె. వి. రమణారెడ్డి "కృష్ణశాస్త్రిగారి కవిత అహపుసుడిలో గిజగిజ లాడి సమాజ దుఃఖం చూడలేదు" అని ఆరోపించారు.[15] కృష్ణపక్షం

14A. A Defence of Poetry – P. B. Shelley.

15. 'ఆంధ్ర కవిత్వ చరిత్ర' - 'భువనఘోష' కె. వి. రమణారెడ్డి.

దృష్టిలో వుంచుకొని చేసిన ఆరోపణ ఇది. "రిక్షావాలా, బూట్‌పాలిష్, స్నేహక్షీరము" వంటి రచనల్ని గమనిస్తే యీ ఆరోపణలో సత్యం లేదని తేలుతుంది. శ్రీ బాలగంగాధర తిలక్ 'త్రిమూర్తులు' గీతంలో-

"మల్లెపూల మీద పరుంటాడు, మంచి గంధం రాసుకుంటాడు
మరి ఎందుకేడుస్తాడు ?
మంచి పనివాడు, మాకు నచ్చినవాడు, మంత్రనగరానికి
వెళ్ళొచ్చినవాడు
మధురసం చేదంటాడు, వధ్యశిలపై విరహగీతం రాస్తాడు
మాతోపాటు నడుస్తానంటాడు
మరి నిజంగా వస్తాడా"

అని కృష్ణశాస్త్రిగారి కవిత్వం సమాజాన్ని ముందుకు తీసుకు వెళుతుందా? అని సందేహించారు. జీవించినన్నాళ్లూ కృష్ణశాస్త్రిగారు మనిషిని మరిచిపోలేదు. కవిత్వానికి ప్రాణభూతమైన కరుణను వీడ లేదు." వేదనా, ప్రేమా కలిస్తేనే కరుణ. కరుణ సృష్టిస్తుంది. కరుణ శైథిల్యంలో నుంచి చైతన్యాన్ని పుట్టిస్తుంది. "కరుణ బోధివృక్షం, కరుణ సిలువ, కరుణ సబర్మతి. ఊరికే బాధ చాలదు. కన్నీరు రావాలి" అని దీనుల బాధలు తొలగిపోవాలని కృష్ణశాస్త్రి తపించిపోయేవారు.[16] శ్రీశ్రీగారు 'ప్రాసక్రీడలు'లో 'శాష్ణకృస్త్రి విష్పరించు చారు వేదనా రోగమ్' అని చమత్కారంగా ఆక్షేపించారు. కృష్ణశాస్త్రిగారి వేదన చారు వేదన మాత్రమే కాదు- గుండెల్ని కదలించి దీనుల్ని గురించి ఆలోచింప జేసి సంస్కరణకు మార్గం చూపిన కవితావేదనే.

కృష్ణశాస్త్రిగారి కవితామూర్తిని అంచనా వేయటానికి ఆరుద్ర గారు కూనలమ్మ పదాల్లో పలికిన-

16. 'నా స్మృతిపథంలో' - కృష్ణశాస్త్రి ప్రసంగవ్యాసం - మహారాజా కాలేజి సెంటినరీ సావనీర్ - విజయనగరం - 1971.

"కొంతమందిది యువత
కొంతమందిది నవత
కృష్ణశాస్త్రిది కవిత– ఓ కూనలమ్మా"

అనే పంక్తులు సరిగా సరిపోతాయి.

"ఏవిస్మృత వోయనాన, ఏ ఆషాఢ ప్రథమ దివసాన వ్రాసితి వయా మేఘదూతను" అని రవీంద్రుడు కాళిదాసును ప్రశ్నిస్తే, కృష్ణశాస్త్రి రవి కవిని "ఏ ఫాల్గున సంధ్యాసమయాన, ఏ వైశాఖపూర్ణిమా రజనీముఖాన నీభావ కావ్యాలను రచించితివయా" అని మరి మరి అడగాలని ఉంటుందంటారు.[17] మనసున మల్లెల మాలలనూ, కన్నులవెన్నెల డోలలనూ ఊగించిన కలికిపాటల కోయిలా, నీవులేక తెలుగు కవితోద్యానం మోడువారింది. ఎప్పుడు మళ్ళీ నీరాక? ఎప్పుడు మళ్ళీ వసంతం? అని కవిత్వంలో తప్ప కన్పించని కృష్ణశాస్త్రిని అడగాలనిపిసుంది.

స్వాతంత్ర్యానంతరం శ్రీ అబ్బూరి రామకృష్ణారావు కలం దరిదాపు మూగవోయింది. అన్నిటా ఆధునికుడే అయిన శ్రీ అబ్బూరి అభ్యుదయ కవిత్వంలో వచ్చిన అవాంఛనీయ ధోరణులను అరికట్టవలసిందిగా హెచ్చరించిన ఒకటి రెండు గీతాలు తప్ప, తన సహజశైలిలో భావకవిత్వాన్ని వెలువరించలేదు.

## చలం - ప్రకృత్యుపాసన 'సుధ'

శ్రీ గుడిపాటి వెంకటచలం రచించిన కథలు, నవలలు, నాటికలు, వ్యాసాలు అన్నిటిలో ఏ ఉత్తమ కవికీ తీసిపోని కవిత్వం వున్నది. పురూరవ, ప్రేమలేఖలు, మ్యూజింగ్స్, యశోదా గీతాలులో కవిత్వం సహృదయులను అలరిస్తుంది, ప్రేమలేఖల్లో కొన్ని గీతాలు ఇంగ్లీషులో

---

17. భూమిక - శ్యామపక్షి - టి. ఎన్. అనసూయాదేవి రచనకు కృష్ణశాస్త్రి పీఠిక - విశ్వోదయ ప్రచురణ

రచించారు. స్వాతంత్ర్యానంతరం వెలువడిన చలంగారి రచనల్లో 'సుధ' రసవంతమైన గీతాల సంపుటి.

"యామినీ శిరోజదీప్త జ్వాలా కుసుమాలు
తేజోతల్పంపై రాలి
అదృశ్యమైనాయి
రవికిరణాంగుళీ నఖక్షతాలతో
శ్యామలా కాశం కందింది
అరుణాచలేశ్వర వామభాగాన
కుంకుమపూజ జరుగుతోంది మేలుకో"

అని ప్రకృత్యు పాసనతో ప్రారంభమయ్యే 'సుధ' ప్రజ్ఞాశాలియైన కవి మనోనేత్రంతోదర్శించిన ప్రకృతి సౌందర్యాన్ని, భగవంతుని చిద్విలాసాన్ని వర్ణిస్తుంది. ఈ రచనలో భాష కాల్పనిక కవులకు సహజమైన కావ్యభాషేగాని వాడుకభాష కాదు. చలంగారు తన భావాల కనుగుణమైన శైలిని స్వీకరించారేగాని, ఎప్పుడూ భాషా సంస్కర్తల ప్రచారాన్ని బట్టి నడవలేదు.

'సుధ'లో భావాలు గీతాంజలిని తలపిస్తాయి. కాని చలంగారు రవీంద్రుని అనుకరించలేదు. 'మిస్టిక్'గా చలంగారు ప్రకృతిలో అలౌకికమైన విలువలను అన్వేషించారు.

"కళ్లులేని గురివిందతీగెకి / పట్టుకొమ్మ దొరికేందుకు / కస్తూరి పూల పరిమళం తోవ చూపిందా ? / తనపూలగర్భాల్లోకి దూరి/మకరం దాన్ని తాగే తేటి రొమ్ముకొలత/ తంగేటి చెట్టుకి ఎన్నడో తెలుసా ? నడి ఎండలో చేతులుచాచి / నాట్యంచేసే కొబ్బరిచెట్టుకి / తన ఎత్తు నుండి వూడిపడే పాపని కాపాడ్డానికి / పీచుదిళ్ళ చొక్కాల ల్లడం ఎవరునేర్పారు? గర్భంలోని శిశువులో/ఏ అవయవాలు ఎక్కడ ఏర్పడాలో / కన్నతల్లి కలగన్నదా? - ఇటువంటి ప్రకృతి వర్ణనలు మహాభక్తుని అన్వేషణకు నిదర్శనాలు.

చలంగారు లేకపోతే తెలుగువచనానికి శక్తి, సౌందర్యమూలేనట్టే, 'సుధ' లేకపోతే తెలుగు కవిత్వానికి ఇంత అందం వుండేది కాదు.

13

వేదుల 'ముక్త ఝరి' - భావకవితా ఛాయలు

భావకవులలో శక్తిమంతమైన గీతరచనా, భావుకనైశిత్యమూ కలిగిన కవి శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి. వీరి 'దీపావళినాడు' భావ కవిత్వంలో విశిష్టమైనది.

"మ్రొక్కిన కొలందిఁ గాలితో త్రొక్కుచున్న
యీ కఠినలోకమెల్ల బహిష్కృతమ్మ
రండు చిమ్మటలార! ఈ రాత్రి వేళ
నావలెనె పాడుకొను మీరె నా సఖులు"

అని నిరాశతో కుంగిపోయిన వీరి భావతీవ్రత చురుక్కుమని గుండెల్లో గుచ్చుకుంటుంది.

శ్రీ వేదులపై రవీంద్రుల ప్రభావం గాఢంగాను, హిందీ కవుల ప్రభావం తగు మాత్రంగానూ వున్నది. రవీంద్రుని "Pluck this little flower, Delay not"(Gardener) పంక్తిని 'కోసికొనుము యీ కోమల కుసుమము' అని తెనిగించారు. వేదుల వారి రాధాకృష్ణ శృంగారకేళి భావకవులకు వొరవడి అయింది.

స్వాతంత్ర్యానంతరం వేదుల వారి ఖండ కావ్యాలు 'ముక్త ఝరి' పేరుతో సంపుటంగా వచ్చాయి. కృష్ణశాస్త్రిగారిలాగే వేదుల వారు కూడ బ్రహ్మ సమాజ ప్రభావంతో సంఘ సంస్కార భావాల్ని పెంపొందించు కున్నారు. స్వేచ్ఛా పథంలో పయనించారు. పద్యరచన కొక వింతశక్తిని చేకూర్చారు. ఛందో బంధాలను విడనాడకుండానే భావనలో సుదూర తీరాల కెగసి పోయారు.

సన్మానసభల్లో కృతజ్ఞత వెల్లడించిన పద్యాలు, కవిస్తుతులు మినహాయించి చూస్తే 'ముక్త ఝరి'లో కవిత్వం తక్కువే. అయితే అది గ్రీష్మంలో సన్నగిలిపోయిన ప్రవాహంతో ఇసుక దిబ్బలతో నీరెండలో తళతళ మెరిసే నదిలాగా సొగసుగా వుంటుంది.

మాతృభూమి పై మమకారం ఆయన కవితలో గాఢంగా వెల్లి విరుస్తుంది.

"పేదకన్నుల నశ్రు బిందువొకటురలెనా
ఉదధులేడీ యెడద నుప్పొంగి పోవలయు!"

నన్న సంకల్పం ఆయన అభ్యుదయ భావనకు చక్కని నిదర్శనం. 'దీపావళి' రచనా కాలం నుండీ ఆయన కవితలో దేశభక్తిచక్కగా వ్యక్తమైంది.

"మాతృదేవతా కళ్యాణ మందిరమ్ము,
ద్వారమున అడ్డుపెట్టు పూజారి లేడు"

అని మాతృభూమిని సేవించి తల్లి ఋణం తీర్చుకున్న కవి శ్రీ వేదుల.

"కాళిదాసు కావ్యాలలోని పరువమూ, బరువూ ఈయన పద్యాలలో కనిపించుతవి" అని ముద్దుకృష్ణగారు వైతాళికులలో వేదుల గురించి చెప్పారు. ఈమాటలు 'ముక్తఝరి'లో పద్యాలకు అంతగా అన్వయించక పోయినా, భావకవిగా వేదుల కవితాశక్తిని స్మరణకు తెచ్చే పద్యాలు అక్కడక్కడా వున్నాయి.

## 'కోయిలాలాపంలో విషాదం' - నాయని 'విషాద మోహనము'

భావకవిగా సుప్రసిద్ధులైన శ్రీనాయనిసుబ్బారావు జీవితానుభవాలనే కవితగా మలచటంలో అఖండమైన శక్తిగలవారు. స్వాతంత్ర్యానంతరం వారు రచించిన కావ్యాల్లో 'భాగ్యనగర కోకిల.' 'విషాద మోహనము' భావకవితా పరిమళాలను వెదజల్లేవి. మోటారు హారనే వీణావాదనగా తలచే సంస్కార జడులముందు కోకిల కూజితాలు వ్యర్థమౌతున్నాయని వాపోయారు. 'గోరువంకల లోకసభ' రమ్యమైన కావ్యఖండిక. ఆకాశ వాణీ కేంద్రంలో పాచిపని చేసిన ఒక అవ్వపై 'రేడియో అవ్వ' అనే ఖండకావ్యం రచించారు. ఇది శ్రీ శ్రీగారి 'భిక్షువర్షీయసీ'ని తలపిస్తుంది. అవ్వచనిపోతే ఆమెకోసం ఆకాశవాణిలో శ్రద్ధాంజలిలేదు, ఆమె ఆత్మశాంతికోసం సభ జరగలేదు. అవ్వ ముగురమ్మల మూల పుటమ్మ కాంతిలో నిశ్శబ్దంగా కలిసిపోయిందని భావించారు. నాయని

వారి పరిశీలనా శక్తికి, బడుగు మానిసులపై వారి కరుణాదృష్టికి యీ ఖండ కావ్యం చక్కని నిదర్శనం.

బాధపడగలిగిన హృదయమే ప్రేమిస్తుంది. కవి హృదయం గాయపడినప్పుడు కావ్యం లభిస్తుంది. తన బాధను లోకానికి కావ్య రూపంలో అందించగలిగిన కవి ధన్యజీవి, "తరుః ప్రసూతే పుష్పాణి మరుద్వహతి సౌరభమ్" అన్నట్లు కవి కన్నీరుకార్చి, గద్గద కంఠంతో పలికితే, ఆ కావ్యం ఆబాధనంతటినీ ప్రపంచపు మూలమూలలకూ కొని పోతుంది. కీట్సు మరణం షెల్లీచేత Adonais కావ్యం రాయించింది- షెల్లీ కవనశక్తి రసజ్ఞులెందరిచేతనో కీట్సుకై కన్నీళ్లు పెట్టించింది.

తెలుగులో వచ్చిన ఎలిజీల్లో బసవరాజు, నాయని కవులిరువురిలో సమానమైన కొన్ని అంశాలున్నాయి. స్వీయజీవితాల్లో సంభవించిన శోక సంఘటనలే ఇద్దరిచేతా కావ్యాలు రాయించాయి. గుండెల్ని చీల్చుకు వచ్చిన వీరి కవిత్వానికి రక్తపు జీరకూడ అంటుకొని మరపురాని అను భూతిని కలిగిస్తుంది. 'మరపురాని బాధకన్నా మధురమేలేదు',

నాయని వారి కుమారుడు మోహనకృష్ణుడు ముప్పై అయిదేళ్ళు జీవించి మరణించాడు, అప్పటికి వార్ధక్యంలోవున్న నాయని వారికి కుమారుని మరణం కడుపుకోత అయింది. ఆ దుఃఖాన్ని 'విషాద మోహనము' కావ్యంగా రచించి గుండెబరువు కొంత దించుకున్నారు.

తండ్రీ కొడుకులు నిత్యమూ కలిసిజీవించిన సాంసారిక దృశ్యాలే కుమారుడు పోయాక తలుచుకుని, గుండెలు బద్దలుచేసే శోకానికి కావ్య రూప మిచ్చారు. భార్యతో కలిసి అనుభవించిన పుత్రశోకాన్ని-

"మా గుండె గుబులు పెల్లుబికి విరియ
మా కన్నులు నీరు వదలిన పెన్న కాలువలు"

అని వర్ణించారు.

కుమారుడు జబ్బు పడినప్పుడు నాయని వారి భార్య పూజచేసి, దేవునికి కొట్టిన కొబ్బరికాయ క్రుళ్ళిపోయిన దృశ్యాన్ని జ్ఞాపకంచేసుకుని భగవంతుని నిర్దయునిగా చిత్రిస్తారు.

"ఎవడురావాడు ! నిర్ణీత నిరవధి సృష్టి కార్యమ్ము
నవధరించిన మహామేధ గహ్వరాయత చతురాస్య
వివరనిర్గచ్ఛద పూర్వ నిర్ఘోష విదిత ఛాందసుడ
శివ వక్రరేఖ మా నుదుటనిట్లు గీసిన వ్రాతకాడు"

పద్యంమాతృగీతాలలోని "ఎవ్వడా విరసాత్మకుండెవడు?" పద్యాన్ని స్మృతికి తెస్తుంది. వీరి "పద్యాలు జీవితాన్ని చీల్చుకుని వస్తవి. అందు చేతనే బాధాకరంగా ఉంటవి. గుండెలకు తగిలేట్టు చెబుతాడు" అని వైతాళికులలో ముద్దుకృష్ణగారన్న మాటలు 'విషాదమోహనము' కావ్యానికి కూడ అదే విధంగా అన్వయిస్తాయి.

## గ్రామిక జీవుల ప్రణయదృశ్యాలు - కవికొండల గేయాలు

భావకవిత్వంలో గొప్పగీతంగా ఎన్నదగిన 'శివరాత్రిప్రభ' రచించి ప్రఖ్యాతులైన వారు శ్రీ కవికొండల వేంకటరావు. వీరు రెండు మూడు తరాల కవులతో కలిసి ప్రయాణంచేశారు. కావ్యవస్తువు కానిదేదీ లేదని వీరు నమ్మారు. కనిపించిన చెట్టూ, పుట్టా, పుంతదారీ, వాగూవంకా, గడ్డిపువ్వు మీదా కృతులు రచించి 'ఆంధ్రా వర్డ్స్‌వర్త్' అనిపించుకున్నారు. ఆధునిక కవులు కొందరు రైతుల గురించి రాసి కొత్తదనాన్ని ప్రవేశ పెడితే వీరు "కూలియన్నల కుతుకము"ను గూడ వర్ణించారు. కంటికి కనిపించిన ప్రతివస్తువుపైనా కావ్యం అల్లటానికి ప్రయత్నించటం చేత భావన పలచబారి కొన్నిచోట్ల పేలవంగా తోస్తుంది. కట్టలుకట్టలుగా కవితరాసి పడెయ్యటం వలన వారిగీతాలలో రసవంతమైన వాటికోసం వెదక వలసి వుంటుంది. వెతికితే మాత్రం గుండెపట్టుకొనే రసగీతాలు లభిస్తాయి; శ్రమవ్యర్థం కాదు. స్వాతంత్ర్యానంతర కాలంలో కవికొండల గేయాలు, కవికొండల గీతాలు రెండు సంపుటాలు వచ్చాయి. వీటిలో ఎదురయ్యే తేలికదనాన్ని పేలవత్వాన్ని చూచి విసుగుజెందకుండ

చదివిన వారికి చవులూరించే కావ్యఖండికలు లభిస్తాయి. "నదినిండ నీరున్నదీ - నావపై పిల్లున్నదీ/పిల్లాకు వొళ్ళున్నదీ / వొళ్ళెల్ల వయసున్నదీ" మొదలైన శృంగార గీతాలు మరపురానంత మధురమైనవి.

శ్రీ కవికొండల కలం కుంచెయై గోదావరీ తీరంలోని సుందర ప్రకృతిని, ముఖ్యంగా కష్టజీవుల కడగండ్లను రసరమ్య చిత్రాలుగా తీర్చిదిద్దింది.

## ఉగాదులూ - ఉత్సవాలూ : మల్లవరపు కవిత్వం

మధుకీల, కల్యాణ కింకిణి కావ్యాలతో భావకవులలో చోటు గడించుకొన్న శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు స్వాతంత్ర్యానంతర కాలంలో రచించిన గీతాలు విశేషమైనవి కావు. భావకవిత్వం ఉజ్జ్వలంగా వెలుగుతున్నదశలోవున్న కవితావేశం, ప్రేరణ యీభావకవికి కొరవైనా యేమో! కాని తిరిగేకాలు, తిట్టేనోరులాగే రానేకలం కూడ వూరుకోదు. శ్రీ విశ్వేశ్వరరావు అప్పుడప్పుడు రచించిన ఖండకావ్యాలు 'ఉగాదులు-ఉత్సవాలు' సంపుటంగా వచ్చాయి. పండుగలూ పబ్బాల్లో రాసినవేఅయినా విశ్వేశ్వరరావుగారి పద్యాల్లో లయాత్మకమైన భావన సహృదయుల్ని అలరిస్తుంది.

"ఒక సంవత్సరం నడిస్తే/ఒకమైలురాయిగడిస్తే/ఒక
నిట్టూర్పు విడుస్తాడు మనిషి....
ఒక కష్టం తొలగితే/ఒక నష్టం తలగితే/ఒక నిశ్వాసం
వొదుల్తాడు మనిషి....
ఒక ఉగాంతం అయిందంటే/ఒక ఉగాది మొదలయిం
దంటే/ఒక ఆశకలిసి వస్తుందనీ/
ఒక అదృష్టం ఫలిస్తుందనీ / ఒక అవధి
చేరువయిందనీ / ఒక విశ్వాసం మీదనిలుస్తాడు మనిషి"

వంటి ఉగాది పద్యాలు ఆహ్లాదకరంగా వున్నాయి.

'మధుకీల' నాటి కవితాజ్వాల లేకపోయినా విశ్వేశ్వరరావు గారిలో కవిత్వం నివురుగప్పిన నిప్పులా మిగిలేవున్నది.

## కొనకళ్ళ ప్రణయ గీతాలు - 'బంగారి మామ పాటలు'

ఎంకి పాటల తర్వాత తెలుగు దేశాన్ని ఉర్రూత లూపిన మధుర గీతాలు 'బంగారిమామపాటలు', జానపదులశైలిలో. భావకవుల భావనతో సుకుమారమైన ప్రణయ భావనను లయాన్వితమైన భాషలో రచించిన కవి శ్రీ కొనకళ్ళ వెంకటరత్నం.

''రావోయి బంగారి మామా / నీతోటి
రాహస్య మొకటున్నదోయీ !''

అనే ప్రియురాలి ఆహ్వానం గుండెలు ఝల్లుమనిపిస్తుంది. తర్వాత వచ్చే మాటలు మైమరపిస్తాయి-'' అవిసెపువ్వులు రెండు/అందకున్నయి నాకు/తుంచి నా సిగలోన తురిమి పోదువుగాని- రావోయి / ఏటిపడవ సరంగు/పాట గిరికీలలో / చెలికాడ మనసొదలు / కలబోసు కుందాము, రావోయి బంగారి మామా'' అనే పలుకుల్లో వున్న ప్రణయ భావన ఆనందంతో గుండెల్ని మెత్తగా కోసుకొని పోతుంది.

బంగారిమామ పాటల్ని మెచ్చుకుంటూ చలంగారు ''ఎంకిపాటల్ని అనుకరించిన పాటల్ని చూస్తే నాకు అసహ్యం. కాని ఇవి ఎంకి పాటల అనుకరణం కావు. ఎంకి పాటలనేవి లేకపోయినా ఇవి తెలుగు ప్రపంచం లోకి రావటం ఆగేదికాదు. కొన్ని కొన్ని పాదాల్లో ఎంకి పాటల్ని మించినలయ- విరుపులు- శబ్దంలో సంగీతం, ఎక్కడనించో అపురూపపు పుష్పాల్ని ఏరి తెచ్చినట్లు ఆ మాటలు, మాటలతో మాట ఐక్యం-అంతా ఒక గొప్ప అపురూపమైన చాలా అందమైన కవిత్వపు పటం'' అన్నారు. ''ఈ పాటలు ఇంతకాలం వినక బతికిన'' తన అలసత్వానికి సిగ్గుపడ్డారు.[18]

''సుక్కలన్ని కొండమీద / సోకుజేసుకునేవేళ / పంటబోది వరిమడితో/పకపక నవ్వేవేళ/సల్లగాలి తోటకంత సక్కలిగిలి పెట్టువేళ/ మొక్కజొన్న తోటలో/ ముసిరిన సీకట్లలో / మంచెకాడ కలుసుకో/

18. బంగారి మామ పాటలు - 'గీటురాయి' - చలం - జయంతి పబ్లికేషన్స్: 1980- ద్వితీయ ముద్రణ

మరవకు మామయ్యా'' పాట తెలుగుదేశంలో గాయకులు, నాట్యగత్తెలు, నటులు, ఎన్నోవిధాల ఆదరించారు. ఈపాటను మెచ్చని రసికులుండరు.

''ముసురేసిందంటే పైన / అసలే మతిపోతది మామా / ససి చెడినట్లుంటది లోలోన / ఓ ముద్దుల మామా/'' అని ప్రబంధనాయికల విరహాన్ని దిగదుడుపు పెట్టే తెలుగుపిల్ల యీకావ్య నాయిక. పేరు లేకుండానే (కవి నాయికకు పేరు పెట్టలేదు) రసజ్ఞుల గుండెల్ని దోచుకున్న యీ కోడలుపిల్ల చిరంజీవి తెలుగుపాట వున్నంతకాలమూ నిలిచే వుంటుంది. నాయుడుబావ, బంగారి మామ లిద్దరూ అదృష్టవంతులే.

''ఏరుదాటిస్తానె చిన్నదానా/ నాకే మిస్తువె, సాహసమున్నదానా!''

అన్న బంగారి మామకు కోడలుపిల్ల యిచ్చే కానుక - ఆమె సర్వస్వమూ. ''ఒక్కనేనే నీకు పెక్కునీవులు నాకు'' అన్నట్టు తాను బంగారి మామ నీడలో వొదిగి నిలిచి వెలుగంతా మామకే ఇచ్చిన ఇల్లాలు. 'ప్రొద్దు తిరుగుడుపూలు' అనే కొనకళ్ళ గీతాల సంపుటి మరొకటున్నా బంగారిమామ పాటల్లోనే ఆయన కవితాశక్తి అజరామరమై నిలిచింది.

## ''సంజ వెలుంగులో పసిడివన్నెల ఖద్దరు చీరగట్టి''న కవితా కుమారి - 'కరుణశ్రీ' కవిత్వం

భావకవిత్వం కనుమరుగై పోయినతర్వాతనే 'కరుణశ్రీ' జంధ్యాల పాపయ్య శాస్త్రిగారి 'ఉదయశ్రీ' వెలువడింది (మొదటిభాగం- మొదటి ముద్రణ 1944). గడచిన మూడు దశాబ్దాల పైచిలుకు కాలంలో 48 ముద్రణలు పొందిన యీ కావ్యం మిక్కిలి ప్రసిద్ధి వహించిన కావ్యమని వేరే చెప్పనక్కరలేదు. 'ఉదయశ్రీ'లో విశేష ప్రచారం పొందిన పుష్ప విలాపము, అద్వైతమూర్తి, సాంధ్యశ్రీ, ప్రాభాతి, రాట్నసుందరి, కుంతీ కుమారి, తపోభంగము, ధనుర్భంగము, ఊర్మిళాకుమారి, సతీ సావిత్రి, అనసూయాదేవి, తెనుగుతల్లి, బీదపూజ, సార్థకత, స్వేచ్ఛా పుష్పాలు, అంజలి మొదలైన ఖండకావ్యాలు భావ కవితా స్ఫూర్తితో

వెలువడినవే. సతీ సావిత్రి, అనసూయ వంటి ఖండకావ్యాలు పురాణాల లోవే అయినా 'కరుణశ్రీ' కవితలో భావకవితా రూపాలుగా మార్పు పొందాయి. ప్రకృతి, ప్రణయం, ప్రబోధం అనే మూడు భావ కవితా శాఖలలో కరుణశ్రీగారి ఖండ కావ్యాల్లో ప్రణయమూ, ప్రబోధమే అధికంగా కానవస్తాయి. అభ్యుదయ కవిత్వం విజృంభిస్తున్న దశలోగూడ కరుణశ్రీగారి కవితలు కాలదోషంపట్టిన ప్రణయ కావ్యాలనిపించుకోలేదు. దీనికి కారణం వీరి పద్యాలు నిరక్షరాస్యులకుకూడ సులువుగా బోధపడి, నోరూరగ చవులు పుట్ట చదువుకోవటానికి, పాడుకోవటానికి వీలుగా వుండటమే.

కరుణశ్రీ రచించిన పుష్ప విలాపము, కుంతీకుమారి, సాంధ్యశ్రీ మొదలైనవి ఘంటసాల వేంకటేశ్వరరావుగారి క్రమగానంతో తెలుగు దేశం నాలుగు చెరగులకూ వ్యాపించాయి. భావనలో లాలిత్యం, పరిచిత శబ్దాలనే ప్రయోగించటం, పద్యాల్లో ధారాశుద్ధి కరుణశ్రీ కవితకు పెట్టని సొమ్ములు.

కరుణ రసం కరుణశ్రీ కవితలో ప్రాధాన్యం వహించటం చేత, నవరసాల్లో కరుణ శ్రేష్ఠమని తలచే సహృదయులు వీరి కవితను శిరో ధార్యంగా ఎంచారు. శృంగారం కరుణశ్రీ కలంలో అందాలు వొలక బోస్తుంది.

> "రాధనురా ప్రభూ ! నిరపరాధనురా ! అనురాగభావనా
> రాధన మగ్న మానసనురా ! కనరా! కరుణింపరా! మనో
> వీధి పదేపదే కలకవేయుచు నున్నవిరా ! పురా రహో
> గాథలు - ఈదలేనిక అగాధ తమోమయ కాలవాహినిన్"

అని విన్నవించుకునే మాధురీ భక్తితత్త్వం 'కరుణశ్రీ' లేఖినిలో రమణీయంగా వెలుగొందింది. రాధాకృష్ణుల ప్రణయకేళిని వర్ణించే సమయాల్లో కృష్ణశాస్త్రి వేదుల గారలను, ప్రబోధ కవిత్వం రాసే సమ యంలో జాషువాను కరుణశ్రీ అనుసరించినట్లనిపిస్తుంది.

శబ్దశక్తి తెలిసినకవి కరుణశ్రీ. మాలా కారుడు పూలమాల గ్రుచ్చినట్లు వీరు సుశబ్దాలను ఏర్చికూర్చి కవితను కమనీయంగా భాసింపజేస్తారు. "సంజ వెలుంగులో పసిడి చాయల ఖద్దరు చీరగట్టి నారింజకు నీరువోయు శశిరేఖవె నీవు" అనే పద్యంలో ప్రతి శబ్దమూ హృద్యమైనదే. భావ నైశిత్యంకంటె కరుణశ్రీ గారిలో భావ వ్యక్తీకరణలో చక్కని వొడుపు కన్పిస్తుంది.

జాతీయతా భావ స్ఫోరకాలైనవి, ప్రకృతి సౌందర్యాన్ని దీపింపజేసేవి, ప్రణయ పారమ్యాన్ని చాటేవి అయిన ఖండకావ్యాలతో 'ఉదయశ్రీ' ఐదు భాగాలను రచించిన కరుణశ్రీ భావకవిగా ముద్ర పడని భావకవి. అట్లని ఆయన సంప్రదాయాన్ని అభ్యుదయాన్ని విడనాడలేదు. కమనీయమైన కవితకు మరోపేరు కరుణశ్రీ.

## అంగారం శృంగారం కలబోసిన దాశరథి

నవ్య కవిత్వోద్యమంలో భావ కవితా సౌరభాల్ని నింపుకొని అభ్యుదయ కవిత్వోద్యమంలో కవితారథ సారథ్యం వహించారు శ్రీ దాశరథి. తెలంగాణ ఆంధ్రోద్యమంలో ఆయన మహారథుడు. ఉర్దూ కవి మఖ్దూం మొహియుద్దీన్ లాగ అంగారాన్ని, శృంగారాన్ని కవిత్వంలో రంగరించిన ప్రతిభావంతుడు. "సైనికుడు యుద్ధ రంగంలో పోరాడుతూ కూడ అప్పుడప్పుడూ తన ప్రియురాలి అందమైన కళ్ళను తలచుకోవడం అస్వాభావికమా? కానేకాదు. క్రాంతిని ప్రబోధించే ఎందరో కవులు కమ్మని శృంగారం రాశారు" అని శ్రీ దాశరథి కైఫీ ఆజ్మీ, సర్దార్ జాఫ్రీ మొదలైన వారిని నిదర్శనంగా చూపుతారు.[19] తెలంగాణ పోరాట సమయంలో "పోలీస్ స్టేషన్ నుంచి తప్పించుకొని పారిపోతున్నప్పుడు కూడ మంచి నీళ్లు అడిగితే, ఆప్యాయంగా ముంతతో నీళ్లు అందించిన రైతు పిల్ల ఒయ్యారం, ఆమె కళ్లలోని అమాయికత నన్ను మైమరపించాయి. నిజామాబాదు జైల్లో కిటికీలోంచి చూస్తే

19, 20.—'పురస్కృతులు' - దాశరథి కవిత' - దాశరథి మహేంద్ర ప్రచురణలు - 1977.

బయటి మామిడి కొమ్మ చిగిర్చి, పూలు పూస్తే, లక్ష ఉగాదులు ఒక్కసారి హృదయంలో దూకినట్లుండేది'' అని శ్రీ దాశరథి ప్రకృతి సౌందర్యం, ప్రణయ భావన తన విప్లవ భావాలకు ఆటంకం కాలేదంటారు.[20] ఆయన రచించిన ''అగ్నిధార, రుద్రవీణ, మహాంధ్రోదయము, పునర్నవం, అమృతాభిషేకము, కవితాపుష్పకము, ఆలోచనాలోచనాలు, తిమిరంతో సమరం'' కావ్యాలన్నిటిలో భావ కవిత్వం వున్నది.

''నా యింటి చిన్నది, నడుము సన్నముది, కన్నుల తెల్గు సిగ్గులు మొలకలెత్త/నావైపు సూచి నన్ వలపించుకొన్నది'' వంటి రసవంతమైన పద్యాలు దాశరథిగారిని ప్రణయ కవిత్వం రాసిన కవులలో అగ్రశ్రేణిలో నిలబెడతాయి. ''నాడు నీ ఖుంటి వెనుక పున్నాగ నవ్వె'' (పూలలో జ్వాలలు) మొదలైన పద్యాల్లో తెలుగు ముంగిళ్లలో కన్పించే సుందర ప్రకృతిని రమణీయంగా వర్ణించారు.

''ఉషస్సు కిర్మీర కవాటంతోస్తూ/ఒక్క మాటు చూచిందిటు/తమస్సు పాషాణ కిరీటం తీస్తూ/ఒక్క పరుగు తీసిందటు'' అని ఉషోదయపు తేజోరేఖల్ని పద చిత్రంలో ప్రదర్శించారు. 'అచుంబితం'లో ''మాట్లాడని మల్లెమొగ్గ/మాదిరిగా నడచిరా/నిశ్శబ్దం ఎరుగనట్టి/నిమ్నగ వలె నడచిపో'' అనే గీతం సుకుమారమైన ప్రణయ భావనలో దాశరథి అందెవేసిన చేయి అని నిరూపిస్తుంది.

'అంధుని అనురాగ గీతి' లో—

''గుండె కొట్టుకొనుట చూచితి నేను
పెదవు లదరు టనుభవించినాను
దాపరికములేని దాక్షిణ్యమూర్తి ? నా
గుండె గూట దివ్వె కులికెనేడు''

అని అంధుడు ప్రియురాలిని ప్రేమతో స్మరించటం కన్నులు చెమరింపజేసే కవిత.

తెలుగు ప్రజలు నిద్దుర మేలుకోగ, 'నా తెలంగాణ కోటి రతనాల వీణ' అని జాతీయతను ప్రబోధించి, మహాంధ్రోదయాన్ని ఆకాంక్షించిన

కవి శ్రీ దాశరథి. భావ కవిత్వానికే పరిమితమైపోకపోయినా, ఆయన భావ గీతికలు ఏ ఉత్తమ భావకవికీ తీసిపోనివి.

## 'రసాద్వైత' కవి బోయి భీమన్న

శ్రీ బోయి భీమన్న కవితాతత్త్వం 'రసాద్వైతం'. అది భావ కవిత్వానికి మరో పేరని చెప్పవచ్చు. ప్రకృతి సౌందర్యానికి నిలయమైన కోనసీమలో పుట్టి, ఆ సీమ సౌందర్యాన్ని కవితలో నిలిపిన కవి శ్రీ భీమన్న,

"శ్యామలములైన లంకల అంకములను
పమిట చెరగున మలయానిలములు వీచి
పాంథజనులకు పారమ్య పదవినొసగు
కోమలారామసీమ మా కోనసీమ" అని జన్మభూమిని

తలచి పులకించిపోతారు. "కొబ్బరి ఎక్కడ కనిపించినా/నాకు దానిలో కొబ్బరితోటలు కనిపిస్తై/కోనసీమ ప్రత్యక్ష మవుతుంది/అమ్మ ఒడిలో చంటి పాపలా/అవశుణ్ణయిపోతానా క్షణంలో!"అని తన పారవశ్యాన్ని వివరించారు.

అంటరానితనపు దురాచారానికి గురియై, బీదరికంతో బాధపడి, ఆవేదనలో నుండి వీరి కవిత వికసించింది. వర్ణోజ్వలాలూ, సుగంధ భరితాలూ అయిన వివిధ పుష్పాలు వీరి సుందర కవితో ద్యానంలో దర్శనమిస్తాయి.

ప్రణయం భీమన్నగారి కవిత్వంలో ప్రధానమైన భాగం. రాధాకృష్ణ తత్త్వం భావకవులను ఆకర్షించినట్లే భీమన్నగారికి కూడ కావ్య ప్రేరణ కలిగించింది.

"గాన రసమ్ముతో వెదురు కర్రకు ప్రాణము పోసినావు నీ
వేణు రవమ్ముతో మొరటు ప్రేతను రాధను జేసినావు నీ
యాన రయమ్ముతో జడ మహస్సుకె కళ్లెము వేసినావు నా
మానసమంత కంటె ఖలమా? ఖిలమా? నినుగోరుటబ్రమా?"

అని విశ్వకాముకుని తన ఎదలోకి తీసుకునే ఆర్తి వీరి కావ్యాల్లో కన్పిస్తుంది.

దేశభక్తి ప్రబోధం భావ కవిత్వంలో మరొక భాగం. 'దీప సభ'లో శ్రీ భీమన్న దేశభక్తుల దివ్య స్మృతికి 'ఒక్కొక్క దీపాన్ని' సమర్పించారు.

కృషీవల జీవనంపై భీమన్నగారికి అభిమానం హెచ్చు. పాలేరు, కూలిరాజు నాటకాలు రాయటమేగాక కావ్యాల్లో గూడ రైతు జీవితాన్ని అభిమానించే ఘట్టాలు అనేకం రచించారు-బంతిపువ్వు వీరికి 'రైతాంగపు పువ్వు'గా భాసించింది.

భీమన్న "కావ్య కుసుమాలు, పైరుపాట, రాగవైశాఖి, రాభీలు, కేదారేశ్వరి, బొమ్మ, శివాలకలు" కావ్యాల్లో భీమన్నగారి భావ కవిత అందంగా రూపుదిద్దుకొన్నది.

## "జాజి పువ్వుల అత్తరు దీపాలూ - మంత్రలోకపు మణి స్తంభాలూ వున్న సౌందర్యసీమ"-తిలక్ కవిత్వం

ఆధునికాంధ్ర కవిత్వంలో శ్రీ దేవరకొండ బాలగంగాధర తిలక్ 'అమృతం కురిసిన రాత్రి' ఒక దీప స్తంభం. ఆధునిక కవిత్వానికి జవమూ, జీవమూ ప్రసాదించిన కవి శ్రీ తిలక్. 'నా కవిత్వం కాదొక తత్త్వం' అంటూ-

> "నా అక్షరాలు కన్నీటి జడులలో తడిసే దయాపారావతాలు,
> నా అక్షరాలు ప్రజాశక్తుల వహించే విజయ ఐరావతాలు
> నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే అందమైన ఆడపిల్లలు"

అన్నారు. వీటిలో చివరి పంక్తి ఆయన భావకవితా దృష్టిని చక్కగా వెల్లడిస్తున్నది. ఒక తత్త్వానికి కట్టుబడక నిరంతరం అన్వేషియై శిఖరారోహణ చేసిన కవి శ్రీ తిలక్. 'ఇజాలలో ఇంప్రిజన్' కావటం ఆయనకు ఇష్టంలేదు; స్వేచ్ఛాప్రియుడు.

భావకవిత్వానికి కాలదోషం పట్టిందనుకుంటున్న కాలంలో శ్రీ తిలక్ ప్రకృతినీ, ప్రణయాన్నీ వర్ణించే రస గీతాలను రచించారు. ఆయన రచనలతో భావ కవిత్వం పునరుజ్జీవనం పొందింది. కృష్ణశాస్త్రి గారి భావనాశక్తి, శ్రీశ్రీ గారి అభ్యుదయ రక్తి ఆయన కవితలో అంతర్వాహినిగా కన్పిస్తాయి. భావ కవితా యుగానికి చివరి, గొప్ప ప్రతినిధి తిలక్.

ఉదాత్త ప్రణయ భావన తిలక్‌గారి రచనల్లో "అమృతం కురిసిన రాత్రి: యుగళ గీతిక; నగరం మీద ప్రేమ గీతం; ఈ రాత్రి; అదృష్టాధ్వగమనం; ప్రవహ్లిక, వానలోనీతో, విరహోత్కంఠిత, చిన్నారికి చిన్నమాట; అద్వితీయం; ఆ రోజులు; నీవు లేవు నీ పాట వుంది" మొదలైన గీతాల్లో కన్పిస్తుంది. రాత్రివేళ వినవచ్చిన గానం చీకటి కాగితం మీద ప్లాటినం తీగలాగ మెరుస్తోందట". ఇంటిముందు జూకా మల్లె తీగల్లో అల్లుకుని, లాంతరు సన్నని వెలుతురులో కమ్ముకుని గుండెల్లో చుట్టుకున్న పాట సహృదయుల మనస్సుల్లో మెదులుతూనే వుంటుంది. గుమ్మం తగిలి గొప్పికట్టినా గొప్పకి నవ్విన కొత్త కోడలులా వచ్చిన కొత్త సంవత్సరం: వెలుతురు కుందేళ్లను నీడల కొండ చిలువలు మింగేయటం; కిటికీ తెరిస్తే కన్పించిన ఎర్రని పువ్వు ఎండలో మెరుస్తూ ఇదే నిజం, ఇదే నిజం అని నవ్వుతూ అంతలో రాలిపోయిన దృశ్యం-ఎన్నెన్నో దృశ్యాలు-తిలక్ ఊహా పరిధిని తలుచుకుంటే సముద్రం జ్ఞాపకం వస్తుంది.

శ్రీ తిలక్ కవిత జాజి పువ్వుల అత్తరు దీపాలూ, మంత్రలోకపు మణి స్తంభాలూ వున్న సౌందర్య సీమ. ఒయ్యారంగా పరుగెత్తుతూ-పృథు వక్షోజ నితంబ భారలై యౌవన ధనుస్సుల్లా వంగిపోతున్న అప్సరలు 'అమృతం కురిసిన రాత్రి'లో కన్పిస్తారు. అమృతాన్ని దోసిళ్లతో తాగి, జీవితాన్ని హసన్మందారమాలగా ధరించి దుఃఖాన్ని చావుని వెళ్ళిపొమ్మన్న కవి స్వాప్నికలోకం అందంగా కళ్ల ముందు మెదులుతుంది. ఆకులు రాలని పూలువాడని సుందర వసంతా రామాన్ని

సౌందరనంద కవులు ఊహించినట్లే, ఒకానొక సుందర స్వాప్నికలోకాన్ని తిలక్ భావించారు.

ప్రేయసి శ్రీ తిలక్ దృష్టిలో తల్లి, నెచ్చెలి, తనను కౌగిలించుకున్న పెద్ద పులి.' తిలక్ రచించిన ప్రేమ గీతాల్లో అత్యుత్తమమైనవి వానలో నీతో; నువ్వు లేవు నీ పాట వుంది' అనేవి.

"ఆకాశాన్ని మేఘం నల్లని కంబళిలా కప్పుకుంది/ఆనందం మనస్సులో మయూరబర్హంలా విప్పుకుంది / అరటితోట నడుంచుట్టి కాలువ ఏటవాలుగా మలుపు తిరిగింది/నారికేళ వనాంతాన ప్లాటినం సంకేతంలా మెరుపు మెరిసింది" అని భావించిన తిలక్‌గారి రచన భావ కవిత్వంలో ఉత్తమ ప్రణయ గీతాలలో వొకటి. "అభ్యంగనావిష్కృత త్వదీయ వినీల శిరోజ తమస్సముద్రాలు" మొదలైన సంస్కృత సమాసాలు నన్నయ కవిత్వంలాగ సుగమమై హాయిని గొల్పుతాయి గాని క్లిష్టమనిపించవు. 'విరహోత్కంఠిత'లో భావమూ, రచనా పద్ధతీ దక్షిణాంధ్రయుగ కవులను జ్ఞాపకం చేస్తాయి.

శ్రీ తిలక్ పద్య రచన కూడ ఆయన వచన కవితలాగే రసవంతమైనది. "సీత, అద్వైతమన్మథము, ఆటవెలది" మొదలైన ఖండ కావ్యాలు ఆయన కవితా రామణీయకతను వెల్లడిస్తాయి. "అడుగునడుగునందు ఆనందమేమ్రోయు/ఆంధ్ర కవిత నాది ఆటవెలది" అని 'ఆటవెలది' ఖండ కావ్యంలో పెక్కు సుందర దృశ్యాలను మనోజ్ఞంగా, వర్ణ చిత్రాలవలె రచించారు.

"ఆకసమ్ము చివర అంత కుంకుమమేమె
ఎరుపు పెదవి చిటిలె నేమి నవ్వు
అంధ తమసమందు అల్ల వెలుతురేమె
విడిన జడను రాలిపడెన పువ్వు !"

వంటి భావ చిత్రాలు మనస్సులో చిరకాలం నిలిచిపోతాయి.

"తోట ఆకు పచ్చ పైట తొలగి జార
పూల రొమ్ము నిక్క పొడిచి నిలిచె"—

ఉద్యానవనాన్ని స్త్రీతో పోల్చటం ప్రాచీన సంప్రదాయమే అయినా పూల రొమ్ము నిక్కపొడవటం ఆధునికమైన తలపు. "జీవితం దేవతల దరస్మితం/చిన్నారి పెదవిమీద సింగారించు" అనేది చక్కని సందేశం.

భావ కవిగా తిలక్ ప్రకృతిని క్రొత్త కోణాల నుండి, వర్ణోజ్వల చిత్రాలుగా ప్రదర్శించారు. "సంధ్య, దృశ్య భావాలు, ఈ రాత్రి, రాజమండ్రి పాటలు, రాత్రివేళ; అద్వితీయం; ప్రాతః కాలం, వేసవి" గీతాల్లో ప్రకృతి, దృశ్యాని కనుగుణంగా ఆహార్యాన్ని మార్చుకునే నాట్య కత్తెలాగ, దర్శనమిస్తుంది. "చిటారు కొమ్మలో నక్షత్రం చిక్కుకుంది/శిథిల సంధ్యా గగనం రుధిరం కక్కుకుంది"— తిలక్ విలక్షణమైన భావన మనస్సును పట్టి నిలుపుతుంది. చీకటిపడే వేళను చిరుత పులులు పశువుల్ని నోట కరుచుకుపోయే వేళగా, పడుచు విధవలు పాడు బావిలో దూకే వేళగా వర్ణించినచోట దృశ్యాల సాదృశ్యాన్ని గమనిస్తే వొళ్లు గగుర్పొడుస్తుంది. చలిని వర్ణించేచోట 'నెత్తురు చల్లబడే చలి' అంటారు. వేసవి తీవ్రతను 'కాలం కదలదు/గుహలో పులి పంజా విప్పదు/చేపకు గాలం తగలదు.' వానలో కానలో తనకు అవిరామ ప్రాచీనత స్ఫురిస్తుందంటాడు. ఆధునికాంధ్ర కవిత్వంలో అపురూపమైన ప్రకృతి చిత్రం'–'సంధ్య'.

"సంజ పెదవుల ఎరుపు కడలి అంచుల విరిగి
సంజె పరికిణి చెరగు ఎడద లోతుల మెరసి
ఏటి కొంగల నిదుర ఎర్రగా ప్రాకింది
బాతురెక్కల నీడ బరువుగా సోలింది"

ఇంత రమ్యమైన ప్రకృతి చిత్రాన్ని బూర్జువా కవిత్వమని ఆక్షేపించే వాళ్ళుంటే వాళ్ల అరసికతకు జాలిపడాలి. అందాన్ని ఆనందించలేని వాళ్లకు అంతకుమించిన శిక్ష వేరే ఏమీ అక్కరలేదు.

దేశభక్తి ప్రబోధం తిలక్ కవిత్వంలో భారత దేశంపై చైనా యుద్ధానికి దిగినప్పుడు, మరికొన్ని యుద్ధ సమయాల్లో రాసిన గీతాల్లో వున్నది. ఆయన దేశభక్తి ప్రబోధం సంకుచితమైనదికాదు. మానవత్వం ఎక్కడ ఆపదపాలైనా తిలక్ ఆక్రోశించారు. కరుణ ఆయన కవిత్వానికి ఆత్మ.

భావ కవితోద్యమం అణగారి పోయిన తర్వాత వచ్చినప్పటికీ శ్రీ తిలక్ భావ గీతాలు ఆయన్ను భావ కవులలో విశిష్టమైన కవిగా నిలుపుతాయి. ఊహ, వ్యక్తీకరణలు రెండూ తిలక్ కవితలో అందంగా కన్పించటమేగాదు, అనితరసాధ్యమనిపిస్తాయి.

## ప్రకృతి సౌందర్య పిపాస-సోమసుందర్ కావ్యాలు

'వజ్రాయుధం'తో అభ్యుదయ కవిగా ప్రసిద్ధులైన శ్రీ సోమసుందర్ కావ్య సముదాయాన్ని గమనిస్తే ఆయనలో అభ్యుదయ భావాల కంటె, భావ కవితా ఛాయలే ఎక్కువగా కన్పిస్తాయి. శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి కవితాముద్రగల పదబంధాలు శ్రీ సోమసుందర్ ఎక్కువగా ప్రయోగిస్తారు. "మిణుగురులు, సోమరసం-సుందరకాండ; మేఘ రంజని; మాఊరు మారింది; అనల కిరీటం; వెన్నెలలో కోనసీమ" కావ్యాల్లో సోమసుందర్‌గారు భావ కవిత్వ మార్గాన్ని అనుసరించారు.

"శైలూషికావలాహకాలు? శరశ్చంద్ర రేఖాశ్వేతపత్రాలు? ఆతతాయి వాంఛా ప్రచ్ఛన్న స్వరూపాలు! నా గురించిన పరిచయ వాక్యా లింతకన్న ఏం చెప్పను"- అనే పంక్తుల్లో కవి ఉపయోగించిన పద బంధాలు భావ కవులను జ్ఞాపకం చేస్తాయి. "స్వర్గంగా తీరాలసికతా తలాల దారులలో నిరవధిక శాద్వల సీమలలో/పల్లవిస్తున్నాయి నిరామయ కామనలు"-అనేచోట కవి సౌందర్య దాహంతో తపించి, అందని ఆనందంకోసం వేగిపోయి, నిరాశతో క్రుంగిపోయిన మనస్థితి చక్కగా వ్యక్తమయింది.

"అరటి మొక్కలెత్తిన మొవ్వటాకు బావుటా
చెరకు గడలెత్తి ఝళిపించే చిత్తజుని కాగడా
కావేషి గుండెల్లో మెరిపించే మొగలిరేకు కటారు
సావేరి రాగచ్ఛాయల్లో నర్తించే ఈకు చెట్ల డాళ్లు/ఇవన్నీ
నాకెంతో ఇష్టం"

అని సోమసుందర్‌గారు ప్రకృతి సౌందర్యంపై మక్కువపడ్డారు.

భావ కవుల ప్రణయ భావన మాత్రం సోమసుందర్‌గారిని ఆకర్షించినట్లులేదు. మార్క్సిస్టుతత్త్వాన్ని నమ్మటంచేత ఆయన జాతీయతా హద్దులకు లోబడిన దేశభక్తి ప్రబోధం చేయలేదు. ప్రకృతి వర్ణనల్లో మాత్రం ఆయన భావ కవుల ఊహా వైచిత్రిని, వ్యక్తీకరణను బాగా అనుసరించినట్లు కన్పిస్తుంది. 'మా ఊరు మారింది'లో వెన్న ముద్దల వంటి/ఎద్దుల్ని తోలుకుంటూ/మెడమీద చందనపు కాడితో/ గబగబ అడుగులు వేస్తుంది/బండ రాసానలా పడివున్న/పుడమి దోసిళ్లనిండా/మంచి గంధం తీస్తుంది/ఆ గంధమే నేను...నా అందమే ఊరు" అని రమ్యంగా తన గ్రామ శోభను వర్ణించారు. ఊళ్లో వచ్చిన మార్పుల్ని గుర్తించటంలో కూడ శ్రీ సోమసుందర్ కఠిన వాస్తవాలను పట్టించుకోక, భావ కవిలాగ ఊహా మాత్రమైన సౌందర్యాన్నే దర్శించారు-'వెన్నెల పడవలు' అని కావ్య ఖండికలకు శీర్షిక నెన్ను కోవటం ఆయన సౌందర్య దృష్టికి మరొక నిదర్శనం.

శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి వ్యాధిగ్రస్తులై, వారి గొంతు మూగ వోయినప్పుడు శ్రీ సోమసుందర్ రచించిన 'ఇది సుదీర్ఘ చరమరాత్రి' వేదనతో పలికిన ఉత్తమ గీతం. 'కృష్ణ కోకిల స్వామికి సౌవర్ణిక' అని శ్రీ సోమసుందర్ కృష్ణశాస్త్రిగారికి సమర్పించిన నివాళి కూడ ఆయన భావ కవితా దృష్టిని చక్కగా వెల్లడిస్తుంది. అభ్యుదయ భావాలను శ్రీ సోమసుందర్ విరివిగా ప్రచారం చేసినా, కవిగా ఆయన వ్యక్తిత్వం భావ కవులకే సన్నిహితమైనది. సామాన్యుల బ్రతుకు తెరువును వర్ణించేటప్పుడు గూడ ఆయన ఉపయోగించే సంస్కృత సమాసాలూ,

ఆడంబరమైన శైలి అనిపించే పదబంధాలు విలక్షణంగా వుంటాయి. అభ్యుదయ కవులలో ఆయనదొక ప్రత్యేకమైన స్థానం. భావ కవులుప యోగించే పదబంధాలను బట్టి శ్రీ సోమసుందర్ కవితను తేలికగా గుర్తించవచ్చు.

## నారాయణరెడ్డి సౌందర్యోపాసన

సురభిళ శబ్దమ్మొక్కటి/తరగలెత్తిన చాలునాయె/డందనందు లందు కోటి/నందనాలు గుబాళించు ('దివ్య మానవుడు' - 'దివ్వెల మువ్వలు') అని పలికిన శ్రీ సి. నారాయణరెడ్డి, కవితలో సౌందర్యానికి అభ్యుదయ భావనకు సమానంగా చోటిచ్చారు. పద ప్రయోగనైపుణిలో పలుకుల పొందికలో, నారాయణరెడ్డిగారి వాణి భావకవులకు దగ్గరగా వుంటుంది. కృష్ణశాస్త్రిగారి భావన, దాశరథిగారి భావ ప్రకటనా తీవ్రత నారాయణరెడ్డిగారిలో చక్కగా మేళవించాయి. "నవ్వని పువ్వు, వెన్నెల వాడ, విశ్వనాథనాయడు, కర్పూర వసంత రాయలు, ఋతు చక్రము, నాగార్జునసాగరము, అక్షరాల గవాక్షాలు, దివ్వెల మువ్వలు, జాతి రత్నం, మధ్య తరగతి మందహాసం, మరో హరివిల్లు, మనిషీ-చిలక, భూమిక, మథనం, మార్పు నాతీర్పు; ఉదయం నా హృదయం కావ్యాల్లో నారాయణరెడ్డిగారి భావ కవితా సౌందర్యం మనోజ్ఞంగా కానవస్తుంది.

"దుత్తల నెత్తి నెత్తుకొని దూరపు చేలకు గాలి తోడ వ
ర్వెత్తెడు కాపు భామలకు వేగముగా పయనించు మేఘ సం
పత్తికి నెంత సామ్య; మిసుమంత విభేదమదేదియుండినన్
మొత్తముపై పయోభర సమున్మిషితాంగులు గాదెయిర్వురున్"
(వర్షా సుందరి-దివ్వెల మువ్వలు)

అని ప్రాచీన కవుల చాటూక్తుల పోలిన పద్య కవిత్వం నుండి "వెన్నెలలున్నప్పుడు ఇరుల/నెన్నుకొనుట ఒక అందము/తీపిగడియ లందు చేదు/జ్ఞాపకమ్ములొక అందము/సంయోగములో విరహ/చ్ఛాయ లున్న ఒక అందము" (అందం; అక్షరాల గవాక్షాలు) అని సుకుమార

మైన భావనను వెలయించినా - "నన్ను త్రాగనిండు విషము/నాకదియె జీవరసము/కాకోలమ్మను కొందురో ? కాదు కాదు; గుత్తులుగా/పండిన చీకట్లు పిండి/వడపోసిన రాగ రసము" అని అంతర్ముఖులై "తుమ్మెద సుల్తానుల పద్మ ధూళినైన నోచుకోని/పూచిన ఉమ్మెత్త పువ్వు/నాచషకము నాచషకము ('విషపానం' - అక్షరాల గవాక్షాలు) అని గంభీరంగా పలికినా నారాయణరెడ్డిగారి భావనలో, పదాల పొందికలో సౌందర్య మధూళి చిందుతుంది.

'నవ్వని పువ్వు'గా నవ్య కవిత్వంలోకి అడుగుపెట్టిన నారాయణ రెడ్డిగారు నిత్యవసంతంలాగ-కావ్య పరిమళాలను వెదజల్లుతున్నారు. యౌవన దశలో కవులకు సహజమైన ప్రణయ భావన నారాయణరెడ్డి గారికి కూడ కావ్య ప్రేరణ కలిగించింది. "నాగార్జునసాగరం, కర్పూరవసంతరాయలు"వంటి చారిత్రక కావ్యాల్లో గూడ ప్రణయ భావనకే పట్టం గట్టారు. కవి ఎదిగినకొద్దీ ప్రణయంలో ఉన్నత శిఖరాలను అందుకున్నారు.

"ఒక నాట్యకత్తె రొమ్ము కుదింపుగని బిగిం
చిన వీణవోలె స్పందించిపోయితిగాని
ఆమె గుత్తపురవికయందు అణగారి పడు
మాతృభావన లేశమాత్రమ్మెరుగనైతి"

అని సౌందర్య దృష్టికి మానవతా భావాన్ని జోడించుకుని, కవితకు పుష్టి చేకూర్చుకున్నారు. లయాన్వితమైన పదాల పొందికతో దరిదాపు నారాయణరెడ్డిగారి కావ్యాలన్నీ గానయోగ్యంగా వుంటాయి. ప్రకృతి, ప్రణయం, ప్రబోధాలలో నారాయణరెడ్డిగారి కావ్యాల్లో ప్రణయ కవిత్వానికే ప్రాధాన్యం ఇచ్చినట్లు తోస్తుంది. ఇటీవలి కావ్యాల్లో ప్రణయం నుండి తాత్త్విక చింతన వైపు ప్రయాణిస్తున్నట్లనిపిస్తుంది. సున్నితమైన భావన, ఆహ్లాదకరమైన వ్యక్తీకరణతో నారాయణరెడ్డి గారి భావ గీతాలు నాజూకుగా, నగిషీలు దిద్దిన కళా ఖండాలై మనస్సును దోచుకుంటాయి.

## శేషేంద్ర భావ విహంగాలు

ఋతు ఘోషతో సంప్రదాయ కవిత్వానికి స్వస్తి చెప్పి శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ 'పక్షులు, శేష జ్యోత్స్న' మొదలైన కావ్యాల్లో భావ కవిత్వం రచించారు. 'జాబిల్లి' అనే ఖండ కావ్యంలో-

"ఆకాశపు నీలి నికుంజం వెండి పూలు పూచింది
మల్లె పూల బాటల్లో మబ్బుల బిబ్బోకవతులు
వెడలెను అతిషోకుగా వెన్నెల తిరునాళ్లకు
వెళిపోకు జాబిలీ నా ఊహల పాలవెల్లీ"

అని రమ్యమైన భావకవిత్వం రచించారు. ప్రాచీనాంధ్ర కవిత్వం వాచ్యార్థ ప్రధానమనీ, భావ కవిత్వంతోనే తెలుగులో ధ్వనికి ప్రాచుర్యం వచ్చిందని శ్రీ శేషేంద్ర విశ్వాసం. ఇటీవల వీరు రచించిన కావ్యాల్లో భావ కవిత్వం నుండి కూడ విడివడి, ఆయన 'కవిసేన'ను స్థాపించి, తనదైన ఒక నూతన పద్ధతిలో కవిత్వం రచిస్తున్నారు. క్లిష్టమైన అన్వయము, అస్పష్టత శేషేంద్రగారి కవిత్వంలో పాఠకులను ఇబ్బంది పెడతాయి. ఉన్నట్టుండి మెరుపులా మెరిసిన ఒక భావం మొత్తం గీతాన్ని రసవంతం చేస్తుంది. యువ కవులు శ్రీ శేషేంద్ర కవిత్వ మార్గాన్ని అనుసరిస్తున్నారు. 'వచన కవితా వికాసం' అధ్యాయంలో వీరి కవిత్వాన్ని గురించి మరికొన్ని విశేషాలు ప్రస్తావిస్తాను.

భావ కవిత్వమూ, అభ్యుదయ కవిత్వమూ ఉద్యమ స్థాయిలో దేశాన్ని ఉధృతంగా ఊగిస్తున్నప్పుడు, వాటిలో ఏకమైపోక శ్రీ నార్ల వెంకటేశ్వరరావు తన ప్రత్యేకతను నిలుపుకున్నారు. సంపాదకీయ రచనలో ఆయన తెలుగు నుడికారం ఆనందం కలిగించినట్లే 'జగన్నాటకం' సంపుటిలో గీతాలు కూడ నుడికారపు సొంపును వెల్లడించే ఉత్తమ రచనలు. ప్రేయసి, లేకపోతే ఆకలి, మాత్రమే కావ్య వస్తువులనుకొనే రోజుల్లో శ్రీ నార్ల "కాక సప్తకం, ద్వంద్వాతీతం, ఆశాసందేశం, ఇల్లాలు, నవోదయం పిచ్చి పూహాలు" (జగన్నాటకం) మొదలైన గీతాల్లో విలక్షణమైన కవిత్వాన్ని అందించారు.

'చీకటి తెర తొలగునులే/ఇక నీ వాకిట సిరి వెలుగునులే' అనే ఆశాజీవి శ్రీ నార్ల. సామాన్యులకు బోధపడని కఠిన శబ్దాలు ఆయన కవితలో కన్పించవు. లయాత్మకమై, పాడటానికి అనువైన గీతాలు ఆయన రచించారు.

తెలుగు శతకాలు-ముఖ్యంగా వేమనపద్యాలు నార్లవారిని అత్యంత ప్రభావితం చేశాయి. 'వాస్తవమ్ము నార్లవారి మాట; నవయుగాలబాట' అనే మకుటాలతో ఆయన రాసిన శతకాలు ప్రసిద్ధి పొందాయి; ఇందులో సూక్తులు కొత్తవి కాకపోయినా ఆధునిక కాలానికి అనుగుణంగా కవి వ్యాఖ్యానించినవి.

"తిక్క కొంతలేక తెలుగువాడెటులౌను ?
తెలుగుదనములేదు తిక్కలేక
తెలుగుజాతి కవియె తిక్కనామాత్యుడు
వాస్తవమ్ము నార్లవారి మాట"

మొదలైన పద్యాలు అర్థంకోసం వెదుక్కోనక్కరలేకుండ, ఝటితి స్ఫూర్తి కలిగిస్తాయి. వీరి శైలి శతక కవుల శైలివలె ముద్దులు మూట గట్టే మాటలతో ఇంపుగా వుంటుంది. కలకండ పలుకులవలె నార్లవారి సూక్తులు హాయిని కలిగిస్తాయి.

## "మధురమైన ఆకలి" బుచ్చిబాబు కవిత్వం

ఊహా వైచిత్రి బుచ్చిబాబుగారి కవితకు ప్రాణం. నవల, కథా రచయితగా ప్రసిద్ధులైన బుచ్చిబాబు వచన రచనలో కూడ కవిత్వం వొలికించారు. ఆయన రచనలో తెలుగు నుడికారం లోపించి, శైలి వింతగా తోస్తుంది. 'అజ్ఞానం' కావ్య సంపుటిలో ఆయన భావాలు విచిత్రంగా తోస్తాయి. "అన్నిటికన్న మధురమైనది ఆకలి/చందమామ కేసి చేతులు జాచిన చంటిపాప/పిలుపు తియ్యనిది/ఆశ్చర్యంతో పెరిగిన కంటి పాప కాంతికి/సిగ్గుతో వంకర తిరిగిన కన్య పెదవి కమ్మనిది" అనే భావ చిత్రాలు ఆహ్లాదకరంగా వున్నాయి.

''కలలు కొంటారాబాబూ?; ప్రపంచ పౌరుడా, జోహారు; వైనా గోడ'' గీతాలు భావకవితా స్పర్శగలవి.

'విచిత్రమే సౌందర్యం' అన్న సిద్ధాంతం బుచ్చిబాబుగారి కవితలో సార్థకమైంది.

## నండూరి 'ఉషస్విని'

శ్రీ నండూరి రామమోహనరావు భావ కవుల కాల్పనికావేశంతో ఉత్తమ భావ గీతాలు రచించి, తర్వాత అభ్యుదయ మార్గంలో నడచి, అతి నవ్య రీతులను పరామర్శించి, 'సరికొత్త పాతపాట' పాడారు. వీరి 'ఉషస్విని'లో భావకవిత్వం ఒక కొత్త సోయగంతో కన్పిస్తుంది. తన పదహారవయేడు ఎలాంటిదో వర్ణిస్తూ శ్రీ నండూరి ''నా కోసమే వెన్నెల కాసేది, పువ్వులు పూసేవి, కోయిలలు కూసేవి. నా కోసమే ఆకాశంలో తెల్లని మబ్బులు తెరచాపలెత్తి చిన్నారి పడవల్లా ప్రయాణం చేసేవి'' అన్నారు. కవితావేశం కలిగినప్పుడు మాత్రమే గీతంరాసి, భావం పూర్తయిపోయినచోట ఆపివేయటం భావ కవులు పాటించిన లక్షణం. ఈ విధమైన క్లుప్తత, ఆత్మాశ్రయ రీతిలో మనోభావాలను వెల్లడించే రీతి రామమోహనరావుగారి కవితలో విశేషంగా తోస్తాయి- 'మలినాత్మ; పిల్లల రాజ్యం; వానవేళ' (ఉషస్విని) మొదలైనవి ఉత్తమ భావ గీతాలు.

## అరిపిరాల నిదుర కన్నెల సౌందర్యం

వచన కవిత్వంలో భావ కవిత్వానికి పుష్టి చేకూర్చిన కవులలో శ్రీ అరిపిరాల విశ్వం ఒకరు. 'రేపటి స్వర్గం, నిదుర కన్నెలు, కాలం గీసిన గీతలు, మనస్ కావ్యాల్లో ఆయన భావ సౌందర్యం గోచరిస్తుంది. 'జీవిత దీపం విరజిమ్మే వెలుగు వెంట వెఱ్ఱిగా పరుగెత్తే మలిసంజ తొలిసంజె ఎరుపులివి' అని తన గీతాలను గురించి శ్రీ విశ్వం భావించారు. తన గీతాలను ''మనసు సందుల మసక మసక జ్ఞాపకాలుగా, మంచి పుష్పొడి గుండె విచ్చిన మందారాలు''గా అభివర్ణించుకొన్న యీ కవి భావన రమ్యమైనది.

భావ కవులు ప్రకృతిలో, ప్రణయంలో దైవత్వాన్ని అన్వేషించి నట్లు శ్రీ విశ్వం కూడ 'మనస్' కావ్యంలో భక్తి భావ భరితమైన ఊహలను వెలువరించారు. "మాకు గురులెవ్వరూ లేరు ఏరు తప్ప" అని తలచిన విశ్వంగారు 'River is my Guru' అనే ఆంగ్ల కావ్యం రచించి అంతర్జాతీయంగా ఒక బహుమతి కూడ పొందారు. అంతర్ముఖు డైన శ్రీ విశ్వం సమ సమాజం రావాలని కోరే కవి. అయితే ఆ సమా జాన్ని ప్రసాదించమని దేవుణ్ణి ప్రార్థించే కవి. దీనులపై కరుణ చూపమని జనులకు బోధిస్తాడుగాని, పీడితులైన ఆ దీనుల్ని తిరుగ బడమని ఎక్కడా చెప్పరు.

ఆత్మాశ్రయమైన, అంతర్ముఖీనమైన భావకవి శ్రీ విశ్వం.

## "విరిని జీల్చి మధువు తాగకుమోయీ" రజనీ గానం

వేంకట పార్వతీశ కవుల వారసత్వాన్ని పుణికి పుచ్చుకొని గాన యోగ్యమైన భావ గీతాలను రచించినవారు శ్రీ బాలాంత్రపు రజనీ కాంతరావు. లలిత కచ్చేరీల్లో, రేడియోలో వినవచ్చే 'శతపత్ర సుందరి'లో గీతాలు భావ కవితా సౌరభాల్ని నింపుకొన్నవి. "మధుపాయి! విరిని జీల్చి/మధువు త్రాగకు మోయి" అని తుమ్మెదను బ్రతిమాలే సున్నిత మనస్కుడు శ్రీ రజని. వాన కోయిల, మయూరి, తుమ్మెద, లేడి, సృష్టిలో అందమైన పశు పక్ష్యాదులన్నీ రజనిగారి పాటల్లో కన్నుల పండువుగా దర్శనమిస్తాయి.

"గడ్డి పువ్వు సుఖము నీకు కలదా మానవుడా?" అని ప్రశ్నించే రజనిగారు సృష్టి సౌందర్యాన్ని ఆరాధన దృష్టితో చూచారు. ఎంకి పాటలు, బసవరాజు గీతాలు, కొనకళ్ల పాటలవలె మనస్సుకు హత్తు కోకపోయినా భావ కవుల తలపులతో రజనిగారి పాటలు వింటున్నంత సేపుహాయిని గొలుపుతాయి. "చల్ల గాలిలో యమునా తటిపై/శ్యామ సుందరుని మురళి"ని విని, వినిపించిన రజనిగారి కవిత్వం మరపురానిది. "నైరిణి అన్నారు నన్ను శ్యామసుందరా!" అని విలపించే రాధ

బేలతనాన్ని రజనిగారు బాగా వ్యక్తం చేశారు. 'ఓహో విభావరీ !/పాట విన్నప్పుడు కలిగే పులకింత రాజేశ్వరరావుగారి గాత్ర మాధుర్యం చేతనే గాక రజనిగారి పలుకుల పొందువలన కూడ వచ్చింది. 'రాదనేయకే తుమ్మెదా!' - పాట ఎపిలో రేపిన రౌచ భావ కవిత్వంలో రజనిగారి శక్తిని వెల్లడిస్తుంది. దేశభక్తి ప్రబోధం భావ కవిత్వంలో ఒక ముఖ్య భాగం. "మాదీ స్వతంత్రదేశం/మాదీ స్వతంత్ర జాతి !" పాటలో రజనిగారు భారతీయులు ఐకమత్యంతో కలిసిమెలిసి వుండాలని కోరారు.

ఇటీవలి కాలంలో భావ కవిత్వానికే పరిమితమై కవిత్వం రచించిన కొద్దిమందిలో శ్రీ రజనీ కాంతరావు ప్రముఖులు.

## మల్లెపూల పరిమళం భగ్గుమని మొహాన కొట్టిన అనుభూతి వజీర్ రహ్మాన్ కవిత్వం

ప్రణయభావనలో తాత్త్వికగాంభీర్యంగల కవిత్వాన్ని శ్రీ వజీర్ రహ్మాన్ రచించారు.'మిస్టిక్'గా ప్రియురాలికై తపించి, ఆమెమోహంలో ఉక్కిరిబిక్కిరై పలవించే కవిత, అలౌకికమైన భక్తిభావాలూ 'ఎచటికి పోతావీరాత్రి'లో కన్పిస్తాయి. "రాత్రిచీకట్లో నిశ్శబ్దంగా సుప్తధరణిని/ రహస్య కామంతో తడిమే వానతుంపరమల్లే / నాగుండెలో/శోకభార/ కన్నీటిధార" (ఎందుకో!) పంక్తుల్లో వజీర్‌గారి భావతీవ్రత పాఠకులను ఆలోచనా మగ్నుల్ని చేస్తుంది.

చలంగారి ప్రభావం శ్రీ వజీర్‌పై గాఢంగా వున్నది. "రాత్రి నిద్రలోమల్లెపూల పరిమళం/ భగ్గుమని/ మొహానకొట్టి/వుక్కిరిబిక్కిరై/ నువ్వే-నిశ్చయంగా నువ్వే-నువ్వే వొచ్చావని/నిలవలేని ఆనందావేశంతో తలుపు తెరిస్తే/దుర్భరశూన్యం" - ఈ భావం, శైలి వెంటనే చలంగారిని గుర్తుకు తెస్తుంది. రవీంద్ర ప్రభావంతో తెలుగు కవులు చాల మంది ప్రియాన్వేషణలో దైవాన్ని సందర్శించ ప్రయత్నించారు. చలంగారు రవీంద్రుని అనుకరించకుండానే ఆ మార్గంలో నడిచారు. వజీర్‌గారూ అంతే. చెలం నీ పాట- యెడతెగని / నిరాశ చీకట్లో/ వాకిలి కానరాక/

శోకభారంతో అరిచే/ శాపోహత భక్తుడి భీతావహతాపం''అన్న నివాళిలో వజీర్‌గారి భక్తిభావం చక్కగా వ్యక్తమైంది.

శ్రీ వజీర్ భావావేశం సహృదయులకు మరపురాదు. రాసింది తక్కువే అయినా ఆధునిక కవులలో వజీర్‌గారి కవితాశక్తి అద్భుతమైనది.

## "నమ్మకం అక్షరమై మెరిసే కవిత"
## కృష్ణకుమారి 'అగ్నిపుత్రి'

భావకవిత్వం ఉజ్వలంగా వెలుగుతున్నప్పుడు కవయిత్రులు చావలి బంగారమ్మ, విశ్వసుందరమ్మ, బసవరాజు రాజ్యలక్ష్మమ్మగారలు, స్త్రీలకు మాత్రమే సాధ్యమైన ఒక సుకుమారమైన పద్ధతిలో ఉత్తమ కవిత్వం రచించారు. స్వాతంత్ర్యానంతరం కవిత్వం రచిస్తున్న కవయిత్రులలో శ్రీమతి నాయని కృష్ణకుమారి గణనీయమైనవారు. ప్రసిద్ధ రచయిత్రి డా. పి. శ్రీదేవిగారు మరణించినప్పుడు కృష్ణకుమారిగారు రచించిన 'ఎలిజీ' మరపురానిది.

'అగ్నిపుత్రి' కావ్య సంకలనం కృష్ణకుమారిగారి భావాల తేనెపట్టు.

"నేను మార్పును ఆహ్వానించే మనిషిని. అయితే మార్పుకోసం ఉగ్రవిప్లవాలను ఆహ్వానించే మనస్సు కలదాన్నికాదు. మార్పు మెల్లిగా అయినాసరే, ఇకరాక/తప్పదన్నట్లుగా, జన జీవితంలోకి చొచ్చుకుని రావాలని కోరుకుంటాను. ....ఎవ్వరినీ లక్ష్యపెట్టకుండ తనపని తాను/ చేసుకుపోయే చతురురాలైన గృహిణిలాంటిది/కాలం. అది మనుష్యుల్ని తనతో లాక్కుపోతుంది'' అని ప్రశాంత విప్లవాన్ని ఆహ్వానించే కవయిత్రి కృష్ణకుమారిగారు. భావకవిత్వంపై ఎంత ప్రగాఢమైన అభిమానం వున్నప్పటికీ సమాజ శ్రేయస్సును ఈమె నిరంతరం వాంఛిస్తారు. "లోకంలో కనబడుతున్న / లోపాలన్నీ గుదులు గుచ్చి/ ఇన్నిటికీ కారణం/ఇంకెవరో లెమ్మన్నానో / నాకవిత్వం నన్ను / చాచి లెంపకాయ కొట్టే/కోపదారి తల్లిలాగా కొరకొర చూస్తుంది.... నన్నూ

ఈ లోకాన్ని ఒక్క క్షణం విడిగా బ్రతకనివ్వదు / ప్రతినీటి కణంలో తోచే ప్రభాకర ప్రతిఫలనంలా / నా కవిత్వమంతటా / నమ్మకం అక్షరమై మెరుస్తుంది'' అని సంకల్పించిన కృష్ణకుమారిగారు బాధ్యత ఎరిగిన కవయిత్రి. భావనలో వ్యక్తీకరణలో కడుస్వతంత్రురాలైన కృష్ణకుమారి గారి కవిత్వం ఆలోచనామృతమైనది.

''నీ నడుమును చుట్టినాను, నింగి కొనలు ముట్టినాను-
బాపురెడ్డి ప్రణయ భావాలు

కవిగా శ్రీ బాపురెడ్డి పద్యంలో, గేయంలో, వచన కవితలో తన కొక బాణీ ఏర్పరచుకున్నారు. కవి చూసిన ప్రదేశాలవర్ణన, దేశాభివృద్ధి ఆయన కవిత్వంలో ప్రాధాన్యం వహిస్తాయి. దేశంసాధించిన అభివృద్ధిని వర్ణిస్తే, ఉడుకురక్తంగల యువకులకు అంతగా నచ్చదు. వీరికవితలో వాచ్యార్థమే ప్రధానమై భావం సులువుగా బోధపడుతుంది.

''విచ్చిన సుమాలు మధువుల వెల్లివిరిసె
భ్రమర యువకాళి ప్రణయ గీతముల కరగి
హెచ్చిన వియోగబాధ నా ఎద రగుల్ప
భావకవిచేసె నన్నొక దేవి మోవి'' (వసంతోదయము)

అని వసంతఋతువును దేవిగా ఆరాధించారు. సాధారణమైన ప్రేమగీతంలాగ కనిపించే ''నీ నడుమును చుట్టినాను/నింగికొనలు ముట్టినాను/ప్రణయ కళాసీమలేలి పంచాస్త్రుని కొట్టినాను'' అనే మాటల్లో అసాధారణమైన ప్రజ్ఞను చూపారు.

'చుక్కల్లో ఉషశ్రీ' గీతంలో కవి తన చిన్నారి ఉషశ్రీ(కుమార్తె) మరణించినప్పుడు,''ఉషోరాగమును/నిశానాగములు/ఓర్వలేక మ్రింగినవి'' అని తీవ్రమైన వేదనను వెల్లడించారు.

''వ్రాయగనె విలాసినులపై గేయములను
కూలిపిల్లను మరచు మూర్ఖుడనుగాను

ప్రకృతి సౌందర్యముల గూర్చి పాడగానె
మానవుని కష్టసుఖములే మరువలేదు''

అని భావకవిత్వాన్ని, అభ్యుదయ కవిత్వాన్ని సమానంగా తలచే బాపురెడ్డిగారు రెండింటా తన ప్రతిభను చూపారు.

శ్రీ బాపురెడ్డి భావన అలౌకికమైనది కాక పోయినా ఆహ్లాద కరమైనది.

## 'మా తెలుగు తల్లికీ మల్లెపూదండ'- సుందరాచారి మధుర గీతం

మహాకవి గురజాడ దేశభక్తి గీతం తర్వాత శ్రీ శంకరంబాడి సుందరాచారి 'మా తెలుగు తల్లికీ మల్లెపూదండ' గీతం మిక్కిలి ప్రజా దరాన్ని పొందింది. భావకవిత్వంలోని దేశభక్తి ప్రబోధమంతా ఒక యెత్తు, 'మా తెలుగు తల్లికి' గీతం ఒకయెత్తు. తెలుగు దేశంలో బాల బాలికలు, యువతీయువకులు, స్త్రీ పురుషులందరూ వయోభేదం లేక, పండిత పామరభేదం లేకుండ యీ గీతాన్ని హృదయాలకు హత్తు కున్నారు.

ఆంధ్ర సంస్కృతీ సారమంతా పొదివి రచించిన యీ గీతం తెలుగువారి అనధికార జాతీయగీతం. ప్రపంచ తెలుగు మహాసభల తర్వాత ప్రజలు మరింతగా యీ గీతాన్ని ఆదరిస్తున్నారు.

''కడుపులో బంగారు - కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు - దొర్లించు మాతల్లి''

అని జన్మభూమిని కీర్తించిన కవి కవిత్వం అజరామరమై నిలుస్తుంది.

''అమరావతీ నగరి - అపురూప శిల్పాలు
త్యాగయ్యగొంతులో - తారాడు నాదాలు

తిక్కయ్య కలములో - తియ్యందనాలు
నిత్యమై నిఖిలమై నిలచి యుండేదాక''-

సుందరాచారిగారి గీతం కూడ త్యాగయ్యవంటి వాగ్గేయ కారుల కోవకు చెందినదే. త్యాగయ్య కాలంలో ఆయన వాణి దేవుడికి అంకిత మయితే యీ కాలానికి తగినట్టు సుందరాచారిగారి గీతం మాతృదేశానికి అంకితమైంది. 'మా చెవులు రింగుమని మారుమ్రోగేదాక' అని కవి పలికినట్లే తెలుగు ప్రజల చెవులు గానామృతంతో తనిసేలాగ మధుర గీతం రచించిన సుందరాచారి గారికి ఆంధ్రదేశం ఋణపడివున్నది.

## మరికొన్ని దేశభక్తి గీతాలు

''శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి రచించిన త్రిలింగదేశం మనదేనోయ్ / తెలుంగులంటే మనమేనోయ్'' అనే గీతం కూడ బాగా ప్రజాదరాన్ని పొందింది. ఇంద్రగంటి వారి ''నాదు జన్మభూమి కంటె నాక మెక్కడుందీ''- 'పూలదోసెళ్ళత్తరా,' 'సృష్టిలో తియ్యనిది స్నేహమేనోయీ' గీతాలు కూడ భావకవితా సంబంధమైన రసరమ్య గీతాలు.

భావకవిత్వాన్ని సజీవంగా నిలిపే కృషి చేస్తున్న వారిలో శ్రీయుతులు ఎల్లోరా (నిశ్శబ్ద సంగీతం, రేపటి వసంతం) బెజవాడ గోపాలరెడ్డి(ఆమె) ఆర్. యన్. సుదర్శనం(నిశాంతం); మాలకొండయ్య మొదలైన వారున్నారు. వీరిలో శ్రీ సుదర్శనం కవిత్వం తాత్త్విక చింతనతో నిగూఢమై ఆలోచనామృతంగా వుంటుంది.

తెలుగుదేశంలో సుందరమైన ప్రకృతి కవులకు ప్రేరణ కలిగిస్తున్నన్నాళ్ళూ, ప్రణయభావనలో నూతన వ్యక్తీకరణ కోసం కవులు ప్రయత్నించినన్నాళ్ళూ, దేశభక్తిని మరువక కవులు జాతిని ఉద్బోధించినన్నిరోజులూ భావకవిత్వం నిత్య నూతనంగా వెలుగొందుతూనే వుంటుంది. దేశకాల పరిస్థితులను గమనించకపోతే భావకవులు పూర్వంలాగే యువతరంచేత తిరస్కరింపబడవలసి వస్తుంది.

ఆ ర వ  అ ధ్యా య ం

# అభ్యుదయ కవిత్వ పరిణామం

కవిత్వం ఆనందాన్నివ్వటంతో పాటు విశ్వశ్రేయాన్ని కలిగించాలని ఆదినుండి కవులూ, కావ్య శాస్త్రవేత్తలూ భావిస్తూ వచ్చారు. వ్యక్తిగతమైన మోక్షప్రాప్తికోసం కవిత్వం రాసినా, కృతిభర్తను మెప్పించటానికి రాసినా, పండిత పరిషత్తుల ఆమోదం పొంది సహృదయుల్ని అలరించడానికి రాసినా, పూర్వకవులు సంఘశ్రేయస్సును విస్మరించలేదు. రామాయణ, భారత, భాగవతాలు చదివి, ఆనందించి, కవితా శిల్పాన్ని మెచ్చుకోలేక పోయినా సామాన్యజనులు సైతం వాటిని పురాణాల ద్వారా కాని, జానపద కళారూపాలలో కాని విని, చూచి ఆనందిస్తూ వచ్చారు. వాటిలో పాత్రలు ప్రజలకు చిరపరిచితంగా కనిపించాయి.

"అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన ప్రబంధంబునకు కథాక్రమం బెట్టిదనిన" అని ప్రారంభించిన కావ్యాల్లో వున్న అభ్యుదయం ప్రజలమేలు కోరినది కాదు. కొందరు కవులు రాజులవిలాసాలతో పాటు వ్యసనాలను కీర్తించే స్థాయికి దిగజారారు. "రాయవేశ్యాభుజంగా" అని కృతిభర్తను సంబోధించే స్థాయికి దిగజారారు. ప్రబంధ కవిత్వం సామాన్యజనులకు దూరంగా వుండిపోయింది. ద్విపద కావ్యాలు, పద కవిత్వము, శతకాలు, యక్షగానాలు ప్రజల సాహిత్యపిపాసను తీర్చాయి. ప్రజాకవి వేమన తెలుగువారి నోళ్ళలో కలకండ పలుకులవలె తన సూక్తులను నిలిపాడు.

శ్రీ వీరేశలింగము పంతులుగారితో ప్రారంభమైన నవ్యయుగంలో సంఘంలో మూఢ విశ్వాసాలను, దురాచారాలను రూపుమాపే కవిత్వం వెలువడింది. వీరేశలింగం, గురజాడ అప్పారావుగారి కావ్యాల్లో సామాజిక శ్రేయస్సే ప్రధాన లక్ష్యం. గురజాడ కవితా శిల్పాన్ని సామాజిక ప్రయోజనాన్ని రెండుకళ్లుగా చేసుకొని భవిష్యత్తులోకి దృష్టిసారించారు.

ఆయన వెన్నంటి వచ్చిన కవులు ఆయనంతటి ముందుచూపు గలవారుకారు.

రాయప్రోలు వారి నేతృత్వంలో రూపుదిద్దుకొన్న భావకవిత్వం స్వేచ్ఛా వాయువుల్ని వీచింది. కొత్తపలుకుబళ్ళకు చోటిచ్చింది. స్త్రీకి గౌరవస్థానం కల్పించింది. ఆత్మాశ్రయమైన భావకవిత్వంలో వ్యక్తివాదానికి ప్రాముఖ్యం వచ్చింది. సాహిత్యంలో వ్యక్తివాదానికి ప్రాధాన్యమివ్వటం ఆరోగ్యకరంకాదు. ఈఅంశంపైన చర్చచేస్తూ Christopher Caudwell - "Bourgeois culture is the culture of a class to whom freedom - man's realisation of all his instinctive powers - is secured by individualism" అన్నాడు.[1] బూర్జువా సంస్కృతి స్వేచ్ఛయే సర్వస్వమని భావించటంలో తప్పులేదు. కాని అది సమాజస్వేచ్ఛకాక వ్యక్తిస్వేచ్ఛ అయినప్పుడే హానికరం. ఆత్మాశ్రయరీతిలో రానేకవులు కోరేస్వేచ్ఛ మిథ్యమాత్రమే. "The bourgeois sees himself as an heroic figure fighting a lone fight for freedom-as the individualist battling against all the social relations which falter the natural man who is born free and is for some strange reason everywhere in chains" అని Caudwell బూర్జువా కవులు స్వేచ్ఛకై పోరాడు తున్నామనుకొనే భ్రమలను వివరించారు.[2] వ్యక్తి స్వేచ్ఛవలన సామాజిక రుగ్మతలు తొలగిపోవు. వ్యక్తి ప్రధానమైన వాదమొక వంక, సంఘ ప్రధానమైన వాదం మరొకపక్క నిరంతర సంఘర్షణతో అపూర్వ కావ్య సృష్టికి కారణమయ్యాయి. సామాన్య మానవుని అనునిత్యం వేధిస్తున్న ఆకలి,

---

1. Christopher Caudwell - 'Development of Modern Poetry' - Illusion And Reality - People's publishing House - New Delhi - page-53 - 1978.
2. Christopher Caudwell - 'Development of Modern Poetry' - Illusion And Reality - people's Publishing House - New Delhi - page-53 - 1978.

నిరుద్యోగం మొదలైన సమస్యల కొక వ్యక్తీకరణ అవసరమైంది. ఈ దృష్ట్యా వ్యక్తి ప్రధానవాదులు సంతృప్తి కలిగించలేక పోయారు. వాస్తవికవాదం కవిత్వంలో ప్రవేశించింది. మానవుణ్ణి కలవరపెట్టే ప్రతి విషయం వాస్తవిక వాదులకు కవితావస్తువైంది.

ఒకే వస్తువును సందర్శించిన భావకవు లోకపద్ధతిని, వాస్తవిక వాదు లోక పద్ధతిని అవలంబించి తమ భావాలను అభివ్యక్తం చేశారు. "ఆకాశంలో నక్షత్రాలను శ్రీకృష్ణశాస్త్రి "నింగి మూలల/నీలి పందిళ్లపై చి వింత చిరుమల్లెతోట/వేయించినాను" అని వర్ణిస్తే, శ్రీనారాయణబాబు "నల్లని త్రాచుకోరలు/తెల్లని మశూచికుండలు/గగనమ్మున చుక్కలు" అని వర్ణించారు. రెండిటికీ వున్న భేదం స్పష్టమే, 1930 తర్వాత వచ్చిన గడ్డు రోజుల్లో వాస్తవికవాదం అవసరమైంది. వ్యక్తిస్వేచ్ఛ హేళనకు గురియైంది. ఈ సంగతిని ప్రస్తావిస్తూ లెనిన్ మహాశయుడు "The freedom of the bourgeois writer, artist or actress is simply masked (or hypocritically masked dependence on the money - bag, or corruption, or prostitution అన్నారు.[3]

1920 తర్వాత జాతీయ భావ ప్రేరణతో సంఘంలో అట్టడుగున వున్న దీన జనులస్థితి బాగుపడాలని కోరుతూ, తెలుగుజాతి మహేతిహాస మనదగిన ఉన్నవ వారి నవల 'మాలపల్లి' వచ్చింది. స్వాతంత్ర్య సంగ్రామంలో మట్టి బొమ్మలను మహావీరులుగా నడిపించిన గరిమెళ్ళ వారి గీతాలు వచ్చాయి. తరగా పుండరీకాక్షుడుగారి జాతీయభావ ప్రచార నాటకాలు వచ్చాయి. వీటన్నిటినీ బ్రిటిషు ప్రభుత్వం నిషేధించింది. మాలపల్లి నవలలో 'తక్కెళ్ళ జగ్గని ధర్మబోధ' బంకించంద్రుని 'ఆనంద మఠం'లో 'వందే మాతరమ్' గీతంవలె ఉత్తేజకరమైనది. 'తక్కెళ్ళజగ్గని వాఙ్మూలం మాక్సిమ్‌గోర్కీ నవల 'అమ్మ' ను జ్ఞాపకం చేస్తుంది.

3. Lenin - 'Party organisation and party Literature'- 'on Literature and Art' - Progress publishers-Moscow-1975.

"We must make labour the Principal hero of our books, i. e. man as organized by labour process" అనిమాక్సింగోర్కీ చెప్పకముందే,[4] ఉన్నవవారు మార్క్సును అనుసరించి "పనివాండ్లందరు యేక మయితిరా-ప్రపంచమే మీది!" అని మాలపల్లిలో వ్రాశారు. ఉన్నవవారు ప్రజలకు బోధించిన విషయాలు, వారికి సన్నిహిత మైన జానపద కళారూపాలలో అందించారు. "రైతు కూలీల సమస్యల గురించి ఆలోచించేవారు, పీడితజనులపక్షన నిలువదలచినవారు మాలపల్లిని తమ మేనిఫెస్టోగా ఎంచుకున్నారు."[5]

1930 తర్వాత ప్రపంచ మంతటా ఆర్థిక మాంద్యం అలము కొన్నది. మధ్యతరగతి పేదప్రజల జీవితం దుర్భరం కాజొచ్చింది. ఒక నాడు రసస్ఫూర్తిని కలిగించిన మాటలే తియ్యనై, అతితియ్యనై వెగటు కలిగించాయి.

ప్రపంచదేశాల్లో పరిస్థితులు వడివడిగా, ఆందోళనా భరితంగా మారిపోతున్నాయి. జర్మనీలో ఫాసిజం నెలకొన్నది. ఫ్రాన్సులో ఇంచు మించు అదే పరిస్థితి. మేధావులు దిగజారిపోతున్న పరిస్థితుల పట్ల ఆందోళనతో నిస్పృహచెందుతున్నారు. దేశదేశాల కళారంగాల్లో అలజడి, అవ్యవస్థ ప్రతిబింబించాయి. కొత్తకొత్త ఉద్యమాలు వేళ్లదన్ని నీటి మొక్కల్లాగ అందంగా తామర తంపరగా తేలి ఆకర్షిస్తున్నాయి.

మొదటి ప్రపంచయుద్ధానంతరం విలువలు తారుమారై యూరప్ దేశాల్లో నూతన ఉద్యమాలు ప్రారంభమైనాయి. ఫ్రాన్సులో క్యూబిజం, ఇటలీలో ఫ్యూచరిజమ్, జర్మనీలో ఎక్స్ప్రెషనిజమ్, అమెరికాలో ఇమే

4. Maxim Gorky-Address Delivered to the First All Union Congress of soviet writers, August,17,1934 'on Literature' - progress Publishers-Moscow.

5. తుమ్మల వెంకట రామయ్య - అభ్యుదయ కవిత్వం - ఆంధ్రప్రదేశ్‌దర్శిని, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,

జిజమ్ బయలు దేరాయి. ఫ్రాన్సులో బయలు దేరిన డాడాయిజమ్ సకల విలువల్ని ధ్వంసం చెయ్యటమే పనిగా పెట్టుకున్నది. దీనిలో నుండి "సుతీక్ష్ణ తేజస్సుతో బయలు దేరిన మహోద్యమం సర్రియలిజమ్". చిత్రకళలో, శిల్పంలో, ఫోటోగ్రఫీలో బయలుదేరిన యీ కొత్త ఉద్యమాలు కవితారంగంలో శక్తిమంతంగా ముందుకు సాగాయి.

ఆకలి బాధతో ప్రజలు అలమటించి పోతున్నప్పుడు, తెలుగు దేశంలో ఊహాప్రేయసికోసం ప్రణయ గీతాలు ఆలపిస్తున్న కవులు యువతరానికి నేరస్థుల్లాగ కన్పించసాగారు. భారతదేశంలో 'టెర్రరిస్టు' రాజకీయోద్యమంలో ప్రాణాలను త్యాగంచేసిన, చేస్తున్న వీరుల జీవితాలు కొందరు యువకవులకు కావ్యవస్తువులైనాయి. శ్రీరంగం నారాయణబాబు గారి 'కపాలమోక్షం': 'భగత్‌సింగ్ శాపము': నయాగరా కవుల 'భగత్సింగ్'; 'అల్లూరి సీతారామరాజు' గీతాలు ఆనాటి కవుల మనస్థితిని వెల్లడిస్తాయి.

శ్రీ తాపీ ధర్మారావు మొట్టమొదట గ్రాంథిక భాషావాదులై, వ్యావహారిక భాషావాదాన్ని వ్యతిరేకించి, కాలక్రమాన మనస్సు మార్చుకొని అభ్యుదయ భావాలను ప్రచారం చేశారు. 'జనవాణి' పత్రికలో వాడుక భాషలో మొట్టమొదటిసారిగా సంపాదకీయం రాశారు. వాడుక భాషకు అడ్డుగా నిలిచిన చిన్నయసూరి బాలవ్యాకరణాన్ని దుయ్యబట్టారు.

"చదివిన విన్నా జనులకందరికి/చక్కగ తెలిసితె వ్రాతా
మెదడు చించుకొని నిఘంటులన్నీ/వెదికించిందే రోతా"

అని భాషలో సులభశైలిని సమర్థించారు. "కాలము మారిన, దేశము మారినా- ఇంకా పాడిన పాటేనా? పాత పాటయేనా?" అని కవులను కొత్త భావాలను స్వీకరించవలసిందిగా కోరారు. "కప్పులేని వేయి గుడిసెలు కలగబట్టేనోయ్/గొప్పవారి మేడొక్కటి కులుకుతుంటాది" అని గొప్ప కవులు చెప్పని కిటుకును చెప్పారు. ప్రాచీన కవిత్వాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసిన తాపీ ధర్మారావుగారి అండదండలు అభ్యుదయ కవులకు నైతిక బలాన్ని సమకూర్చాయి.

విశ్వనాథ, కృష్ణశాస్త్రిగారల కవితా ముద్రనుండి బయటపడి శ్రీశ్రీ 1929 లో 'సుప్తాస్థికలు' గీతం రాశారు. ఆధునికభావ చేతనతో ఛందోబంధాలను విదలించుకుని వచ్చిన యీ గీతంలో అభ్యుదయ కవిత్వానికి అంకురార్పణ జరిగిందని చెప్పవచ్చు. 1933 లో శ్రీశ్రీ రచించిన 'జయభేరి' – "నేను సైతం/ప్రపంచాగ్నికి సమిధ నొక్కటి/ఆహుతిచ్చాను" అనేది అభ్యుదయ కవిత్వానికి నూతన కవాటాలు తెరిచింది. ఆంగ్ల సాహిత్యంలో New Signatures (1932), ఫ్రెంచి జాతీయ గీతం, హరీన్‌చటోపాధ్యాయ 'షురూహువాహై జంగ్' గీతం, నజ్రుల్ ఇస్లాం విప్లవగీతాలు, ఎడ్గార్ ఏలన్‌పో, గురజాడ, కవికొండల గేయాలు మహాప్రస్థాన గేయానికి మార్గదర్శకమయ్యాయని శ్రీశ్రీ చెప్పుకున్నారు. ఆదిశంకరుల 'భజగోవిందమ్' తన 'మరోప్రపంచం' గీతం నడకకు తోడ్పడిందని కూడ ఆయన తెలిపారు.

ఆంధ్రదేశంలో జమీందారులు, భూస్వాములు పేదరైతులను కూలీలను పీడించటాన్ని సహించలేక జమీందారీ వ్యతిరేకోద్యమం వచ్చింది. ఆ కాలంలో రైతు కూలీలను ప్రబోధించే కవితలు విరివిగా వచ్చాయి. అభ్యుదయ సాహిత్యాన్ని ఆరంభం నుండీ గమనిస్తూ వచ్చిన శ్రీ తుమ్మల వెంకటరామయ్య రైతు కూలీలకు సంబంధించిన కవిత్వం వెలువడిన కాలక్రమాన్ని యీ క్రింది విధంగా వివరించారు.[6]

"శ్రీశ్రీ గారి మహాప్రస్థాన గేయం 12-4-34 లో వెలువడింది. ఆచార్య గోగినేని రంగనాయకులు గారి సంపాదకత్వంలో 'రైతు భజనావళి' 22-4-34 లో వెలువడింది. 'రాగిదమ్మిడి రత్నమాయెను' అనే శీర్షికతో విద్వాన్ విశ్వంగారు రైతుదైన్యాన్ని చిత్రిస్తూ "వెలలుబొత్తిగ కూలిపోయెను, కాసుయొక్కటి కానరాదుగ, రాగిదమ్మిడి రత్నమాయెను" అని ఆనాటి ఆర్థిక సంక్షోభాన్ని కళ్లకు కట్టించారు. శ్రీ తుమ్మల సీతారామమూర్తి "ధరలు పడియె, సేద్యంబు తక్కువాయె,

6. తుమ్మల వెంకటరామయ్య – 'అభ్యుదయ కవిత్వం' వ్యాసం – ఆంధ్రప్రదేశ్ దర్శిని – విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్.

శిస్తుమెండాయె'' అని రైతు దుస్థితికి ఆవేదన వెలిబుచ్చారు. రైతుకు పాలేరును మించిన ఆత్మబంధువు లేడని శ్రీ తుమ్మల హెచ్చరించారు. శెట్టిపల్లి వెంకటరత్నం; గిరిరాజు రామారావుగార్ల ''అగునా జీవాలు, సాగునా లోకాలు''; కుసుమ ధర్మన్నగారి హరిజన శతకము; నెల్లూరి వేంకట రామానాయుడిగారి ''మాకొద్దీ జమీందార్ల పొందు'' మొదలైనవి రైతు భజనావళిలో చోటు చేసుకున్నాయి. 1935 లో గద్దె లింగయ్య గారి సంపాదకత్వాన వెలువడిన పక్షపత్రిక 'ప్రభ'లో వాసిరెడ్డి నాగేశ్వర రావు అనే రైల్వే కార్మికుడు రాసిన 'కూలోడ'; పెండ్యాల లోకనాథం గారి 'కూలీలందరు ఏకమైతిరా, కూటికి తరుగేమిరా'; బాలాంత్రపు నళినీ కాంతరావుగారు అనువదించిన ''ఆకలి మంటచే మలమలమాడే అనాధ లందరు లేవండోయ్'' ప్రచురింపబడి విశేషాదరం పొందాయి. ''మాకొద్దీ తెల్లదొరతనము, అన్యాయ కాలంబు దాపురించిందిపుడు'' అనే గరిమెళ్ల వారి గేయాలు యీ కాలంలోవే. సంప్రదాయంపై తిరుగుబాటు, కుల మత వ్యవస్థపై దాడి, హేతువాద దృష్టి యీ కాలపు కవిత్వంలో కనపడ సాగాయి. త్రిపురనేని వారి 'సూతపురాణము, ఖూనీ, శంబుకవధ' హేతువాద దృష్టిని పెంపొందించాయి. శ్రీ నార్ల ''సర్వసముడయ్యే సర్వేశుడుంచే/కొందరు కోట్లతో కులుకగనేల?/ఎందరో కూటికి కుందగ నేలా'' అనే పాట మతంపై తిరుగుబాటు ప్రకటించింది. పింగళి నాగేంద్ర రావు, పురిపండా అప్పలస్వామి గారల కవితలు కూడా మతంపై, గుళ్లో బందీ అయిన దైవంపై ధ్వజమెత్తాయి.''

శ్రీ తెన్నేటి సూరి 'కీలుగుఱ్ఱం'లో-

''కీలుగుఱ్ఱము మీద/బాలీసునానుకొని/ప్రాణాలు లేనట్టి
భగవంతుడొచ్చాడు
ఊరంత ఊరేగుతూ /ఉత్సవము సాగించుతూ / కూలి
మాటడగండిరా-అన్నాలు / చాలవని చెప్పండిరా
కంచు గుండెకు గూడ / కనికరము కలదన్న / మాయ
సిద్ధాంతాల / మూటేటొ సూడాలి

జాలిగిలబడి మ్రొక్కరా - వినకుంటె / చెవిటి మొద్దని వీడరా
కోటి చేతులుసాచి / కంచు గుండెలు కరుగ / కూలి
మాటడగండిరా-అన్నాలు చాలవని చెప్పండిరా"

గేయం మానవత్వపు విలువల్ని ఎలుగెత్తి చాటించింది.

భావకవుల కవితా సామగ్రి ఆకలితరం యువకులకు నచ్చలేదు. 1938లో శ్రీ'పఠాభి' కలకత్తాలో చదువుకుంటున్నప్పుడు - ఆ నగరంలో విలయతాండవం చేస్తున్న ఆకలి, దారిద్ర్యం, విలువలు కోల్పోతున్న మనుష్యుల్ని కళ్ళారా చూచినప్పుడు - ఆయనకు రవీంద్రుని సౌందర్య భావనా, భావకవుల తియ్యని తలపులూ అర్థరహితంగా తోచాయి. పాత విలువల్ని ధ్వంసంచేస్తూ ఆయన 'ఫిడేలు రాగాలడజన్'రాశారు. ఆ కొత్త దనాన్ని ఆహ్వానిస్తూ శ్రీ శ్రీ ఇంట్రో రాశారు.

1939లో రెండవ ప్రపంచ యుద్ధం వచ్చింది. దిగజారి పోతున్న పరిస్థితులు మరింత దిగజారి సామాన్యుని జీవితం మరింత దుర్భరమైంది. ఈ సంక్షోభ వాతావరణంలో కలంపట్టిన అభ్యుదయ కవులకు కావ్య వస్తువులు, భావప్రకటన, పదబంధాలు, అన్నీ నూతనమైనవే లభించాయి.

లండన్‌లో భారతీయ రచయితలు, మేధావులు మార్క్సిజాన్ని అధ్యయనం చేయసాగారు. 'ఇండియన్ ప్రోగ్రెసివ్ రైటర్స్ అసో సియేషన్' స్థాపించారు. పారిస్‌లో అంతర్జాతీయ అభ్యుదయ సాహిత్య కేంద్రం నెలకొల్పబడింది, 1935లో భారత అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడింది. 1936 ఏప్రిల్‌లో లక్నోలో ప్రేమచంద్ అధ్యక్షతన ప్రథమ మహాసభ జరిగింది. ఈ సంఘంలో సజ్జాద్‌జహీర్, ముల్కరాజ్ ఆనంద్, కైఫీ ఆజ్మీ, కె. ఏ. అబ్బాస్ మొదలైన ప్రసిద్ధ రచయితలు సభ్యులు. 1943 నాటికిగాని అభ్యుదయ రచయితల సంఘం తెలుగు నాట కాలూనలేదు. ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం శ్రీ తాపీ ధర్మా రావు అధ్యక్షతన తెనాలిలో ప్రథమ మహాసభ జరుపుకొన్నది.

"అభ్యుదయ రచయితల సంఘం రాజకీయ సంఘంకాదు. కాని రాజకీయాలను స్పృశించడమే మహాపరాధంగా భావించదు" అని తన ప్రణాళికలో స్పష్టం చేసింది. సంఘమైతే 1943లో ఏర్పడిందిగాని శ్రీ శ్రీ 'సుప్తాస్థికలు' రచించిన (1929)నాటినుండి అభ్యుదయ కవిత్వం ప్రారంభ మైంది. తొలిదశలో ఛందస్సుపైన కవులు తిరుగుబాటు ప్రకటించారు, భావకవిత్వాన్ని నిరసించారు; కొత్తదనం కోసం అఱ్ఱులుచాచారు. నిషిద్ధ మని పూర్వకవులు కావ్యవస్తువులుగా స్వీకరించని అంశాలను తీసు కున్నారు. ప్రమాద ప్రాంతాలలో సంచరించారు. కొత్తదనంకోసం అనేక ప్రయోగాలు చేశారు. క్లుప్తంగా దీన్ని 'ప్రయోగదశ' అని చెప్పవచ్చు. ఈ తొలితరం అభ్యుదయ కవులలో శిష్ట్లా ఉమామహేశ, శ్రీశ్రీ, నారాయణబాబు, ముద్దుకృష్ణ, జలసూత్రం, పాలగుమ్మి పద్మరాజు, పఠాభి, దేశిరాజు కృష్ణశర్మ, పురిపండా ప్రముఖులు చెప్పదగినవారు. ఆనాటి యీ కొత్త కవిత్వానికి మార్క్సిజమ్ పునాది అని చెప్పలేము. శ్రీశ్రీ మరోప్రపంచం, దేశచరిత్రలు, మహాప్రస్థానం మొదలైన గీతాలు రచించాక కొత్తతరం కవులకు నాయకుడైనాడు. మహా ప్రస్థానంలో గీతాలు పుస్తకరూపంలో రాకముందే కవులను అపరిమితంగా ఆకర్షించి, శ్రీశ్రీ మార్గంలో రచనలు చేసేలాగ ప్రేరణ కలిగించాయి. ముద్దుకృష్ణ గారి 'జ్వాల', కొంపెల్ల జనార్దన రావుగారి 'ఉదయిని', తాపీధర్మారావు గారి 'కాగడా', పాటిబండ మాధవశర్మగారి 'వీణ', నవ్యసాహిత్యపరిషత్తు వారి 'ప్రతిభ' పత్రికలు కొత్త కవిత్వాన్ని బాగా ఆదరించాయి.

అభ్యుదయ రచయితలసంఘం స్థాపితమైన తర్వాత "ఏది అభ్యుదయ రచన?" అన్న చర్చ మొదలైంది. "అభ్యుదయ రచన సమకాలికమైన జీవిత పరిస్థితులకు, రాజకీయ వాతావరణానికి, ఆర్థిక సమస్యలకు, సమాజ సంఘర్షణలకు, నైతిక సందర్భాలకు ఐహిక ఆముష్మిక సిద్ధాంతాలకు వైజ్ఞానికవిశేషాల కనుగుణ్యంగా, అనుకూలంగా తగినట్టి, అవసరమైనట్టి మార్పులతో విలసిల్లవలెను" అని పి.వి. రాజ మన్నారు గారు తలచారు.[7]

7. అభ్యుదయ కవిత్వము - పి.వి. రాజమన్నారు-1947 మార్చి-'అభ్యుదయ'

"పీడింపబడేవాళ్ళు, పీడించేవాళ్ళు వున్న యీ వర్గ సమాజం ఉండాలని ఎవరూ కోరరు. రానున్న విధానంలో సాధారణ మానవుడే మకుటధారి. పురోగమిస్తున్న లోకాన్ని ప్రతిఘటించేవారు ఎప్పుడూ అభ్యుదయవాదులు కాజాలరు. ఈ ధనిక సమాజం పోవాలను కోవటమే అభ్యుదయం. ఇది మనసులో పెట్టుకొని వ్రాసేది అభ్యుదయ రచన" అని కృష్ణశాస్త్రిగారు భావించారు.[8]

కవిత్వంలో అభ్యుదయమంటే ఏమిటో వివరిస్తూ శ్రీశ్రీ గారు "అభ్యుదయ రచయితలుతెచ్చిన విప్లవం రసావిష్కరణకు రసాస్వాదనకు సంబంధించినది. సాహిత్యం ఒక భోగ వస్తువుగా పరిగణించే దృక్పథం మీద వీరు తిరుగబడుతున్నారు. నేటి రచయితకు ప్రజలే ప్రమాణము. కొన్ని కారణాలవల్ల సాహిత్యానికి దూరమై పోయిన ప్రజల జీవితాలను మళ్ళీ సారస్వతోన్ముఖంగా తిప్పటానికి నేటిరచయితలు పాటుపడుతున్నా" రన్నారు.[9]

అభ్యుదయ కవిత్వం రెండు దశాబ్దాలపాటు (1935-55) తెలుగు సాహిత్యాన్ని సంపన్నం చేసింది. సంఘం ఏర్పడిన తర్వాత ఒకదశాబ్దం అభ్యుదయ కవిత్వం ఉద్యమవేగాన్ని అందుకొని తెలుగునేల నాలుగు చెరగులా సాహిత్యవ్యాప్తికి, సామాన్యుని జీవితపు స్థితిగతుల్ని బాగు పరచటంలో ప్రజల్ని చైతన్యవంతుల్ని చెయ్యటానికి కృషి చేసింది. యువ రచయితలకోసం 'పెదపూడి' (గుంటూరుజిల్లా)లో సాహిత్య పాఠ శాల నిర్వహించింది. స్వాతంత్ర్యం వచ్చేనాటికి మనదేశంలో నూటికి పదిహేనుమంది కన్న అక్షరాస్యులు ఎక్కువలేరు. దువ్వూరి రామిరెడ్డి, త్రిపురనేని, జాషువా, తుమ్మల, వేదుల, కృష్ణశాస్త్రి మొదలైనవారు ఛందో బద్ధమైన రచనలో అభ్యుదయ భావాలను వెదజల్లారు. కాని అభ్యుదయ రచయితలు వచన కవిత్వాన్ని ప్రధానంగా స్వీకరించారు. నిరక్షరాస్యులైన

8 తృతీయ అభ్యుదయ రచయితల మహాసభ- అధ్యక్షోపన్యాసము-దేవులపల్లి కృష్ణశాస్త్రి - 1946 మార్చి-తెలుగుతల్లి.

9. 'అభ్యుదయ రచయిత - విప్లవదృష్టి' - 1946. మార్చి - తెలుగుతల్లి.

ప్రజలను చైతన్య వంతుల్ని చెయ్యటానికి 'ప్రజా నాట్యమండలి'ఏర్పడి అభ్యుదయ రచయితల సంఘంతో కలిసి పనిచేసింది. డా. రాజారావుగారి నేతృత్వంలో సుంకర-వాసిరెడ్డిగారల 'మాభూమి; ముందడుగు' నాటకాలు విజయవంతంగా ప్రదర్శింపబడి లక్షలాది మంది ప్రజలు తమ దుస్థితిని గురించి తెలుసుకున్నారు. లక్ష్మీకాంతమోహన్, నాజర్ గారల బుఱ్ఱకథలు, ఆత్రేయగారి నాటకాలు రాజకీయ చైతన్యాన్ని కలిగించాయి. ఉప్పల లక్ష్మణరావుగారి 'అతడు-ఆమె' నవల,కొడవటిగంటి వారికథలు,నవలలు, వ్యాసాలు, కరుణకుమార, మా గోఖలే కథలు అభ్యుదయోద్యమానికి పుష్టిని చేకూర్చాయి. 'అభ్యుదయ, తెలుగుతల్లి, ప్రజాశక్తి, సందేశం' పత్రికలు అభ్యుదయరచనల ప్రచారానికి బాగాతోడ్పడ్డాయి. తెలంగాణలో ఆళ్వారుస్వామిగారి 'ప్రజల మనిషి' నవల రాజకీయ సాంఘిక చైతన్యానికి తోడ్పడింది.

సామాన్య ప్రజలు మెచ్చని సాహిత్యం వ్యర్థమనే వాదం తల యెత్తింది. "కళను కాని, కవిత్వాన్నికాని సమాజాన్నుంచి విడదీసి విమర్శించి ఇదమిత్థమని తేల్చుకోవటానికి వీల్లేదు. ఒకవేళ విడదీస్తే అగమ్య గోచరమౌతుంది. మారకంలేని కరెన్సీనోటు గతిపడుతుంది."[10] గత మెంత మంచిదైనా రచయితలకు వర్తమానంతోనే పని; సమకాలిక యథార్థ దృశ్యాలను పట్టించుకోని కవి కవికాదని భావించసాగారు. "In bourgeois society... the past dominates the present, in Communist society the present dominates the past" అని కమ్యూనిస్టు మానిఫెస్టోలో చెప్పిన మాటలు రచయితలు గాఢంగా విశ్వసించసాగారు.[11] కులము, మతమూ, జాతుల సరిహద్దులు తొలగి పోవాలని తలచారు. "The worknig men have no country" అని కమ్యూనిస్టు మానిఫెస్టో చెప్పినమాటను శిరోధార్యంగా తలచారు.[12]

10. జి. వి. కృష్ణారావు - కావ్యజగత్తు - ప్రజాప్రచురణలు - ఏలూరు - చతుర్థ ముద్రణ - 1963

11, 12. Manifesto of the Communist party-K.Marx and F.Engels - Progress publishers - Moscow.

అభ్యుదయ రచయితలసంఘంలో సభ్యులు మార్క్సిస్టుతత్త్వాన్ని గాఢంగా నమ్మినవారైనా, తమ సంఘంలో ఇతరులను చేర్చుకోవటానికి అభ్యంతరం తెలుపలేదు. ప్రజలు తమ పాతకవిత్వాన్ని ఆదరించరన్న భయంతో కొందరు కవులు, పండితులు అభ్యుదయ భావాలపై నమ్మకం లేక పోయినా యీ సంఘంలో చేరారు. వీరి ప్రవేశం యీ సంఘానికి హాని చేసింది.

తెలంగాణ విముక్తి పోరాట సమయంలో భారత ప్రభుత్వం కమ్యూనిస్టుపార్టీని నిషేధించింది. పోరాటాన్ని కొనసాగించలేక కమ్యూనిస్టు పార్టీ పోరాటాన్ని నిలిపివేసింది. అంతవరకు ప్రజాస్వామ్య పద్ధతి ఎన్నికల్లో విశ్వాసం చూపని కమ్యూనిస్టు నాయకులు ఎన్నికల ద్వారా కమ్యూనిజాన్ని యీదేశంలో స్థాపించగలమని తలచారు. 1952 సాధారణ ఎన్నికలలో తాత్కాలిక విజయం పొందినా, 1955 నాటికి కమ్యూనిస్టుపార్టీ ఎన్నికల్లో పరాజయం పొందింది. జీవిత పోరాటంలో అలసి పోయిన అభ్యుదయ కవులు జీవికకై వివిధ వృత్తులను ఆశ్రయించారు. కొందరు సినిమా రంగానికి తరలారు. అభ్యుదయోద్యమం నిర్వీర్యమైపోయింది. 1943 తర్వాత అభ్యుదయ కవులుగా ప్రసిద్ధి వహించినకవులు తెలుగు సాహిత్యానికి చేసినసేవను గురించి యీ అధ్యాయంలో పరిశీలిద్దాం. ఏ ఉద్యమానికైనా వృద్ధీ, క్షయమూ తప్పవు. అభ్యుదయోద్యమంలో కృషిచేసిన కవులు సాధించిన విజయాలను ఓటమిని, చూద్దాం.

## శ్రీశ్రీ అభ్యుదయ ప్రస్థానం

1930 దాకా ఈ శతాబ్దం తనను నడిపిస్తే ఆ తర్వాత తానే యీ శతాబ్దాన్ని నడిపిస్తున్నానని శ్రీశ్రీ గారు ఆత్మ విశ్వాసాన్ని వెలిబుచ్చారు 'మహాప్రస్థానం'లో గీతాలు ఇంచుమించు అన్నీ 1930-40 సంవత్సరాల మధ్య రచింపబడినవే. 'గర్జించు రష్యా, నిజంగానే, నీడలు' మాత్రం తర్వాత రచించినవి. చాల మంది రచయితలు గోగోల్ 'ఓవర్ కోట్' లోనుంచి పుట్టినవాళ్ళే అని రష్యాలో సూక్తి వొకటుంది.

స్వాతంత్ర్యానంతరం అభ్యుదయ కవులుగా ప్రసిద్ధి కెక్కిన చాల మంది 'మహాప్రస్థానంలో' నుండి పుట్టినవాళ్ళే.

'ఖడ్గసృష్టి' గీతాలు మహాప్రస్థానంలో వాటికి భిన్నమైన రీతిలో, విభిన్న జీవిత దృక్పథాల కలయికగా వుండటంచేత పాఠకులు చాలమంది వాటిని మహాప్రస్థానంతోపోల్చి, మహాకవి శక్తి సన్నగిలి పోయినట్లు అభిప్రాయపడ్డారు. దేశకాల పరిస్థితులు నాటికీ, నేటికీ మార్పు చెందిన వాస్తవాన్ని వీరు గమనించటంలేదు. దేశదేశాల కవుల కవితలను తెలుగు వారికి రుచిచూపిన శ్రీశ్రీ కృషిని విస్మరించకూడదు. నూతన ప్రయోగాలను అర్థం చేసుకోలేక వాటిని పిల్లిమొగ్గలకింద, శబ్ద చమత్కారాల కింద జమకట్టకూడదు. అధివాస్తవికత (Surrealism) ను అర్థం చేసుకునేటంతగా ఆంధ్ర పాఠకులు ఎదగలేదు.

శ్రీశ్రీ నిత్యహరితమైన వృక్షం. జీవనది. కాలంతోపాటు కదలి వచ్చిన కవి మాత్రమేకాదు- కాలానికి ముందుండి, క్రాంతదర్శియై జాతిని ముందుకు నడిపించిన కవి. తర్వాత వచ్చిన కవులకు ఆయన ప్రభావం నుండి తప్పించుకోవటం చాల కష్టమైంది. "ఈనాటి కవిత్వమంతా ఏమిటి ? ఎందుకు వుంది ? ఏం చేస్తోంది ? అని ధిక్కరించి అడిగే తెలుగు ప్రజకు శ్రీశ్రీ కవిత్వం ప్రత్యుత్తరం. కొద్దిరోజుల్లో నేడు విర్రవీగే కవులు ప్రతివొక్కరూ శ్రీశ్రీ నీడకింద నించుని తన ఉనికిని సమర్థించుకోవలసిన గతివొస్తుంది" అని చలంగారు 'యోగ్యతాపత్రం'లో హెచ్చరించారు.[13] ఆ కాలం తొందరలోనే వచ్చేసింది. 1947 - 1955 సంవత్సరాల మధ్య వెలువడిన అభ్యుదయ కవుల కవితా సంకలనాలను పరిశీలిస్తే శ్రీశ్రీ ప్రభావానికి లోనుగాని అభ్యుదయ కవి కన్పించడు. కొందరైతే కేవలం శ్రీశ్రీ ప్రతిధ్వనులే.

"Sigmund Freud, Harold Lloyd
Albert Einstein, Jacob Epstein
హరీన్‌చట్టో, గిరాంమూర్తి
ఇటీవల మా inspiration" (రుబాయత్)

---

13. యోగ్యతాపత్రం - చలం - మహాప్రస్థానం - 1950.

అని భావకవులు విస్తుపోయేలాగ కవిత్వసీమను విశాలతరం చేసి, శ్రీశ్రీ కవులకు అంతర్జాతీయ దృష్టిని కలిగించారు. భావకవులు కలలు గంటున్న విశ్వమానవ దృష్టికి, శ్రీశ్రీగారు చూపించిన అంతర్జాతీయ దృష్టికీ కలకూ వాస్తవానికీ మధ్య వున్నంత వ్యత్యాసం వున్నది.

"కాకికేమి తెలుసు Psycho analysis ?
ఆటవెలది ద్విపదకర్తగారు
5, 3, 2; ఆముక్తమాల్యద
విశ్వదాభిరామ వినురవేమ" (De-Compositions)

ఇటువంటి అధివాస్తవికత రచనలు ఆనాటి పాఠకులకేకాక కవులకు కూడ గాభరా పుట్టించాయి. కవిత్వంలో నియమాల కోసం వెదికే వారిని "ఛందోబందోబస్తులన్ని/ఛట్‌ఫట్ ఫట్‌మని త్రెంచి/Damn it! ఏమిట్రా ? ఇదంటే Pray! It's Poetry అందాం" అని అర్థాన్ని అధ్వాన్నపు అడవిలో వదిలి, గద్యానికి పద్యానికి పెళ్ళి చేదామని చెప్పి సాహసోపేతంగా నూతన రీతులకు దారితీశారు, "పానుగంటివారు ఒప్పుకోకపోతే/పాములాంటి దానికి విరుగుడుంది/ఇంద్రకంటివారి నడిగితే/ఏమిటంటారో తెలుసునా ? పులికి పిలక లేదనటం/చలికి తెలుగు రాదనడం/శ్రీనివాసరావు వ్రాస్తున్నది/మా విషాదగీతంలో వున్నది" అని ఎవ్వరేమన్నా ధైర్యంగా ముందుకు సాగారు. 'అధివాస్తవికుల ప్రవేశం'పై శ్రీశ్రీగారి ఉత్పలమాలిక సంభ్రమాన్ని కలిగించే రచన. దీనికి శ్రీశ్రీ ఇచ్చిన వివరణ : "ఆగి; విను- ఉన్న అర్థం వదలవద్దు, లేని అర్థాలను చదవవద్దు. అట్లా చదివితే అర్థంలో అర్థం నిన్ను ఎక్కడికో తీసుకుపోతే నీ క్షేమానికి మా హామీ ఏమీలేదు." "Surrealism కు స్ఫాటిక స్వచ్ఛమైన గుణం పునాది," ఆ పునాదిమీద శ్రీశ్రీ చాల గీతాలు రాశారు. వీటిని తెలుగు పాఠకులు అంతగా ఆదరించలేకపోయారు. క్రోటన్ మొక్కలు ఏపుగా, అందంగా పెరిగి రంగురంగులుగా ఎంతో అందంగా వుంటాయి. వాటికి పూలూపళ్లూ లేవని వగచి ఏం లాభం ? చలువగల వెన్నెలలకు సౌరభము కూడ వుంటేనా ? అనుకునే కాలం కాదిది. క్రోటన్ మొక్కల్ని పీకేసి ఫలపుష్ప జాతుల్ని పెంచాలను

కోవటం సరియైన ఆలోచన కాదు. క్రోటన్ సౌందర్యాన్ని ఆస్వాదించ గల మానసిక స్థితికి మనిషి ఎదగాలి, అంతే.

శ్రీశ్రీ గారి ధర్మమా అని Paul Elvard, James Joyce, Andre Breton, Charles Baudelaire, F. Villon, Apollinaire, W. H. Auden, Dylan Thomas, Henry Michanx, Salvador Dali, Louis Mac Neice వంటి వివిధ దేశాల కవులు తెలుగువారికి పరిచయమయ్యారు. ప్రేమగీతం (Joyce), ఏవితల్లీ (Villon), చిన్నపిల్లల సర్కస్‌లో (Dylan Thomas) పిచ్చి దానిమ్మ చెట్టు (ఒడిస్యూస్ ఎలిటిస్) ద్వేషగీతం (Elaurd), పుట్టని పాప ప్రార్థన (Mac neice) గీతాలు శ్రీశ్రీ అనువాద సామర్థ్యానికి చక్కని నిదర్శనాలు. ఇవి స్వతంత్ర రచనలంత నుడికారంతో వున్నాయి. Transcreations అని చెప్పవచ్చు.

'సిరిసిరి మువ్వ' శతకం శ్రీశ్రీగారి విదూషక తత్వాన్ని తెలిపే లఘుగంభీర రచన, నవ్విస్తూనే శాశ్వత సత్యాలను అలవోకగా అందించే యీ రచన విశిష్టమైనది. "కుర్చీలు విరిగిపోతే కూర్చోడం మాననట్లు గొప్పరచనలను కూర్చేశక్తినశిస్తే చేర్చదగు నొకింత చెత్త సిరిసిరి మువ్వా" అని చెప్పుకున్నా యీ శతకం తీసి వేయదగిన రచనకాదు. శ్రీశ్రీలో గొప్ప రచనలు కూర్చేశక్తి నశించలేదు. విదూషకుని Temperament మాత్రం ఇందులో వుంది. 'రుక్కుటేశ్వర శతకం' కూడ ఇటువంటిదే; జలసూత్రం రుక్మిణీనాధశాస్త్రి గారిని సంబోధించి హాస్యధోరణిలో చెప్పినది. 'మేమే' అనే శతకం ఆరుద్ర, వరద రాజేశ్వర రావులతో కలిసి రాశారు. పై శతకాలకు దీనికి శైలిలో కొంత వ్యత్యాసం వున్నది.

స్వాతంత్ర్యోదయ సందర్భంలో శ్రీశ్రీ రచన 'మహాసంకల్పం'- మహాప్రస్థానం తర్వాత వెలువడిన ఆయన రచనల్లో తలమానికం. స్వాతంత్ర్యోత్సవమనగానే సామాన్య కవులకు మల్లే ఆయన పొంగిపోక, భవిష్యత్తును దర్శించిన బాధ్యతగల కవిగా యీ గీతం రచించారు. నాటికీ నేటికీ శ్రీశ్రీ పీడింపబడేవారి పక్షనే వున్నారు. ప్రభుత్వం ప్రవేశపెట్టే

చిన్నచిన్న సంస్కరణలకు భ్రమపడి పాలకవర్గపు బాకాగా మారి పోలేదు.

1918 లో జీవనోపాధికోసం మద్రాసు నగరం చేరుకున్న శ్రీశ్రీ చిన్నచిన్న పత్రికల్లో తక్కువ జీతానికి పనిచేసి ఎక్కువ కష్టాలనుభవించారు. తర్వాత సినిమా రంగంలో ప్రవేశించారు. సినిమాలకు పాటలు రాసినట్లే ఆయన ఆ తర్వాత రాసిన కవిత్వంలో నిలకడ తక్కువనీ, ఆయా పత్రికలకు అవసర నైవేద్యంగా, పూట గడుపుకోవటానికి రాసిన పాటలుగా, విమర్శకులు తక్కువగా అంచనా వేస్తున్నారు. కాని వీటిలో గాంధీజీ, ఓ మహాత్మా, తెలుగుతల్లి, విషాదాంధ్ర, సదసత్సంశయం, నగరంలో వృషభం, శరశ్చంద్రిక గీతాలు శ్రీశ్రీ కవితా శక్తికి జేగంటలు.

"పదవోయ్ తెలుగువాడా / అదె నీ తెలుగుమేడ / సంకెళ్ళులేని నేల / సంతోష చంద్రశాల" అని ఆంధ్రరాష్ట్రం రాకముందే ఆంధ్రౌన్నత్యాన్ని నుతించి, ఆంధ్రులను గౌరవించి, స్వతంత్రంగా ముందుకు సాగి పోవాలని 'తెలుగుతల్లి' గీతంలో కోరారు.

'విషాదాంధ్ర'లో "పట్టాభిరావుః స్వామ్మీద ప్రమాణం చేసి చెబుతున్నా / అంతా గజీతగాళ్ళే / మళ్ళీ అరగజం పురోగమనం లేదు" అని చమత్కారంగా ప్రారంభించి "శిశువుకు దక్కని స్తన్యంలాగ ప్రవహిస్తున్నాయి గోదావరినీళ్ళు / బద్దలైన గుండెల్లాగ బీటలు వేశాయి పొలాలు / మన పరిశ్రమలు ప్రణాళికల్లోనే / మన ప్రతిభ చాకిరీకి తాకట్టు"అని ఆంధ్రదేశపు దౌర్భాగ్యస్థితికి వగచి ఆనకట్టలు కట్టవలసిన అవసరాన్ని తెలిపారు. ఆ తర్వాత నాగార్జునసాగర్ మొదలైన ప్రాజెక్టులు వచ్చినా, ఇంకా సాగులోకి రాని పొలాలెన్నో వున్నాయి.

'సదసత్సంశయం' లో "ఈ సృష్టికి ఏమర్థం? మానవునికి గమ్యమేది / ఒక సకలాతీత శక్తి / ఉన్నట్టా లేనట్టా" అని సంశయించి, జగదీశ్వరుడతడెవరో అగపడితే, నిలవేసి, లోకంలో అన్యాయాల

గురించి కడిగేస్తానంటారు. "ఈ విశాల జగతినుంచి/ఏమిటి నేకోరినాను/ ఒక జానెడు సానుభూతి / ఒక దోసెడు తీరుబాటు"అని సునాయాసంగా అపురూపమైన సత్యాన్ని ఆవిష్కరించారు.

'నగరంలో వృషభం'లో యంత్ర విరోధి, అహింసావాది, శాకాహారి, మద్యనిషేధ ప్రజ్ఞాశాలి" అయిన వృషభం నగరం నడివీధిలో నాగరికత గమనాన్ని నిరోధిస్తూ నిలబడింది. అన్యాపదేశంగా పాలక పక్షాన్ని హేళనచేసి, దాన్ని సహించే మనిషికేనా బుద్ధి ఉండొద్దా ? అన్నారు.

'శరచ్చంద్రిక' శ్రీశ్రీ రచించిన ఉత్తమగీతాల్లో వొకటి. "అంతరంగం అట్టడుగున మాత్రం / అంతమందిమీ మానవులమే" అని శరత్ చంద్రుడితో చెప్పి "అంత మందికీ అన్నీ తెలుసు / అదే మన అజ్ఞానం" అని మనుషుల 'సర్వజ్ఞత్వం' పై దెబ్బ తీశారు. చందమామతో "ఇదిగో మాట ! ఈ ప్రపంచంలో/ఇంకా ఎందరో అభాగ్యులున్నారు/పలకరించువాళ్ళని చల్లగా, ధైర్యం చెప్పు వాళ్ళకి మెల్లిగా" అని విజ్ఞప్తి చేశారు. ఆసుపత్రిలో రోగుల్ని, జైళ్ళలో మగ్గుతున్న నేరస్తుల్ని, గుడిసెల్లో నివసించే దరిద్రుల్ని పరామర్శించమని వేడుకున్నారు. ఈ గీతంలో శ్రీశ్రీ భావుకశక్తి ఎవరికైనా ఇంపుగొలుపుతుంది.

స్విన్‌బర్న్ కవిని గురించి శ్రీశ్రీగారు-

"కవీ ! నీ గళగళన్మంగళ
కళాకాహళ హళాహళిలో
కలిసిపోతిని, కరిగిపోతిని
కానరాకే కదలిపోతిని"

అని ప్రశంసించారు. ఈ మాటల్నే శ్రీశ్రీ కవిత్వానికి కూడ అన్వయించుకోవచ్చు. "కదిలేదీ, కదిలించేదీ, పెనునిద్దుర వదిలించేదీ, మునుముందుకు నడిపించేదీ, పరిపూర్ణపు బ్రతుకిచ్చేదీ" అయిన అభ్యుదయ కవిత్వానికి మరో పేరు శ్రీశ్రీ.

శ్రీశ్రీ రచించిన 'విప్లవ కవిత్వం' గురించి మరొక అధ్యాయంలో వస్తుంది.

## ఆరుద్ర అభ్యుదయ కవిత్వం - వైచిత్రికి ప్రాముఖ్యం

అభ్యుదయ కవులలో ఆరుద్రగారి కవితా ముద్ర విశేషమైనది. అంత్య ప్రాసలతో రచనను చూచీ చూడగానే ఇది ఆరుద్ర గారి రచన అని పోల్చవచ్చు. భావవ్యక్తీకరణలో వాడుపు, ఉపమానాలను ఎన్ను కోవటంలో అసామాన్యమైన ప్రజ్ఞ ఆయన ప్రతిభకు నిదర్శనాలు. తెలంగాణ పోరాట సమయంలో 'త్వమేవాఽహమ్' ద్వారా ఆయన అభ్యుదయ కవుల్లో ప్రముఖస్థానం వహించారు. ఆయన పాటించిన సంవిధాన చాతుర్యాన్ని సామాన్య పాఠకులు సరిగా అందుకోలేక పోయారు. 'జీర్ణమజ్జేసుభాషితమ్' అని చేదుపాట పాడి, కవిత్వం కట్టి పెట్టక ప్రజలకు దగ్గరగా రావటానికి కఠోరసాధన చేశారు. దేశి ఛందస్సులను బాగా ఆకళించుకున్నారు. తెలుగువారికి అతి సహజమైన అంత్య ప్రాస ఆయనకు సునాయాసంగా అబ్బింది. ఆధునిక కవుల్లో అత్యధికంగా 'కోట్ చేయబడే' (ఉదాహరింపబడే) కవి ఆరుద్ర.

శ్రీ ఆరుద్ర "పూర్తిగా కొత్త ఆవరణలో నిలబడ్డవాడు. చురుకైన భావన ఉన్నది ఇతనికి.... మంచి గేయ కావ్యాలు చాలా వ్రాస్తున్నాడు. కవిత్వ రహస్యం తెలిపినవాడు. కనుక కావ్యనిర్మాణానికి అవసరమైన శిల్పం వదలుకోని గడుసరి" అని కృష్ణశాస్త్రిగారు 1948 లో అన్న మాటలు నేటికీ విలువ కోల్పోనివి.[14] కావ్యనిర్మాణానికి అవసరమైన శిల్పం వదులుకోలేదుగాని 'త్వమేవాఽహమ్' తరువాత ఆయన శైలిలో మార్పు వచ్చింది. ఇంగ్లీషు పదాల వాడుక బాగా తగ్గింది. ఆయన రాజకీయాభిప్రాయాల్లో గూడ మార్పు వచ్చింది. మార్క్సిస్టు సిద్ధాంతంపై వున్న గాఢమైన అభిమానం భారతదేశంపై చైనా 'దురాక్రమణ' చేసిన తర్వాత తగ్గిపోయింది. నెహ్రూగారి ప్రజాస్వామ్య

14. 'పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము' - దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి - భారతి - రజతోత్సవ సంచిక - 1949 జనవరి.

సోషలిజంపై ఆరుద్ర మక్కువ పెంచుకున్నారు. "భరతఖండము నేడొక వంటశాల/వండుచున్నాము తీయని పిండివంట/విందు దినుసులలోన ఓ వెర్రివాడ/వేయవలదయ్య చాటుగా విషపుబొట్టు" అని పంచవర్ష ప్రణాళికలపై విశ్వాసాన్ని ప్రకటించారు.

'త్వమేవాఽహమ్' తర్వాత ఆరుద్రగారి కవితా సంకలనం 'గాయాలూ-గేయాలూ' వచ్చింది. అప్పటికే (1957) అభ్యుదయ కవితోద్యమం శక్తిని కోల్పోయి నిస్తేజంగా వున్నది. అభ్యుదయ కవులకు బాసటగా నిలిచిన కమ్యూనిస్టు పార్టీ ఎన్నికల్లో పరాజయం పొందింది, నిరాశ గొలుపుతున్న సమయంలో తన ఎదలో గాయాలను గేయాలుగా ఆరుద్ర వెలువరించారు, గెలిచిన పక్షాన్ని మెచ్చుకుంటూ ఆయన వేషం మార్చలేదు. 'ఒక్క ఓ చెలియా'- నుండి పదీ పక్షేడా' వరకు పది గీతాల్లో తన బాధను, ఉద్విగ్నతను, కసిని ప్రకటించారు. "అరుణోదయం అయ్యేదాకా ఆశలుంటాయో లేదో చెప్పు" అని సడలిపోతున్న విశ్వాసంతో ప్రశ్నించారు. ప్రజా కంటకుల పాలనలో "విను, విను, విను రూపాయిల డెక్కలధాటి విను/సిపాయిల క్రొన్నెత్తుటి ధారలు కను/" అని చెప్పి "పాలితుల మెదళ్ళకు దళ్ళుకట్టి/వాళ్ళ చూపు దారిలో కాపలా వాళ్ళని పెట్టి/వాళ్ళ కళ్ళకి కిటికీలు మూసి, మేకులు కొట్టి/పరిపాలించబోతుంది రేపటి రాజ్యం/మొరలాలించటం అందులో పూజ్యం" అని భవిష్యత్తు అంధకారమయమని హెచ్చరించారు. "ఎరుపు రంగంటే నీకు వెగటు, ఎందుకో తగని వెరపు/ఐదువరాలి కుంకుమరేఖ అందుకా చెరిపావు దయలేక" - పేదప్రజల పక్షం వహిస్తున్న కమ్యూనిస్టుల చిహ్నమైన ఎరుపు రంగును గురించి ధ్వనిపూర్వకంగా రచించిన యీ గీతం ఆరుద్రగారి కవితా కౌశలానికి చక్కని నిదర్శనం.

'గాయాలూ-గేయాలూ'లో ఆంధ్ర రాష్ట్రావతరణకు కవి పులకించి రచించిన రసగీతాలు ఆహ్లాదకరమైనవి. "వేదంలా గోదావరి ప్రవహిస్తోందే చెల్లీ/వెన్నెలవలె కృష్ణవేణి విహరిస్తోందే తల్లీ/విశాలాంధ్ర నక్షత్రమూలల వైవాహిక వైభోగం" అని ఏరువాక పదవలాగ ఊగిసలాడే, జోడెద్దుల బండిలాగ గుండెలురికి సాగగా ఆనందగీతాలు ఆలపిం

చారు. "ఆడిందే ఆట; తూరుపు దిక్కున; విజయీభవ! ఎందుకింత సంతోషమో తెలుగువాళ్ళకి" మొదలైన గేయాలు నేటికీ ఆనందం కలిగిస్తాయి. 'నిరంతరం మా హృదంతరంలో నిండి వెలుగు జ్యోతీ' అని బాపూజీపై వారు రాసినపాట, 'మాతృకాంక్ష' గేయమూ మరపురానివి. పొట్టి శ్రీరాములుగారి త్యాగాన్ని నుతిస్తూ మంచి కవిత రాసిన కొద్దిమందిలో ఆరుద్ర వొకరు. ప్రణయ కవిత్వంలో ఆరుద్ర అందెవేసిన చేయి. అభ్యుదయభావాలు, ప్రేమగీతాలు పరస్పర విరుద్ధమైనవి కావని దాశరథి, తిలక్‌లవలె ఆరుద్ర కూడ విశ్వసిస్తారు.

ఆరుద్రగారి 'సినీవాలి' రచన 'ఏక్సిడెంటల్'గా జరిగింది. ఆయన గీతాన్ని 'తెలుగు కావ్యమాల'లో చేర్చిన శ్రీ కాటూరి అనాలోచితంగా 'సినీవాలి నుండి' అని ఆ పుస్తకంలో రాశారు. ఆరుద్రగారప్పటికి 'సినీవాలి' రచించలేదు. సినీవాలి అంటే 'చంద్రకళ కనబడే అమావాస్య'; పార్వతికి మరో పేరు.

ఆధునిక సమాజం అమావాస్య చీకటిలాగుంది. ఇంత నైరాశ్యంలో కూడ ఆశాలేశం లేకపోలేదు. ఆధునిక నగర జీవితాన్ని నేపథ్యంగా ఆరుద్ర 'క్లార్కు సూర్యారావు' జీవిత కథను యీ కావ్యంలో రచించారు. T. S. Eliot – 'The Waste Land' కావ్యంలోలాగే ఆరుద్ర నగర జీవితాన్ని ఊసరక్షేత్రంగా తలచారు. ఆధునిక కవులలో నగర జీవితాన్ని వర్ణించిన కవులు ఆరుద్ర, పఠాభి, అజంతా, బైరాగి, శ్రీశ్రీ వంటి కొద్దిమందే.

'నే దమావాస్య' అని ప్రారంభమయ్యే యీ కావ్యంలో నగరంలో "లిప్తలిప్తకు ఆశలు/లుప్తమైన బ్రతుకు జాగ్రదవస్థ దుస్స్వప్నాన్ని" వర్ణించారు. నగరంలో నాతి గురించి, నీతిగురించి చెప్పి వాళ్ళ లోలోపలి నిశ్శబ్దాలను వినిపించి, దుర్గమగహనాంతర సీమల్లో నడిపించి, స్వర్గనరకాల సహజీవనం చూపించారు. నగర వికృతరూపాన్ని అనేక కోణాలనుండి, సమర్థుడైన ఛాయాచిత్రకారునివలె, జీవిత దృశ్యా

లను పేర్చి హృదయంలో సంచలనం కలిగించారు. "ఆధునిక రంగేళీ యువతిలాగ నగరానికి మెదడు తక్కువ"ట. ఈ యువతి శ్రీమంతుణ్ణి ప్రేమించటానికి ఆశ పడుతుంది. "నీ మీద చూపించిన ప్రేమనే/టేకు డాన్సులో ఇంకొకడి మీద కూడా / నిష్కారణంగా, నిష్కామంగా / చూపెట్టే పింజారి నీ నగరం" వంటి వర్ణనలు మెదడు చురుక్కుమని పించి, సంక్లిష్టమైన ఆధునిక జీవితాన్ని గురించి ఆలోచింపజేస్తాయి. నగర జీవితానికి రోసి 'సూర్యారావు' సంజ చీకటివంటి స్వగ్రామమనేడి పంజరంలోకి పరుగెత్తిపోతాడు. "జీవితం రేడియో సెట్టుకి భర్త ఏరి యల్, భార్య ఎర్తు"; "ఖరీదైన ఆడవాళ్ళ భర్తలు ఖరీదైన పెంపుడు కుక్కలు"; "పెద్దోళ్లు సెప్పందే పెళ్ళిసూపులు పద్దాలులేని నాటకంలా ఉంటుంది"; "నువ్వెక్కదలచుకున్న రైలు ఎప్పుడూ ఒక జీవితకాలం లేటు"; "ఎడబాటంటే ఎదలో ముల్లు" మొదలైన సూక్తులు ఆరుద్ర గారి అత్యద్భుతమైన ఉపమాకౌశలానికి నిదర్శనాలు, "ఇసుకలో కాళ్లీడ్చు కునే గస్తీపోలీసు, ఫేసు పౌడరు ఊడిపోతున్న ఆంగ్లో ఇండియన్ అమ్మాయి" మొదలైనవారు ఆరుద్రగారి కవిత్వంలో కనిపించే లోక సామాన్య వ్యక్తులు. "అయ్యా మృత్యువుగారూ!" అని సామాన్యుడు చావలేక బ్రతుకుతూ చేస్తున్న ఆర్తరావాన్ని, మొరను ఆరుద్రగారిలాగ అద్భుతంగా వర్ణించారు : "నిత్యనైమిత్తికాల వంటింట్లో నుంచి లేమి కారుతోంది; కలలపంచ నుండి కారే సంతృప్తిధార/నిద్దుర బిందెల్లో పట్టు కోసిండి- అయ్యా మృత్యువుగారూ కనికరించి కనికరించండి" అని వేడు కునే సామాన్యుడి గోడు ఎవరినైనా విచలితుల్ని చేస్తుంది.

వైచిత్రి ఆరుద్రగారి కవిత్వంలో ప్రముఖంగా కన్పిస్తుంది. ఒక్కొక్కసారి వీరివైచిత్రీ ప్రియత్వం విమర్శకులకు సర్కస్ ఫీట్లలా తోస్తుంది. కాని కవితాశిల్ప మర్మజ్ఞులై లోనారసి చూచేవారికి వీరి వైచిత్రి ప్రగాఢమైన ప్రతిభలోంచి వెలువడినదేగాని కేవలం మాటల గారడీ కాదని తెలుస్తుంది. శుష్కనినాదాలు, పడికట్టు మాటలు వీరి కవిత్వంలో కన్పించవు. 'శుద్ధమధ్యాక్కరాలు; 'ఎంచిన పజ్యాలు' ఆరుద్రగారు ఛందస్సుల అశ్వహృదయం తెలిసినరౌతు అని నిరూపిస్తాయి.

భావనలో అభ్యుదయం, భావప్రకటనలో వైచిత్రి ఆరుద్రగారి కవిత్వాన్ని ఆస్వాదయోగ్యం చేస్తాయి.

## దాశరథి కవిత పీడిత ప్రజల వాణికి 'మైక్'

"నాతెలంగాణ కోటి రతనాలవీణ" అని దేశభక్తితో కంఠమెత్తిన శ్రీ దాశరథి తెలంగాణలో నిజాంరాజు దుర్మార్గాలను ఎదిరిస్తూ ప్రజలను ఉత్తేజ పరచారు. 'అగ్నిధార' కురిపించి జాతిలో చైతన్యం రగుల్కొలిపారు. పీడిత ప్రజల వాణికి తనకవితను 'మైక్'గా సమర్పించారు. ఆయన కావ్యాలన్నిటా అభ్యుదయ భావాలు ఉచ్ఛ్వాస నిశ్వాసాలుగా అమిరాయి. పద్యాల్లో అభ్యుదయ భావాలను వెదజల్లిన కొద్ది మంది అభ్యుదయ కవులలో ఆయన ప్రముఖులు. ఆధునిక కాలానికి అనువైన కవితా వాహకం వచన కవిత్వమని దాశరథి అంగీకరించారు. "హృద్యమైన పద్యం నుండి, శ్రవణ పేయమైన గేయంనుండి, రుచికరమైన వచన కవితదాకా అన్ని ప్రక్రియలనూ ఆహ్వానించాను. పోరాటంలో నుండి కళ పుడుతుందని నమ్ముతున్నాను. నా జీవితమే పోరాటం"[15] అని శ్రీ దాశరథి పలికినట్లే ఆయన కావ్యాలన్నిట్లో అభ్యుదయ భావాలున్నాయి.

"ఆగర్భ శ్రీమంతునికీ, అనాధునికీ మధ్య చిరకాలమునుండి జరుగుచున్న సంఘర్షణమే మాదాశరథి కవితావస్తువు"అని శ్రీదేవులపల్లి రామానుజరావు 1949లో చెప్పారు.[16] శ్రీదాశరథి మొదటినుండి జాతీయ వాది. ఆంధ్ర మహాసభ కార్యకలాపాల్లో తీవ్రవాది అయినా ఆయన కమ్యూనిస్టు పంథాను అనుసరించలేదు. 'అగ్నిధార'లో-

"జండా ఒక్కటె మూడు వన్నెలది; దేశం బొక్కటే భారతా
ఖండా సేతు హిమాచలోర్వర కవీట్కాండమ్ములోన రవీం
ద్రుండొక్కడె కవీంద్రుడు; ఊర్జిత జగద్యుద్ధాలలో శాంతికో
దండోద్యద్విజయుండు గాంధి ఒకడే, తల్లీ! మహాభారతీ!"

15 మూడు దశాబ్దాలు-దాశరథి - దాశరథికవిత - మహాంధ్ర ప్రచురణలు-1977.
16. తొలి పలుకు - దేవులపల్లి రామానుజరావు-అగ్నిధార 1949.

అని ప్రస్తుతించటాన్ని గమనిస్తే ఆయన మార్క్సిస్టు తత్త్వ శాస్త్రంపై ఏనాడూ ఆసక్తి చూపలేదని పిస్తుంది.

శ్రామిక జీవిత వర్ణన దాశరథిగారికి ప్రియతరమైన కావ్యవస్తువు. కష్టజీవియైన పేదరాలితో "ఓసికూలిదానా! అరుణోదయాన/మంటి తట్ట నెత్తిన బెట్టి మరుగులేని / యెత్తు రొమ్మును పొంగించి యెందు కొరకు/ ఉస్సురనెదవు ? ఆకాశముడికిపోవ" అని ఆమె బాధకు సానుభూతి చూపారు. ఆమె నిట్టూర్పుకు ఆకాశం ఉడికి పోతుందనటం దాశరథిగారి ప్రజ్ఞకుమంచి నిదర్శనం.

"బరువులతో శిరసువంచి / పరువెత్తుతు / బ్రతుకని / బ్రహ్మ రాతయని / భ్రమ పొందిన / శోకాచెందిన / నిరుపేదా / శ్రమవిలువను గమనించని అమాయకుడ ! అన్నార్తుడ !"అనిసంబోధించి "నీఘర్మంలో ధర్మం-స్వేదంలో ప్రసాదం-రక్తంలో మౌక్తికాలు"వెలిశాయని తెలుసు కొమ్మని పేదలకు తెలియజెప్పారు. "ఈ లోకంలో శ్రమజీవుల రక్త ధార / జలంకన్న పలచనైంది." వారికోసం కలంపట్టి వారి శ్రేయస్సును కాంక్షించిన కవి శ్రీ దాశరథి.

సమ సమాజ నిర్మాణాన్ని సాధించటంలో శ్రీ దాశరథి హింసను నిరసిస్తారు. "ఏనాడెవ్వడు కత్తితో గెల్వలేదీ విశ్వమున్" అని ఆయన విశ్వాసం. "Force is the midwife of the revolution" అన్న మార్క్సు సూక్తిపై వీరికి గురిలేదు. శ్రామికులు తమశక్తిని గుర్తించి, సంఘటితంగా పోరాడితే సమాజంలో మార్పువచ్చి పరిస్థితులు చక్కబడ తాయని వీరు భావిస్తారు. పండుగలూ పబ్బాలూ అన్నిటికీ ఎప్పటికప్పుడు వీరు రాస్తున్న కవిత్వంలో చిక్కదనం లోపించి ఇటీవల దాశరథిగారి కవితాశక్తి సన్నగిలి పోయినట్లు తోస్తుంది.

అభ్యుదయోద్యమంలో కోటిమంది ప్రజల కొరకై కవిగా, కార్య కర్తగా పోరాడిన శ్రీ దాశరథికి ఆధునికాంధ్ర కవిత్వంలో విశిష్టస్థానం వున్నది.

## ప్రజాకవి కాళోజీ - 'నా గొడవ' ప్రజల గొడవే

ప్రజల కవి శ్రీ కాళోజీ. తెలంగాణ ప్రజలతలలో నాలుకై వారి వ్యధలను కవిత్వ రూపంలో వెల్లడించిన ప్రజానాయకుడు. అన్యాయాలపై విరుచుకుపడ్డప్పుడు కాళోజీ కవిత ఒళ్ళంతా చీల్చుకుపోయే మొగలిరేకు; ఒక్కొక్కప్పుడది పదునైన గండ్ర గొడ్డలి. అభ్యుదయభావాలు లేకుండ ఆయన ఏ కవితా రచించలేదు.

మనుష్యులమధ్య పోరాట స్వభావాన్ని "చాపచింపు-సామ్రాజ్యం కోడిగుడ్డు - కోహినూరు / పాటిమన్ను - ప్లాటీనం / బస్సుసీటు - బ్రహ్మరథం / ఏదైతేం ఏదైతేం" అని హేళన చేసి సామరస్యాన్ని పెంపొందించు కొమ్మని కాళోజీ హితవు చెప్పారు. వ్యంగ్యశక్తి కాళోజీ కవితకు ప్రాణం. మహాత్మగాంధీ బోధనలను పెడచెవినిపెట్టి, స్వార్థ పరులై గాంధీజీ పేరును స్మరించే వంచకులను కాళోజీ "ఇంకేమి కావాలె? బ్రతికినన్నాళ్లు నిను - బాపు అనిపిలిచితిమి, చచ్చిపోయిన నిన్ను-జాతి పితను జేసితిమి / పెక్కు భంగుల నిన్ను - చెక్కి నిలవేసితిమి/ వేడ్కతో ఇంటింట వ్రేలాడ దీసితిమి. నీ పేరుతో టోపి నిత్యమై పోయినది"- అని వ్యంగ్యంగా. ఆయువు పట్లలో కానరాని దెబ్బలు కొట్టారు. రాజకీయాల్లో ఆయన ఎప్పుడూ స్వతంత్రుడు. "అభ్యర్థి ఏ పార్టీ వాడనికాదు, ఏపాటివాడోచూడు" మని ప్రజలను హెచ్చరించారు.

పరీభవ సంవత్సరంలో కాళోజీ కవితా సంకలనాలు ఆరుబుతువుల లోను ఆరు వచ్చాయి. 'నా గొడవ' మొత్తం ఏడు సంపుటాలు. అన్నీ సమకాలిక జీవితదర్పణాలే - కావ్య సంపుటాలను కోరిన వారందరికీ ఉచితంగా అందించారు. కవిత్వం వ్యాపార వస్తువుకాదని, అది ప్రజల జీవితంలో భాగం కావాలని వీరి ఉద్దేశ్యం.

నైజాం ప్రభుత్వపు నిరంకుశత్వాన్ని ఎదిరించినట్లే కాళోజీ నేటి ప్రభుత్వం నిరంకుశంగా ప్రజల హక్కుల్ని రూపుమాప జూచినప్పుడు ప్రజల పక్షాన నిలిచి పోరాడే కవి. భయం ఆయన నిఘంటువులోలేదు.

సంఘంలో వ్యత్యాసాలను వర్ణిస్తూ "కమ్మని చక్కెలాలొకచోట/ గట్టిదవడ లింకొకచోట/ వాసన నూనియలొకచోట/మాసిన తలలింకొక చోట" అని చమత్కారంగా పలికి, పండిత పామరులిరువురినీ రంజింప జేశారు. దేశసంపదకు రైతు ముఖ్యాధారం అయినప్పుడు కర్షకుని చిన్న చూపుచూడటం తగదని కాళోజీ భావం. "నర్తకుని నాట్యాలు, గాయకుని గానాలు, ధార్మికుని దానాలు, పండితుని భాషణలు/వర్తకుని వ్యాజ్యాలు, వకీళ్ళ వాదాలు / సైనికుని శౌర్యాలు, యాంత్రికుని యంత్రాలు / యోధుల యుద్ధాలు, రాజుల రాజ్యాలు / కర్షకా నీ కఱ్ఱు కదిలినన్నాళ్ళే" అని కర్షకుని ప్రశంసించి, భారత భాగ్యవిధాత కర్షకుడేనని తలచారు.

"కాళోజీ 20వ శతాబ్దంలో తెలంగాణ ప్రప్రథమ ప్రజాకవి. కాదనడం సాహసం" అన్నారు శ్రీ దాశరథి.[17] కాళోజీ ప్రజాక్షేమాన్ని విస్మరించి పాలకులను కీర్తించలేదు. జనశ్రేయస్సుకు క్షతికలిగినప్పుడల్లా కవిగా స్పందించటం కాళోజీ జీవలక్షణం, ఇందుకు దేశం ఎంతైనా ఆయనకు ఋణపడి వున్నది.

## కుందుర్తి కవిత్వం "నరజాతి విముక్తి సంగీతం"

"ఇది నా కవిత్వం గీత, వినేవాడు నరుడు
చదువూ సంధ్యలు రాని రోడ్డుమీద పామరుడు
లేమితల్లి యొడిలో నిరంతర గాఢ నిద్రాపరుడు"

కవిత్వ లక్ష్యాన్ని స్పష్టంగా నిర్ణయించుకుని సామాన్యుడికోసం కలంపట్టి, అభ్యుదయ మార్గంలో నడిపించిన కవి శ్రీ కుందుర్తి ఆంజనేయులు. 'నయాగరా' కవితా సంకలనం నాటినుండి ఆయన అభ్యుదయ మార్గాన్ని అనుసరించారు. మానవతావాదాన్ని మన్నించిన మార్క్సిస్టు దృక్పథం శ్రీ కుందుర్తి కవితలో కన్పిస్తుంది. 'నా గీతం నరజాతి విముక్తి సంగీతం' అని వర్గ పోరాటం ద్వారా సమసమాజం ఏర్పడాలని భావించి, అందుకు తన కవిత్వం తోడ్పడాలని ఆయన ఆశించారు.

---

17. దాశరథి - కాళోజీ 'నా గొడవ'లో చేర్చిన అభిప్రాయం-(8-1-53)

'యుగేయుగే' కావ్యరచనలో శ్రీ కుందుర్తి అభ్యుదయ కవిగా ప్రసిద్ధికెక్కారు. "రచనల పూలతోటలో / ఛందస్సు మొక్కలు నాటను/ భావనలో సామాన్యుని / జీవితవలయాలు దాటను" అని ప్రతిజ్ఞ చేసిన కుందుర్తి ఆ తరువాత ఛందస్సులో అప్పుడప్పుడూ రచన చేసినా, పద్య రచన చేయగలనని నిరూపించుకోవటానికేగాని పద్యంమీది మక్కువతో గాదు. వచన కవిత్వం అభ్యుదయ భావప్రచారానికి అనువైన సాధనమని తలచి ఆయన 'ఫ్రీవర్స్ ఫ్రంట్' స్థాపించారు (1958). బహిరాకృతి ఉద్యమం కాదని, వస్తువు ప్రధానమని వాదించే వారిని ఆయన లక్ష్యపెట్ట లేదు. పద్యమే కవిత్వమనే అపోహను తొలగించి, ఆధునిక కాలానికి అనువైన ప్రక్రియ వచన కవిత్వమేనని నిరూపించటంలో ఆయన కృషి మరువరానిది. వచన కవితకు ఆయన ఆద్యుడు కాక పోయినా, పండితులకు జవాబుచెప్పి, వచన కవితకు ఆదరగౌరవాలను సంపాదించటంలో ఆయన ప్రముఖ పాత్ర వహించారు.

తెలుగు కవిత్వంలో సామాన్య పాఠకులకు చీకాకు కలిగించే సంస్కృత పదాడంబరాన్ని, ఇంగ్లీషు పదాల ప్రయోగాన్ని శ్రీకుందుర్తి నిరసించారు. వాడుకలో వున్నవీ, చదువరులకు చిరపరిచితమైన మాటల తోనే ఆయన ఆహ్లాదం కలిగించారు. దుర్భరమైన వర్తమానానికి, ఆశలు రేకెత్తించే భవిష్యత్తుకు తేడాను 'రెండు లోకాలు' గీతంలో వర్ణించారు. 'భగవంతునికి బహిరంగలేఖ'లో తను తప్పుచేస్తూ 'శివశివా'అని నాకండ్లు మూసేయోగి నీకు వాడు మహాభక్తుడు/నేనువాడ్ని సహించను/తిండిలేని వాళ్ళకు తృప్తివిషం పెట్టడానికి / ఒకపూట ఉపవాసం చేసే భోగి/నీకు వాడు మహాఆప్తుడు/ నేను వాడ్ని సహించను/ప్రతిదానికీ మెచ్చి భక్తులకు వరాలు ఇచ్చి నీవు దైవపదవిని నిరుపయోగపరుస్తావు / ప్రతిఫల మాశించకుండా, ప్రజలకు ధర్మబోధలు చేసి / పనిముగిసిన మరుక్షణమే/ మనుష్య పదవినుండి దిగిపోతాను నేను" అన్నప్పుడు కవిఉపయోగించిన పదాలు అన్నీ అందరికీ తెలిసినవే. కవిభావం సూటిగా, వాడిగాగుండెల్లో గుచ్చు కుంటుంది. 'రాతమ్ముడూ, పోదాం, మనకు చోటులేదిక్కడ"

అంటూ మనుష్యులను ఆవరించివున్న కుత్సితాలను, కపటాలను వెల్లడించి వాటిని సరిదిద్దుకోవాలని చెప్పారు.

మూఢ నమ్మకాలపై తిరుగుబాటుచేసి, వాటిని పోగొట్టటానికి శ్రీకుందుర్తి తన కావ్యాలన్నిటిలో ప్రయత్నించారు. ప్రజల అనుభవంలో వున్న విషయాలే తీసుకుని, వారికి తెలిసిన ఉపమానాలే వుపయోగించి, కవితా శిల్పానికి భంగం కాని విధంగా ప్రయోగించటం కుందుర్తిలో కన్పించే కవితా కౌశలం.

'తెలంగాణా' కావ్యం తర్వాత "యుగేయుగే, నగరంలో వాన, నాలోని నాదాలు," కావ్యాలు కుందుర్తి అభ్యుదయ భావాలను వెల్లడించే విశిష్టమైన రచనలు. వచన కవిత్వం నాలుగు కాలాలపాటు నిలిచి వుండటానికి కథా కావ్యాలు రావలసిన ఆవశ్యకత వున్నదని వీరు భావించారు. ఏం చెప్పాలి? ఎలా చెప్పాలి? అనే రెండింటిలో మొదటి దానిపైనే వీరు మొగ్గు చూపిస్తారు.

"నియమబద్ధమై, నన్నయాదులచేత తీర్చిదిద్దబడిన పద్యం మాకు తల్లి. దానిని కించపరచాలనే ఉద్దేశ్యం మాకులేదు. పద్య రచయిత లొకవేళ తూలనాడినా- వొకవేళ ఎందుకు? తూలనాడటం తథ్యం- మేము పద్యాన్ని ఏమనేదిలేదు. కాని తెలుగు కవిత్వానికి పద్యమే, వృత్తమే తుది స్వరూపమని మాత్రం అంగీకరించం....కొత్తప్రయోగం నిరంతరం జరగవలసిందే" అని ఘంటాపథంగా చెప్పి (యుగేయుగే) యువ కవులను నూతనప్రయోగాలు చెయ్యమని ప్రోత్సహించారు. "ప్రపంచంలో ప్రతిదీ మారుతుంది. మారకుండా స్థిరంగావుండేది వొక్కటే-అదిమార్పు" అని నిరంతరం కొత్త దనాన్ని అన్వేషించారు. ప్రయోగమేదైనా ప్రగతికిదారి తియ్యాలిగాని ప్రయోగం కోసమే కాకూడదని వీరు భావిస్తారు.

ప్రకృతి వర్ణనలుకూడ సమకాలిక సమాజాన్ని ప్రతిబింబించాలని వీరు తలుస్తారు. 'నగరంలోవాన'లో కవిఊహాగానాల్లో కదలాడే కవిత్వం జల్లులు జల్లులుగా కురుస్తున్నట్లు, అనంతకోటి దృశ్యాలు తన రంగుల

కుంచెతో రమణీయంగా చిత్రించారు. "మూడునాళ్ళ పసిపాపను ముద్దుగా వొడిలో గుండెల కద్దుకుంటూ, వెచ్చగా ఆస్పత్రినుండి వచ్చుగా ఇంటికి వెళ్ళే పచ్చి బాలెంతరాలి మీద పూలజల్లులాగా, ఆగస్టు పదిహేనున బారుగ తీర్చినించున్న పసిబాలురమీద జాలిగా సన్నని తుంపరగా వర్షం పడుతుందని శ్రీ కుందుర్తి హాయిని గొలిపే భావాల్ని అందించారు. ఇంత మంచి వర్షర్తు వర్ణన ప్రాచీన కవితలోనూ, ఆధునిక కవితలోనూ అరుదుగానే కానవస్తుంది.

అయోమయానికీ, అస్పష్టతకూ కుందుర్తి కవిత చాల దూరం. పండిత పామరులను రంజింపజేయగల సుశబ్ద ప్రయోగం ఆయన సొత్తు. అభ్యుదయ కవితా యుగంలో తిలక్, కుందుర్తి గారల ప్రభావం యువ కవుల మీద అధికంగా వున్నది. "పద్యాల పూటా రూపాయలు, పత్రికల గుడ్డివాళ్ళ వద్ద చిల్లరకీర్తికోసం, చీకట్లో మార్చను" అని కుందుర్తి ప్రతిజ్ఞ చేశారు. అట్లాగే అయినదీ కానిదీ ఏదో సందర్భానికి సరిపడే పద్యాలు ఆయన రాయలేదు.

"ఎప్పుడో ఒక మహాకవి భగీరథుడిలా వస్తాడు, క్రొంగొత్త కవితా గంగను తెస్తాడు" అని ఆశించిన కుందుర్తి "నా అంతస్తుకు మించిన కవితాకీర్తి కావాలని కోరుకోను" అని వినయంగా, సౌజన్య మూర్తియై పలికారు. తన తర్వాత వచ్చిన విప్లవ కెరటంలో దూకక పోయినా, సమాజంలో తాను ఆశించిన మార్పుకోసం ఎదురుచూస్తూ కవితా క్షేత్రంలో నిరంతర వ్యవసాయంచేసి, ఫలసాయాన్ని అందిస్తున్న ఆయన కృషి కొనియాడదగినది.

## తిలక్ భావాలు "ప్రజాశక్తుల వహించే విజయ ఐరావతాలు"

అభ్యుదయ భావన, సౌందర్యమూ శ్రీ బాలగంగాధర తిలక్ కవిత్వంలో కలగలిసి మానవతను పెంపొందించాయి. 'నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే అందమైన ఆడపిల్లలు' అని భావించిన తిలక్ "నా అక్షరాలు కన్నీటిజడులలో తడిసే దయాపారావతాలు / నా అక్షరాలు ప్రజా

శక్తుల వహించే విజయ ఐరావతాలు'' అని కూడ అన్నారు. జీవకారుణ్య దృష్టితో ఆయన దీనుల వేదనను, సైనికుల బాధను, పతితుల విలాపాన్ని, మోసపోయిన అభాగ్యుల గోడును తన రచనల్లో ప్రతిబింబించారు. 'ఆర్తగీతం, ప్రార్థన'లు తిలక్ హృదయావేదనను వినిపింపజేసే ఉత్తమ రచనలు. ''నా దేశాన్ని గూర్చి పాడలేను నీ ఆదేశాన్ని మన్నించలేను, ఈ విపంచికకు శ్రుతి కలుపలేను;' అని ప్రారంభమయ్యే 'ఆర్త గీతం'లో దుర్భరమైన జీవిత దృశ్యాలను ప్రదర్శించారు. ''నేను చూశాను నిజంగా, ఆకలితో అల్లాడి మర్రిచెట్టు కింద మరణించిన ముసలివాణ్ణి, నేను చూశాను నిజంగా నీరంధ్రవర్షాన వంతెన కింద నిండుచూలాలు ప్రసవించి మూర్ఛిల్లిన దృశ్యాన్ని''.... అని వర్ణిస్తుంటే ఎంత కఠినాత్ములైనా చలించకుండ వుండలేరు. శ్రీ తిలక్ బాధితులను సంబోధించి తిరగబడమని చెప్పరు. బాధిస్తున్న లోకంకేసి తిరిగి ''ఇది ఏ నాగరికతకు ఫలశ్రుతి? ఏ విజ్ఞాన ప్రకర్షకు ప్రకృతి? ఏ బుద్ధదేవుని జన్మభూమికి గర్వస్మృతి?'' అని నిగ్గదీసి ప్రశ్నిస్తారు. కవిత్వం చదివే పై తరగతి ప్రజలు అన్యాయాలకు కారణమేమిటని తప్పకుండ ఆలోచిస్తారు. ఆ మేరకు తిలక్ అభ్యుదయ కవి. ''భావకవులకు సహజమైన ఉదాత్తసురభిళాత్త శయ్యాసజ్జితము, రసప్లావితము సుందరవధూక దుష్టపరిరంభము' యీ గీతంలో కన్పిస్తాయి. భావకవితా వాసనను వీడని అభ్యుదయభావన తిలక్ కవిత్వానికొక వింత సొబగును చేకూర్చింది.

మార్క్సిజం తిలక్‌గారిని ప్రభావితం చెయ్యలేదు. కష్టాల్లో చిక్కుకున్న దీనులపట్ల సాటి మానవుడిలా ఆయన ప్రతిస్పందించారు. 'ప్రార్థన'లో ''దేవుడా, రక్షించు నా దేశాన్ని/పవిత్రులనుండి పతివ్రతల నుండి, పెద్ద మనుషులనుండి, పెద్దపులుల నుండి/.... లక్షాది దేవుళ్ళ నుండి/.... శ్రీ మన్మద్గురు పరంపర నుండి'' అని వ్యంగ్యంగా దేశదుస్థితిని ప్రస్తావించి ''దేవుడా, నలభై కోట్ల మనుష్యుల/నిజమైన, ప్రాణం వున్న మనుష్యులతో నిండిన దేశం నాది, రక్షించు నా దేశాన్ని'' అని ప్రార్థించారు. ఈ కవితలో వ్యంగ్యం సమకాలిక సంఘంలో ప్రజలను ఆలోచింపజేసింది. పరిష్కారమేమిటో చెప్పకుండానే చెప్పింది.

గాంధీజీ జీవితం కంటె తిలక్‌గారిని నెహ్రూజీ జీవితం ఎక్కువగా ఆకర్షించినట్లు కన్పిస్తుంది. నెహ్రూగారు మరణించినప్పుడు తిలక్‌గారు ఆయన్ను "ప్రిన్స్‌ఛార్మింగ్, డార్లింగ్ ఆఫ్ ది మిలియన్స్" అని వర్ణించారు. నెహ్రూగారి మరణానికి భూమి ధ్రువగళాలెత్తి ఏడ్చిందని తన బాధను వ్యక్తం చేశారు. తిలక్‌గారు జాతీయవాది. భారతదేశంపై చైనా యుద్ధానికి దిగినప్పుడు ఆయన మావోను, చౌ-ఎన్-లై లను హేళన చేస్తూ, దేశభక్తిని ప్రబోధించే కవిత్వం రాశారు.

మానవతావాది తిలక్ అభ్యుదయమంటే సమసమాజ నిర్మాణమని గాక, ఆకలీ యీతి బాధలూలేని చల్లని లోకమని మాత్రమే తలచారు. అయితే ఆయన అభ్యుదయ భావాలకు వ్యతిరేకి మాత్రం కారు. 1942లో బొంబాయిలో జరిగిన భారత అభ్యుదయ రచయితల మహాసభకు ప్రతినిధిగా హాజరైనారు. ఆ సంవత్సరమే ఆయన 'మేగ్నకార్టా' అనే సుప్రసిద్ధమైన గీతం రచించారు. "పాతలోకపు గుండెలో శతఘ్ని పగిలించి/భావికాలపు చంద్రకాంత శిలల కరిగించి/పాటపాటకి నోకు స్వర్గంలాగ/మాటమాటకి దూకు సింహంలాగ/మేం నిలుస్తాం/మేం పిలుస్తాం/మేం మనుష్యులం, మేం మహస్సులం/మాకు దాస్యంలేదు/మాకు శాస్త్రం లేదు / మాకులోకం ఒకగీటురాయి /మాకు కరుణ చిగురుతురాయి" అని స్పష్టంగా స్వేచ్ఛను కోరారు. సనాతనమైన, అభివృద్ధి నిరోధకమైన భావాలను ఆయన ఎన్నో చోట్ల ఏవగించుకొన్నారు.

అభ్యుదయ భావాలతో సామాజిక ప్రగతిని కోరేగీతాలు 'మేగ్నకార్టా; దీపం; శిక్షాపత్రం; స్వేచ్ఛా విహారం; గొంగళీపురుగులు; సి.ఐ.డి. రిపోర్టు; మొదలైనవి 'అమృతం కురిసిన రాత్రి'లో వున్నాయి. "ఒక్క దుఃఖితుడు నవ్వినప్పుడు / ఒక్క పతితుడు కన్విప్పినప్పుడు/ అక్కడ నా అడుగుజాడ గుర్తించగలవు" అన్నకవి అభ్యుదయ దృక్పథాన్ని కొనియాడకుండ వుండలేము, తిలక్‌గారి అనుభూతి ప్రధానమైన కవిత్వం, కరుణాదృష్టిని కలిగించే కవిత్వం అభ్యుదయ భావాలకు విరుద్ధమైనదికాదు.

'గొంగళీ పురుగులు'లో శ్రీ తిలక్ చిత్రించిన 'అయినాపురం కోటేశ్వరరావు', అజంతాగారి నిరుద్యోగి వెంకట్రావు, ఆరుద్రగారి క్లార్కు సూర్యారావులాంటివాడు. దైనందిన జీవితంలోంచి నిద్రలోకి జారుకుని కోరికల సీక్రెట్ బాక్స్'లో సెక్స్, క్రైమ్, లాటరీలో ప్రైజులూ ఊహించుకునే మధ్య తరగతి బలహీనుల్ని అవహేళనచేసి వాళ్ళ మధ్య డైనమైట్ పేలాలి / డైనమోలు తిరగాలి'' అంటారు. తపాలా బంట్రోతును పరామర్శిస్తూ ''ఒక్కనయనమైనా నీకోటు దాటి లోపలికి చూడదు'' అని సానుభూతి చూపారు.

యుద్ధ బీభత్సం తిలక్‌గారి గుండెల్ని ఘూర్ణిల్ల జేసింది. పదేపదే ఆయన యుద్ధాన్ని నిరసించారు. అభ్యుదయ కవులు యుద్ధ కాలంలో ప్రజల కష్టాలను వర్ణించారేగాని యుద్ధభయంకరత్వాన్ని వర్ణించలేదు. శ్రీశ్రీగారి 'గర్జించు రష్యా' వీరరసాన్ని ఉప్పొంగించేదేగాని అందులో యుద్ధ భీకరత్వంలేదు. ఒక్క తిలక్ మాత్రమే రెండవ ప్రపంచ యుద్ధ బీభత్సాన్ని కవితలో చిత్రించి, శాంతిని ప్రబోధించారు.

శ్రీ తిలక్ కవితకు సంస్కృత పదాలమీద మోజు ఎంత అందం తెచ్చిపెట్టిందో, అంత అపచారం చేసింది. వాడుక భాషలోరాస్తూ, అభ్యుదయ భావాలను వెదజల్లుతూ''జ్వలత్కాష్ఠమిలా తలం శప్తధాత్రినిర్జనమై పరచుకొనెను / సుప్తదేవ హృదయ స్ఫుణ్నాళము లేగిరిపడెను'' అని రాయటం కవితను అందుకోవలసిన సామాన్య పాఠకులకు దూరం కావటమే. 'భస్మీకృత ధాత్రిమీద కళ్ళిస్మూర్ఛని తుది్రవాలు' వంటి మాటలు, వాడుకలోలేని సంస్కృత పదాలమీద మోజుచేత వాడినవే. ఇటువంటి రచన మనస్సును కదపదు. కనుబొమలెత్తి ఆశ్చర్యపోయేట్లు చేస్తుందంతే.

'అమృతం కురిసిన రాత్రి' ఆధునికాంధ్ర కావ్యాల్లో ఒక మహోన్నత శిఖరం. నేటి కవులమీద తిలక్ ప్రభావం ఎక్కువగా కన్పిస్తున్నది. శ్రీశ్రీ తర్వాత యువకవులను ఎక్కువగా ప్రభావితం చేసిన కవి తిలక్, కేవలము అభ్యుదయ భావాలకే కట్టుబడి కవిత్వం రాయకపోయినా, తిలక్

కవితా దృష్టి 'ఇజమ్‌లలో ఇం|ప్రిజన్' అయిపోక, స్ఫటిక స్వచ్ఛంగా కాంతిని విరజిమ్మింది. తిలక్ కవిత కవితాసతి నొసట నిత్యరస గంగా ధర తిలకమై" విరాజిల్లుతుంది.

## రాయలసీమ కన్నీటిపాట - విశ్వం 'పెన్నేటిపాట'

సంస్కృత విద్యను అభ్యసించి, జాతీయోద్యమంలో కారాగార శిక్షను అనుభవించి తన జన్మభూమి రాయలసీమ క్షేమం కోసం పాటు పడిన కవి శ్రీ విద్వాన్ విశ్వం. రాయలసీమలో జలాధారాలు తక్కువ. తరచు కరవులు రావటం అందరికీ విదితమే. రాయలసీమ కరవును కళ్లారా చూసి, హృదయం ద్రవించి, బాధాదగ్ధమైన కంఠంతో శ్రీ విశ్వం పలికిన కవిత్వం 'పెన్నేటిపాట'. 'రాయలసీమ కన్నీటిపాట పెన్నేటి పాటగా' కరుణరసభరిత కావ్యంగా వెలువడింది.

"అచట నొకనాడు పండె ముత్యాలచాలు; అటనొకప్పుడు నిండె కావ్యాలజాలు" అని రాయలనాటి వైభవాన్ని వర్ణించి- "కోటిగొంతుల కిన్నెర మీటుకొనుచు, కోటిగుండెల కంజరి కొట్టుకొనుచు" కోటి మంది ప్రజల బాధను తన కంఠంలో పలికించారు. "అదే పెన్న ! అదే పెన్న ? నిదానించి నడు ! విదారించు నెదన్, వట్టి ఎడారి తమ్ముడు" అని ఎండి పోయిన పెన్నానది గుండెలు వ్రయ్యలు చేస్తున్నదని, ఆవేదనతో "ఎదీ నీరు ? ఎదీ హోరు ? ఎదీ నీటిజాలు" అని నీటిచుక్క కోసం అలమ టించి పోయే ప్రజల వేదనకు రూపమిచ్చారు. "ఇంత మంచి పెన్నతల్లి ఎందుకెండిపోయెనో ! ఇంత మంది కన్నతల్లి ఎందుకెండిపోయెనో" అని వగచి, వగచి కక్కటిల్లిపోయిన కవి దుఃఖం హృదయాన్ని కరిగిస్తుంది.

బ్రిటీషువారి పరిపాలనలో రాయలసీమలో యథార్థంగా జరిగిన కథకు కావ్యరూపం 'ఒకనాడు'. 'తెల్లసైనికులు' నాగులమ్మ అనే తెలుగు పడుచును మానభంగం చేయబోతే హంపన్న అనే వీరుడు ప్రాణాలను తెగించి, ఆ సైనికుల నెదిరించి ప్రాణాలు కోల్పోయిన సంఘటనను శ్రీ విశ్వం వీర, కరుణరసాల సమ్మేళనంతో రమ్యంగా రచించారు.

'పెన్నేటిపాట, ఒకనాడు' అభ్యుదయ భావాలుగల ఆధునిక కావ్యాలు. వీటికంటె భిన్నమైనది, విశ్వంగారి వివిధ భావాలకు నిలయమైనది 'నా హృదయం'. సంస్కారపూరితమైన వాక్కు సమాజాభ్యుదయాన్ని కోరే రచనాశక్తి విశ్వంగారి కవిత్వంలో కన్పిస్తాయి.

## పురిపండా 'పులిపంజా'

అభ్యుదయ కవితోద్యమపు తొలిదశనుండి కవిగా, యువకవులకు తోడునీడగా నిలిచినవారు శ్రీ పురిపండా అప్పలస్వామి. భాషాశాసనచణులైన గిడుగువారికి శిష్యులై వాడుక భాషను విశ్వవిద్యాలయాల్లో ప్రవేశపెట్టే కృషిలో వీరు కొంతవరకు విజయాన్ని సాధించారు. భావకవులపై తిరుగుబాటు చేసిన యువతరానికి దివిటీ పట్టుకు త్రోవచూపిన కవి శ్రీ పురిపండా. "తొలినాటి సంద్రాలు తుహినగిరి శిఖరాలు/ఇంకిపోతున్నాయిలే! కుంగిపోతున్నాయిలే / నల్లమందేకాని కళ్లిప్పనంటావు/ రాతి గుళ్లకెకాని రానుపొమ్మంటావు/సుడిగాలి రేగిందిలే! పిడుగావులించిందిలే" (సుడిగాలి) అని బూజులా వేళ్లాడుతున్న సనాతన భావాలను వదలగొట్టటానికి ప్రయత్నించారు. అభ్యుదయకవులు అంతర్జాతీయమైన అవగాహనతో, వసుధైక కుటుంబ భావనకు ప్రోదిచేస్తుండగా పురిపండావారు మాత్రం మొదటినుండి జాతీయ మార్గగాములైనారు.

"పాలికాపును నేను/బందెబానిసను/మంటిలోనె బతుకు" అని దీనజనుల స్థితిని వర్ణించారు. 'గుడిలోన దైవమా ఆలింపవోయి, గుడిలోన దైవమా పైకిరావోయి' అని దైవాన్ని సంబోధించి "మాలమెట్టిన నేల, మాలమెట్టిన సీమ మైలపడిన"దనే కుహనా భక్తుల నుండి బయటపడి, వారిని ఉద్ధరించమని హెచ్చరించారు. సాంఘిక దురన్యాయాలపై పంజావిప్పిన కవిసింహం శ్రీ పురిపండా అప్పలస్వామి.

## తేన్నేటిసూరి 'అరుణ రేఖలు' - "మానవ స్వాతంత్ర్య మార్గ్నకొర్థాపైన రక్తాక్షరాలు"

అభ్యుదయ కవిత్వయుగంలో సాంఘిక విప్లవాన్ని కోరిన కవి శ్రీ తెన్నేటిసూరి. వీరి 'అరుణ రేఖలు'లో మాతృగీతి, మహోదయం,

కన్నీటికాలువ, పట్టిబయులు, స్వర్గానికి రోడ్డు, నీకవి, తిండి కావాలి, ప్రపంచవిప్లవం, కీలు గుఱ్ఱం 'గీతాలు వాక్కాక్కాకే వాక్కాక్క విస్ఫులింగం. "మానవ స్వాతంత్ర్య మార్గనకార్టాపైన రక్తాక్షరాలతో వ్రాలు చేసేశాను "అని కష్టజీవుల స్వేచ్ఛకై పరితపించారు. "విశ్వ కారాగార వీధిలో చెరవడ్డ విశ్వకార్మికులార ! నిగళబద్ధుల్లార....లెండోయి, లెండోయి, బ్రతికి లేవండోయి" అని ఉత్సాహాన్ని రగుల్కొల్పారు. బ్రతుకంతాభారం, క్రూరం, ప్రమాదాలతీరం, ఘోరం; పుట్టటమే మహా పాతకం, చావే యికమేలను కుంటూ నిరుత్సాహ పడకండోయ్" అని బాధల్లో వున్నవారిని వోదార్చి "యుగయుగాల మానవ కథనం స్వర్గానికి రోడ్డేస్తున్నదని" అభయ మిచ్చారు.

"తిండికావాలోయి, తిండికావాలోయి, మండేటి ప్రేగులకు తిండి కావాలి"- అన్ని అలంకారాలనూ వదిలివేసి కుండబద్దలు కొట్టినట్లు ఆకలి కేకలు వినిపించారు. శ్రామికుల పక్షాన నిలిచే కవులను ఆదరించమంటూ "నీ కవిని బ్రతికించుకోవాలిరా" అని హితవు చెప్పారు. 'సాహిత్య సమవకారం' అనే రచనలో సమకాలిక కవుల లోపాలను, బలహీనతలను హేళన చేశారు.

కష్టజీవులకూ, కార్మిక జనులకూ మహోదయాన్ని, నవయుగో దయాన్ని తోపించిన శ్రీ తెన్నేటి సూరి 'అరుణ రేఖలు' అభ్యుదయ కవిత్వంలో కాంతి మంతమైనవి: తీక్ష్ణమైనవి కూడ.

## పిలకా గణపతిశాస్త్రి - "అమ్మా మాదా కబళం తల్లీ !"

శ్రీ పిలకాగణపతిశాస్త్రి ఖండకావ్యాలు అధికభాగం భావకవిత్వమే. వారు ఆర్తితో రాసిన 'మాదా కబళం' మాత్రం అభ్యుదయ కవితకే తల మానికం.

"హోరని గాలి దుమారము లెగిరెన్
ఘోరని ధారావర్షము కురిసెన్
వీధులలో ఎవరో ! ఆ నీడలు

ఆకలితో ఏవేవో ఘోషలు !
అమ్మా మాదా కబళం తల్లీ !
అమ్మా పిల్లల మన్నం తల్లీ !''

అని ఆర్తితో పలవించిన కవి కంఠం చదువరులకు పేగుల్లో అలజడి రేపుతుంది. ఇదా మనదేశం ? అమ్మా పిల్లల మన్నం తల్లీ ! అని అడుక్కుతినే ముక్కుపచ్చ లారని పిల్లలున్న మనదేశం ఎటుపో తున్నట్టు ? ఈ గీతం విని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు 'ఇదేమి కవిత్వ మని' ఆక్షేపించి వ్యగ్రులయ్యారట ! ఉత్తమ కవిత్వం గుండెలు చీల్చుకు వస్తుంది, బాధలోంచే వస్తుందన్న సత్యం యీ గీతం ద్వారా మరోసారి ఋజువయింది.

శ్రీ గణపతిశాస్త్రి రాసిన 'వాన' అనేది మరొక అభ్యుదయగీతం. ''వానహాయిగా కురిసెనుగానీ ! కానీ లేని దరిద్రులకన్నీ / శ్శేనోన్లె యీ నీళ్ళల్లో ప్రవహి / స్తున్నాయిగదా ! ఓ కవితా!'' అని కరుణను కురిపించటమేగాదు, ''చాలని బియ్యపు నూకల కోసం / కూలిజనంతో ఎర్రనికంకర / ధూళివేడిలో గర్జిద్దామీ/నేలంతా వణికేదాకా-చిరవేదనలో/ లోలో కరిగి, సురిగి పోదామని'' కవితను ఆవాహన చేశారు.

తక్కువ గీతాల్లో ఎక్కువ అభ్యుదయాన్ని అందించిన శ్రీ పిలకా గణపతిశాస్త్రి కవితాశక్తి ఎంతైనా మెచ్చదగినది.

## సోమసుందర్-''జన్మెత్తిన మానవునకు జీవితమె పరమధనం''

''జన్మెత్తిన మానవునకు/ జీవితమె పరమధనం/అయితే అది ఒక మారే / అతని కొసగబడిన వరం'' అని పలికిన శ్రీ సోమసుందర్ అభ్యుదయ కవులలో ప్రముఖులుగా గణింపదగ్గవారు. 'వజ్రాయుధం' తర్వాత 'మిణుగురులు, సోమరసం - సుందరకాండ, మేఘ రంజని మొదలైన కావ్యాల్లో అభ్యుదయ భావాలకు దూరంగా జరిగినా మళ్ళీ 'అనల కిరీటం'లో అభ్యుదయ భావన కన్పిస్తున్నది.

"అదిగోఅదిగో ఫ్యాక్టరీ/ధనమదాంధ అధికారుల/కనికార రహిత గర్వం / ఆకృతియై నిలిచిన ఫాక్టరీ: అదిగోఅది పొగగొట్టం, ధనస్వామి నిర్దయవలె నించుని / భుగభుగమని / పొగలెగజిమ్మే చిమ్నీ" అంటూ యంత్రభూతముల కోరలుతోమే కార్మికుల నుద్దేశించి రాసిన గీతం సోమ సుందర్ గారి కవితల్లో విశిష్టమైనది. శ్రీ సోమసుందర్ అభిమానించిన తీవ్రవాద రాజకీయాలు 'వజ్రాయుధం' ద్వారా యువకులను బాగా ఆకర్షించాయి. భగత్సింగ్ త్యాగాన్ని "తొలితారక తేజం / యువవీరుని తేజం / క్రాంతి కాలజాగృతియై/లోకం ముంచెత్తివై చె"నని వర్ణించారు. "సమధర్మం, బాడుగగోజీలు, ఆకలినాలుకలన్నీ (వజ్రాయుధం); చీకటిని ద్వేషిస్తాను (అనల కిరీటం)" మొదలైన గీతాలు సోమసుందర్ గారి కవితాశక్తికి నిదర్శనంగా పేర్కొనదగ్గవి.

వజ్రాయుధం నాటి కవితాశక్తి శ్రీసోమసుందర్‌లో ఇప్పుడు లేక పోయినా అభ్యుదయ కవిత్వం మీద అభిమానం మాత్రం ఇప్పటికీ వున్నది.

## అనిసెట్టి - "అన్నా మనకీలోకం పన్నిన పద్మవ్యూహం"

అభ్యుదయ కవిత్వంలో శ్రీ అనిశెట్టి సుబ్బారావు 'అగ్నివీణ' చిరస్మరణీయమైనది. "భయం, భయం, బ్రతుకు భయం భయం !.... అన్నా మనకీలోకం పన్నిన పద్మవ్యూహం ! ఆశలతో బ్రతుకీడ్చే అస్థి పంజరాలు మనం, ఆవేదన హితమయ్యే ఆశాజీవులం మనం! గతమంటే కారు వెగటు, రేపంటే తగని భయం!" అని సామాన్యుని దుర్భర జీవితాన్ని, నిస్సహాయస్థితిని శ్రీ అనిసెట్టి రమణీయంగా వర్ణించారు,

'ఎవరి పిల్లలోయి మీరు'- వీరి రచనల్లో అత్యుత్తమమైన గీతం. 'బ్రిడ్జికింద, స్టేషన్లో, ధూళిమీద ఎటు చూచిన కనిపించే అనాధలను చూచి "ఈ లోకపు శాసనాలు ఎంగిలాకులిస్తాయి / ఇనప కమ్ములిస్తాయి" అని పరిస్థితులు చిన్నారి బాలల్ని బిచ్చగాళ్ళుగా నేరస్థులుగా చెయ్యటాన్ని గురించి ఆక్రోశించారు, "ఎవరి సంతతోయి మీరు! ప్రస్తుత సమాజ

దేహపు నుదుటి రేఖలా మీరు!....దిక్కులేని తమ్ములార! మిముచూస్తే రాతిగుండె జాలువారి ద్రవిస్తుంది / జాలిగుండె కర్కశమై నిలుస్తుంది/ జగతి నెదుర్కొంటుంది!'' అని ఆశావహులై సమాజంలో మార్పు రావాలని అభిలషించారు.

'బిచ్చగాడిపాట'లో శ్రీ అనిసెట్టి గుండెల్ని మండించి, కర్తవ్యోన్ముఖుల్ని చేసే భావాలు వెలువరించారు. 'శాంతి, రిక్షావాలా' మొదలైన రూపకాల్లో మూకాభినయంతో ప్రదర్శించడానికి వీలైనకవిత్వం రచించారు, శబ్దమేగాక నిశ్శబ్దం కూడ కవిత్వంలో శక్తినియ్య గలదని వీరు నిరూపించారు.

అభ్యుదయోద్యమం నిర్వీర్యమైనాక శ్రీ అనిసెట్టి సినిమారంగంలోకి నిష్క్రమించారు. ఉద్యమం చల్లారిపోయిన తర్వాత చెప్పుకోదగిన కవిత్వమేదీ ఆయన రచించలేదు.

భావతీవ్రతను వెలువరించడంలో శ్రీ అనిసెట్టి కొంత ప్రత్యేకత వున్నది. ఆయన గీతాలు ధారాశుద్ధితో గుండెల్ని చీల్చుకుపోతాయి.

## రెంటాల - 'పల్లకీ బోయీలు'

శ్రీ రెంటాల గోపాలకృష్ణ రచించిన 'సంఘర్షణ, సర్పయాగం' అభ్యుదయ భావాలుగల ఉత్తమ కావ్యాలు. వీరి 'పల్లకీబోయీలు' సామాన్య పాఠకుల్ని, కవితా రసజ్ఞుల్ని సమానంగా ఆకట్టుకొన్నది. మేనామోసే బోయీలు ''అడుగేర, అడుగేర ! వడివడీగ, తడబడక/ అడుగేర, అడుగేర'' అని ఊగు, తూగుతో నడుస్తూ పాడేపాటలో వాళ్ళ బాధలు వ్యక్తమౌతాయి. ''కటికీ రాళ్ళా నేల / కనిపెట్టి అడుగేయి/ సూదుల్లాంటి ముళ్లు/సూపు కనపడనోణ్ణి !''అని వొకరికొకరు హెచ్చరికలు చేసుకుంటూ నడుస్తుంటారు. వెలయాలి మొక్కు వెళ్ళబుచ్చబోయే పెద్దమనిషిని మోసే బోయీలు తమ కష్టాలను తలచుకుంటూ సాగిపోతుంటారు, ఇంటి దానికి జరం / పొయిలోను ప్పియ్యలేదు / సద్దీలేక

దొరగారి సావిట్లో ఉండాను''అని వెట్టిచాకిరితో సతమతమయ్యేబోయీల దీనస్థితి జాలి గొలుపుతుంది. ''రాళ్ళైనమోయొచ్చు/రథమైన లాగొచ్చు/గుండెలేని మనిషి/కూర్చున్న'' పల్లకి మోయలేక మోస్తూ భుజంమార్చు కునే బోయీల స్థితిని వర్ణించిన యీ గీతం అభ్యుదయ కవితా ప్రస్థానంలో ఒక మైలు రాయి.

''అదిగో! అరుణ పతాకం! పేదవారకు ప్రాణం/పీడిత ప్రజకాధారం'' అని రాసిన శ్రీ రెంటాల 1955 తర్వాత మార్క్సిస్టు సిద్ధాంత బలిమితో కవిత్వమేదీ రచించినట్లు కనపడదు.

'సంభవామి యుగేయుగే'లో అధర్మంప్రవర్తిల్లినచోట అభ్యుదయ కవిగా అవతరిస్తానంటారు. ''తల్లీ చల్లని శాంతి ధారుణి పండించవమ్మ/తల్లీ వెన్నెల కాంతి / ధారుణి నిండించవమ్మ'' అనే గీతం రసవంతమైనది. ఇంకా 'నగరంలోరాత్రి; శివధనువు'' గీతాలు జ్ఞాపకముంచుకోదగినవి.

అభ్యుదయోద్యమంలో కవిగా మేల్కొని ఉద్యమం ఆగిపోగానే సుషుప్తిలో మునిగిన కవి శ్రీ రెంటాల. వారు ఇటీవల చేస్తున్న రచనలు అభ్యుదయ సంబంధమైనవి కావు.

## గంగినేని - 'అరచేతిలో మృత్యువు'

'ఉదయిని' కావ్య సంకలనంతో శ్రీ గంగినేని వెంకటేశ్వరరావు అభ్యుదయ కవిగా ప్రసిద్ధి కెక్కారు. కమ్యూనిస్టు పార్టీని ప్రభుత్వం నిషేధించినప్పుడు, అభ్యుదయ కవిత్వం యువతరాన్ని ఉద్రూతలూగిస్తున్నప్పుడు శ్రీ గంగినేని కొన్నాళ్ళు రాజకీయంగా 'రహస్య జీవితం' గడిపారు, సిద్ధాంత బలంతో, పోరాటపు అనుభవంతో శ్రీ గంగినేని రచించిన ''అరచేతిలో మృత్యువు; ఓరాత్రీ; ఎర్రసముద్రం'' మొదలైన గీతాలు అభ్యుదయ భావుకులకు అమితంగా నచ్చాయి.

'అరచేతిలో మృత్యువు'లో ''జీవితం అసిధారావ్రతం / నూలుపోగు మీద సాము / మరణంపై తిరుగుబాటు / ఔను, మనం తప్ప

వీరులులేరు'' అని దేశక్షేమాన్ని కోరి ప్రాణాలకు తెగించి పోరాడినవీరుల సంకల్పబలం సులివెచ్చగా సోకుతుంది. ''దినగండాలు దాటలేక / దరిద్ర మహాజనావళి / మండీరణ జండా ఎత్తినది'' (ఎర్ర సముద్రం) అని ఎర్రజండా రెపరెపలు కష్టజీవుల కడుపు మంటలుగా వర్ణించారు. ''దయా ధర్మం ఉరితీసే ఉదయం ఒక్కనాటికైనా వద్దు'' అని రాత్రి సమయమే పోరాటానికి అనువైన దంటారు. శ్రీ గంగినేని కవితలో రాజకీయ సిద్ధాంత అవగాహన, కవితా శిల్పమూ చక్కగా మేళవించాయి.

అభ్యుదయోద్యమం శక్తిని కోల్పోయాక శ్రీ గంగినేని కంఠం కవిగా మూగ పోయింది. ఆనాటి ఆవేశం అంతరించి పోయింది.

## రామదాసు - 'నిష్క్రమణం'

శ్రీ బెల్లంకొండ రామదాసు రచించిన గీతాలు చాల తక్కువ. అవి కూడ సంపుటిగా రాలేదు. 'నయాగరా' కవుల్లో ప్రముఖులు శ్రీ రామదాసు. 'కల్పన' కవితా సంకలనానికి సంపాదకులలో వొకరు. అక్కడ కూడా చెదరివున్న రామదాసుగారి రచనలను కవితా రసజ్ఞు లెప్పటికీ మరచిపోలేరు. ''మానవ మేధస్సుకు / సంకెళ్ళను తగిలించిన/ గత సాంఘిక శిలాశాసనం/పడగొట్టను/పగిలిన నా నిప్పుల కంఠం/పలికిన విప్లవగీతం'' నాగీతమన్న రామదాసుగారి గళం ప్రతీప శక్తులపై రణభేరీ. ''కాలపు దారుల్లో చీకటి ముళ్ళను తొలగించాలని'' ఆయన కోరారు.

''బ్రతుకే ఒక క్రాస్/మనిషీ ఒక క్రైస్ట్'' అన్న యీ కవి బాధల ముళ్ళకిరీటాన్ని ధరించి సమాజంలో మార్పు కోరుతూ కవిత రచించారు. ''ప్రపంచమొక లంకానగరం / బ్రతుకొక అశోక వృక్షం/ నేను సీతను / లంకా దహనం ఎదురు చూస్తూ'' అధర్మ నిలయమైన లోకాన్ని దహించాలని ఆవేశపడ్డారు.

'నిష్క్రమణం'లో ''వెడతాను మరి, సెలవు / విడిచి వెడుతున్నాను నా కండ్లు....అర్థించాను-బోధించాను - తపించాను-శపించాను-

మానవుడా ! ఇది క్షంతవ్యం కాదుసుమా ! వెడతాను మరిసెలవు ! భూత కాల భూతశాలవదలి/వర్తమాన విషవర్తులాన్ని ఛేదించుకుని/భావికాలపు నల్లని ముసుగు ధరించి/ వెడతాను మరి,సెలవు - వినిపించెనేదో మెల్లని పిలుపు/మూయండి నావెనుక విశ్వపుతలుపు'' అని పలికిన కవి అర్థాంతరంగా తనువుచాలించటం తలుచుకుంటే శ్రీ నండూరి రామమోహనరావు అన్నట్లు గుండెకలుక్కు మంటుంది.[18]

శ్రీ రామదాసు కోరిన శ్రామిక లోకపు స్వర్గం ఏర్పడలేదు. ఆ సమాజాన్ని చూడటానికి తన కళ్ళు విడిచి వెడుతున్నాననటం కవిగా ఆయన తపనను తెలియజేస్తుంది. అభ్యుదయ కవులలో అత్యంత శక్తివంతమైన కంఠం రామదాసుగారిది.

## రమణారెడ్డి - ప్రజాకవికి బహిరంగ లేఖ

నమ్మిన రాజకీయ సిద్ధాంతాల ప్రచార సాధనంగా కవితను ఉపయోగించుకొన్న కవి శ్రీ కె.వి. రమణారెడ్డి. 'అడవి, భువనఘోష, అంగారవల్లరి' కావ్యాల్లో అభ్యుదయభావాలు దరిదాపు ప్రతి రచనలోనూ కన్పిస్తాయి. కవిత్వం సమాజ శ్రేయస్సును కోరేదైనప్పుడు అందులో కవి నమ్మిన రాజకీయాల ప్రచారం తప్పకుండ వుండాలని వీరు భావిస్తారు. వీరి పాండిత్యం వాక్కొక్కప్పుడు కవితకు బరువు అనిపిస్తుంది. సంస్కృత పదాలను అధికంగా ప్రయోగించటం, అన్వయ కాఠిన్యం వీరి కవిత్వాన్ని క్లిష్టం చేశాయి. శ్రుతిసుభగత్వానికి తోడ్పడేటంత వరకే కవికి ఛందస్సుతోపని అని వీరు అభిప్రాయ పడతారు. ''రక్తాశ్రువు: రణోన్మాది చిత్రపటం; స్టాలిన్ అస్తమయం; శ్రీశ్రీ'' వీరి కవితల్లో ఎన్నదగిన ఉత్తమ రచనలు. 'ఆంధ్ర కవిత్వ చరిత్ర' వివాదాస్పదమైనది. అందులో వీరు భావకవులను తూలనాడటం బాధాకరం.

రాజకీయోద్యమంలో 'రహస్య జీవితం' గడుపుతున్న ప్రజాకవి సుంకర సత్యనారాయణగారికి వీరురాసిన ''ప్రజాకవికి బహిరంగలేఖ'' వీరి

---

18. మహా సంకల్పం - ఉపోద్ఘాతం నండూరి రామమోహనరావు - చైతన్య భారతి - విజయవాడ - 1975

రచనలన్నిటిలో ఉత్తమమైనది. "జీవితం మసిపూసిన వదనం / జీవితం అఖండ భయసదనం/జీవితం గాలివీచని సాయంతనం" అని జీవితాన్ని నిర్వచించే ప్రయత్నమేగాక "సుంకరసత్తెం కంకర కొడుతున్నావటే" అని ఆప్యాయంగా పలకరించి ప్రజాకవిగా జీవితాన్ని సార్థకం చేసుకొంటున్నందుకు అభినందనలు తెల్పటం యీ గీతంలో విశిష్టత.

ఏ రాజకీయోద్యమంలోనైనా తగిన అవగాహనతో ముందుండి, కవిత్వమూ-రాజకీయాలూ వేరుకావని, సాహిత్యవేత్తల జీవితం దంత శిఖరాల్లో కాదని ఆచరణలో నిరూపించిన కవి శ్రీ కె. వి. రమణారెడ్డి.

## అజంతా - "ఆ కళ్ళవెనక దీపం వెలగదు"

అభ్యుదయ కవులలో 'కవీనాం కవిః' అనదగినకవి శ్రీ అజంతా. కవితనొక తపస్సుగా భావించి అతి తక్కువగా రచనలు చేసేకవి ఆయన. రాసిన గీతాలు తక్కువైనా ప్రతిగీతమూ అమోఘమైన సంచలనాన్ని సృష్టించింది. కవులు, కవితా రసజ్ఞులూ వాటిని కళ్ళకద్దు కొంటున్నారు.

అభ్యుదయభావుకుడైన శ్రీఅజంతా మార్క్సిస్టు సిద్ధాంతచట్రంలో ఇమిడి పోలేదు. రాజకీయ సిద్ధాంత ప్రచారానికి కవిత్వం రచించలేదు. ఏ పరిస్థితులలోను కవిత్వంలో శిల్పంతో రాజీపడలేదు. ఆయన గీతాల్లో 'చెట్లు కూలుతున్నదృశ్యం' ఎన్నో కావ్య సంకలనాల కెక్కింది. ఆయన జీవన వేదాంతం అంతా ఆ కవితలో నిక్షిప్తమైంది."ఆశలేదు ఆస్కారం లేదు/ఫలానా రోజు శాపం అఖరౌతుందనే హామీలేదు / ఫలానా రోడ్డు గమ్యం జేరుస్తుందనే సూచన ఎక్కడా ఏమీలేదు / జీవితం ఎప్పుడూ ఇలా కన్నీళ్ళ ప్రవాహంగానే సాగుతుం దనుకుంటాను / రోడ్డు పొడుగు నాచెట్లు కూలుతున్న దృశ్యాలనే చూపుతుందను కుంటాను" - నిరాశను వ్యక్తపరచే యీ గీతం ఆధునిక మానవుని నిస్సహాయతను, మానసిక ఏకాంతాన్ని, అన్నిటినీమించి ఏ వైపునుంచీ ఆశాలేశమైనా కనిపించని పరిస్థితుల సంకటస్థితిని శక్తిమంతంగా వెల్లడించింది.

చెట్లు కూలుతున్న దృశ్యం కన్పించకపోతే నిరుద్యోగి వెంకట్రావు ముఖం "గాలీవెల్తురు లేని గదిలాగ మరీఇంత దీనంగా ఎన్నడూ ఉండనే ఉండదు". "నిరుద్యోగి వెంకట్రావు రోడ్ల మీద నడుస్తూవుంటే/ సమీపంలో ఎక్కడా జనసంచారం ఉండదు.... ఎందుకో అకారణంగా సూర్యుడు ఖిన్నుడౌతాడు / ఆగ్రహం పట్టలేక భూదేవి బ్రద్దలౌతుంది/ ధర్మదేవత ఉన్న ఒకకాలూ విరుచుకుంటుంది" – ఆధునిక మానవుని నిస్సహాయస్థితిని ఇంతకంటె ఎవరు మాత్రం ఎక్కువగా చెప్పగలరు? నిరుద్యోగి వెంకట్రావును అజంతాగారు సృష్టించలేదు. ఆధునిక సమాజమే సృష్టించింది. వెంకట్రావు జీవితం మార్చాలనే అజంతాగారి కోరిక. వెంకట్రావులు భిక్షకుల్ని, చీమల్ని చూసి చావకుండ బతికేస్తున్నందుకు ఆశ్చర్యం ప్రకటిస్తారు.

శ్రీ అజంతా రచించిన "కొత్త సంవత్సరం: రోజూ చూస్తూనే వున్నాను: పరిత్యాగి పరివేదన; స్వ్యాన్‌రీల్; నడిచేసవి; క్షుద్ర సంధ్య; జెండాలకు కన్నీళ్ళులేవు;" ఇటీవల రచించిన 'అగ్నిస్పర్శ' అన్నీ ఉత్తమ కవిత్వాన్ని ఆదరించే వారు విడిచి పెట్టరానివే.

"ఎలక్ట్రిక్ స్తంభాలపైన/ఎర్రని అపాయాల మధ్య / చెట్లకింద సకుటుంబంగా తారసిలే/సంతాపాల మధ్య / నగరం అవయవాల లోపల/ నయం కాని గాయాల మధ్య / సూర్యుడురాని రోజుల మధ్య / గ్లౌలేని రాత్రుల మధ్య ... కండచీమల కుత్కలాల మధ్య / నీకూ నీనీడకూ మధ్య" 'కొత్త సంవత్సరం' సాక్షాత్కరిస్తుందన్న అజంతాగారి భావాల్లో గాంభీర్యం చదువరులను భీత చిత్తుల్ని చేస్తుంది. కాని మరోసంవత్సరం వస్తున్నదంటే సామాన్యుడికి, ఆ సంవత్సరం అజంతాగారు వర్ణించినట్లు కాక మరెలా కన్పిస్తుంది? మానవ హృదయాల అంతశ్చైతన్యాన్ని భావ చిత్రాలలో పట్టుకోగలిగిన ప్రతిభాశాలి శ్రీ అజంతా.

"నిరాశాజీవి కళ్ళ వెనుక అప్పుడే భూపతనమైన ఏడుపును/ శాఖోపశాఖలుగా వ్యాప్తమయే గర్భఘోషను / కొమ్మకింద కన్నీళ్ళలో నిష్క్రమణ గీతాలను/ రోజూ చూస్తూనే ఉన్నాను.... ఆ కళ్ళ వెనక

దీపం వెలగదు/అక్కడ సంగీతం వినపడదు" అని నిరాశామయలోకాన్ని చిత్రించిన శ్రీ అజంతా పరిస్థితులపై కదనశంఖం పూరించలేదు. యుద్ధం ప్రకటించలేదు. మాటల్లో విప్లవాలు రగిలించటం పట్ల వీరికి నమ్మకం లేదు. కరుణామయ దృశ్యాలను కవి ప్రదర్శిస్తే వాటిని సమాజంలో సరిదిద్దుకునే బాధ్యతను ప్రజలే స్వీకరిస్తారని వీరి వుద్దేశ్యం.

'సుషుప్తి'లో "ఎక్కడా ఎవరూలేరు/అంతా ఇళ్ళకు చేరుకున్నారు/ విద్యార్థి పుస్తకాలు మూసేశాడు / విదూషకుడు వేషం మార్చేశాడు/ వీధి గాయకుడు పాట ఆపేశాడు" - లోకమంతా సుషుప్తిలో వున్నా సజావుగా మాత్రంలేదు.

గుడిసెలో వెన్నెట్లో కార్మికులు కన్నీళ్ళు ఆరబెట్టు కున్నారు
కటకటాలమధ్య శూన్యంలోఖైదీలు ఆకాశయానం చేస్తున్నారు
పేవ్‌మెంటు మీద భిక్షకులు వాల్‌పోస్టర్లు కప్పుకున్నారు"

'సుషుప్తి' బాధలకు పరిష్కారంకాదు - కాని బాధల్ని మరపించే 'సుషుప్తి' ఎంత గొప్పది! "ఈ రాత్రి జీవితమనే పెద్దపులి ఎవర్నీ భయపెట్టదు....ప్రపంచం మీద గొడ్డళ్ళచప్పుడు రేపుగాని వినపడదు.... పోస్ట్ బంట్రోతు భయం ప్రొద్దున్నేగాని ఇప్పుడులేదు / దేశాలపాలైన కొడుకు సంగతి ఏ తల్లినీ ఇప్పుడు కలత పెట్టదు/. మిత్రుడు ద్రోహం తలపెట్టినా ఇప్పట్లో అది ఎవరికీ తెలియదు"-అని కఠోర వాస్తవాలను మదిలో మెదిలేటట్లు చేసి జీవిత వాస్తవాన్ని తెలిపి భయ పెడుతుంది యీ గీతం.

'పరిత్యాగి పరివేదన'లో "నన్ను నేనే పోల్చుకోలేక నాకు నేనే సహస్ర యోజనాల దూరంలో ఉన్నాను. నాచూపుడువేలు నిత్యం భయాలవైపే" అని నిత్య భయగ్రస్తుడైన మనిషి నిస్సహాయతను వర్ణించారు. "గగన కుసుమసౌరభం క్రింద స్పృహతప్పి పడిపోయాను" వంటి విచిత్ర భావవ్యక్తీకరణ వీరి కవితలో అడుగడుగునా కనిస్తుంది.

భారతదేశంపై చైనాయుద్ధానికి దిగినపుడు శ్రీ అజంతా మార్క్సిస్టు పంథాను ఆక్షేపించారు. "చైనా అధినేత మావో / కను

బొమ్మల కొమ్మలపై ఘృతేళికలు మరీ మరీ ఎరుపు/ఎఱ్ఱదనం రాజకీయ విద్రోహానికి గుర్తు/ఎఱ్ఱజండా మిత్రభేదానికి గుర్తు" అన్నారు. జండాలను జాతీయతను నమ్ముకొని యుద్ధాల మహాగ్నికి ఆహుతి అవుతున్న మనస్థితికి వగచి "జెండాలకు కన్నీళ్లు లేవు" అని హెచ్చరించారు.

"ఇంద్రదలు ప్రకం, గ్లౌ; ఘృతేళికలు" వంటి మారుమూల పదాలను ప్రయోగించిన శ్రీ అజంతా పాండిత్య ప్రదర్శనకోసం వాటిని ఉపయోగించలేదు. "Best words in their best order" అని Coleridge కవి చెప్పినట్లు ఎక్కడ ఏ పదం వాడాలో ఆ పదమే వాడారు. శబ్దసంగీతమూ, శబ్దసంవిధానమూ తెలిసి ప్రయోగించే అజంతా కవితా శిల్పాన్ని అందుకొని హృదయాలను రసప్లావితం చేసుకోవటానికి పాఠకులు శ్రమపడక తప్పదు. అజంతాగారి కవితాశక్తిని గుర్తించిన వారు దాన్ని జీవితాంతమూ విడిచిపెట్టలేరు.

## బైరాగి - "హృదయపు మెత్తనిచోటుల గీరే జంతువు ఆకలి"

"కత్తిరించిన ఒత్తులే వెలుగుతాయి దివ్యంగా / బాధా దగ్ధకంఠాలే పలుకుతాయి శ్రావ్యంగా" అని ప్రపంచపు బాధనంతా తన కంఠంలో పలికించిన ఉత్తమ కవి శ్రీ ఆలూరి బైరాగి. ఆయన కవిత్వం చిక్కనైన భావగాంభీర్యంతో ఆలోచనామృతంగా వుంటుంది. 'చీకటి నీడలు, నూతిలో గొంతుకలు' రెండూ విశిష్టమైన కావ్యాలు. అభ్యుదయ కవిత్వం మార్క్సిస్టు తత్త్వశాస్త్ర పునాదిలో ఉన్నత స్థానాన్ని పొందుతున్నప్పుడు శ్రీ బైరాగి ఆ తత్త్వాన్ని వదలి, మానవతా వాదాన్ని నమ్మి, రాడికల్ హ్యూమనిజంతో ప్రాభావితులై విలక్షణమైన కవిత రాశారు.

"శబ్దాల అసమర్థత ప్రతి కవికీ ఏదోవొక సందర్భంలో తట్టే ఉంటుంది. కవితాకామిని చేలాంచలాల కొసవిసురులు ఎప్పుడూ ఒక బారెడు దూరానే మాయమైనట్లు అగుపిస్తాయి" అని భావప్రకటనలో చిక్కును శ్రీ బైరాగి వెల్లడించారు. బైరాగిగారి విషయంలో యీ అభిప్రాయం నిజం కాదని, "బైరాగికి మాత్రం ఆ కొసవిసురులు దూరాన

మాయమైనట్లుగాక దగ్గరగా వచ్చినప్పుడు అతనిని నిలువునా నిమిరి. అంతరంగాన్ని పలకరించేవి'' అని శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి బైరాగి శక్తిని కొనియాడారు.[19]

సమాజంలో ఆర్థిక వ్యత్యాసాలు మనుష్యులనెంత క్రుంగదీస్తున్నదీ- ఆకలి మంటలు ఎందరి జీవితాల్ని బలిగొంటున్నదీ బైరాగిగారు తీవ్రమైన భాషలో వెల్లడించారు. ''హృదయపు మెత్తని చోటుల గీరే జంతువు ఆకలి'' అని వర్ణించి, ఆకలి కమ్మిన కళ్ళకు ప్రపంచం కనిపించదన్నారు. ''మీ హేమాసవ పాత్రల్లో, మీ స్వప్నజగతి యాత్రల్లో మా అశ్రుధార నింపేస్తాం, మీ బాటను జారుడు చేస్తాం / పానకపు పుడకగా వస్తాం, టీ కప్‌లో ఈగై చస్తాం, మా ప్రాణాలైనా విడుస్తాం, మీ శాంతిని భగ్నం చేస్తాం'' అని ఆకలిజీవుల ప్రతినిధియై విప్లవానికి దారితీశారు. ''పేద జనుల స్వేదధార/మానధనుల అశ్రుధార/ఆకాశపు కళ్ళలోంచి/కట్టలు తెగి పొరలుతోంది- అది తుఫానై ముంచెత్తుతుంది/ఆగబోదు ఈ తుఫాను/ఆగరాదు ఈ తుఫాను/మీ మేడలు మునుగువరకు/మీ కోటలు కూలువరకు/మీ అంతఃపురకాంతలు/భూమిపైన దొరలువరకు/శోకంతో పొరలు వరకు/ఆగరాదు ఈ తుఫాను'' అని శ్రామికలోక మహాశక్తికి విజయం కలగాలని కోరారు. ఆ శక్తిని ఎవరూ అడ్డలేరని హెచ్చరించారు.

అభ్యుదయ కవుల కావ్యవస్తువుల్లో సంఘ దురన్యాయానికి గురవుతున్న 'వేశ్య' కూడ వొకటి. ''ఎరువిచ్చిన శృంగారం/నీ తళతళ మెరిసిన గాజులు/నీ గిల్టు చంద్రహారం/అణాపూలు/కానీ తాంబూలం/నలిగిన చీరలు/చీకటి ముసుగులు/ఇదా నీకు జీవితమిచ్చిన బహుమానం? ఈ సౌందర్య ప్రపంచదానం? అని ప్రశ్నించి. కరుణాదృష్టిని బరపి. నికృష్ట జీవితం గడుపుతున్న వేశ్యలపై జాలి కలిగించారు శ్రీ బైరాగి.

'తాజమహల్ పడగొట్టండోయ్!' అనే గీతం బైరాగిగారి రచనల్లో ప్రత్యేకంగా పేర్కొనదగినది. సౌందర్య నిలయమైన తాజమహ

19. ఆలూరి బైరాగి సంస్మరణ సంచిక - 'సావాడు' - దేవులపల్లి కృష్ణశాస్త్రి- మద్రాసు 1979.

లను కవులు ఎందరో ఎన్నో విధాల వర్ణించారుగాని, దాన్ని "ప్రభు ప్రేమల కుళ్ళు వాసనలు/మాకవి బీభత్సకల్పనలు/మాకెందుకు షాజహాన్ ప్రణయం/మానవ శ్రమమింగిన ప్రళయం/ఈ కుళ్ళిన విలాస చిహ్నం/ తాజమహల్ పడగొట్టండోయ్ / రాయి రాయి విడగొట్టండోయ్" అని తాజమహలును పడగొట్టమనీ, అది కష్టజీవులను వెక్కిరించే శిల్పమనీ అన్నవారు మరెవ్వరూ లేరు. "ప్రేమకు గురుతు పన్నీరా ! వెచ్చని బాధల కన్నీరా !" అని వాపోయి బైరాగి శ్రీశ్రీగారిలాగే తాజమహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీల గురించి తపనపడ్డారు.

'నూతిలో గొంతుకలు' సంశయ కావ్యం. దీనిలో మానవుడు ఏది త్రోవ ? అనే అడుగుతున్నాడు. 'నాన్యఃపథా విద్యతేఽయనాయ' అని చెప్పగలిగేస్థితిలోలేడు. చీకటితో ప్రారంభమైన ఈ కావ్యం 'ఆవేదనల ఆనంతంలో అంతమైన జీవితాలను' గురించి చర్చిస్తుంది. దీనిలో నాయకులు "హేమ్లెట్, అర్జునులు, రాస్కోల్నికోవ్". సందిగ్ధావస్థలో ఒకక్రమ బద్ధమైన పరిణామాన్ని సూచిస్తున్నారు. హేమ్లెట్ వేదన కర్మ పూర్వం. అర్జునుడి వేదన కర్మక్షేత్రంలో తక్షణికం. రాస్కోల్నికోవ్ బాధ కర్మ తరువాత. కాని ముగ్గురి బాధ ఒకేస్థాయిని అందుకొంటుంది. అదిమానవుని సహజవేదన" అని శ్రీ బైరాగి తొలిపలుకులో చెప్పారు. "ప్రపంచంతో ఏకమైననాడే కవి కంఠం సరిగా పలకగలుగుతుందని నా నమ్మకం. ప్రపంచానుభూతిలో స్వీయానుభూతి పరమైనప్పుడే ఉత్తమ కవిత ఉద్భవిస్తుందని నావిశ్వాసం" అన్నారు శ్రీ బైరాగి. ఆయన విశ్వసించినట్లే అటువంటి ఉత్తమ కవిత రచించి ఆధునిక కవితకు గౌరవం చేకూర్చారు. "విదూషకుని విషాదం / ఉన్మత్తుని ఆహ్లాదం / వేశ్యల విషాదం / ఓంకార ప్రణవనాదం" అన్న బైరాగి గారి కవిత పఠితల్ని ఉక్కిరి బిక్కిరి చేసి, అంతర్ముఖుల్ని చేస్తుంది. ఈ సంశయజగత్తులో మనిషికి కావలసింది నమ్మకం. "నాకొంచెం నమ్మక మివ్వు" అని శ్రీ బైరాగి వేడుకున్నారు.

T. S. Eliot - The waste Land వంటి కావ్యం 'నూతిలో గొంతుకలు'. దీన్ని పూర్తిగా అర్థం చేసుకోవటానికి పఠితలకు చాల

సంస్కారం కావాలి. పాండిత్యం కావాలి; లోకానుభవం కావాలి. కావ్యం ఏకొంత అర్థమైనా బైరాగిగారి ప్రతిభ చదువరిని ఆకర్షిస్తుంది. పాఠకుడు ఎదిగే కొద్దీ యీ కావ్యం మరింత సన్నిహిత మౌతుంది.

> ''సింహానికి పంజానిచ్చి ఏనుగకు దంతమిడిన మహానుభావా !
> మ్యూటనీ లేనివేళ మా మొరాల కించవయ్యా ? దేవా !''

అన్న కవి చమత్కారంలో విషాద గాంభీర్యం అర్థం చేసుకుంటే, ఆధునిక కవిత్వమంటేనూ, శ్రీ బైరాగి కవిత్వ మంటేనూ ఎనలేని గౌరవం కలుగుతుంది.

## జలసూత్రం ఆశ్వాసాంతం

'పేరడీ'ల రచనతో తెలుగు సాహిత్యంలో సుస్థిరస్థానాన్ని సంపాదించిన శ్రీ జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి ఉత్తమ అభిరుచులుగల కవి, విమర్శకుడు. కవి హృదయంలోకి దూరి, కవిని వశపరచుకొని, పునర్జన్మ ఎత్తి ఆ కవిని పేరడీ చేసి తెలుగు కవిత్వంలో అపూర్వమైన ప్రయోగానికి మూలపురుషులయ్యారు. శ్రీ జలసూత్రం రచించిన కవితలు తక్కువే. అవికూడ సంపుటంగా రాలేదు. ఆయన రచనల్లో 'ఆశ్వాసాంతం'; 'ఆసుపత్రి కోకిల' ప్రసిద్ధమైనవి.

'ఆశ్వాసాంతం'లో ఆయన వేగంగాసాగిపోతున్న కాలప్రవాహాన్ని వొదుపుగా కౌగిలించుకుని, ఆ ప్రవాహం తన కౌగిలినుండి జారిపోగా, తబ్బిబ్బై ఆ ఆనందాన్ని మాటల్లో పెట్టారు. కొత్త దనాన్ని ఎంతో ముందుగా ఆహ్వానించి స్వీకరించటం జలసూత్రం గారి గొప్పతనం. గతించిపోయిన కాలానికి వగచక, గతస్మృతులను నెమరు వేసుకుంటూనే కొత్తకుస్వాగతం చెప్పటం ఆయన విశిష్టత. ఇంతకుమించిన అభ్యుదయం మరేముంది ? ''లలాటాన కుంకు మాగ్ని / బుజంమీద మబ్బుదుబ్బు/ కాళ్ళకింద కిర్రుచెప్పు / అంగోస్త్రం పొడుం కాయ / వ్యవధిలేని అవధానం, వెళ్ళిపోయిం దెళిపోయింది''అనటంలో అవధానంపట్ల జలసూత్రం గారికి గల ప్రీతీ – 'వ్యవధిలేని' అనటంలో అవధాన కవిత్వం ఏమీ

మిగల్చకుండానే వెళ్ళిపోయిందన్న ధ్వనీవున్నాయి. వడ్డాది, పానుగంటి, చెళ్ళపిళ్ళ, చిలకమర్తి కవుల కవితను, తాటికాయ నీటికాద (ప్రతాప రుద్రీయంలో పిచ్చివాడిపాట) పుల్లు మూసు బైర్రిటటా (గిరీశం ప్రేమ గీతం): ప్రచారణి, చింతామణి (గ్రంథ మాలలు) వెళ్ళిపోయాయి; భావ కవిత్వమూ వెళ్ళిపోయింది-కాలప్రవాహంలో అతివేగంగా మారిపోతున్న ఫేషన్లు, విలువలు, కళాభిరుచులు - అన్నిటినీ మక్కువతో స్పృశించారు. రాయప్రోలు దేశభక్తి, విశ్వనాథ విసురుళ్లూ, డాడాయిజం, ఇమేజిజం వెళ్ళిపోయాయి.

వైజాగులో కొత్త గద్ద (శ్రీ శ్రీ) 'ఎముకముక్క చేదుపాట' (శ్రీశ్రీ కవిత); లేతవాళ్ళ దారులకే దిగివచ్చిన కృష్ణశాస్త్రి, పఠాభికవి ఫిడేల్ డజన్, పిఠాపురం యువరాజా కవిత్వం, అశాంతిలో ఇంద్రకాంతి (ఇంద్రగంటి కవిత) పూరిలో పురిపండా - ఆధునికమైన, కాంతిమంత మైన అన్నిటినీ "అతిపూజిత అతికామిత అతివాస్తవికాకారం/ఆహార్యం, ఆచారం వొచ్చేశా యొచ్చేశాయి" అని అభ్యుదయ కవిత్వానికి స్వాగతం చెప్పారు. ఆధునిక కవిత్వాన్ని అర్థం చేసుకొని, అనుభవించి, పలవ రించిన కవి విమర్శకుడు శ్రీ జలసూత్రం. 'ఆసుపత్రిలో కోకిల' జలసూత్రం గారి ఊహోవైచిత్రికి చక్కని నిదర్శనం.

శ్రీ జలసూత్రం కవిత భావకవిత్వాన్ని అభ్యుదయ కవిత్వాన్ని కలిపే కొలికిపూస. 'పేరడీ'లలో అనితరసాధ్యం ఆయన మార్గం.

## నారాయణరెడ్డి : "ఎందుకీ ధరణీతలమ్మున ఇరుకువాడలు"

స్వాతంత్ర్యానంతర కాలంలోనే శ్రీ సి. నారాయణరెడ్డి కవిత్వం రచించటం ప్రారంభించారు, తెలంగాణ విముక్తి సమరంలో కవిగా ఆయన పేరు వినిపించదు, చారిత్ర కేతివృత్తాలు స్వీకరించి, వాటిలో ప్రణయగాథలకు కొత్త అందాలు కల్పించారు. పద్యాలుకూడ రచించారు గాని వారికి మాత్రాఛందస్సులపై మమకారమెక్కువ, క్రమంగా సమ కాలిక సమాజంలో ప్రజల కష్టాల నర్థంచేసుకొని అభ్యుదయ కవిత్వం

రచించారు. మాత్రాఛందస్సులేగాక ఆధునిక కవితావాహికమైన వచన కవిత్వంలో ప్రయోగాలు చేశారు.

"రేపటి వుదయం నాలో/లోపల గుసగుసలాడెను/మనిషీ! నీ భవిష్యత్తు/మహోజ్జ్వలంగా వుందని" శ్రీ సి. నారాయణరెడ్డి భవిష్యత్తుపై ఆశలు కల్పించారు. 'లోకాలోకము' (దివ్వెలమువ్వలు) లో "నింగిలోపల లేవు ఎల్లలు/నీరధిని కనరావు ఎల్లలు/ఎందుకీ ధరణీ తలమ్మున/ఇరుకువాడలు, ఇనుప గోడలు?/అన్ని జాతులకొకే సూర్యుడు/అన్ని నేలలకొకే చంద్రుడు / అయినచో జాత్యహంకారము / ఆటవిక తత్త్వము కాదా" అన్నారు. మనిషికీ మనిషికీ మధ్యన అడ్డుగోడలు తొలగిపోవాలని ఎన్నోవిధాలుగా శ్రీ నారాయణరెడ్డి ప్రబోధించారు. గురజాడపై స్తుతిగీతంలో" కులమతమ్ముల ఉక్కుడెక్కల/నలిగిపోయెడు మాలలంగని/అల్లనాడే కంటనీరిడి/నట్టి వెన్నెల మనసు నీయది" అని కైమోడ్పు ఘటించారు.

శ్రామికుల్ని గురించి పేదలను గురించి రాసినప్పటికి నారాయణ రెడ్డిగారి కావ్యాల్లో మధ్యతరగతి వారి కష్టసుఖాలెక్కువగా కన్పిస్తాయి. 'మధ్యతరగతి మందహాసం'లో విల్లులా వంగిన వెన్నుపూసతోనే విజయదశమి జరుపుకునే మధ్యతరగతి వారి జీవితాన్ని వర్ణించారు. సన్నజాజి పూలమ్మే కుర్రవాడూ, 'పసులపోసి'వంటి బడుగు జీవులుకూడ వారి రచనలో సజీవమూర్తులై నిలిచారు.

ఆధునిక నాగరికత మనిషిని మృగంగా మారుస్తున్నందుకు ఆందోళన చెంది "ఎక్కడికి పోవాలి మనం?" అని ప్రశ్నించి "జీసస్ ప్రాకిన సిలువ పందిరిలోకి / బాపూ విడిచిన చివరి ఊపిరిలోకి" అని జవాబు చెప్పారు. 'ప్రత్యేక తెలంగాణ' ఉద్యమం ఒక పీడ కలగా ఆంధ్రదేశాన్ని పట్టి పీడిస్తున్నప్పుడు బాధ్యత యెరిగిన కవిగా ఆయన సమైక్యతను ప్రచారం చేశారు. దేశభక్తులైన విప్లవవీరుని ఉరితీసిన సంఘటనకు స్పందించి వీరు రాసిన 'ఉదయానికి ఉరి' ఒక ఉత్తమ గీతం. "సత్యం సంకెళ్లలో నలుగుతుంటె/శాంతం లాఠీపోటుల మూల్గు

తుంచె/పక్షి వధను చూసినప్పుడు / రాశిల్లిన శాప కవిత / మళ్ళీ మళ్ళీ ప్రభవిస్తుంటుంది/సంకెళ్లలో నవచ్ఛందం పుడుతుంది'' అని వీరు ఆశించటం మున్ముందు రాయబోయే వీరి కవితపై పాఠకులకు ఆశలు కల్పిస్తున్నది. ''ఆకలి వాకిట కేకలుపెట్టిన/ఆరని బాధల అంచులు ముట్టిన'' జ్వాలాశిశువుగా వీరు శ్రీశ్రీని అభినందించారు.

ఒక ఇజానికి కట్టుబడిన కవి కారు నారాయణరెడ్డి. సమకాలిక సంఘటనలు తనను ప్రేరేపించినపుడు కవిగా స్పందిస్తారు. శుభాశుభ సంఘటనలన్నిటికీ ఆయన ప్రతిధ్వనిగా గీతాలు రచించి సంపుటాల కెక్కిస్తున్నారు. సభల్లో కవితాగానం చేయటంలో వీరు శ్రోతలను సమ్మోహపరుస్తారు.

ప్రేమగీతం రచించినా ప్రగతిమార్గంలో పయనించినా నారాయణ రెడ్డిగారి వాణి నాజూకైనది. ఒక్కసారి చదివితే మళ్ళీమళ్ళీ చదవాలనిపిస్తుంది.

## గోపాల చక్రవర్తి 'ఆనందం జీవనది'

''జీవితం కరిగిపోయే మంచు
ఉన్నదాంట్లో నలుగురికీ పంచు''

అని జీవిత సత్యాలను అవలీలగా అతి తేలికైన మాటల్లో రసవంతంగా పలికిన కవి శ్రీ గోపాలచక్రవర్తి. చమత్కారం ఆయన కవిత్వానికి ప్రాణం. చేదు జీవితాన్ని విషాద గాంభీర్యాన్ని ఆయన అత్యద్భుతమైన హాస్యరీతిలో మేళవించి, అభ్యుదయ కవులలో తనకొక ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకున్నారు.

'కలం కలలు, ఆనందం జీవనది' కావ్యాల్లో శ్రీ గోపాలచక్రవర్తి వాగ్వైచిత్రి శ్లేషైకమయమై ఇంపుగొలుపుతుంది. ఆయన 'రేపు మనది' అనే ఆశావాది. ''అంగీ లోపల అగ్నిపర్వతం వున్నా/చిరునవ్వు మనసారగా నవ్వు, సగటు మనిషీ! ఆకలికీ అన్యాయాలకూ గోరీకట్టు/ నిరుద్యోగం పరపీడనా నిలువునా పాతిపెట్టు / ప్రపంచ జనతాసభ నుండి

శోకాన్ని వాకౌట్ చేయించు సమతావాదీ!'' అని సామాన్యులకు ఉత్సాహం కల్పించే అభ్యుదయవాది.

ఆకలి కాని వనమూలిక అమ్మకానికి వచ్చింది / ఆనందం అసలు పేరు / కవిత్వం మారుపేరు / కావలసిన వారు తీయండిసార్ ''అన్నప్పుడు కవి చమత్కారం మనస్సును రసప్లావితం చేస్తుంది. 'నిరుద్యోగి స్వగతం'లో ''శరత్కాలమేఘం కంటె / తెల్లనైన కుక్కపిల్ల /మనకంటె ఎంతో నయం/దానికాలోచనలు రావు/దానికి సమస్యలు లేవు'' అనుకునే నిరుద్యోగి జీవితం జాలిగొలుపుతుంది.

'సంధిపత్రం; యువకవి నిష్క్రమణ: యౌవనం' మొదలైన గీతాలు జ్ఞాపకముంచుకోదగిన రసవద్రచనలు. ''పడుచుదనం ఒక అరబ్బీ గుర్రం/తప్పిదాలు దానిడెక్కల జాడలు'' అని జీవితంలో ఏ స్థితినైనా చిరస్మరణీయం చేయగలనేర్పు వాడుపు చక్రవర్తిగారి కవిత్వంలో విశిష్టమైనవి.

## భీమన్న 'గుడిసెలు కాలిపోతున్నై'

'పాలేరు, కూలిరాజు' నాటకాలు రాసినప్పటినుండి శ్రీ బోయి భీమన్నలో అభ్యుదయ భావాలున్నా, ఆయన కవిత్వం ప్రధానంగా 'రసాద్వైతం'. ప్రణయ కవిత్వమే ఎక్కువ. 'గుడిసెలు కాలిపోతున్నై' కావ్యం ఆయన అభ్యుదయ భావాలకు దర్పణం. మార్క్సిస్టు సిద్ధాంతంపై విశ్వాసం లేకున్నా, వీరు దారిద్ర్యపు బాధల్ని స్వయంగా అనుభవించి, పేదల జీవితాలు బాగుపడాలని కోరిన అభ్యుదయవాది. కుహనా సంస్కర్తలు దారిద్ర్యాన్ని ఏదోలాగ మిగిల్చి వుంచుతున్నారని వీరి ఆందోళన. ''ధర్మసంస్థాపనార్థం/ఈ గుడిసెలు/మళ్ళీమళ్ళీ అవతరిస్తుంటై- ఈ విషవలయం సాగడం/ఎంతవరకు? రహస్యం గుడిసెల వాళ్ళకు తెలిసేవరకు?'' అని అట్టడుగున వున్నవారిని కళ్ళు తెరవమని ఉద్బోధించారు. వీరు రచించిన 'జన్మాంతరవైరమ్'లో అంటరానితనంలో మగ్గుతున్నవారి బాధల్ని వర్ణించారు.

"ప్రార్థనలు, భజనలు అన్నీ / వట్టి శవ జాగారాలు/మతమూ, భక్తి నశించకుండా ప్రగతిలేదు మనిషికి!" అని వీరివిశ్వాసం. ప్రణయము, ప్రగతి రెండూ కలగలిసిన వీరి కవిత్వంలో అభ్యుదయభావాలు కాల్పనిక రీతిలో వ్యక్తమౌతాయి.

## బాపురెడ్డి - 'మనిషిని ఆరాధించే మనిషి'

శాస్త్రవిజ్ఞానయుగంలో జీవిస్తున్న ఆధునిక మానవుడు సాధించిన విజయాలను కొనియాడి, ఆ ఫలితాలు సామాన్యులకు సైతం అందు బాటులోకి రావాలని అభిలషించే కవి శ్రీ జె. బాపురెడ్డి-వీరి 'రాకెట్టు రాయ బారం' చక్కని సందేశ కావ్యం.

'పాడేరుపాట, అరకులో అభ్యుదయం' మొదలైన రచనల్లో వీరు గిరిజనుల జీవితాల్ని బాగుపరచటానికి ప్రభుత్వం తలపెట్టిన ప్రణాళికలను ప్రస్తుతించారు. 'కూలివాడు కుబేరుడు'లో పొదుపు ఉద్యమాన్ని ప్రచారం చేశారు, మొత్తంమీద యీగీతాల్లో కవిత్వం కంటె ప్రచార ధోరణి హెచ్చుగా కన్పిస్తుంది.

"మనిషినిమించిన / మహాశక్తిలేదని / మనిషినే ఆరాధిస్తున్న/ మనిషిని నేను" (మనిషిని చదువుతున్నాను) అని మానవత్వంపై విశ్వా సాన్ని ప్రకటించారు శ్రీ బాపురెడ్డి. "ఈ నదులు మన ఎదలు/ ఈ కొండలు మనకండలు / ఈ గనులు మన కనులు / ఈ పొలాలు మనబలాలు / ఇవి మన అందరికోసం / ఇది మన భారతదేశం" అని సస్యశ్యామలమూ, గనుల సంపదలో రత్నగర్భ అయిన భారత దేశంలో ప్రజలు సుఖించటానికి కొన్ని అడ్డంకులున్నాయి - "పల్లెటూళ్ళ పండు వెన్నెల్ని ఎత్తుకుపోయి / పంజరాలలో బంధించి/పట్టణవీధుల్లో అమ్మే/ పాపిష్టికరాలు ప్రజాసంపదను దోచుకుంటున్నా"యని, ఆ కరాలను బంధిం చాలని వీరు భావించారు. (ప్రజాశక్తి ప్రహ్లాదుడు) "సాయుధ విప్ల వాలతో / సాధించలేని / సంఘసంస్కరణను / సాహితీ సౌరభాలతో సాధించిన కీర్తి శృంగం / కందుకూరి వీరేశలింగం" వీరికి ఆదర్శం.

ప్రచారధోరణిని తగ్గించుకుని, వ్యంగ్యాన్ని ఆశ్రయిస్తే వీరి కవిత మరింత రసవంతం కాగలదు.

## 'అభ్యుదయ కవిత్వం మారాకు హత్తింది'

1960 తర్వాత అభ్యుదయ కవిత్వం పూర్వశక్తితో కాకపోయినా, మళ్ళీ చిగురించి కొన్ని పూలుపూసింది. కవితా పరిమళం వెదజల్లింది. ఈదశలో శ్రీయుతులు గజ్జెల మల్లారెడ్డి, కేశవరావ్, కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు, సి. విజయలక్ష్మి, వరవరరావు మొదలైనవారు అభ్యుదయ భావాలతో కవిత్వంలో ప్రగతిభావాలు నిలిచి వుండేటందుకు తోడ్పడ్డారు.

## మల్లారెడ్డి 'వజ్రజిహ్వ'

శ్రీ గజ్జెల మల్లారెడ్డి కవిత్వంలో రాజకీయ వ్యంగ్యం అధికం. సమకాలిక సంఘటనలను అభ్యుదయ కవిగా వ్యంగ్యంగా వ్యాఖ్యానించి ఆయన పాఠకులను ఆకర్షించారు. మూఢనమ్మకాలను హేళన చెయ్యటంలో ఆయనకలం 'వజ్రజిహ్వ'. ''ఈమధ్యను యెటుజూచిన/ఎన్నెన్నో చోద్యమ్ములు / విద్యాధిక వర్గంలో / వింత వింత దృశ్యమ్ములు? పాంట్లు బూట్లు బుష్‌కోట్లూ / పైనేమో బోడిగుండ్లు / ఈవినింగు హేటుల్లో ఎంచక్కని / మగ విధవలు'' - ఈ గీతంలో వ్యంగ్యం చురుక్కు మనిపిస్తుంది. మేధావుల తలలపై మూఢత్వం మేటగట్టినదని, ''తెలుగునాట భక్తిరసం తెప్పలుగా పారుతోంది; డ్రెయినేజీ స్కీము లేక దేంజరుగా మారుతోంది'' అన్నప్పుడు హాస్యం వెనుకవున్న వాస్తవం సహృదయుల్ని కదిలిస్తుంది.

'మల్లారెడ్డి గేయాలు, శంఖారావం' కావ్యాల్లో మన ప్రజాస్వామ్యంలో 'ఇంటర్వ్యూహం': 'సత్యంవధ-ధర్మంచెర; ఎం. ఎల్. ఏ.; సందేహదోల; పేరిగానిదర్బారు; యక్షప్రశ్నలు గీతాల్లో చేదునిజాలను శక్తిమంతమైన వ్యంగ్య రీతిలో అందించారు. 'ఎద్దుమార్కు పెద్దదొరలు' మొదలైన పదబంధాల్లో వీరిహేళన దూషణస్థాయికి దిగజారింది. వీరి

శంఖారావం శ్రీ ఆర్వీయార్ అన్నట్లు 'మాత్రాబద్ధ శంఖారావ'మై,[20] కవిత్వాన్ని సరిగాఅందించలేక, వ్యక్తిగతమైన ఇష్టానిష్టాలకు పరిమితమై పోయింది.

అభ్యుదయ కవిత్వపు పునర్వికాస దశలో శ్రీ మల్లారెడ్డి కవిత్వం విశిష్టమైనదిగా చెప్పవచ్చు.

## సి. వి. 'కారు చీకటిలో కాంతిరేఖ'

అభ్యుదయ కవిత్వం పీడవిరగడైందని సనాతనులు భావకవులు సంతోషిస్తున్న సమయంలో నిప్పుచల్లారి పోలేదన్నట్లు, మళ్ళీ వేడిని ప్రసరింప జేసిన కవి సి. విజయలక్ష్మిగారు.

దినపత్రికల్లో దేశంలో జరుగుతున్న అన్యాయాలు, వార్తల రూపంలో వచ్చినవి వచ్చినట్లే స్వీకరించి, ఆందోళన చెంది ఆవేశంతో రాజకీయోపన్యాస పద్ధతిలో వీరు కవిత్వం రచించారు. వీరికి కవిత్వం 'త్రినేత్రం'. ''బాధనుండి కవిత్వం, బాధను గురించి కవిత్వం, బాధలో నుంచి కర్తవ్యబోధ'' విజయలక్ష్మి గారి కవితాతత్త్వం'.

సి. వి. గారు 'విషాద భారతం, కారుచీకటిలో కాంతిరేఖ' కావ్య సంపుటాలు; ప్రజలకు విజ్ఞానాన్ని అందించే కౌటిల్యుని అర్థశాస్త్రం, పారిస్ కమ్యూన్ మొదలైన కవితా రూపమైన రచనలు వెలువరించారు.

> ''ఏమిటండీ యిది లోకమా ? కాక విషం కలిసిన రుచి పాకమా?
> దరిద్రుని ఆకలిగోడు కష్టజీవి జీవితమే బీడు
> వర్గాలతో యున్న నేటి సంఘం మానవ జీవిత ప్రతిష్టకే భంగం
> మతం పేరుతో జరుగుతున్నదారుణం వర్ణించడానికే కఠోరం''

అంటూ కావ్యోపన్యాసంలో సాగిపోతుంది సి. వి. గారి రచన. ఇది సామాన్య ప్రజలకు రాజకీయ సామాజిక చైతన్యానికి తోడ్పడు

20. 'మాత్రాబద్ధ శంఖారావం' - ఆర్వీయార్ - 'సాహిత్యతత్వం' - యుగ సాహితి; ప్రొద్దుటూరు-1980

తుంది గాని ఉత్తమ శ్రేణి కవిత కాబోదు. శ్రీ సి.వి. తన రచనద్వారా సమాజ ప్రగతిని కోరినంతగా కావ్యశిల్పంమీద దృష్టి పెట్టలేదు. అందు వలన కొన్నిచోట్ల వీరిరచన కేవలం 'న్యూస్ రిపోర్టు'లాగ కన్పిస్తుంది. కప్పిచెప్పవలసిన కవిత్వాన్ని కేవలం ఆవేశంతో విడమరచి, అసభ్యమన దగిన తీవ్ర పదజాలంతో వ్యక్తీకరించిన సి. వి. గారి రచన వ్యర్థం కాలేదు. తర్వాత కొద్దికాలంలో దిగంబర కవిత సి.వి. గారు అనుసరించిన మార్గంలో అంతకంటె తీవ్రమైన పదజాలంతో, ఆవేశంతో వచ్చి అభ్యు దయ కవితోద్యమం తర్వాత ఏర్పడిన స్తబ్ధతను చెదరగొట్టింది. సంఘాన్ని పీడిస్తున్న బాబాలు, అమ్మలు, వారిభక్తులు వీరు చీల్చి చెండా డిన కవితా వస్తువులు.

సి. వి. గారు దిగంబర కవిత్వం వెలువడటానికి పూర్వం రంగం సిద్ధం చేసిన పూర్వరంగ ప్రవర్తకులైన సూత్రధారులని చెప్పవచ్చు.

## అభ్యుదయ గేయ ప్రస్థానం

అభ్యుదయ కవిత్వం ఉద్యమ రూపాన్ని పొందుతున్న దశలో కవులు పాటలకంటె వచన కవిత్వాన్ని ఎక్కువగా ఆదరించారు. అభ్యు దయ కవిత్వానికి ఆకలి, దారిద్ర్యం కావ్యవస్తువులు కాబట్టి మధురమైన వలపు పాటలకు చోటెక్కడుంది? భావకవుల్లో నుండి బయటపడిన శ్రీశ్రీ తానూ కొంత నల్లమందు సరఫరా చేసిన తర్వాత యథార్థాన్ని గుర్తించినట్లు స్వయంగానే అంగీకరించారు.

దేశభక్తి కవిత్వం అభ్యుదయ కవులకు కూడ ఇష్టమైనదే. దురభిమానాన్ని రేకెత్తించే దేశభక్తిని వీరు కోరలేదు. "మా తెలుగు తల్లికీ మల్లెపూదండ" గీతాన్ని అభ్యుదయ కవులు సభల్లో దైవ ప్రార్థనకు బదులుగా ఉపయోగించారు.

కవితోద్యమాలు కవుల్ని కొత్తగా బయటికి తీసుకొస్తాయి. కొంత మంది తమలో నిద్రాణంగావున్న కవితాశక్తిని ఉద్యమావేశంలో గాని గుర్తించలేదు. అటువంటి సమయాల్లో భవ్య కవితావేశం కవుల

కంఠాల్లోనుండి, గంగా ప్రవాహంలా వెలువడి జాతిని పునీతం చేస్తుంది. శ్రీ పులుపుల శివయ్య, వేములపల్లి శ్రీకృష్ణగారలు ఇటువంటి కవులు. ఇద్దరు కవులూ ప్రసిద్ధమైన గీతాలు రాయక ముందు కవులు కారు. ఆ తర్వాత గూడ వారు రాసిన కవిత్వం ఏమంత చెప్పుకో దగినదిలేదు. రాజకీయ నాయకులైన వీరిని కవిత్వమే వరించింది. పీడిత ప్రజల పక్షాన నిలిచి వారి హక్కుల కోసం పోరాడినట్లే వీరు దేశచరిత్రను తలచుకొని ఉజ్జ్వల ఘట్టాలకు ప్రతిస్పందించి వీరగీతాలు రచించారు.

పలనాటిసీమ పౌరుషానికి నిలయం. ఆర్థికంగా వెనుకబడిన ప్రాంతం. చరిత్రలో పలనాటిసీమలో ఎన్నో రసవద్ఘట్టాలున్నాయి- వాటిని తలచి; పలనాటి సీమను నుతిస్తూ శ్రీ పులుపుల వెంకటశివయ్య ''పలనాడు వెలలేని మాగాణిరా'' అనే పాట రచించారు. శాతవాహన చక్రవర్తులు, నాగార్జునుడు, బ్రహ్మనాయుడు, నాగమ్మ, మాంచాల, బాలచంద్రుడు ఎందరోవీరుల త్యాగధనుల శౌర్యాగ్నితో, బలిదానంతో బోధనలతో పునీతమైన సీమ చరిత్రకు గర్వపడటం న్యాయమే.

''బాల చంద్రుని కదన - కౌశలము కథలల్లి శ్రీనాథకవిరాజు- చంద్రవంకకు చెప్ప ఎదకరిగి ప్రవహించెరా - పలనాట 'ఎత్తిపోతల' దూకెరా-''అనే పంక్తులు ఉత్సాహాన్ని రేకెత్తిస్తాయి. ''వెనకటి తరముల వారి వీరచరితల సిరులు నారోసి త్యాగంపు నీర్వెట్టి పెంచ'' మనేది కవి సందేశం.

శ్రీకృష్ణగారి 'తెలుగోడా!'గేయం ''చేయెత్తి జైకొట్టు తెలుగోడా! గతమెంతొ ఘనకీర్తిగలవాడా! అని ప్రజలను శౌర్యవంతులను చేస్తున్నది. ''పెనుగాలివీచింది-అణగారిపోయింది; నట్టనడిసంద్రాన నావనిలుచుండాది- చుక్కాని బట్టరా తెలుగోడా ! నావదరిజేర్చరా మొనగాడా!'' అని స్వాతంత్ర్య పోరాటం తర్వాత స్వేచ్ఛను సంపాదించు కొన్న జాతిని సవ్యమైన దిశలో నడపమని కవి ఉద్బోధించారు. ''తల్లివాక్కుతె నీకు తెలుగోడా! సవతిబిడ్డల పోరు మనకేలా !'' అన్న హెచ్చరిక తెలుగు ప్రజల్లో చైతన్యం రేకెత్తించింది. శ్రీ కృష్ణగారి పాట అభ్యుదయోద్యమం ఆంధ్రసాహిత్యానికి ప్రసాదించిన అమూల్యమైన కానుక.

నార్ల చిరంజీవి గీతాలు అభ్యుదయ కవితోద్యమంలో చెప్పుకో దగిన రసవంతమైనవి. 'తెలుగుపూలు' మొదలైన గేయ సంకలనాల్లో శ్రీ చిరంజీవి మూఢ నమ్మకాలను చెదరగొట్టి పిల్లలలో ప్రగతి భావాలు పాదుకొల్పటానికి కృషిచేశారు. లయజ్ఞానం, పిల్లలమనస్తత్వ పరిజ్ఞానం వున్న ఆయన పసందైన పాటలు రచించారు. "కారు మబ్బు చీల్చవోయ్ క్రాంతి రేఖ చూపవోయ్" అనేది అభ్యుదయ గేయాల్లో విశిష్టమైనది.

బంగారి మామ పాటలతో ప్రసిద్ధులైన శ్రీ కొనకళ్ళ శ్రామిక జీవుల కష్టసుఖాలను గురించి రసవంతమైన గేయాలు రచించారు. 'రోడ్డు రోలరు'పాటలో "లాగరా, హైలెస్సాలాగరా, రోడ్డురోలరు ముందడుగై సాగరా, నడినెత్తిన సూరీడు నకనకలాడించేడు; కంకరరస్తాలో సగమింకా మిగులున్నదిరా!" అని పాడేపాటలో వాళ్ళ ఉత్సాహంతోపాటు- "రోల్సురాయి మోటార్ల షికార్లకు కుదుపొచ్చిందంట / పూలపానుపల్లె త్రోవపొడుగున మలసాలంట! "అనే వ్యంగ్యం ఇంపు గొలుపుతుంది" మారువాడి అప్పుకంటె మాయదారి బ్రతుకుకంటె / బరువా యింతోటి పెద్ద బండరాయి మామయ్య?" అనేచోట జాలితో కన్నీరొలుకుతుంది. "లచ్చలున్న సావుకారు లాభాలను మోసిందుకు / బారీయాపారములో లారీ కొన్నాడంట! మర్రిసెట్టు ఊడనీడ మడిసి పురుగులేనికాడ, సను బాలకు కక్కటిల్లి సంటోదేడుస్తుంట" అనేచోట రోడ్డువేసేకూలీలదుస్థితి కళ్ళముందు మెదిలి వాళ్ళ దీనస్థితికి గుండె చెరువౌతుంది. కొన కళ్ళ వారి గేయాలు బ్రతుకు బరువును భారంగాలాగే శ్రమజీవుల గుండెచప్పుళ్ళే.

శ్రీ సుంకర సత్యనారాయణ రచించిన "పచ్చపచ్చగ పండి ఒరిగున్నాను / ప్రజలకు నన్నందించరావా, నారైతా, ప్రళయమౌ కరువాప లేవా" అని పంటచేను రైతుతో మొరపెట్టుకొనే 'పంటచేను పిలుపు' అభ్యుదయ గేయాలలో విశిష్టమైనది.

'కరుణశ్రీ'గారు రచించిన "మాకండలు పిండిననెత్తురు/మీపెండ్లికి చిలికిన అత్తరు" మొదలైన గీతాలు మిక్కిలి ప్రాచుర్యం పొందాయి. కరుణశ్రీగారి పద్య కవిత్వంలాగే ఆయన 'అరుణ కిరణాలు'లోగేయాలు కూడ సుబోధకంగా, చైతన్యాన్ని పెంపొందించే విధంగా వుంటాయి.

శ్రీ నాజర్ పేదరైతులను, కూలీల గురించి కరుణ రసభరితమైన పాటలు, బుర్రకథలు రచించారు. వ్యవసాయ జీవితానికి సంబంధించిన వీరి పాటలు శ్రామికజనుల హృదయావేదనలను చక్కగా వెల్ల డిస్తాయి. "ఎన్నాళ్ళీ కాపురాము / ఏశరో సురోబడి / చేతామన్నా / ఎన్నాళ్ళీ కాపురాము;" "ఏరన్న రాకముందె ఏరువాక వచ్చేరన్నా" మొదలైన గీతాలు శ్రీ నాజర్ కవితాశక్తికి నిదర్శనాలు. అభ్యుద యోద్యమం వెనుకంజ వేసిన తర్వాత గూడ నాజర్ పాటలు రాస్తూనే వున్నారు. వీరి ఇటీవలి రచనల్లో విప్లవభావాలు వాడిగా వేడిగా వెలువడుతున్నాయి.

ఇంకా తుమ్మల వెంకటరామయ్య, తిరునగరి రామాంజనేయులు, వట్టికొండ విశాలక్షి, మొదలైన వారి గేయాలు అభ్యుదయ కవిత్వాన్ని ముందుకు తీసుకువెళ్ళాయి. మళ్ళీ విప్లవకవులు పాటను తమ భావ ప్రచా రానికి అనువైనసాధనంగా గుర్తించారు. అభ్యుదయ కవిత్వం ఈవిధంగా చారిత్రకంగా సమాజంలో అనివార్యమై వెలువడి, రెండుదశాబ్దాలు తెలుగు దేశాన్ని ఉర్రూతలూపి, తనగమ్యం చేరకుండానే శక్తిని కోల్పోయింది. కాలగమనంలో వచ్చిన మరొక మలుపు దిగంబర కవిత్వం.

## మరి కొందరు అభ్యుదయ కవులు - కరుణశ్రీ; "మా కండలు పిండిన నెత్తురు, మీ పెండ్లికి చిలికిన అత్తరు"

అభ్యుదయ కవితోద్యమంతో ప్రభావితులై రాసిన సంప్రదాయ కవులలో కరుణశ్రీ వొకరు. ఆయన రాసిన 'పాకీపిల్ల; స్టాలిన్ అస్త మయం; మన గురజాడ' కావ్యఖండికలు అభ్యుదయ భావాలతో వెలువడినవి. ఇంకా చాల ఖండ కావ్యాల్లో ఆయన అభ్యుదయ కవులను మించిపోయే భావాలను వెలువరించారు. పాకీపిల్ల ఎదురైతే చీదరించుకునే నాగరకులు ఆమె సంఘానికి చేస్తున్న సేవను గుర్తించరని వీరు ఆక్రోశించారు. స్టాలిన్ మరణించినపుడు మార్క్సిస్టు చింతనా పరులు రాసిన కవితలకన్నా మేలైన విషాదగీతాన్ని ఆయన రాశారు. "స్తంభించింది అకస్మాత్తుగా / జగత్తంతా ఒక్కక్షణం / జారిందిలోకం

చెక్కిళ్ళపై గోరువెచ్చని అశ్రుకణం" అని స్టాలిన్ మహాశయుని విశ్వ బంధువుగా వీరు తలపోశారు. 'అరుణ కిరణాలు'లో గేయాలన్నీ అభ్యు దయ కవిత్వానికి జేగంటలే.

అభ్యుదయ రచయితల సంఘ వ్యవస్థాపక సభ్యులై కవిగా పత్రికా సంపాదకులుగా యువకవులను ప్రోత్సాహ పరచిన వారు శ్రీ తుమ్మల వెంకటరామయ్య. "మన బౌమిక గూడుల్లో మన ఎండు గుండెల్లో/స్వాతంత్ర్య సమరాగ్ని ప్రజ్వరిల్లిందంటె/తొలగదాదాస్యంబు- కలగదా స్వేచ్ఛ?" అని పేద రైతుల పక్షం వహించి వ్యవసాయ విప్లవం కావాలని కోరారు.

'నయాగరా' కవులలో వొకరై అభ్యుదయ కవులకు మార్గ దర్శకులైన శ్రీ ఏల్చూరి సుబ్రహ్మణ్యం ఉద్యమావేశం తగ్గిన తర్వాత అంతగా రాయకపోయినా, కవిగా ఆయన ప్రత్యేకతను మరచిపోలేము. "చరిత్ర కంట్లో నల్లటి నలుసు మా ఊరు!" అని తన స్వగ్రామం దుస్థితిని వర్ణించిన వీరు "సాయంత్రం పరుగెత్తే సూర్యుణ్ణే వెక్కిరిస్తూ మెరిసిన కాపుపిల్ల కొడవలిని" కూడ వర్ణించి, శ్రామికశక్తి అణగారి పోతున్నదని ఆవేదన పొందారు. "పడిపోయిన సత్రపుగోడ; ఆహుతి; అప్పుడు తెలిసింది; నాకే వృద్ధాప్యం వస్తే" మొదలైన గీతాలు శ్రీ ఏల్చూరి కవితాశక్తికి నిదర్శనాలు. ఆయన రాసినది రాసిలో స్వల్పమైనా కవితా గుణంలో మేలైనది.

శ్రీ అబ్బూరి వరద రాజేశ్వరరావు మేధావిగా, కవనశిల్పం తెలిసిన గొప్ప పనివాడుగా చెప్పదగినవారు. ఆయన రచించిన 'అందాక' అభ్యుదయ కావ్యాలలో మిక్కిలి విశిష్టమైనది. సమకాలిక సమాజాన్ని చూచి నిస్పృహ చెంది ఆయన చేదుపాట పాడారు- "అన్నా యీ బ్రతుకు చేదు/అంతకన్న తెరువులేదు/అన్నా! యీ పరుగు వృధా/ఆగి పోవటం మంచిది!" ఆయన దృష్టిలో యీ లోకం డబ్బుగల వారికి అన్ని సౌఖ్యాలు సమకూర్చే వెలయాలు. లోకం నుండి 'పిడికెడు వలపు'ను కోరిన కవి శ్రీ వరద. రచనలు తరచు వెలువడకపోయినా, రాసిన గీతాలు మిక్కిలి విలువైనవి.

అభ్యుదయ కవుల పరంపరలో శ్రీ 'శశాంక' కంఠం విలక్షణ మైనది. 'నయాజమానా' లో ఆయన సమ సమాజమనే మరో ప్రపం చాన్ని వాంఛించారు. వీరి రచనల్లో 'అంతర్గీతమ్' విశిష్టమైనది. ''గుండె మాత్రమే పలుకగలిగే శబ్దజాలాన్ని / ఎంత నోరు తిరిగితే మాత్రం/ ఎవరుగానీ ఉచ్చరించగలుగుతారు ?'' అని ఆయన అభ్యుదయ భావనను, అంతరాత్మ ప్రబోధాన్ని జోడించారు. ''తూరుపు దిశనుంచి మొదలు/ పడమర దిశవరకు ప్రాకు/అరుణ కిరణ స్వర్ణ క్రాంతి/నవమానవ మహా గీతి !'' అని శ్రామికలోక స్వర్గాన్ని దర్శించి, 'రండి రండి నరులారా' అని ఆహ్వానించారు. అభ్యుదయోద్యమం వెనుకంజవేశాక కవిగా ఆయన కంఠం మూగవోయింది.

'మహైక; ప్రణుతి; మానవ సంగీతం' కావ్యాలు రచించి అభ్యు దయ కవిత్వానికి పుష్టిని చేకూర్చిన కవి శ్రీ 'కవిరాజమూర్తి'. దుర్భర మైన సమకాలిక సమాజంలో పరిస్థితులు మారాలని వీరు కోరారు. 'ప్రార్థన'లో వీరు ''ఈ లోకపు వనమ్ములో పూవులు లేనేలేవు / ఈ మొక్కల రంగు ఆకుపచ్చ అసలేకాదు/.... ఈ గులాబి రెక్కలలో దుర్గంధం పులుముకుంది'' అని దుర్భరమైన లోకాన్ని ఉద్ధరించమని వేడుకున్నారు. 'సురుచిర స్వప్నం' వీరి గీతాల్లో రసవంతమైనది. ఉద్య మం వెనుకబట్టాక వీరి కవిత్వంలో ఉరవడి తగ్గింది.

కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతలలో వొకరై, సమాజశ్రేయస్సును కోరి కవిత్వం రచించినవారు శ్రీ కారుమంచి వెంకటేశ్వరరావు. వెట్టి చాకిరికి నిరసనగా వీరు 'నమూనా' అనే గీతం రచించారు. తెలంగాణ పోరాట సమయంలో రాసిన 'మైల్‌రేస్' వీరరసస్ఫోరకమైనది. ఇంకా 'పిడిగుద్దు గీతాలు' వీరి రచనల్లో ప్రసిద్ధమైనవి. అస్పష్టత వీరి కవి త్వాన్ని ఆస్వాదించటానికి అడ్డుగా నిలుస్తుంది. ఉద్యమంలో నిమగ్నమై ఆవేశంతో రాసిన వీరి గీతాల్లో గుండె చప్పుడు మాత్రం వినిపిస్తూనే

వుంటుంది. అభ్యుదయోద్యమంలో 'పాంచజన్యం' పూరించిన కవి శ్రీ కారుమంచి.

భావకవిత్వం, అభ్యుదయ కవిత్వం పరిధులకు విడిగా శ్రీ దుర్గా నంద్ కవిత్వం ఒక ప్రత్యేక పంథాలో నడిచింది. 'మధూలిక, జూనా ప్రణయగాథ'ల్లో వీరి కవిత్వం భావకవిత్వానికి సన్నిహితమైనది. 'మధూలిక'ను వీరు 'అభ్యుదయ ప్రబంధం' అని తెలిపారు. 'అంతర్గోళాలు' శాస్త్ర విజ్ఞానంమీద వీరికిగల అపరిమిత విశ్వాసాన్ని తెలియజేస్తుంది. మానవత్వాన్ని పెంచని విజ్ఞానం మనిషిని మృగాన్ని చేస్తున్నదని వీరు ఆందోళన చెందుతారు. 'చిరంతన' తాత్త్విక గాంభీర్యంతో మానవజాతి భవిష్యత్తును గురించి ఆలోచింపజేస్తుంది.

వ్యంగ్య కవితలో పేరుమోసిన కవి శ్రీ రాంభట్ల కృష్ణమూర్తి. 'శశివిషాణం' కలంపేరుతో వీరు రాసిన గీతాలు కార్టూన్లవలె కవ్వించి నవ్విస్తాయి. రాజకీయ వ్యంగ్యం ఈయన కవిత్వంలో నిశితంగా పాఠక హృదయాన్ని సోకుతుంది. ఉద్యమావేశం తగ్గాక వీరు కవిత్వం రచించినట్లు కన్పించదు.

ఇంకా అభ్యుదయ కవితోద్యమంలో పాల్గొని తాము కూడ కవితా సమిధలను ఆహుతిచ్చిన కవులలో అవసరాల సూర్యారావు, శార్వరి, నారపరెడ్డి, కొమఱ్ఱాజు వినాయకరావు, సంపత్, ప్రయాగ కోదండరామశాస్త్రి, వట్టికొండ విశాలాక్షి, రాంషా, వాచార్ ఘర్, చాగంటి సోమయాజులు మొదలైనవారు పేర్కొనదగినవారు.

ఆధునికాంధ్ర సాహిత్యంలో అభ్యుదయ కవిత్వయుగం స్వర్ణ యుగం. సామాన్యుని కష్టాలను గురించి ఇంతగా పట్టించుకున్న సాహిత్యోద్యమం ఇంతకుముందు లేదు. ''మారుపడిన పసిబిడ్డలాగ నేటి మానవుడు జీవితపు తిరునాళ్లలో ఏకాంతంగా సంచరిస్తున్నాడు- అంతేకాదు,

అతను కల్పించుకున్న ముక్తిసాధనాలే ఒక దశ తర్వాత అతనికి బంధాలై కలవరపరుస్తున్నాయి. మేధావుల వాదోపవాదాలకు రాజకీయ నాయకుల వివిధ పథకాలకు, శాస్త్రజ్ఞుల పరిశీలనా పద్ధతులకు కేంద్రంగా వుండవలసిన మానవాత్మయే వీటివల్ల మరుగున పడిపోతున్నది. మానవుని భౌతిక ఆధ్యాత్మిక వ్యక్తిత్వాల మధ్య సమన్వయం కుదరడం లేదు."[21]
ఈ విచిత్ర వేదనే నేటి సాహిత్య రూపాలలో, ముఖ్యంగా అభ్యుదయ కవిత్వంలో గోచరిస్తున్నది. అభ్యుదయ కవిత్వం తన లక్ష్యాన్ని సాధించకుండానే శక్తిని కోల్పోయింది.

21. 'చింతన' - బెల్లంకొండ రామదాసు - కల్పన కవితా సంకలనం పీఠిక చేతన సాహితి - విజయవాడ

ఏడవ అధ్యాయం

# వచన కవితా వికాసం

1930 తర్వాత తెలుగు కవిత్వపు బహిరాకృతిలో వచ్చిన మార్పు 'వచన కవిత్వం'. ఛందోబంధాలను వదిలించుకోవటానికి భావకవులు ప్రయత్నించినా, వారు స్వేచ్ఛకై పరితపించారేగాని నియమాలను తెంచి వేయలేదు. పద్యానికి ముందు వృత్తాలను సూచించే 'ఉ-చ-శా-మ' అని అచ్చువేయటం మానేశారు. అస్సలు అచ్చువేసే ఆకృతిని గూడ మార్చారు. 4 పంక్తుల పద్యాన్ని ఒక్కోసారి 6, 8 పంక్తులుగా కూడ అచ్చువేశారు. పద్యం పూర్తికాకపోయినా భావం పూర్తయితే అక్కడితో పద్యాన్ని ఆపివేశారు. ఈ స్వేచ్ఛతో సరిపెట్టుకోక శ్రీ దువ్వూరి రామిరెడ్డి, కవికొండల వెంకటరావు మొదలైనవారు దరిదాపు గద్యకవిత్వ మనదగిన రచనలు చేశారు. శ్రీ దువ్వూరికి ఛందస్సంటే అపరిమితమైన గౌరవం వున్నది. "యథార్థమైన కవిత్వమునకు అనివార్యముగా ఛందస్సు అనుగతమౌను" అని ఆయన విశ్వసించారు.[1] ఛందస్సును ధిక్కరించటం ఆయన వుద్దేశ్యంకాదు. కాని కొత్తను వెదుక్కుంటూ ఆయన చేసిన ప్రయోగాలే వచన కవిత్వానికి తొలిరూపాలుగా కన్పిస్తున్నాయి. దువ్వూరివారి యీ కొత్త రచనలు వచనగేయ రూపం గలిగినవేగాని వచన కవిత్వం కావు.

వచన కవితకు ఆద్యుడుగా పేర్కొనదగిన కవి శ్రీ శిష్ట్లా ఉమామహేశ. ఆయన 1930 ప్రాంతాలనుండి రాసిన వచన గీతాలు 1938 లో 'విష్ణుధనువు; నవమిచిలుక' కావ్యరూపాలు ధరించాయి. శ్రీ శిష్ట్లా తన గీతాలను వచన గీతాలని పిలవలేదు; 'ప్రాహ్లాద కవిత్వ'మని పిలుచు

1. 'తెలుగు కవితలో క్రొత్తతెన్నులు' - దువ్వూరి రామిరెడ్డి - కవికోకిల గ్రంథావళి - 4 - వ్యాసములు - ఆరవ ముద్రణ - 1967 - పేజీ ౧౬౪.

కున్నారు. "ప్రాహ్లాద కవిత్వం పూర్వకవిత్వం కాదు, భావ కవిత్వం కాదు, నూతనములో బహునూతన కవిత్వం" అని ప్రకటించుకున్నారు.[2] "ప్రాహ్లాద కవిత్వం ఆరిపోయే దీపాన్ని రగుల్చుతుంది. పరుగెత్తే పాము రుణ్ణి నిలేస్తుంది" అని తన కవిత్వ లక్ష్యాన్ని నిర్దేశించుకున్నారు. "ఇతడు భావకవిత్వముపై తిరుగుబాటు చేసెనేకాని క్రొత్తబాట వేయలేదని ఒప్పుకోక తప్పదు" అని శ్రీ సి. నారాయణరెడ్డి శిష్ట్లా తిరుగుబాటును గురించి అభిప్రాయపడ్డారు.[3] "దుర్గమారణ్యంలో ప్రవేశించడమే ఒక సాహసిక కృత్యం, తనకు తాను బాట వేసుకోనిదే ఎవడూ కారడవిలో ముందుకు సాగలేడు. శిష్ట్లాది గొప్ప విప్లవారంభం"గా తలచారు శ్రీ ఆరుద్ర.[4] శ్రీ శిష్ట్లా కవిత్వమార్గాన్ని సుగమం చేశారు. అందుకైనా ఆయన్ను ఆద్యులుగా సంభావించాలి.

వచన కవిత్వం ప్రారంభమైన తొలిదశలో పండితులు యీ ఉద్యమాన్ని తీవ్రంగా వ్యతిరేకించారు. ఛందోబద్ధంగా రాయటం చేతగాక యీ విధంగా రాస్తున్నారన్నారు. వచన కవిత రాసిన వారిలో కొందరు పద్యరచయితలు గూడ వుండటంతో ఆ వాదం చాలించి, మరొక మార్గంలో ప్రతిఘటించారు. కవిత్వం వచనంలో వుండటం క్రొత్త సంగతేమీ కాదన్నారు. సింహగిరి నరహరి 'వచనాలు', తాళ్లపాకవారి 'విన్నపాలు' ఇంకా ఎందరో కవులు పూర్వకాలంలోనే యీ ప్రక్రియలో రచనలు చేశారన్నారు. తాళ్లపాకవారి 'వృత్తగంధి' వచనం ఆధునిక వచన కవిత్వం వాకటేనన్నారు. కాని ఉడుకు రక్తంతో ఉరకలు వేసే యువకులు వింటారా? తమ కవిత్వం పాత పద్ధతులకు వ్యతిరేకమని ప్రక

2. 'ముస్నుడి' - శిష్ట్లా ఉమామహేశ - 'నవమి చిలుక' - 1938.

3. అభ్యుదయ కవిత్వము - సి నారాయణరెడ్డి - ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయము : ప్రయోగములు మొదటి ముద్రణ - 1967 - పేజీ 527.

4 'వచన కవిత; ప్రయోగ వైవిధ్యం' - ఆరుద్ర - 'సమాలోచనం' - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి - 1980.

టించారు. "వేదాంతులు జీవితాన్ని, ప్రకృతిని అవగాహన చేసుకున్నారు. మేము లోకాన్ని, జీవితాన్ని, ప్రకృతినికూడ మారుస్తాము."[5] ఆ ప్రయత్నంలో భాగంగా కవిత్వ స్వరూపాన్ని కూడ మార్చేదలచారు.

ప్రపంచంలో ఆర్థిక సంక్షోభం ముసురుకువచ్చి ఆంధ్ర దేశానికి కరువు కల్పించింది. ఆ 'గడ్డురోజు'ల్లో (Depression days) కవుల ఆలోచనల్లో మార్పువచ్చి, ఛందోరీతుల్లోకూడ తిరుగుబాటు అవసరమైంది. చారిత్రకంగా చూస్తే వచన కవిత్వ ఆవిర్భావం సహజంగానే జరిగింది. కాబట్టే అది ఇప్పటికి ఏపుగా పెరిగి, వనమై విస్తరించి రుచికరమైన ఫలాలను అందిస్తున్నది. అంతేకాని వచన కవిత్వం accidental గా, పడి మొలిచిన విత్తనం మహావృక్షమైనట్లు పెరగలేదు. పూర్వకవిత్వంలో ఏ తాళ్లపాకవారి నుండో అంటుకట్టి పెంచినదీకాదు. "Language like consciousness, only arises from the need, the necessity, of intercourse with other men" [The following words are crossed out in the manuscript; "My relation to my surroundings is my consciousness"]అని మార్క్స్, ఏంగెల్స్లు భావించినట్లు కవిత్వంలో కూడ భాష అవసరాన్నిబట్టే మారుతుంది.[6]

వచన కవితకు ఆద్యుడు శిష్లా అనటంతో నేటి విమర్శకులు చాల మంది ఏకీభవిస్తారు. వచన కవిత్వాన్ని ఆదరించి, దానికొక వేదిక ఏర్పరచి, ప్రోత్సహించింది శ్రీ ముద్దుకృష్ణ నడిపిన 'జ్వాల' పత్రిక, తర్వాత "ఉదయిని, ప్రతిభ, కృష్ణాపత్రిక" మొదలైన పత్రికలు ఆదరించాయి. శ్రీ శిష్లా ప్రచారం చేయబూనిన 'ప్రాహ్లాద కవిత్వం' అనే మాట తర్వాత ప్రచారంలోకి రాలేదు. ఆయన ఉద్యమం మాత్రం ముందుకు సాగింది. 'జ్వాల' మొదటి సంపాదకీయంలో శ్రీ ముద్దుకృష్ణ

5. 'ప్రవర' - శ్రీరంగం నారాయణబాబు - రెంటాల 'సంఘర్షణ'కు పీఠిక - 'రుధిర జ్యోతి'లో ప్రచురింపబడింది - ప్రథమ ముద్రణ - 1972.

6. 'Social Divison of Labour - Karl Marx and Frederick Engels - On literature And Art - Progress Publishers - Moscow - 1978.

"ప్రపంచమంతా ఒక్క యిల్లుగా, మానవజాతి అంతా ఒక కుటుంబంగా మారిపోయే రోజులు వస్తున్నవి.... మనం కూపస్థంగా వుండడంవల్లనో, పురాతన మగతచేతనో, రక్తంలో నీరసం చేతనో, నూతన తేజస్సుకు గుడ్లగూబల మౌతున్నాము. యువకుల దృష్టికి ఒక కొత్త తేజస్సు. ఒక కొత్తదారి కనబడుతూ వున్నది. ధర్మాలలో సంఘంలో, భావాలలో, భాషలో మార్పురాక తప్పదు. దీనికి అడ్డుపీల్లేదు. వచ్చినా ఆగదు. పిరికితనానికి ముక్తిలేదు. అందుచేత నచ్చని పాతబంధాలను తెంపివేయ డానికి ఎంతైనా సాహసిస్తాము. నచ్చిన కొత్తదానికి దూకుతాము. భయ పడము. తప్పు అవుతుందేమో అని జంకము" అని కొత్తదనానికి రాజ మార్గం వేశారు.[7] 1930 తర్వాత యూరప్ దేశాలలోగూడ కవిత్వంలో అలజడి ప్రారంభమైంది. "The Poetry of Nineteen–thirties was saturated in the bloody sweat of that decade. This fact gives it a documentary importance which may seem, as time passes, to outweigh its poetic merit" అని A. C. Ward–'20th Century English Literature 1901–60' లో పేర్కొన్న విధంగా ఆ కాలంలో కవిత్వంలో కఠోరమైన వాస్తవికత కళారూపం ధరించింది.[8]

తొలితరం వచన కవులలో ముద్దుకృష్ణ, నారాయణబాబు, శ్రీశ్రీ, పురిపండా, పఠాభి, పాప గారలు ప్రసిద్ధులు. జరుక్‌శాస్త్రి, తిలక్, సంపత్, సింగరాచార్య మొదలైనవారు వచన కవితలో మరింత వెలుగును విరజిమ్మినవారు. అభ్యుదయ కవిత్వం ఒక ఉద్యమరూపం దాల్చాక వచన కవితకు శక్తిని ప్రసాదించినవారు 'నయాగరా' కవులు (బెల్లంకొండ రామదాసు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, కుందుర్తి ఆంజ

7. 'వచన కవిత - ప్రయోగ వైవిధ్యం' అన్న ఆరుద్రగారి వ్యాసం (సమాలోచనం) నుండి యీ సమాచారాన్ని స్వీకరించాను. అందుకు ఆరుద్ర గారికి నా కృతజ్ఞత.

8. 'Poetry' – A. C. Ward – '20th Century English Literature 1901-60' – B I. Publications - First Indian Edition - 1974.

నేయులు) అజంతా, బైరాగి, కాళోజీ, దాశరథి, ఆరుద్ర, వరద రాజేశ్వరరావు, సోమసుందర్, అనిసెట్టి, రమణారెడ్డి, గంగినేని, చిరంజీవి మొదలైనవారు.

అభ్యుదయ రచయితల సంఘం కార్యకలాపాలు మందగించిన తర్వాత 1956 లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డాక, హైదరాబాదు కార్యరంగంగా వచన కవిత్వం మళ్ళీ చైతన్యవంతమై విస్తరించింది. శ్రీ కుందుర్తి నాయకత్వాన 'ఫ్రీవర్స్ ఫ్రంట్' ఏర్పడి వచన కవిత్వంలో వైవిధ్యానికి, అభ్యుదయ భావప్రచారానికి కృషిచేసింది. ఈ దశలో కుందుర్తి, తిలక్, గోపాల చక్రవర్తి, శేశవరావ్, మాదిరాజు రంగారావు, సుప్రసన్న, వరవరరావు, అరిపిరాల విశ్వం, శీలా వీర్రాజు, బోయి భీమన్న, మురళీధర్, యాదవరెడ్డి గారలు వచన కవిత్వానికి జవసత్వాలను ప్రసాదించారు. బహిరాకృతి (Form) ని ఉద్యమమనటం కొందరికి నచ్చలేదు. "సంప్రదాయచ్ఛందోలంకారాది పూర్వసాధనములను వదలి విరాడంబరంగా రసావిష్కరణ చేయడానికిగల అవకాశాలను గురించే గత 30 సంవత్సరాలుగా పరిశోధన జరిగింది. ఆ ప్రయోగశాలలో మనం సృష్టించిన నూతన మార్గమే యీ వచనకవితా మార్గము" అని శ్రీ గోపాల చక్రవర్తి 'వచన కవిత్వం ఒక ఉద్యమమా?' అనే సందేహానికి తావు లేదనీ, కవితాత్మ ఏ కాలంలోనైనా మారదనీ, బాహ్యరూపం మాత్రం మారుతుందని భావించారు.[9]

వచన కవిత్వం విధిగా అభ్యుదయ భావాలను, ముఖ్యంగా మార్క్సిస్టు సిద్ధాంతపు వెలుగులో సమసమాజ నిర్మాణానికి కృషి చెయ్యాలనే వాదన, కొందరు కవులకు నచ్చలేదు. వీరు తమ భావాలను వెల్లడించడానికి వచన కవిత్వాన్నే ఎంచుకున్నారు. 'చేతనావర్తం' కవులు; 'కవిసేన' కవులు; 'అనుభూతివాద' కవులు; ఇంకా కొందరు ప్రణయ గీతాలను, భక్తి గీతాలను వివిధ తాత్త్వికచింతనా భరితమైన గీతాలనూ రచించారు.

---

9. 'వచన కవిత్వం' - గోపాల చక్రవర్తి - పుస్తక ప్రపంచం - కవితా సంచిక - జనవరి 1968.

నాలుగు దశాబ్దాలకుపైగా చరిత్ర గలిగిన 'వచన కవిత్వం' లో చెప్పుకోదగిన వైవిధ్యం వున్నది. శ్రీ కవికొండల వెంకటరావు 'కూలి యన్నల కుతుకము'ను గురించి రాసిన ప్రజాకవి. ఆయన రాసిన 'శివ రాత్రి ప్రభ; నక్కాసామిగాడు: చిన్నప్పుడు' మొదలైన గీతాలను విమర్శకు లింతకుముందే ప్రశంసించారు. శ్రీ కవికొండల 'కవిలె కట్టలు'లో 'దాసిగొడవ; కష్టజీవులు' వంటి ఉత్కృష్టమైన వచన గీతాలున్నాయి. ''ఆరికీరి కంట్లుతోమి- యప్పలమ్మ అసురసంజ, ఇంటికేగ కంటిఎఱుసు-గుప్పు కంపు కొట్టుకొనుచు జోగులన్న సొచ్చెనిల్లు'' - త్రాగుబోతు మగడు చేసిన అప్పుకోసం, తన 'కాసుతీగ' యిచ్చిన దీనురాలి కథ 'దాసిగొడవ'లో కావ్యవస్తువు. 'మోకాల్‌బంటి దమ్మగుమిడి'లో పవలెల్లా ఆకూడ్చే కూలీల బతుకు 'కష్టజీవులు' లో వర్ణించారు. వచన కవిత రూపురేఖలు దిద్దుకోకముందే ఇంత మంచి వచన గీతాలు రావటం ఆశ్చర్యకరం. కవికొండల వారి కవిత్వంలో చిక్కదనం తక్కువైనా, రచనలో కన్పించే చిత్తశుద్ధి మనస్సు కరిగిస్తుంది.

'పిఠాపురం యువరాజు' రచించిన చినుకుల చిందులు, నామ '' —— '' రహితం; ఆ లోకం నుండి ఆహ్వానం' మొదలైన కావ్యాల్లో వచన కవిత్వం ఒక వింత సోయగంతో కన్పిస్తుంది. ''పద్యం గద్యం కాకుండా, సంస్కృతాంధ్ర పదాలకి మైత్రిచేసి, పాత పదాలు సంధులు విరిచి, కొత్త పదాలు సంధులు కలిపి, వింతయైన సంగీతంతో, పాత భావాలు తొక్కి, కొత్త భావాలు పెంచి, మూడు మాటల్లో ముప్పది తళుకులు, మూడువందల హృద్భావాలు, కొంచెం కొంచెం చూపించాలని యత్నించారు. కాని తృప్తి కలుగలేదు'' అని కవి స్వయంగా వెల్లడించారు.[10] కొత్తదనం కోసం వెదికే ప్రయత్నంలో శ్రీ పిఠాపురం యువరాజు కృషి మరువరానిది. ఆయన కవిత్వం విశిష్టమైనది కాకపోవచ్చు గాని ప్రయత్నం గొప్పది.

10. 'తొలిజాము' - పిఠాపురం యువరాజు 'నామ "—" రహితం' - అద్దేపల్లి అండ్ కో - 1950,

వచన కవిత్వ ప్రయోగదశలో శ్రీ పాలగుమ్మి పద్మరాజు "పురిటిపాట; చీకటి: మనమైత్రి" మొదలైన మిక్కిలి రసవంతమైన గీతాలు రచించారు. వచన కవిత్వాన్ని వచనం నుండి వేరు చేయటంలో శ్రీ పద్మరాజు శక్తి అమోఘం. పురిటిపాట ఆధునిక కవిత్వంలో లెక్కించదగిన రసగీతాలలో వొకటి,

## వచన కవిత్వమనే పేరు సరియైనదేనా ?

వచన కవిత్వం ప్రయోగదశలో వుండగా 'శిష్ట్లా' ప్రతిపాదించిన 'ప్రాహ్లాద కవిత్వం' పేరు ప్రచారంలోకి రాలేదుగాని, ఛందోరహిత మైన కొత్త కవిత్వానికి "వచన గేయం: వచన పద్యం; వచన కవిత; ఫ్రీవర్స్; వర్స్ లిబరే; ముక్తచ్ఛంద కవిత" మొదలైన పేర్లు వ్యాప్తి లోకి వచ్చాయి. వచన గేయమనే పేరు సరియైన దనాలంటే గేయానికి మాత్రలూ, లయ, గానయోగ్యతా వుండటం పరిపాటి; ఈ కొత్త కవితలో లయజ్ఞానంతో వెలువడిన కవితలు తక్కువ. అందువలన ఈ పేరు సరిపడుతుందని చెప్పలేము. వచన పద్యం అనగానే యీ కవిత్వంలో గణాలూ, యతి, ప్రాసలూ వున్నాయా ? అనే ప్రశ్న ఎదురౌతుంది. ఈ కొత్త కవిత్వంలో అంత్యప్రాసలూ, మరికొన్ని నియమాలూ కన్పించినా మొత్తంమీద లక్షణవేత్తలు పద్యకవిత్వానికి నిర్దేశించిన లక్షణాలు దీనికి సరిపోవటంలేదు. సరిపుచ్చటానికి 'సంపత్కుమార' వంటి ఛందోవేత్తలు ప్రయత్నించారు గాని, వారి వాదం కవులు ఆమోదించలేదు. నియమాలను త్రోసిరాజని కొత్తదనం కోసం అఱ్ఱులుచాస్తున్న కవులకు మళ్ళీ నియమాల్లో ఇరుక్కుపోవటం ఇష్టంలేదు. 'ఫ్రీవర్స్' అనే పేరు తగినట్లు అనిపిస్తుందిగాని సామాన్యులకు కవితారూపాన్ని దగ్గరగా తీసుకొస్తూ ఇంగ్లీషులో పేరు పెట్టటమెందుకు ? పైగా ఇటువంటి కవితా రూపాన్ని ఇంగ్లీషులో 'Verse–Libre' అని పిలుస్తారుగాని, 'Free–Verse' అనరు. 'స్వచ్ఛంద కవిత్వం' లేక 'ముక్తచ్ఛంద కవిత్వం' అనే పేర్లు బాగుంటాయిగాని ఛందస్సు వదలిన కవిత్వం అనటం కంటె 'వచన కవిత్వం' అనే పేరే తగినట్లుగా వుంటుంది. చాలమంది కవులు, విమర్శకులు, పాఠకులు కూడ యీ కవిత్వాన్ని 'వచన కవిత్వ' మనే

వ్యవహరిస్తున్నారు. మిగిలిన పేర్లుకూడ వాడుకలో వున్నా వచన కవిత్వమనే పేరు బహుశా స్థిరపడిపోవచ్చు.

వచన కవిత్వం - చారిత్రకమైన అవసరం

"ఈనాడు సంఘంలో రావలసిన విప్లవం ముందుగా భాషలో రావాలి. భాషను మార్చడానికి భావాలను మార్చాలి. జీవితపు పోకడలనే మార్చాలి" అని శ్రీశ్రీ భావించారు.[11] భాషలో మార్పుకు గిడుగు రామమూర్తి పంతులుగారూ, భావాల్లో మార్పుకు గురజాడవారూ కారకులయ్యారు. కావ్యవస్తువులో 'వాస్తవిక వాదం' ప్రవేశించింది. "The business of poetry is not to simplify or to explain but to present" అని C. M. Bowra వాస్తవిక వాదాన్ని సమర్థించారు.[12]

ఛందస్సులో గురజాడ తెచ్చిన కొత్తదనంతో అభ్యుదయ కవులు సంతృప్తిపడలేదు. "ప్రాచీన ఛందస్సులో ప్రాచీన సంగీతం గోచరించినట్లే నవీన కల్పనలో నవీన శ్రావ్యతలు గోచరిస్తాయి. క్రొత్త సంగీతం లోహవిహంగాల, పారిశ్రామిక యంత్రాల, ధూమనౌకల, విద్యుచ్ఛకటాల, వివిధ విచిత్ర ఘోషలలో నుండి బయలుదేరుతున్నట్లే, నవీన గీతాలు కవియొక్క రసాత్మనుండి, అనేక ధోరణులలో ప్రవహిస్తాయి. ఇందుకు కారణం ఈ కాలపు పారిశ్రామిక యుగధర్మమే" అని శ్రీశ్రీ భావించారు.[13] పారిశ్రామిక యుగధర్మానికి అనుగుణమైనది వచన కవిత్వమే.

వచనాన్ని కవిత్వాన్ని వేరుచేసే కవితాగుణాన్ని, మూలద్రవ్యాలను గుర్తించుకోవడంలోనే వున్నది కవి ప్రజ్ఞ. Bad Prose-'Free

11. 'అనంతం' - శ్రీశ్రీ - ఆనందవాణి - 1945 జనవరి.
12. 'The Creative Experiment' - C. M. Bowra - Macmillan - London - 1967 - Page 24.
13. 'నేటి తెలుగు కవిత - కొత్త పోకడలు' - శ్రీశ్రీ - భారతి 1939.

Verse' ఎప్పుడూ కాదు. వచన కవిత్వం నియమరహితమైన దనుకోవ టం పొరపాటు. వచన కవిత్వంలో కవికి బాధ్యత మరీ ఎక్కువ. అలాగని వచన కవిత్వాన్ని ఒక ఉద్యమంగా భావించటం కూడ పొర పాటే. ఈ విషయాన్ని T. S. Eliot "It is assumed that 'Verse libre' exists. It is assumed that 'Verse-libre' is a school; that it consists of certain theories.... 'Verse libre' does not exist.... No verse is libre for the man who wants to do a good job" అనే మాటల్లో స్పష్టం చేశారు.[14] వచన కవిత్వంలో కవికి భావదారిద్ర్యాన్ని దాచుకోవటానికి ఛందస్సు గాని, సంగీతంగాని ఆఖరుకు లయగాని తోడ్పడదు. కవిత్వానికి మూల ద్రవ్యాలుగా ఆలంకారికులు భావించిన రసం, ధ్వని, ఔచిత్యం మొద లైనవి వచన కవిత్వానికీ కావాలి. వీటితోపాటు జీవిత విమర్శ మరీ అవసరం.

ఛందస్సును ధిక్కరించిన వచన కవులు అంత్యప్రాసలకు లొంగి పోయారన్న విమర్శ అర్థవంతమైనదే. సమర్థులైన కవులు అంత్యప్రాస కోసం ప్రాకులాడరు. వచన కవిత్వం పేరుతో వెలువడుతున్న అసం ఖ్యాకమైన గీతాలను, సంపుటాలను చూచినప్పుడు బాధ కలుగుతుంది. వీటిలో కవిత్వం కంటె శుష్కవచనమే ఎదురౌతున్నది. కేవలం పాద విభజనచేసి, అచ్చువేసినంత మాత్రాన వచనం కవిత్వం కాదు. నియమ రహితంగా గట్లులేక పొంగి పొరలుతున్న వచన కవిత్వానికి, నియమాల నేర్పరచటానికి కొందరు ఆధునిక ఛందోవేత్తలు ప్రయత్నించారు.

## వచన కవిత్వం - లక్షణ నిర్దేశం

వచన కవిత్వానికి నియమాలను ఏర్పరచే ప్రయత్నంలో శ్రీ సంపత్కుమార మాత్రం, మాత్రాగణాల నియతక్రమంవల్ల పాదానికి తూగు వస్తున్నట్లు, "భావం వచన పద్య భావాలకు సమభారం కలిగి

14. 'Reflections on Verse-Libre' - T. S. Eliot -'Twentieth Century Poetry - Critical Essays & Documents' (Ed. Graham Martin and F. N. Furbank)

స్తుంది.... సామాన్యంగా భావం పూర్తి కావడంతో, పాదంకూడా పూర్తి అవుతుంది. ఒక్కొక్కప్పుడు భావం పూర్తి కాకున్నా 'భావాంశం' పూర్తి అయినా కూడా పాదం పూర్తి కావచ్చునన్న మాట'' అని 'భావ గణా'ల సహాయంతో ఒక నియమాన్ని ప్రతిపాదించారు.[15] శ్రీ అరిపిరాల విశ్వం లయకు ప్రాధాన్యమిచ్చి 'భావలయ'ను బట్టి వచన కవిత్వానికి లక్షణాన్ని ప్రతిపాదించారు.[16] ఈ రెండు సిద్ధాంతాలూ వచన కవిత్వాన్ని స్పష్టంగా విభజించి, లక్షణాన్ని ఏర్పరచలేవు గాబట్టి వీటిని తిరస్కరించవచ్చునని శ్రీ చేకూరి రామారావు తలచారు.[17] శ్రీ రామారావు అభిప్రాయం సరియైనదే. ఎవరైనా కవి రాసిన వచన కవిత్వంలో పాద విభజనను తొలగించి, వరుసగా పేర్చి ఇస్తే, ఏ ఇద్దరూ లక్షణ వేత్తలూ దానికి ఒకే విధంగా పాద విభజన చెయ్యలేరు; ఒకే విధమైన నియమాల్ని సూచించలేరు. కాబట్టి వచన కవిత్వానికి ఆమోదయోగ్య మైన నియమాలేవీ ఏర్పడలేదని చెప్పవచ్చు. ఎవరైనా నియమాలను ఏర్పరచినా ఇప్పుడున్న వ్యవస్థలో అలజడిలో క్రమశిక్షణకు తలవొగ్గి, లక్షణవేత్తల నియమాలను అనుసరిస్తారను కోవటం భ్రమ.

> ''నియతికృత నియమరహితాం
> హ్లాదైకమయీ మనన్య పరతంత్రామ్
> నవరసరుచిరాం నిర్మితి
> మాదధతీ భారతీ కవేర్జయతి''

అని మమ్మటభట్టు 'కావ్యప్రకాశమ్'లో చెప్పినట్లు ప్రతిభావంతులైన కవులు తమ కవిత్వానికి కావలసిన నియమాలను తామే ఏర్పరచు

15. 'వచనపద్యం : ఛందోరీతి' - సంపత్కుమార - 'వచనపద్యం - లక్షణ చర్చ' - 1978.
16. ప్రాచీనాలంకారికుల ధ్వనికీ, ఆధునిక వచన కవిత్వంలోని భావ లయకు సాదృశ్య వైషమ్యాలు - అరిపిరాల విశ్వం - కృష్ణాపత్రిక - 1967 జనవరి 7, 14.
17. వచన పద్యం : ఆభాస లక్షణ నిరాకరణం - చేకూరి రామారావు - వచన పద్యం : లక్షణ చర్చ - 1978.

కుంటారు. శ్రీ సంపత్కుమార మొదలైనవారు సూచించిన నియమాలు 'సర్పపరిష్వంగాలు' కావు, కవులకు మార్గదర్శక సూత్రాలు మాత్రమే.

వచన కవిత్వపు సామర్థ్యాన్ని గురించి దాని అభిమానులు అతిశయోక్తులు పలుకుతున్నారని శ్రీ నోరి నరసింహశాస్త్రి, దాని శక్తి పరిమితమేనని తలచారు. "నేడు వచన కవిత సరికొత్త మోజు। అది తత్త్వమూ కాదు, ఉద్యమమూ కాదు. అది ఎక్కువ భాగము ఆది ప్రాసల, అంత్యప్రాసల, మాటల విరుపుల, అసమాన పాదాల, మాటల పోటీల గారడిగానే ప్రధానంగా సాగుతున్నది. అది ప్రయోగ దశను ఇంకా అధిగమించలేదు. కవి వృషభులు, అనాదిగా, లోకమంతటా, అన్ని భాషలలో, అన్ని కాలాలలో అవలంభించి సంపుష్టము చేసినది ఛందోమార్గము" అని వచన కవిత ప్రయోజనాన్ని శంకించి శ్రీ నోరి నాలుగు కాలాలపాటు నిలిచివుండే కవిత ఛందోమార్గంలో తప్ప వెలువడదన్నారు.[18] ఈ ఆక్షేపణ పాతదే. పండితులెందరో ఇంతకుముందు కూడ చేసిందే. ఈ వాదానికి శ్రీ కుందుర్తి తాము పద్యాన్ని తూలనాడమనీ, తెలుగు కవిత్వానికి పద్యమే తుది స్వరూపమని మాత్రం అంగీకరించమనీ 'యుగేయుగే' పీఠికలో 1959 లోనే జవాబు చెప్పారు. ఆధునిక వచన కవిత్వంలో వచ్చిన రసవద్రచనలు చిరకాలం నిలిచి వుంటవని తలచటం భావ్యంకాదు.

వచన కవులు కవిత్వం చదివేటప్పుడు గొంతెత్తి పద్య కవులకు మల్లే ఒక విరుపు, తూగు, లయ వీటిని పాటిస్తున్నారు గనుక, కవిత్వానికి ఛందస్సుతో సంబంధం అనివార్యమంటారు శ్రీ కేతవరపు రామకోటిశాస్త్రి. "ఛందస్సు యొక్క కబంధ హస్తాలలో చిక్కుకున్న కవిత్వానికి మనం విడుదల కలిగించి స్వతంత్రంగా బ్రతకమంటున్నాం. అది బ్రతకటం మానుకుంటున్నది. మానుకుంటుందన్న భయంచేతనే కవులు అవకాశం చిక్కినప్పుడెల్లా సాధ్యమైనంతవరకూ ఆ కవిత్వంలోకి ప్రాణాలను ఊదుతున్నారు. వచన పద్యాల కవులు పద్య కవుల్లాగే నొక్కులతో

18. 'వచన కవిత - అభిమానుల అత్యుక్తులు' - నోరి నరసింహశాస్త్రి - భారతి - ఏప్రిల్ 1971.

చదవటం అందుకే.[19] గొంతెత్తి కవులు నొక్కులతో చదివిన మాత్రాన కవిత్వానికి ఛందస్సు అనివార్యమనటం సరికాదు. యథార్థమైన కవిత్వం దానికి తగిన ఛందస్సులో వెలువడినట్లే, లయతోనూ వెలువడుతుంది. కవి యీ 'లయ'ను శ్రోతకు అందించ ప్రయత్నించటం తప్పేమీకాదు. ఈ విధంగా చదవటాన్ని ఛందస్సుతో ముడిపెట్టనక్కరలేదు. మరొక ఆక్షేపణ శ్రీ దుర్గానంద్ చేశారు. వచన కవిత్వం పఠితకు తృప్తి కలిగించటం లేదని ఆయన ఆరోపణ. వచన కవిత్వంలో "వేడి వుంది, వాడి వుంది. కాని ఆ వైభవ సంపన్నమైన భాషలేదు. ఆ తంద్రాలసమైన సంగీతంలేదు. ఆ భావతన్మయతలేదు. ఇది ఒక మెరుపు వంటిది. ఒక్క మెరుపుతో ఒక్క విరుపుతో పాఠకుడు ఎంతసేపు ఆనందించగలడు. హృదయాంతరాళంలో క్వణితమై అతని సర్వనాడులను ప్రసక్కింపజేసే పారవశ్యం కొరకు అతడిప్పుడు తహ తహ లాడుతున్నాడు" అని దుర్గానంద్‌గారు తిరిగి వెనక్కు మరల మంటున్నారు. "గ్రాహకుడు కోరాడని మధువునమ్మే అంగడిలో టాయిలెట్టు సామానులు తెచ్చి అమ్ముతున్నాడు"[20] అని కవులు పద్యం చదవని పాఠకుల కోసం, వచన కవితను రాస్తున్నందుకు వాపోయారు. వీరి ఆరోపణ సరియైనదికాదు. పారిశ్రామిక యుగధర్మాన్నిబట్టి కవితా పద్ధతి మారితే తప్పులేదు. మార్పు సహజం కూడ. పెక్కు మంది పండిత కవులు పద్యరచనతోపాటు వచన కవిత్వాన్నిగూడ రచిస్తున్నారంటే వచన కవిత్వం స్థిరంగా నిలిచి వున్నదని చెప్పవచ్చు. "1960 ప్రాంతంలో తెలుగు కవితలో వచన కవిత ఒక స్థిరమైన రూపాన్ని పొంది, ప్రాధాన్యం వహించినట్లు గోచరిస్తుంది. ఒక క్రొత్తతరం కవులు అన్ని భావ ధారలనూ ఈ కావ్యరూపంలో అభివ్యక్తీకరించటం మొదలుపెట్టారు."[21]

19. 'కవిత్వానికి ఛందస్సెందుకు? అక్కరలేదూ?' - కేతవరపు రామకోటి శాస్త్రి - ఆకాశవాణి, విజయవాడ - రజతోత్సవ సంచిక - 1974.
20. 'వచన కవిత్వం పేరుతో కొన్ని విజాలు' - దుర్గానంద్ - 'నవత' - జూలై 1967.
21. 'భూమిక' - 'చేతనావర్తం' - సాహితీ బంధు బృందం - వరంగల్లు - 1967.

శాఖోపశాఖలుగా విస్తరించి వచన కవిత్వం మహావృక్షమై సమృద్ధిగా ఫలాలను అందిస్తున్నది. వచన కవితా వికాసానికి తోడ్పడిన వారిలో స్వాతంత్ర్యానంతరం కవిత రచించిన కొందరి కృషిని గురించి వివరిస్తాను.

## వచన కవిత్వ వ్యాప్తికి కుందుర్తి కృషి

తెలుగులో ప్రచురింపబడిన తొలి వచన కవితా సంకలనం 'నయాగరా', శ్రీ కుందుర్తి రచించిన 'తెలంగాణ' వచన కవిత్వంలో వెలువడిన తొలి సమగ్రకావ్యం. ఛందోబద్ధంగా 'సౌప్తికం' రచించి, తర్వాత తన భావప్రకటనకు వచన కవిత్వాన్ని యెంచుకుని, దాని విస్తృతికి శ్రీ కుందుర్తి నిర్విరామకృషి చేశారు. వైవిధ్యం లేనిదే కవిత్వం నిలవదనీ, కథాకావ్యాలు రావాలనీ, వచన కవిత్వంలో కూడ బృహత్కావ్యాలు వచ్చే అవకాశం వున్నదని విశ్వసిస్తారు.

వచన కవిత్వంలో ప్రయోగాలు జరగాలనే ఉద్దేశ్యంతో 'ఆశ' అనే నాటిక; 'శిక్ష ఏమిటి?' అనే నాటిక రచించారు. లేఖారూపంలో గీతాలు రచించారు. చరిత్రతో విజ్ఞప్తి చేస్తున్నట్లు ప్రజల నుద్బోధించారు. కథాకావ్యాలు రావాలనే తలంపుతో అజ్ఞాతశైశవం; ఆరంభ యౌవనం; అసమర్థ కౌమారం; అవసాన వార్ధక్యం అనే గీతాలు రాశారు. వచన కవిత్వంలో తనకు నచ్చని ప్రేమ కథాకావ్యాలు, మార్మిక కావ్యాలు వచ్చినప్పుడు కూడ ఆయన విశాల హృదయంతో స్వాగతం చెప్పారు. వచన కవిత్వంలో నిరంతరం ప్రయోగాలు జరుగుతూండవలసిందేనని ఇప్పటికీ అభిలషిస్తారు.

'తెలంగాణ' కావ్యాన్ని పద్దెనిమిది పర్వాలుగా విభజించి వచన కవిత్వానికి బలమైన పునాది కల్పించారు. 'ఆశ' నాటిక రంగస్థలంపై విజయవంతంగా ప్రయోగింపబడింది. ప్రేక్షకులలో పండిత పామరులిరువురినీ ఆనందింపజేసింది. ఈ మార్గంలో ఎక్కువ మంది కవులు కృషి చెయ్యకపోవటం దురదృష్టకరం. విప్లవ ఝంఝ ప్రభంజనమై వీస్తున్న యీ దశాబ్దంలో కూడ కవిత్వంలో నాటిక నిలదొక్కుకోలేదు. దృశ్యకళారూపాలు వ్యాపిస్తే ప్రజల్లో చైతన్యం పెంపొందుతుంది.

"భావనలో సామాన్యుని జీవిత వలయాలు దాటను" అని స్థిర నిశ్చయం చేసుకున్నట్లే, "రచనల పూల తోటలో ఛందస్సు మొక్కలు నాటను" అని ప్రతిజ్ఞ చేశారు కుందుర్తి. రైతు గుండెలో రాజు చేసిన ఘాతం, ఆకలితో మరణించిన కూలివాని ప్రేతం, జీవితాన్ని గడపలేని గుమస్తా వీరి కవితా వస్తువులు.

శ్రీ కుందుర్తి ప్రచారం చెయ్యక పోయినా వచన కవిత్వం ఇప్పుడున్న ఉన్నత దశకు చేరుకుని వుండేదని కొందరు విమర్శకులు ఆయన కృషిని శంకించారు. కాని పద్యం రాజ్యమేలుతున్న కాలంలో వచన కవిత్వం రాసి, పండితుల్నికూడ మెప్పించి "మేం మాత్రం పద్యమే కవిత్వమంటున్నామా? ఏమిటి?" అనేదాకా తీసుకువచ్చిన ఖ్యాతి వీరిదే. సుమారు ఇరవై వచన కవితా సంకలనాలకు పీఠికలు రాసి, వచన కవిత్వమంటే ఏమిటో తెలియజెప్పారు. వచన కవిత్వంలో ఆహ్వానించదగిన మార్పులను, వదలిపెట్టవలసిన భాషాభేషజాన్ని, ఆంగ్ల సంస్కృత శబ్దాడంబరాన్ని, అయోమయమైన ఆలోచనలను అంత్య ప్రాసలకు బందీ అయిపోవటాన్ని గురించి పదేపదే హెచ్చరించారు. శ్రీ తిలక్ మొదలైనవారు కథాకావ్యాలు రావాలనే తలపును వ్యతిరేకించినప్పుడు, వీరు మొండి పట్టుదలతో తన వాదమే సరియైనదని వాదించక, వచన కవిత్వ సుస్థిరతకు కథాకావ్యాలు దోహదం చేస్తాయని, కవులను యీ విషయాన్ని గురించి యింకా ఆలోచించవలసిందనీ కోరారు. 'ఫ్రీవర్స్ ఫ్రంటు' స్థాపించి వచన కవితా ప్రచారానికి విశేషమైన కృషి చేశారు.

అంతర్ముఖులై జీవన తత్త్వాన్ని గురించి వ్యాఖ్యానిస్తున్న కుందుర్తి ఇటీవలి కవితల్లో రసావేశం తక్కువగా, ఆలోచింపజేసే గుణం ఎక్కువగానూ కన్పిస్తున్నది.

## వచన కవిత్వంలో శ్రీశ్రీ సాధించిన వైవిధ్యం

'ప్రభవ' రచించి కవిగా పేరుపొందాక శ్రీశ్రీ కొత్తదనం కోసం వెదుక్కుంటూ 1929లో సుప్తాస్థికలు రచించారు. శ్రీ శిష్టా 'అతినవ్య'

కవిత్వం ప్రారంభించి 'ప్రాస్లేప కవిత్వం' చెప్తున్నారు. శ్రీశ్రీ కూడ వచన కవితవైపు ఆకర్షితులయ్యారు. కొద్దికాలంలోనే ప్రయోగవాదులైన అతి నవ్యకవుల్లో అగ్రగణ్యులైనారు. శ్రీశ్రీ రచనలు ఛందోబద్ధంగా వున్నాయా లేదా అని చూడకుండ యువకవులు వాటిని కళ్ల కద్దుకున్నారు. 'మహాప్రస్థానం'లో అనేక వచన గీతాలున్నాయి. ఈ కావ్యసంపుటిలో కొన్ని గీతాల్లో గేయఛాయలు, పద్యపాదాలూ వున్న మాట నిజమే. 'మహాప్రస్థానం'లో వచన గీతాల్లో పద్యపాదాల కోసం, పద్యపు తునకల కోసం వెదకటం ఛందోవేత్తలకు 'హాబీ' అయింది. సంప్రదాయాన్ని విడనాడలేకపోవటం చేతనే, ఛందస్సు అవశేషాలు తన రచనల్లో కన్పిస్తాయని, తన తర్వాత కవులు నిగ్గుదేరిన వచన గీతాలను రాస్తారని శ్రీశ్రీ ఆశించారు. ఆయన ఆశ నెరవేరింది. వచనగీతం అపరిమితమైన శక్తిని సంతరించుకున్నది.

"ఛందస్సు (గాయత్రీ సాక్షిగా చెబుతున్నాను) ఎటు తిరిగితే అటు తిరుగుతుంది. విధానంలో వికారం- మాత్రలు మింగడం నాకు చేతకాదు"[22] అని ఆయన ఛందస్సు కవి చెప్పినట్లు వినాలేగాని, కవిత్వం ఛందోనియమాలకు లొంగిపోకూడదని తలచారు. ఛందస్సులు 'సర్ప పరిష్వంగా' లని ఆయన అభిప్రాయపడ్డారు. "ఛందోరహస్యం తెలిసిన వెటరన్సు, స్ట్రెయిట్ రైమ్స్‌కే ఇస్తారు ప్రిఫరెన్సు" అని ఆయన వచన కవిత్వాన్ని సమర్థించారు.

నిరంతర ప్రయోగశీలి శ్రీశ్రీ 'ప్రాసక్రీడలు', 'లిమఋక్కులు' రచించి వచన కవిత్వంలో వైవిధ్యానికి తోడ్పడ్డారు. "వ్యక్తుల ప్రైవేటు బ్రతుకు/వారివారి సొంతం/పబ్లికులో నిలబడితే/ఏమైనా అంటాం" అని ప్రముఖ వ్యక్తుల్ని అపహాస్యం చేసే అధికారం, పత్రికలో కార్టూనులు వేసేవారికి వున్నట్లే కవికీ వున్నదని తలుస్తారు. "అడుగుజాడ గురజాడది/అదిభావికి బాట/మనలో వెధవాయత్వం మరపించే పాట" వంటి

---

22. 'కారదాబిల్లి' - 'మహాకవి ఆశ్చర్యం' - శ్రీశ్రీ - శ్రీశ్రీ సాహిత్యం - రెండు (కావ్యవిభాగం) - 1970.

'ప్రాసక్రీడలు' మనస్సును అలరిస్తాయి. 'లిమబుక్కులు' శ్రీశ్రీ 'పచరించిన' ఐదు పాదాల వచనగీతం. ఆయా సందర్భాలకు సరిపోయిన కాలక్షేపపు రచనలే అయినా "నా యింటిపేరు ప్రపంచం / ప్రజలే నా కుటుంబం/వెదజల్లుతా దిగ్దిగంతం / అభ్యుదయ సుగంధం / అప్పుడు నా జీవితమే ఒక ప్రబంధం" వంటి ఆహ్లాదకరమైన రచనలూ యిందులో వున్నాయి.

"కోఈ హఁస్‌రహాహై; కోఈ రో రహాహై"; అనే రచనలో శ్రీశ్రీ వచనాన్ని కవిత్వంగా పరివర్తింపజేశారు. కవిత్వానికి ఛందస్సుతో పనిలేదని యీ గీతం నిరూపిస్తుంది. 'మహాప్రస్థానం'లో 'వాడు' అనే గీతాన్ని పరిశీలిస్తే వచన కవిత్వంలో శ్రీశ్రీ సాధించిన పరిణతి బోధ పడుతుంది.

డెబ్భైయేళ్లు నిండిన వయస్సులోకూడ శ్రీశ్రీ మనస్సు ఎప్పుడూ కొత్త ప్రయోగాలవైపే ఆకర్షింపబడుతూ వుండటం విశేషం. ప్రతి వసంతానికీ పుష్పించే పచ్చని చెట్టు శ్రీశ్రీ.

ఆరుద్ర - "కవితకోసం నేను పుట్టాను,
కాంతి కోసం నేను కలం పట్టాను"

1942లో కవిగా కలంపట్టిన నాటినుండి వచనకవిత్వాన్నే అభిమానించినా, పద్యరచనలోకూడ ఆరుద్రగారు అందెవేసిన చేయి. ఛందస్సుల చేత వెట్టిచాకిరీ చేయించుకోగలిగిన ఆరుద్ర వచన కవిత్వంలో రకరకాల ప్రయోగాలు చేశారు.

"కవిత కోసం నేను పుట్టాను
కాంతి కోసం కలం పట్టాను"

అని ఆయన స్వేచ్ఛకోసం తపించి, నియమాల పంజరాన్ని విరుగగొట్టి, నూతన సమాజ నిర్మాణానికి కృషి చేశారు.

ఆరుద్రగారి కవిత్వంపై పాశ్చాత్యకవుల - ముఖ్యంగా టి. ఎస్. ఇలియట్, డిలాన్‌థామస్, ఎమిలీ డికిన్‌సన్, ఆగ్డన్‌నేష్‌ల ప్రభావం

ఎక్కువ. కవిత్వంలో ఆయన చేసిన ప్రయోగాల వైచిత్రిని హర్షించ లేని విమర్శకులు వాటిని 'సర్కస్‌ఫీట్లని' ఆక్షేపించారు. కాని ఆయన ప్రయోగాల్లో కవితాశిల్పం మిక్కిలి పనివాడితనంతో కూడు కొన్నది; ఆలోచనా పరులైన పాఠకులు శ్రమిస్తేనేగాని అందుకోలేనిది. కొన్ని తేలిక రచనలున్నప్పటికీ, భావ ప్రచారం కోసం సంవిధానాన్ని వదలు కోని కళాకారుడు.

'త్వమేవాఽహం' తర్వాత ఆయన రచించిన "సినీవాలి, పైలా పచ్చీసు, ఇంటింటి పజ్యాలు, గాయాలు - గేయాలూ; ఏటికేడాది వచన కవిత్వమే, కూనలమ్మ పదాలు మాత్రా ఛందస్సులోను, ఎంచినపజ్యాలు వృత్తాలలోను రచించారు. వచన కవితలో ఛందోబద్ధమైన పద్యాలను ఇమడ్చటం ఆరుద్రగారి ప్రత్యేకత.

"ఆరుద్ర తనఛందస్సులచేత అందంగా చాకిరీ చేయించుకోగలడు ....శుద్ధ వచనం రాస్తున్నా దాని గమనంలో ఒక వేగం సాధించగలడు" అని శ్రీశ్రీ గారు ఆరుద్ర కవిత్వాన్ని మెచ్చారు (త్వమేవాఽహం-పీఠిక). వచన కవిత్వంలో ఆయన రచన పట్టి చూడగానే ఆరుద్ర ముద్రతో ఇట్టే తెలిసిపోతుంది. అంత్య ప్రాసనియమాన్ని యించుమించు వచన కవు లంతా పాటించినా అది ఆరుద్రగారి కవిత్వంలో వొదిగినట్లు మరొకరి కవితలో రాణించలేదు - "సీతారామసామీ / నేజేసిన నేరము లేమీ" అని అడిగే రామదాసువలె, తెలుగువారికి అంత్యప్రాస సహజంగా వస్తుందంటారు ఆరుద్ర,

'సినీవాలి'లో నాటకీయత, 'ఇంటింటి పజ్యాల'లో ఉల్లము ఝల్లు మనే ఝటితిస్ఫూర్తి, 'ఏటికేడాది'లో సమకాలిక సమాజంలో మార్పు రావాలని అభిలషించిన తీరూ ఆరుద్రగారి కవితావైభవానికి నిదర్శనాలు. 'ఇంటింటి పజ్యాలు'లో కొంటెపిల్ల కాయల్లేని కన్నతండ్రి / గోదావరి పొంగుల్లేని రాజమండ్రి" అని హృద్యమైన రీతిలో వచన కవిత్వానికొాక లాలిత్యాన్ని సమకూర్చారు. 'పైలాపచ్చీసు'లో వెయ్యివోల్టుల కవిత్వం ప్లస్; మైనస్ గుర్తులతో చూశటానికి కూడ చిత్రమనిపించి, ఒక

పంక్తితో మరొక పంక్తిని అన్వయించుకుని చదువుకోవలసిన రచన. ఇది కవిత్వానికి మంచి లక్షణం కాదుగాని ఆరుద్ర వైచిత్రీప్రియులు కావటం వల్ల వాక్చమత్కృతులతోపాటు, అన్వయంలో, అచ్చులో కూడ చమత్కృతులు చేస్తారు. వీటినిచూచి ఉడుక్కోనక్కరలేదు. 'వేయి వోల్టుల కవిత్వం' వ్యర్థమనగలమా ? విద్యుచ్ఛక్తిని మానవ వినియోగానికి తెచ్చుకున్నట్లు ఆరుద్రగారిని అర్థం చేసుకుంటే కావలసినంత కాంతి, శక్తి లభిస్తాయి. ఆరుద్రగారి వచన కవిత్వంలో వైచిత్రి, వైవిధ్యమూ మనోజ్ఞంగా దర్శనమిస్తాయి.

## దాశరథి - "మద్యంలా పారే పాత ఛందస్సు పనికిరాదు"

"విద్యుత్తులా ఊహించగల మనకు మద్యంలా పారేపాత ఛందస్సు పనికిరాద"ని వచన కవిత్వాన్ని విద్యుత్ ఛందస్సని సంభావించారు శ్రీ దాశరథి. పద్యం నడక, గేయపుసొగసు బాగా తెలిసిన దాశరథి వచన కవిత్వాన్ని కొన్నిచోట్ల లయబద్ధంగా, మరికొన్నిచోట్ల నిక్కచ్చిగా వుండేటట్లు రచిస్తారు. 'అగ్నిధార' రచించిన నాటి నుండీ ఆయన వచన కవితను అభిమానిస్తూనే వున్నారు. "నిరుపేదా ! శ్రమిక జాతి; '?' అనంత సంగ్రామం; పదేపదే అనేస్తా" మొదలైన కావ్య ఖండికలు వచన కవిత్వంలో రాసినవే.

"రూపాయికి విలువలేని రోజు రేపు వస్తుందట; మస్తిష్కంలో లెబరేటరీ; మేల్కొన్న మనిషిని చూడ్డానికి వెళుతున్నాను; రేపటి జలపాతాలు; కంటికి కనిపించిందంతా కైతగారానేస్తున్నాను," మొదలైన ఖండకావ్యాల్లో ఆయన వచన కవిత్వం అభ్యుదయ భావాలతో శక్తిమంతంగా సాగింది. ఉర్దూ, పర్షియన్ భాషల్లో నిష్ణాతులైన దాశరథి ఆ భాషల్లోలాగే 'గజల్' వంటి ప్రక్రియల్లో క్లుప్తంగా, 'కప్లెట్ల' వంటి వచన గీతికలను వెలయించటం ఆధునిక కవితకు పుష్టిని చేకూర్చింది.

"తిమిరంతో సమరం; ఆలోచనా లోచనాలు" కావ్యాల్లో ఆయన కవిత్వం పలచబారి కొన్నిచోట్ల వచనకవిత్వం వచనపుస్థాయికి దిగజారినట్లనిపిస్తుంది. ఛందోబద్ధంగా తీర్చిదిద్దినట్లు పద్యం రాయగల దాశరథి

వచన కవిత్వాన్ని చేపట్టటం వలన ఆ ప్రక్రియకే గౌరవం వచ్చిందని చెప్పవచ్చు.

## నారాయణరెడ్డి నవ్య భావన

మాత్రా ఛందస్సులతో ప్రణయ కవిత్వాన్ని, చారిత్రక గాథలను రచించిన ప్రఖ్యాతులైన శ్రీ సి. నారాయణరెడ్డి పద్యం, గేయం బాగా నడిపించగలరు. పాటరాయటమంటే ఆయనకెంతో మక్కువ. ఆధునిక యుగధర్మానికి అనుగుణంగా ఆయన విరివిగా వచన కవిత్వం రాస్తున్నారు; సంపుటాల కెత్తిస్తున్నారు. శబ్దం రంగు రుచి వాసన తెలిసిన కవి ఆయన. శబ్దం మీద ఆయనకు అపరిమితమైన మోజు. వచన కవిత్వంలో అందమైనశబ్దాలను కూర్చాలన్న మోజు, సార్థకమైన శబ్దాలను కూర్చాలన్న తపన ఆయన కవిత్వాన్ని ఒక్కోసారి కృత్రిమంగా తయారు చేస్తున్నాయి. చెవికింపు కలిగించే ఆయన శబ్దాల పోహళింపు మనస్సును కదిలించటం కంటె శ్రావ్యతనే ఎక్కువ కలిగిస్తుంది.

అపురూపమైన పింగాణీ బొమ్మ చుట్టూ - దాని భద్రత కోసం చెత్తను చేర్చినట్టు నారాయణరెడ్డిగారు హృద్యమైన భావాన్ని అందించడానికి - దాన్ని శబ్దాలతో కప్పి 'పేకేజి కవిత్వం' రచిస్తారని శ్రీ పాద గోపాలకృష్ణమూర్తిగారొక సందర్భంలో చెప్పినట్టు జ్ఞాపకం. ఈదశాబ్దంలో (1970-80) నారాయణరెడ్డిగారు రచించిన "ముఖా-ముఖీ; మనిషీ-చిలుక; ఉదయం నా హృదయం; మార్పు నా తీర్పు; మరోహరివిల్లు; భూమిక; మంటలూ-మానవుడూ" సంపుటాలలో రసవంతమైన కవిత్వం కోసం వెదకవలసి వస్తున్నది.

"ఉదయానికి ఉరి; వారసుణ్ని; పసులపోశి; విరిగిన హరివిల్లు; సూచికలు" (మార్పు నాతీర్పు) వంటి గీతాలు మాత్రం హృద్యమైనవి. శ్రావ్యమైన శబ్దాలమీద మోజు తగ్గించుకుంటే నారాయణరెడ్డిగారు ఇంకెన్నో రసవంతమైన కవితలను అందించగలుగుతారు.

ఛందోరహస్యం తెలిసిన నారాయణరెడ్డిగారు వచన కవిత్వాన్ని నాజూకుగా, పొదుపుగా, వొయ్యారంగా నడిపించి యీ ప్రక్రియకు అందచందాలను సమకూరుస్తున్నారు.

## తిలక్ - వచన కవితకు లయాన్వితమైన సౌందర్యం

భావకవిత్వాన్ని అభ్యుదయ కవిత్వాన్ని రెండిటినీ ఆదరించిన శ్రీ బాలగంగాధర తిలక్ ప్రధానంగా అనుభూతివాది. పద్యరచనలో, గేయ రచనలో సిద్ధహస్తులైన తిలక్ వచన కవిత్వంలో ఒక విలక్షణ గమనాన్ని సాధించారు. గొంతెత్తి చదవటానికి వీలైన, చెవికి యింపుగొలిపే మాటలతో కవిత రచిస్తారు. వాడుక భాషలో రాస్తూ వున్నట్టుండి, సుదీర్ఘ సంస్కృత సమాసాన్ని జొప్పించి గీతానికొక వింత సొగసును సాధించటం తిలక్ ప్రత్యేకత. అన్వయ కాఠిన్యంలేని యీ సమాసాలతో వీరి ఖండకావ్యాలు మళ్ళీ మళ్ళీ చదవాలనిపిస్తాయి. కొన్నిచోట్ల మాత్రం బరువనిపిస్తాయి. వచన కవులు చాల మంది తిలక్‌ను అనుసరించటానికి ప్రయత్నించారు. ఇప్పటికీ ప్రయత్నిస్తున్నారు.

వచన కవిత్వంలో కథాకావ్యాలు రావాలని శ్రీ కుందుర్తి సూచించినప్పుడు శ్రీ తిలక్ ఆ అభిప్రాయంతో ఏకీభవించలేదు. "ఒక కవితాఖండిక దానికదే సమగ్రమూ పూర్ణమూ అయిన అనుభవాన్నిస్తుంది. కవిత్వాన్ని నేడు అనుభవప్రదంగానే తీసుకుంటున్నాం. తక్కిన పాత్రోన్మీలనకూ, సంఘర్షణలకూ యితర సాహిత్య ప్రక్రియలు ఉన్నాయి. కవిత వాటి జోలికి వెళ్ళి నగుబాటు పొందవలసి వస్తుందేమో !.... చురుకైన ఆవేశాన్ని, సాంద్రతరమైన అనుభూతి ఒత్తిడినీ సూక్ష్మమైన భావనని ఆనందించటానికి కవిత తన స్థానాన్ని ప్రత్యేకించుకుంది. అందువలననే దేశదేశాల నవ్యకవితా విలసనంలో కథాభాగం వెనక్కి వెళ్ళిపోయింది. కవిత తన పరిధిని స్పష్టంగా నిర్ణయించుకోగల్గుతోంది" అని శ్రీ తిలక్ అనుభూతికే ప్రాధాన్యమిచ్చారు.[23] ఇప్పటి నవకవులు తిలక్ అభిప్రాయాన్నే ఆమోదించినట్లు కన్పిస్తుంది. కథాకావ్యాలు విరివిగా వెలువడటం లేదు.

23. వచన కవిత - వివిధ కవుల పథాలూ, దృక్పథాలూ - బాలగంగాధర తిలక్-ఫ్రీవర్స్ ఫ్రంట్ తరపున స్నేహాంజలి ప్రచురణ-1967, (నవత-3)

కవిత్వం పట్టుపట్టి ఒక సందేశాన్ని అందివ్వాలనే అభిప్రాయాన్ని గూడ తిలక్ వ్యతిరేకిస్తారు. ''అగ్నిజల్లినా అమృతం కురిసినా అందం, ఆనందం'' కవిత్వం పరమావధి అని ఆయన భావన.

## సోమసుందర్ - వచన కవితలో సూక్తులు

మూడు దశాబ్దాలుగా వచన కవిత్వం రచిస్తూ దాని గమనంపై అధికారం సంపాదించిన, చేయి తిరిగిన రచయిత శ్రీ సోమసుందర్-వచన కవితలో చక్కని సూక్తులు పొదగడం ఆయన ప్రత్యేకత. ''జన్మెత్తిన మానవునకు జీవితమే పరమధనం; ఒక వీరుడు మరణిస్తే వేలకొలది ప్రభవింతురు'' మొదలైనవి ఆయన సూక్తులు. 'ఫాక్టరీ' గీతం రక్తం ఉడుకెత్తిస్తుంది. 'మలయా ప్రభంజనం'పై ఆయన కావ్యం మరికొన్ని అటువంటి కావ్యాలకు మార్గదర్శక మయింది.

''మేఘరంజని; సోమరసం; సుందరకాండ; మిణుగురులు'' సోమసుందర్‌గారి అభ్యుదయ భావాలకు భిన్నమైన రచనలు. వాటిల్లో ఆయన ప్రకృతి వర్ణనలు, తాత్త్విక చింతనా విలక్షణమైనవి. తన జన్మస్థలమైన పిఠాపురం ప్రకృతి సౌందర్యాన్ని, కాలంతోపాటు వస్తున్న మార్పుల్నీ 'ఊరు మారింది'లో వర్ణించారు. ఇది కూడ యువకవులకు ప్రేరణ కలిగించవచ్చు. 'వెన్నెలలో కోనసీమ' శీర్షికకు తగినట్లే ఆంధ్రదేశపు సౌందర్యసీమను కమనీయంగా వర్ణించింది. 'అనలకిరీటం'లో అభ్యుదయ భావాలు, కాల్పనికరీతి కలగలిసి వచన కవితలో ఎంతరుచిని కల్పిస్తాయి. సమకాలిక సంఘటనలకు స్పందించకపోతే కవిని పాఠకులు మరచి పోతారని ఆయన అభిప్రాయం. అందుచేత తగినంత ప్రేరణ లేకుండానే కావ్యరచనకు పూనుకుంటారు. వాడుకభాషలో వీరుపయోగించే సంస్కృత సమాసాలు; భావకవు లుపయోగించిన పడికట్టు పదాలు వీరిశైలిని జటిలం చేశాయి. శ్రీ సోమసుందర్ వచన కవితా మార్గం విలక్షణమైనది.

## పఠాభి ప్రయోగం - 'పన్‌చాంగమ్'

'భావకవిన్మాత్రము కాన్నే/నహంభావ కవిని' అని ఎలుగెత్తిచాటి, తెలుగుకవిత్వంలోకి చిచ్చుర పిడుగులాగ ప్రవేశించిన కవి శ్రీ పఠాభి.

వచన కవిత్వపు తొలిదశలో శిష్లా, ముద్దుకృష్ణ, శ్రీశ్రీ, నారాయణ బాబులతో పాటు 'పఠాభి' పాత విలువల్ని ధ్వంసంచేసి, నూతనకవితకు మార్గం సుగమం చేశారు. "ఛందస్సుల చండశాసనానికి కూడా కాలం వెళ్ళిపోయింది. కవి హృదయంలోని రాగాలాపన ఎట్టి తీగెలుగా సాగితే అదే గీతానికి ఆకారం నిర్ణయించాలి" అని శ్రీశ్రీ పఠాభి 'ఫిడేలు రాగాల డజన్'ను పరిచయం చేస్తున్నప్పుడే చెప్పారు. పఠాభి చేతిలో వచన కవిత్వం శక్తిమంతమైన ఆయుధం. ఫిడేలు రాగాలకు ముందుగా రచించినవి, ఆ తర్వాతవి కొన్ని రచనలు 'కయిత నాదయిత'లో వున్నాయి (ప్రచురణ 1978).

'పఠాభి పన్‌చాంగం' తెలుగులో సరికొత్త ప్రయోగం (1964). శబ్దార్థశ్లేషలు మనకు పూర్వకాలం నుండీ వున్నప్పటికీ - సమకాలిక సమాజాన్ని వర్ణించటానికి ఉపయోగించుకున్న కవి శ్రీ పఠాభి, "It is like having a hidden weapon under your sleeve. It is vey effective. But the hurt is smoothed over by the humour it generates" అని పఠాభి 'పన్'ల ద్వారా సాంఘిక ప్రయోజనాన్ని సాధించారు.[24] వెలయాలు చాలా ప్రియము. 'అలుచాలా సరసము;' కరగ్రహణానికి ముందు / వేలు కావాలంటాడు ఈనాటి యువకుడు - మొదలైన చమత్కారపు వాక్యాలు చిటికెలో చదివి ముగించటానికి వీలైనవి. వీటివల్ల కలిగే ఆనందం మాత్రం చిరస్మరణీయమైనది.

శ్రీ పఠాభి మిక్కిలి నిపుణుడైన కవనశిల్పి. ఆయన రచనలు రాశిలో తక్కువైనా మిక్కిలి విలువైనవి.

## అజంతా - తీర్చిదిద్దిన శిల్పం

వచన గీతంలో ప్రతి శబ్దమూ సార్థకంగా, మరొక మాటతో దాన్ని మార్చటానికి వీలులేకుండ, చెక్కిన శిల్పంలాగ తీర్చిదిద్దగల

24. Foreword పఠాభి రామిరెడ్డి - 'పఠాభి పన్‌చాంగం' - ప్రవాసాంధ్ర భారతి - మైసూరు-14; 1980.

నేర్పరి శ్రీ అజంతా. కవితా శిల్పంలో గొప్ప పనివాడు. హృదయాన్ని కదిలించే భావుకశక్తికి, తగిన శబ్దం లభించే వరకూ నిరీక్షించటం చేత వీరు అతితక్కువ వచనగీతాలు రాశారు. వచనగీతంలో శబ్దసంవిధానమూ, శబ్దసంగీతమూ తెలిసిన అజంతా కుశాగ్రబుద్ధులైన కవులకు మార్గదర్శకులయ్యారు. అరుద్ర, కేశవరావ్ మొదలైన కవులపై అజంతా ప్రభావం కన్పిస్తుంది.

## కేశవరావ్ 'ఉదయించని ఉదయాలు'- "తిరుగుబాటు దారులపై తిరుగుబాటు"

'ఉదయించని ఉదయాలు' కావ్యంతో శ్రీ కేశవరావ్ కంఠం వచన కవితలో శక్తిమంతంగా వినవచ్చింది. అభ్యుదయ కవులు భావ కవిత్వంపై తిరుగుబాటు జరిపి, ఆకలి దారిద్ర్యం కావ్య వస్తువులుగా ఓ పాతికేళ్ళ పైచిలుకు కాలం కవిత్వాన్ని నడిపించారు. వారిలో స్తబ్ధత ఏర్పడిన సమయంలో జడత్వాన్ని బ్రద్దలు కొడుతూ చీకటిని ఛేదిస్తూ శ్రీ కేశవరావ్ 'ఉదయించని ఉదయాలు' రచించారు.

"తిరుగుబాటు దారులపైన తిరుగుబాటుకూడ ఒకప్పుడు అవసరం" అని శ్రీకేశవరావ్ కవిత్వానికి ఆరుద్ర ఆమోదం ప్రకటించారు. ఈతరం కవులు విరహగీతాలు రాస్తే ఎందుకో అందరూ ఎబ్బెట్టుగా చూస్తారు. అభ్యుదయ కవుల ధర్మమా అని వర్గ చైతన్యం గురించి పాడితేనే తప్ప మిగతాది కవిత్వం కాదేమోనన్న అపోహ ఆంధ్రదేశములో అనవసరంగా ఊపిరి పీలుస్తోంది. వచన పద్యాలకి సరిపోయే కావ్యవస్తువులు వేరే వున్నాయను కుంటాను" అన్నారు అరుద్ర.[25] వచన పద్యాలకి సరిపోయే కావ్యవస్తువులు కేశవరావ్‌గారి కవితలో వున్నాయి. "ఆకాశాన్ని వెలిగిస్తాను; ఈ గులాబి నవ్వుతుంది; నిశిలోంచి నిజంలోకి: జ్ఞాపకాల డైరీలోంచి" గీతాలు కేశవరావ్‌గారి కవితాశక్తికి నిదర్శనంగా పేర్కొనదగ్గవి.

25. 'ఒప్పో, తప్పో, ఇది నా మెప్పు' - ఆరుద్ర - 'ఉదయించని ఉదయాలు' పీఠిక - అనీలా ప్రచురణ - 1961.

'నాలుగు రోడ్లు' గీతం ఏ ప్రమాణాలతోచూచినా ఉత్తమ రచన- "రాత్రి - ఊరునిద్ర పోయాక / ఎవరిబాధల్ని వాళ్ళు దుప్పట్లో బంధించే శాక / కన్నీళ్ళకి ఆనకట్టలు కట్టేశాక/మృగాల్ని లోపలికి తోలేసి మనసు గేట్లు వేసేశాక / మేం నలుగురం / నాలుగు దిక్కుల నుండి వొచ్చి/ కాఫీ హౌస్‌లో కలుసు కుంటాం. అనుభవాల గీతాల్ని ఒకరి కొకరం వినిపించు కుంటాం / కోపంతో గాలిని వేడెక్కిస్తూ / కన్నీళ్ళతో శిలల్ని కరిగిస్తూ" గడిపిన కాలాన్ని కవిత్వంలో చిరస్థాయిగా నిలిపారు. భావ ప్రకటనలో శ్రీ కేశవరావ్ అజంతాగారిని తలపిస్తారు. జీవితాన్ని నిర్వ చించకు / దోసిట్నిండా నింపబడిన యీ జీవితాన్ని గటగటా తాగెయ్య నియ్యి" అని పలుకగలిగిన కవి వచన కవితకు శక్తిని చేకూర్చారని చెప్పవచ్చు.

## కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు - "కాలమొక తుది మొదలులేని ఎడారి"

వచన కవిత్వవికాసదశలో శ్రీ కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు తనదని చెప్పదగిన వొక విలక్షణమైన శైలిలో వచన కవిగా ఆవిర్భ వించారు. "కొడిగట్టే దివ్వెలు; అశ్రుదీపిక; తుఫానురాత్రి" మొదలైన గీతాలతో 'అగ్నిశిఖలు - మంచుజడులు' కావ్యం వెలువరించారు.

"ఏదోవొక అజ్ఞాత మహాశక్తి నటిస్తున్నది/ఈ మానవ శక్తు లపై విజయం ప్రకటిస్తున్నది/ఏ కనిపించని ఝుంఝూ ప్రభంజనం వీస్తు న్నదో/దీనహీన గళాలెత్తి/దివ్వెలు విలపిస్తున్నవి" అని మానవుని నిస్సహాయతను వ్యక్తపరచారు.

"కాలమొక తుదిమొదలు లేని ఎడారి
ఇది పొడుగు కాళ్ళున్న గూని ఒంటెల దారి
నీరసించిన నిరాశాపథిక సోదరా
లోకమిది కొందరికి మాత్రమే రహదారి" (ఇసుక ఎడారి)

ఈ గీతంలో భావం మెదడు చురుక్కుమని పిస్తుంది. హృద యాన్ని కదిలిస్తుంది.

వచన కవితలో అభ్యుదయ భావాలు నీరసించిపోయి, కవులు పేలవంగా పలుకుతున్నప్పుడు కొత్తదనం కోసం తపించిన కవి శ్రీ వెంకటేశ్వరరావు.

## సి. వి. కృష్ణారావు 'వైతరణి' : "నగరం దేహంమీద మానని రాచపుండు మురికిపేట"

వచన కవిత్వంలో అభ్యుదయ భావాలను వెదజల్లిన కవి శ్రీ సి. వి. కృష్ణారావు. 1960 తర్వాత అభ్యుదయ కవితోద్యమం వెనకబట్టిన తర్వాత శ్రీ కృష్ణారావు "వైతరిణి; మాదీ మీఊరే"కావ్యాలు రచించారు. దళితజాతుల దీనగాధలు వీరి కావ్యవస్తువులు. ఒక్కొక్క నగరం దేహంమీద మానని రాచపుండు లాగపుట్టిన మురికివాడల్లో సంచరించి, అర్జీ రాసుకోవటానికి ఇళ్ళల్లో కాగితం, కలం కూడా లేక అధికార్లకు 'ఏకలవ్యుల్లా'గ బొటనవేళ్లు అందించే దీనుల వ్యధాభరితమైన జీవితాలను వీరు యీ కావ్యాల్లో వర్ణించారు. "చిత్తడి నేలమీద చిన్న పూరిగుడిసె / ఉప్పులూరి చపుడు రాలి చతికిలబడిన గోడలు" మురికి పేటల్లో కన్పించే దృశ్యాలు. మురికిపేటలు పెరుగుతున్నాయిగాని, ఆపేటవాసుల జీవితాల్లో 'మార్పు' రావటం లేదు. వస్తున్న మార్పు వాళ్ళింకా దుర్భరస్థితికి దిగజారటమే. వైతరణిగట్టున విధి తిరస్కరించిన వ్యధా భరిత జీవితాలు కృష్ణారావుగారి కవితలో సజీవ చిత్రాలై సాక్షాత్కరించాయి.

"వేలుపెట్టి చూపించి తుపాకి పెట్టి కాల్చటానికి 'Bull's eye' ఇంకా అమర్చ బడలేదు" అని సమాజంలో విప్లవానికి ఇంకా అనువైన పరిస్థితులు ఏర్పడలేదని వీరు భావిస్తారు. సాంఘిక విప్లవం రావాలనీ, అందుకు కవులు తోడ్పడాలని తలచే కవి శ్రీకృష్ణారావు. ఆధునిక వచన కవులలో వీరు రాస్తున్న కవిత నినాదాలకు, పడికట్టుమాటలకు దూరంగా, కరుణ రసభరితంగావున్నది.

## వరవరరావు - "మంచి వాని కంఠం కంచయి మోగాలి"

అభ్యుదయ కవిత్వం ఉజ్జ్వలంగా జ్వలించి, వెలుగుతగ్గి కొడిగట్టి వున్నప్పుడు ఆ దీపాన్ని మళ్ళీ వెలిగించి కాంతిని ప్రసరింప జేసిన కవులలో శ్రీ పెండ్యాల వరవరరావు వొకరు. ఆయన రచించిన 'చలినెగళ్లు; జీవనాడి' అభ్యుదయ భావాలతో సమాజ శ్రేయస్సును కోరినవి. 'ఆడ్ అవర్స్' అన్న గీతంలో (చలినెగళ్లు) "వరమీయని వేల్పు గర్భగుడిలో/ తరగని అగరువత్తుల పొగలో నిదురించిన వేళ / ద్వారంలో బిచ్చగాడు తోరణమై వేళ్ళాడిన లీల" మొదలైన భావచిత్రాలు శ్రీ వరవరరావుపై తిలక్‌గారి ప్రభావాన్ని తెలియజేస్తాయి. క్రమంగా ఆయన సమాజపు వక్రనడతకు కారణాలు తెలుసుకుని, 'సెంటి మెంట్స్' నుండి బయట పడి, వర్గ పోరాటాన్ని నమ్మి 'విప్లవ రచయితల సంఘంలో' చేరారు. అంతకుముందు ఆయన రాసిన గీతాల్లో "మంచి నీరను కొని రాత్రి మల్లెపూవు తాగిన / మంచు నీరు గడ్డకట్టి కుత్తుక జారడంలేదు" (శిశిరోషస్సు) మొదలైన మనోహరమైన ప్రకృతి చిత్రాలున్నాయి.

మూగజీవాలవంటి ప్రజల శ్రేయస్సుకై కవిత్వాన్ని, జీవితాన్ని ప్రజాసేవకే అంకితం చేయదలచిన కవి. పత్రికానిర్వహణలో ప్రభుత్వం ఆయన అభిప్రాయాలకు అభ్యంతరం చెప్పి జైల్లో వుంచినా, చలించక, తాను విశ్వసించిన సిద్ధాంతాలను ప్రచారం చేస్తున్న కవి శ్రీ వరవరరావు. ప్రజాక్షేమాన్ని కోరని రచనలన్నీ సోమరి పోతుల విలాస క్రీడలని ఆయన దృఢంగా నమ్ముతారు.

"మంచి వాని కంఠం కంచయి మోగాలి / మంచివాని కష్టం కనక మయిపండాలి" అని సంకల్పించిన వరవరరావుగారి కవిత్వం వచన కవితాభిమానులు కొనియాడదగినది.

## శీలా వీర్రాజు - 'పదచిత్రాల నుండి ప్రగతి మార్గానికి'

సుప్రసిద్ధ చిత్రకారులు శ్రీ శీలా వీర్రాజు కవితలో అందమైన పదచిత్రాలు అడుగడుగునా కానవస్తాయి. వచన కవిత్వంలో కథా

కావ్యాలు రావలసిన ఆవశ్యకతను గురించి శ్రీ కుందుర్తి చేసిన విజ్ఞప్తిని పురస్కరించుకుని శ్రీ వీరరాజు 'కొడిగట్టిన సూర్యుడు' - వచన కవిత్వ కథల సంపుటి రచించారు. కథ, కవిత వొక్కచోటనే వుండటం అరుదనీ, కవి కథమీద దృష్టిపెడితే కవిత్వం పలచ బారిపోక తప్పదని వొక అభిప్రాయం వున్నది. ఈ అభిప్రాయం సరికాదని శ్రీశ్రీ గారి 'భిక్షువర్షీయసి' మొదలైన కావ్యాలు నిరూపించాయి. వచన కవిత్వంలో హృదయాన్ని కదిలించే "కొడిగట్టిన సూర్యుడు; ముళ్ళరెమ్మ; అద్దెగది; హృదయం దొరికింది" మొదలైన కథానికలు రచించి ఖ్యాతి పొందారు.

కథానిక ముగింపులో పాఠకులు ఊహించని మలుపు తిప్పడం వీరరాజుగారి ప్రత్యేకత. జ్ఞాపకాల డైరీల్లోంచి జీవితానుభూతుల్ని వెదకి పట్టుకున్న ఆనందం వీరరాజుగారి కవితలో లభిస్తుంది.

'మళ్ళీ వెలుగు' కావ్యంలో శ్రీ వీరరాజు కవిత మలుపు తిరిగింది. 'సెంటిమెంట్స్'తో నిండిన ప్రేమకథల్లో నుండి సామాజిక దృష్టిగల జీవిత చిత్రణకు శ్రీ వీరరాజు పూనుకున్నారు. సూర్యోదయం 'హట్స్ యూనియన్' గుడిసెల్లో, మధ్యతరగతి ఇళ్ళల్లో, ధనవంతుల మేడల్లో ఏ విధమైన వెలుగును ప్రసరిస్తుందో వీరరాజుగారు చక్కగా చెప్పారు.

శ్రీ వీరరాజు సరికొత్త కావ్యం 'కిటికీకన్ను' (1980) సమకాలిక సమాజంలో అన్యాయాలపై కవి తెరిచిన 'మూడోకన్ను'. దేవుని పేరిట జరుగుతున్న మోసాలను ఆయన యీ కావ్యంలో తీవ్రంగా ఖండించారు. శ్రామికజీవుల వేదనలో ఆయన దేవుణ్ణి దర్శించారు. "చల్లని మంచు పళ్ళు మోసుకుని / ఊరి తార్రోడ్లమీద బాల్యాన్ని పారేసుకుంటున్న/పదేళ్ళ నగ్నపాదాల్ని చూడు/అరికాలి నిండా ఆక్రమించుకుని/ ఎర్రపూల దృశ్యం కనిపిస్తుంది నీకు/.... సుత్తిపట్టిన కార్మికుని / ఇనప పిడికిలిని విప్పిచూడు/గొడ్డలెత్తిన కష్టజీవి ఆకలి అరచెయ్యిచూడు / నీ కోసం అడవిదారి పట్టిన ఉగ్రవాది అరికాలినిచూడు / ఎర్రపూల దృశ్యం కనిపిస్తుంది నీకు"- అన్యాయాలపై విరుచుకుపడి, అవి తొలగిపోవాలని కోరే కవి సంకల్ప బలం సహృదయుల్ని ఆకట్టుకొంటుంది. శ్రీ వీరరాజు

కవిత్వంలో ప్రణయం నుండి ప్రగతి- ప్రగతినుండి విప్లవ భావాలు క్రమపరిణామంలోనే వెలువడినాయి.

వచన కవిత్వంలో శ్రీ వీరరాజు పదచిత్రాలు మనోజ్ఞంగా వుండి కవిగా ఆయన విశిష్టతను వెల్లడిస్తాయి.

## మాదిరాజు రంగారావు : తాత్త్వికచింతన - "జీవితం చివర తెలియని చీకటి వంతెన"

వచన కవితకు తాత్త్వికచింతనా దృష్టిని కల్గించి, జీవితమంత గంభీరమైనది కవిత్వం అనే భావంతో రచిస్తున్నవారు శ్రీ మాదిరాజు రంగారావు. కొత్తతరం వచన కవులలో వీరు వెలువరించిన కొన్ని కావ్యాలు- "యుగసంకేతం; కాలాన్ని నిలిపి క్షణం: ఆవాహన, మానవీయం; పడగెత్తిన ఉదయం; వయొలిన్‌పై రాగంతో; ముక్తధాత్రి; వెలుగులో ఈ నేలపై; మేల్కొన్న ఈ సమయం; శబ్దమై ప్రాణమై- ఏ కవీ రచించలేదని చెప్పాలి. సంఖ్యాబాహుళ్యాన్నిబట్టి శ్రీ రంగారావు కవిత పలుచనైనదని చెప్పడానికి వీల్లేదు. సమాజ చిత్రణలో బాహ్య స్వరూపం కన్న అంతస్స్వరూపానికి వీరు అధిక ప్రాధాన్యమిస్తారు.

"జీవితం చివర తెలియని చీకటి వంతెన" వంటి పంక్తులు శ్రీ రంగారావు కవితను చిరస్మరణీయం చేస్తాయి. కాని వీరి కావ్యాలలో ఎక్కువచోట్ల కవితావేశం లోపించటాన పాఠకులు వాటిలో రసాస్వాదన చెయ్యలేరు. వియత్నాం, బంగ్లాదేశ్ వంటి రాజకీయ సంఘటనలు వీరి మనస్సును కదిలించినా ప్రధానంగా వీరి కవిత తాత్త్వికచింతనా పరమైనదే. ఉదయం నుండి ఉదయం వరకు 24 గంటలలో ఒకవ్యక్తి అనుభవాల్ని వర్ణించిన 'పడగెత్తిన ఉదయం' వచన కవిత్వంలో ఒక మంచి ప్రయోగం.

శ్రీ రంగారావు కవిత్వంలో కన్పించే తాత్త్వికభావాలు ఒకొక్కసారి జటిలంగా, ఒకొక్కసారి చప్పగా అనిపిస్తాయి. వీరి కవిత్వంలో రసానందం పొందటానికి పాఠకుడు చాలా శ్రమకోర్చి చదవవలసి వుంటుంది.

## అద్దేపల్లి 'అంతర్జ్వాల'

ఆధునిక కవిత్వ విమర్శకునిగా, కవిగా ప్రసిద్ధులైన శ్రీ అద్దేపల్లి రామమోహనరావు అభ్యుదయ మార్గాన్ని అనుసరించారు. 'అంతర్జ్వాల' కావ్యం వచన కవిత్వంలో వీరి కౌశలాన్ని చక్కగా వెల్లడిస్తుంది.

పైసాకోసం తన బ్రతుకులోని బరువునంతటినీ పుటం పెడుతున్న ఆధునిక మానవుడికి డబ్బుకంటె ప్రధానమైనది హృదయమని తెలియ జెప్పి "మనిషికోసం, మనిషి మీదుగా జరిగే ఉద్యమాలు సాగాలి" అని శ్రీ రామమోహనరావు తలుస్తారు. "నా కంఠంలో సమస్తాభ్యుదయ కవుల సమిష్టి స్పందన" అని ప్రకటించి శ్రీ అద్దేపల్లి "ఈనాడే వృద్ధుడూ నా భవిష్యత్తుపై భూతాన్ని నిలుపలేడు/ఈనాడే దేవుడూ నా కాళ్ళపై కర్మబంధాలు విసరలేడు" అని వర్తమానంపై విశ్వాసాన్ని పెంచుకోవాలంటారు. ఎక్కడా కనిపించని భగవంతుణ్ణి అన్వేషించిన కవికి "లక్షాధికారి మిత్రుని జేబులోని మనీపర్సునుండి తొంగిచూస్తూ" దేవుడు కన్పించాడట !

"సామాన్య మానవుడా! నాకు మనిషి కావాలి; నా మానవులారా రండి" మొదలైన గీతాల్లో శ్రీ అద్దేపల్లి కావ్యరచనా ధోరణి ఆవేశ పరవశుడైన యువకుని ఉపన్యాసంలా సాగుతుంది. మధ్యమధ్యలో వాడియైన వ్యంగ్యశక్తి ఇంపుగొలుపుతుంది. "స్వార్థరాజకీయాలు / కుహనా నాగరికతలు, దుష్టసంస్కారాలు/మూర్ఖసంప్రదాయాలను ఆత్మబలంతో దహింపజేసే మనిషి కావాలి" అని శ్రీ అద్దేపల్లి పరిపూర్ణ మానవుని కోసం ఎదురుచూస్తూ కవిత రచిస్తున్నారు.

## వచన కవిత్వంలో నూతన ప్రయోగాలు

వచన కవిత్వంలో నూతన ప్రయోగాలు జరగాలనే అభిలాషతో శ్రీ కె. వి. రమణారెడ్డి 'కావ్యోపన్యాసం'అనే ప్రక్రియను ప్రవేశపెట్టారు. కవిరచిస్తున్న వచన గీతం కొంత దూరం పోయాక వచనంగా మారి, ఉపన్యాసంలాసాగి, మళ్ళీఆవేశంతో పలికే ఘట్టాల్లో గీతరూపం ధరించటం

యీ ప్రక్రియ. కవిత్వంలో ఉపన్యాసం వంటి వచనం జొరబడటం ఇష్టం లేకనేమో దీన్ని తర్వాత కవులెవ్వరూ అనుసరించలేదు.

'ఊహా ప్రహేళిక'

వచన కవిత్వం మధ్యలో పద్యాలను, వచనాన్ని, సంభాషణలను ప్రవేశపెట్టిన కదంబం శ్రీ యస్వీజోగారావు ప్రవేశపెట్టిన 'ఊహా ప్రహేళిక', కవిత్వంలో అన్ని ప్రక్రియలను కలగా పులగం చెయ్యటం ఇష్టం లేకనేమో యీ ప్రక్రియను కూడ తర్వాత కవులెవ్వరూ ఆదరించ లేదు.

నూతలపాటి గంగాధరం - "నా తరానికి కావలసింది తెల్లని కిరణాలు ప్రసరించే ఎర్రని కాంతి"

"చీకటి నుంచి; వెలుగులోనికి" అనే రెండు వచనకవితా సంకలనాలు రచించి శ్రీ నూతలపాటి గంగాధరం అభ్యుదయ భావాలను వెదజల్లారు. పాము కాటుకు గురై మరణించిన గంగాధరంగారు ఆధునిక కవిత్వంలో, విమర్శలో, జీవించిన కొద్ది కాలంలోనే తన కొక ప్రత్యేక స్థానం ఏర్పరచుకున్నారు.

"నా వారునడిచే దారంతటా పరిచిన పల్లేరుగాయలు / నాతరం పాదాల నిండుకూనెత్తురు కారేగాయాలు" అని ఆధునిక సమాజ దుస్థితిని వర్ణించి, "నాకూ నా తరానికీ కావలసిందిప్పుడు / నల్లని చీకటికాదు / తెల్లని కిరణాలు ప్రసరించే ఎర్రకాంతి" అని సమసమాజం ఏర్పడాలని అభిలషించారు.

కవిత్వంలో హృదయోల్లాసం కలిగించే సారళ్యం శ్రీ గంగాధరం ప్రత్యేకత.

పరిగి రాధాకృష్ణ మానవతావాదం

"చిక్కని చీకట్లో కవికళ్ళు ఆశకోసమే అన్వేషిస్తున్నాయని భావించే పరిగి రాధాకృష్ణగారు ఆధునిక మానవుని నిస్పృహాయస్థితిని

వర్ణించి, దీని నుంచి బయటపడే మార్గం మనుష్యుల్లో మానవత్వం పెంపొందడమేనని తెలుస్తారు.

## ముదిగొండ శివప్రసాద్ మతతత్త్వవాదం

"నాకీ మానవలోకం నిర్భరమై తోస్తున్నది
నరమేధం చేయాలని నామది వాంఛిస్తున్నది
నరకపు నరలోకమెల్ల నరకా లనిపిస్తున్నది
జగతికి మరణపు శిక్షను చెప్పాలనిపిస్తున్నది"

అని విధ్వంసనాన్ని కోరిన శ్రీ ముదిగొండ శివప్రసాద్ 'మహాసర్గ' కావ్యంలో, వచన కవిత్వంలో మతపరమైన ఆలోచనలను ప్రవేశపెట్టారు. ఇప్పుడున్న సమాజ దుర్గతలన్నిటికీ హిందూమతమే పరిష్కారమార్గం చూపిస్తుందని శ్రీ శివప్రసాద్ విశ్వసిస్తారు.

## ఎల్లోరా 'రేపటి వసంతం'

వచనకవిత్వాన్ని అభ్యుదయ భావాల్ని జోడించి రాస్తున్న కవిశ్రీ ఎల్లోరా. ఈయన 'రేపటి వసంతం; నిశ్శబ్ద సంగీతం' కావ్య సంపుటాలు వాచ్యార్థ ప్రధానమై, సున్నితమైన భావనను అందిస్తాయి. వీరికవితలో గాఢమైన అనుభూతి కనిపించదు. "మానవ జీవితానికి ప్రగతిగీతం పాడడానికి / అనాది నుంచి అనంతం వరకూ / వ్యాపించిన కాలరేఖమీద నిలబడి / రేపటి మానవ విశ్వమహోదయానికి / నక్షత్రగానం చేస్తాను" అనే ఎల్లోరాగారి సంకల్పబలం గొప్పది. 'పహరా హుషార్' వంటికొన్ని గీతాల్లో యీయన తిలక్‌ను అనుకరిస్తున్నట్లు తోస్తుంది. "వికసించిన పువ్వు నా జీవితం / అభ్యుదయం కోరు నా జాతకం"అని పలికే ఎల్లోరా ప్రగతిని సమానంగానే ప్రేమిస్తున్నారని పిస్తుంది.

"నా పాట భవిష్యత్తుకు / పిలుపు దాని రంగు ఎరుపు / చిట్ట చివరకు దాని తత్త్వం గెలుపు" అని భావించిన ఎల్లోరాగారి కవితలో భవిష్యత్తును తీర్చిదిద్దే అంశాలు అంతగా కన్పించవు. "నేను కవిని! నేను రవిని! నాదేశపు ప్రగతి రథపు చోదకుడిని" అని పాఠకునితో సూటిగా పలికే ఒక మార్దవం ఎల్లోరా గారి కవితలో కన్పిస్తుంది.

## భీమన్న - వచన కవిత్వంలో వైవిధ్యం

"అనాది కొసనుండి అనంతత్వంలోకి"; 'త్రిపదలు'; 'రాగ వైశాఖి'; 'గుడిసెలు కాలిపోతున్నై; శివాలకలు' కావ్యాల్లో శ్రీ బోయి భీమన్న వచన కవిత్వం రచించారు. 'అనాది కొసనుండి అనంతత్వంలోకి' ప్రాచీన కాలం నుండి మానవ నాగరకతలో వచ్చిన మార్పుల్ని కవితా రూపంలో వివరించిన కావ్యం. "రాగవైశాఖి, శివాలకలు" ప్రణయభావ భరితమైనవి. 'త్రిపదలు' సమకాలిక సమాజంపై భీమన్న తలపులు మూడేసి పంక్తులుగా కూర్చినవి. గుడిసెలు కాలిపోతున్నై అభ్యుదయ భావాలతో విలసిల్లిన వచన కవితా కావ్యం.

వచనకవిత్వంలో ప్రణయం, ప్రకృతి, తత్వశాస్త్రం, అభ్యుదయం మొదలైన భావాలతో వైవిధ్యాన్ని ప్రవేశపెట్టి భీమన్నగారు యీ ప్రక్రియకు పుష్టిని చేకూర్చారు.

## గోపాలరెడ్డి ప్రణయ కవిత్వం

శాంతినికేతనంలో రవీంద్రుల అంతేవాసియై, బెంగాలీ కవితా పరిమళాలను నింపుకొని శ్రీ బెజవాడ గోపాలరెడ్డి వచన కవిత్వం రచిస్తున్నారు. 'ఆమె' కావ్య సంపుటిలో ఆయన భావాలు ప్రణయం, ప్రకృతికి సంబంధించినవి. ఇవి భావకవిత్వానికి సన్నిహితమైనవి. పర్షియన్, ఉరుదూ కవుల కావ్య పరిమళాలను ఆస్వాదించిన శ్రీగోపాల రెడ్డి తెలుగులో 'మినీ పొయెమ్'ను అభిమానిస్తారు. "వీరి కవిత్వం భావ కవిత్వానికి ఒక నూతన రూపం అనవచ్చు. అంటే విప్లవకవులు అభ్యుదయ కవిత్వంలో తెచ్చిన మార్పు వంటి దానినే గోపాలరెడ్డిగారు భావ కవిత్వంలో తెచ్చారు." అన్న బి. ఎస్. ఆర్. కృష్ణగారి అభిప్రాయం గోపాలరెడ్డిగారి కవిత్వతత్వాన్ని సరిగా వెల్లడిస్తుంది.[26]

వాచ్యార్థప్రధానమైన గోపాలరెడ్డి గారి కవిత అలంకార భారాన్ని విడిచి నిరాడంబరంగా, సరళంగా వుంటుంది.

26. తనదైన రీతి - బి. ఎస్. ఆర్. కృష్ణ - 'ఆమె' ముందుమాట - ఆంధ్ర సారస్వత పరిషత్తు - 1978

## బాపురెడ్డి గద్య కావ్యాలు

వచన కవిత్వంలో శ్రీ బాపురెడ్డి కృషి 'బాపురెడ్డి గద్యకావ్యాలు'; 'అనంత సత్యాలు'లో కన్పిస్తుంది. కవిత్వం రచించటానికి వీరికి ప్రేరణ ఏమీ అక్కరలేదు. సమకాలిక సంఘటన - ఉత్సవం, శుభ ప్రారంభం, తాను చూచిన సుందర నగరం, అన్నీ కవితా వస్తువులే. ఉపన్యాస పద్ధతిలో, వాచ్యార్థ ప్రధానంగా సాగిపోతూ, చిన్నచిన్న అందాలు, చమత్కారాలు సామాన్య పాఠకులుకూడ అర్థం చేసుకొనేటంత సరళంగా సుందరంగా వుంటాయి బాపురెడ్డి గారి కవితలు.

వచన కవిత్వ రంగంలో కృషిచేస్తున్న వారిలో ముకురాల రామారెడ్డి, మిరియాల రామకృష్ణ, అరిపిరాల విశ్వం, మురళీధర్, మాల కొండయ్య మొదలైనవారు పేర్కొనదగినవారు.

కవిత్వానికి నియమాలు తప్పనిసరిగా వుండాలని వాదించేవారిని హేళనచేస్తూ శ్రీ కాళోజి "కైతకు లక్షణాలున్నాయి కోటొక్కటి/వానిలో వ్యాకరణం కూడా ఒక్కటి. మీకు దాని సూత్రాలే సర్వస్వం/.... మా రచనలో వ్యాకరణం మాత్రమే లేదు / మీ రచనంతా వ్యాకరణం"[27] అన్నారు. ఆధునిక కాలంలో మానవుని ఆలోచనలకు అనువైనది వచన కవిత్వమే. ఈ విషయాన్ని నిర్ధారిస్తూ శ్రీ నండూరి రామమోహనరావు "నేటి జీవితం అతి సంకీర్ణమైనది. అందువల్ల కవిలో కలిగే స్పందన కూడా అతి సంకీర్ణంగా వుంటుంది. ఈ స్పందనను వ్యక్తం చేయడానికి వృత్త, మాత్రాచ్ఛందస్సులకంటె వచన చ్ఛందస్సు సరైన ప్రక్రియ. యుగయుగానికి వస్తూత్పత్తి పద్ధతులు (Modes of Production) మారినట్టే, కవిత్వ ప్రక్రియలు మారుతాయి. వేదకవితకు, వాల్మీకి కవితకు ప్రక్రియ మారింది. కాళిదాసు నాటికి ఇంకా మారింది. నేటి జీవిత చిత్రణకు వచన కవిత సరైన సంవిధానం.

వాల్మీకి తన రామాయణాన్ని వచన కవితగా వ్రాసివుండడం కాల రీత్యా వస్తురీత్యా కూడా అసంభవం. శ్రీ శ్రీ తన "మరో ప్రపంచం"

27. 'సరస్వతీ భక్తులారా!' - కాళోజీ - నాగొడవ.

గీతాన్ని వృత్తాలలోనో, వచన కవితలోనో వ్రాసి వుంటే అది నిష్ప్రయోజనమై వుండేది. అలాగే అజంతా తన భావాలను చంపకమాలలోనో, మాత్రాబద్ధ గేయాలలోనో పొదిగివుంటే, వాటిలో స్వారస్యం మిగిలేది కాదు.

నేటికవులు పాతవిలువలను తిరస్కరిస్తున్నారు. పాత విశ్వాసాలను ప్రశ్నిస్తున్నారు, పాత నియమాలపై తిరుగుబాటు చేస్తున్నారు. ఈ తిరుగుబాటుకు ప్రతీక వచన కవిత'' అన్నారు.[28]

శ్రీ పఠాభి ''వచన పద్యాలనే దుడ్డు కర్రలతో పద్యాల నడుములు విరగదన్నటంతో వచన కవిత్వం పనిపూర్తికాలేదు. ఎందరెందరో వచన కవులు దీనిలో వైవిధ్యాన్ని, వైశిష్ట్యాన్ని సాధించి ఆధునికాంధ్ర కవిత్వాన్ని సుసంపన్నం చేశారు.

మరికొందరు వచన కవులను గురించి వచన కవితా సంపుటాల గురించి చివరి అధ్యాయంలో ప్రస్తావిస్తాను. తెలుగులో అత్యధికంగా వచన కవితా సంపుటాలు వెలువడు తున్నాయి. వాటిలో కవిత్వం కంటె కవిత్వం కాని భాగమే ఏక్కువ. వీటిని చూచి ఆందోళన చెందనక్కర లేదు. కాల ప్రవాహంలో కవితా గుణంగల రచనలే మిగులుతాయి.

విప్లవ కెరటం విరుచుకుపడిన తర్వాత కూడ కొందరు కవులు రాజకీయ విశ్వాసాలకు, భావ, అభ్యుదయ కవితా మార్గాలకు కట్టుబడక స్వతంత్రంగా, స్వచ్ఛమైన కవిత్వం' (pure poetry) రాస్తున్నారు. వారిని గురించి చివరి అధ్యాయంలో ప్రస్తావిస్తాను. వచన కవితా వికాసంలో ఇక్కడికి ఒక దశపూర్తయినట్లుగా భావించి, దిగంబర కవుల ఆగమనంతో మరొక అధ్యాయాన్ని ప్రారంభిస్తాను.

28. ఉపోద్ఘాతం - నండూరి రామమోహనరావు - 'మహాసంకల్పం'-'చైతన్య భారతి' - విజయవాడ.

ఎనిమిదవ అధ్యాయం

# దిగంబర కవుల తిరుగుబాటు

ప్రపంచ దేశాలన్నిటా యువతరం తిరుగుబాటు చేస్తున్నది. యువతరాన్ని ఆవహించిన అలజడికి కారణాలు అనేకం. మారుతూన్న విలువలు అమిత తొందరగా మారిపోయి నూతన వ్యవస్థ యేర్పడాలని ప్రతిచోటా ప్రయత్నం జరుగుతున్నది. కొందరివి స్వతంత్రమైన ఉద్య మాలైతే మరికొందరివి ఇతర దేశాలలోని విప్లవ బీజాలనుండి మొల కెత్తినవి. అన్ని అలజడులూ ఉద్యమ రూపాలు ధరించవు. విధ్వంసనకు లక్ష్యంగా ప్రారంభమైన అలజడులు పాత వ్యవస్థను సమూలంగా పెరికి వేయకపోయినా పాత వ్యవస్థలో బూజుపట్టిన భావాలను విదిల్చివేసి చప్పగా చల్లారి వూరుకుంటున్నాయి. నూతన వ్యవస్థ ఏర్పడకపోయినా పాత విలువల్ని ప్రశ్నించి, వాటి బండారం బయటపెట్టటం వలన ఎంతో మేలు మాత్రం జరుగుతున్నది. తెలుగు కవిత్వంలో 1965 లో ప్రారం భమై 1968 వరకు మూడేళ్ళపాటు సాగి, మూడు సంపుటాలతో సాహి త్యంలో గగ్గోలు పుట్టించిన తిరుగుబాటు 'దిగంబర కవుల'ది. అభ్యుదయ రచయితల సంఘం నిర్వీర్యమై పోయాక ఏర్పడిన స్తబ్ధతను బ్రద్దలు చేస్తూ వచ్చింది దిగంబర కవుల తిరుగుబాటు.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడకముందు తెలుగువాళ్ళకి నగరమంటూ వొకటిలేదు. మద్రాసు నగరంలో ఆంధ్రులున్నా, అది చివరకు తమి ళులకే దక్కింది. నగర జీవితాన్ని వర్ణించిన కవులు చాల తక్కువ మంది. పఠాభి, ఆరుద్రగారలు వర్ణించినప్పటికీ నగరంలో ప్రజల జీవి తాన్ని యింకా ఎన్నో కోణాలనుండి చూడవలసి వున్నది. 1956 లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత అన్ని జిల్లాలనుండి ఎన్నో కుటుంబాలు జీవిక కోసం రాజధాని నగరం హైదరాబాదు చేరుకున్నాయి. సాహిత్య చైతన్యం నెమ్మదిగా వ్యాపింపసాగింది. 1955 లో జరిగిన సాధారణ

ఎన్నికల్లో అభ్యుదయ రచయితలు అభిమానించిన కమ్యూనిస్టు పార్టీ పరాజయం పొందటంతో, అభ్యుదయ రచయితల సంఘపు కార్యకలాపాలు అడుగంటిపోయాయి.

హైదరాబాద్‌లో ప్రముఖ అభ్యుదయ కవి శ్రీ కుందుర్తి నాయకత్వంలో 'ఫ్రీవర్స్ ఫ్రంట్' ఏర్పడింది. వచన కవులు తాము రాసుకొచ్చిన కవితలను పరస్పరం వినిపించుకోవటానికి యిది వేదికగా తోడ్పడింది. యువకవులకు వచన కవితలో ఒక స్థాయి చిక్కిందనుకుంటున్న తరుణంలో, వచన కవిత్వమే ఒక ఉద్యమమని కుందుర్తి ప్రభృతులు భావించసాగారు. వచన కవిత్వం కొద్దిమంది కవుల సహృదయుల మధ్యనే పరస్పర ప్రశంసలు, చర్చలతో వుండిపోయింది. ఈ స్థితిలో యువకవులు కొందరి మనస్సుల్లో అలజడి తీవ్రరూపం ధరించసాగింది. వచన కవిత్వానికి ''లక్షణాలుండాలా ? వద్దా ?'' అన్న చర్చలతో; ''భావగణం, భావలయ, అంత్యప్రాస నియమాలు'' - బాగోగులు వీటి చర్చలతో పొద్దుపుచ్చటం దుర్భరంగా తోచింది.

ఆరుగురు యువకులు ఒకచోట (ట్రూప్‌బజార్, సెంట్రల్ పాయింట్, హైదరాబాదు - సంచాలకుడు : సుబ్రహ్మణ్యమ్) చేరి తమ అలజడిని కవితారూపంలో ప్రకటించటానికి, పూర్వపు కవిత్వ పద్ధతులు ఏవీ పనికి రావని నిశ్చయించుకొని, కొత్త రకమైన కవిత్వాన్ని రాయాలనుకున్నారు. అచ్చులో ఆవిష్కరణలో కలం పేర్లను ఎన్నుకోవటంలో కొత్తదనం చూపారు. పాత ఋతువుల పేర్లు, సంవత్సరాల పేర్లు కూడ వీరికి పనికిరాక కొత్త పేర్లను పెట్టుకొని, కొత్తదనాన్ని చూపుతూ కవిత్వ సీమలో ప్రవేశించారు. ''నగ్నముని (ఎం. హెచ్. కేశవరావ్) నిఖిలేశ్వర్ (యాదవరెడ్డి), చెరబండరాజు (బద్దం భాస్కరరెడ్డి) మహాస్వప్న (కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు) జ్వాలాముఖి (వీరరాఘవాచార్యులు) భైరవయ్య (మన్‌మోహన్ సహాయ) అనే యీ ఆరుగురూ తెలుగు కవిత్వంలో ఏర్పడిన స్తబ్ధతను తొలగించటానికి 'షాక్ ట్రీట్‌మెంట్' వంటి పద్ధతిలో తమకు నచ్చని వాటిని బూతులు

తిడుతూ కవిత్వం రచించారు. వీరిలో కేశవరావ్, కమ్మిశెట్టి వెంకటేశ్వర రావు, యాదవరెడ్డి గారలు దిగంబర కవులుగా అవతరించక ముందే కవులుగా ప్రసిద్ధులు.

దిగంబర కవుల మొదటి సంపుటం వెలువడటానికి ఒకసంవత్సరం ముందు హైదరాబాదు నుండి యువకవుల కవితా సంకలనం 'రాత్రి' వెలువడింది.[1] యువతరంలో అలజడిని కొంతవరకు యీ సంపుటం ప్రతిబింబించింది. కేశవరావ్, కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు, యాదవరెడ్డి గారల కవితలతోపాటు మరికొంత మంది యువకవుల రచనలు కూడ ఇందులో వున్నాయి. కాని తమమనస్సుల్లో చెలరేగిన ఝుంఝా ప్రభంజ నాన్ని వీచటానికి యీ మార్గం సరిపోదన్నట్లు 'రాత్రి' సంకలనంలో వున్న పై ముగ్గురు కవులూ మరి ముగ్గురితో కలిసి దిగంబర శకాన్ని ప్రారంభించారు.

దిగంబరకవుల భావ ప్రకటన, పుస్తక ప్రచురణ, ఆవిష్కరణ లనుచూస్తే వారి ఉద్యమానికి పాశ్చాత్యదేశాల కవితోద్యమాల ప్రేరణ వుండివుంటుందని సహజంగా అనిపిస్తుంది. ప్రత్యక్షంగా ఏ వొక్క ఉద్యమాన్నుండి దిగంబర కవులు ఆవిర్భవించలేదుగాని, యీ కవులకు పాశ్చాత్య దేశాల్లో యువతరం కవులు ప్రేరణ కలిగించిన మాట యథార్థమే. ఈ శతాబ్దంలో ఇంగ్లీషు కవిత్వంలో వచ్చిన మార్పుల్ని గమనిస్తే వాటి ప్రభావం యీ కవులమీద ఎంతవరకు వున్నది తెలుస్తుంది.

ఇంగ్లండులో 1912లో జార్జియన్ కవితోద్యమం ప్రారంభమైంది. దీన్ని ఆధునిక కవిత్వానికి ఒక మలుపుగా తలచవచ్చు. ఎడ్వర్డు థామస్ (1878-1917) విల్ఫ్రెడ్ ఓవెన్ (1893-1918) రాబర్టుగ్రేవ్స్ యీఉద్యమ నేతలు - ఎజ్రాపౌండ్, టి. యస్. ఇలియట్‌లను ఆధునిక కవిత్వానికి ఆద్యులుగా పేర్కొనవచ్చు. "Imagism; Symbolism" ఈశతాబ్దా

---

1. 'రాత్రి'-కవితా సంకలనం - అమర సాహితి-హైదరాబాద్ - ప్రచురణ- 1964.

రంభంలోకవులు అనుసరించిన పద్ధతులు. చిత్రకళలో, సంగీతంలో వచ్చిన ఆధునికత్వం కవిత్వాన్ని ప్రభావితం చేసింది. Apollinaire, Rilke వంటి ఫ్రెంచి, జర్మన్ కవుల కవితలు ఇంగ్లీషులోకి అనువదింపబడి ఇంగ్లీషు కవులకు ప్రేరణ కలిగించాయి. William Empson కవిత్వంలో అస్పష్టత వుండవచ్చునని, ఉత్తమ కవిత్వంలో అస్పష్టత తప్పదని ఒక కొత్త సిద్ధాంతం లేవదీశాడు.

1930 తర్వాత "Surrealism; Dadaism" వంటి వినూత్న సిద్ధాంతాలు తెలుగు కవిత్వంలో ప్రవేశించాయి. ఇలియట్ ఆరుద్ర,బైరాగి వంటి ఆధునిక కవులకు ప్రేరణ కలిగించినట్లే దిగంబర కవులకు కూడ కవితావేశాన్ని కలిగించాడు.

1950 తర్వాత అమెరికాలో 'బీట్నిక్స్' కవుల ఉద్యమం ప్రపంచ దేశాల్లో యువకులను బాగా ఆకర్షించింది.[2] Allen Ginsbery రచించిన 'Howl' కావ్యం యువకవుల పారాయణ గ్రంథమైంది. దాదాపు అదే కాలంలో బ్రిటన్‌లో 'Angry youngmen' ఉద్యమం వచ్చింది. George orwell వీరి నాయకుడు. వీటిని గురించి పాశ్చాత్య పత్రికలలో, పుస్తకాలలో చదివిన దిగంబర కవులు వాటినుండి కొంత ప్రేరణ పొంది వుండవచ్చు. 1958 లో బెంగాల్‌లో ఆకలితరం కవులు తిరుగుబాటు ప్రకటించారు. అదికూడ భారతీయ యువకులపై కొంత ప్రభావాన్ని కల్గించింది.

దిగంబర కవుల అసంతృప్తి దేనిమీద ? ఎందుకు వీరింత అశ్లీల పదజాలంతో పూర్వ కవులను, సంఘంలో అన్ని విలువలను దుయ్యబడుతున్నారు? అని ఆలోచించే వ్యవధి కూడ ఇవ్వనంత తీవ్రధాటితో

2. ఇతర ప్రాంతాలలో కవుల తిరుగుబాటుకు సంబంధించిన సమాచారం. 'నేటి తెలుగు కవితలో తిరుగుబాటు ధోరణులు' - కె. కె. రంగనాథాచార్యులు గారి వ్యాసం (సమాలోచన) నుండి స్వీకరించాము, వారికి కృతజ్ఞతలు.

వచ్చింది వీరి ఉద్యమం. సుప్రసిద్ధకవులు, విమర్శకులు కూడ వీరిపద్ధతిని మెచ్చటం అటుంచి, తట్టుకోలేక నిందించసాగారు.

"ఈదేశంలో, యీ భూగోళంలో ఊపిరి పీల్చే ప్రతి మనిషి ఉనికి కోసం తపనపడి, అతడిభావిని చూసి వెక్కివెక్కి ఏడ్చి, పిచ్చెత్తి ప్రవచించిన కవిత" అని తమ కవితా స్వరూపాన్ని వాళ్లు స్పష్టంచేశారు. కీర్తి, డబ్బు ఇనపబూట్ల క్రింద యీ నాటి జనులందరూ జీవిస్తున్నారని యెంచి, వాళ్ళను ఆస్థితినుండి తప్పించి, అసలు స్వరూపాన్ని తెలియజెప్పి, ఆచ్ఛాదనల్ని తొలగించుకోమని చెప్పాలని దిగంబరకవుల ఉద్దేశ్యం. ఈ ఉద్దేశ్యంతో వీరికంటె ముందుగా ఆధునిక కవిత్వంలో ప్రవేశించిన అభ్యుదయ కవులు, వచన కవులు ఏకీభవిస్తారు. ఆచ్ఛాదనల వెనుక జీవిస్తున్న ప్రజలను మేల్కొల్పాలనే వీరిపద్ధతితో మాత్రం అభ్యుదయ కవులు భేదిస్తారు. జీవచ్ఛవాలుగా బ్రతుకుతున్న ప్రజల్ని తిట్టి, కోప్పడి, వారి మనస్సులపై కలియబడి, భయపెట్టి, జుగుప్స కలిగించి, ప్రజలను మేల్కొల్ప జూశారు దిగంబరకవులు.

"మంచికోసం, మనిషిలోని నిప్పులాంటి నిజమైన మనిషికోసం కపటంలేని చిరునవ్వులుచిందే సమాజంకోసం, అహోరాత్రులు ఆరని అగ్నిలో నడిచిన ఆత్మలలోంచి పలుకుతున్న గొంతుకలం" అని ప్రకటించు కొని దిగంబరకవులు తాము పుస్తకాల్లోంచి మాట్లాడదలచు కోలేదని, వాస్తవ పరిస్థితిని "మేం మేంగా మాట్లాడదలచు కొన్నా" మన్నారు. తాము రాస్తున్నది వచన కవితే అయినా తమ కవిత్వాన్ని వచన కవిత్వం అననివ్వదలచు కోలేదని, తమగీతాలను 'దిక్'లని పిలవాలని చెప్పారు. అంతేగాక దిగంబరశకం కాలమానం గూడ ప్రకటించారు. సంవత్సరాలపేర్లు, ఋతువులపేర్లు, మతాలపేర్లు కూడ మార్చారు.

కులమతాల సంకేతాలుగా వున్నాయనుకుంటే అసలు పేరును వదలిపెట్టి కలం పేరు పెట్టుకోవటం పరిపాటిగాని, కాలచక్రం తమ చేతిలోనే వున్నట్లు కాలగమనాన్ని మార్చటం ఎందుకో తెలియదు. మూడు

సంపుటాలు వెలువడిన తర్వాత, అగ్గిరిపేరిట వున్న ఆరు సంవత్సరాలు, ఆరు సంపుటాలైనా రాకుండానే యీ శకం అంతరించింది గదా! అనంత కాల ప్రవాహంలో కవులు క్రాంతదర్శులు కాగలరని కాలాన్ని మార్చటం ఎలా సంభవం?

కొత్త కవితోద్యమం తీవ్రధాటితో వస్తే రావచ్చు. ఏ ఉద్యమమైనా ఎంతోకొంత వేగంతోనే వస్తుంది. కాని కీర్తి ఇనుప పాదాలక్రింద లోకం నలిగి పోతున్నదని ఒకప్రక్క ఆక్రోశిస్తూనే తమ కవిత్వ సంపుటాలను విచిత్రంగా ఆవిష్కరింపజేసి, సంచలనాన్ని సృష్టించటం బాగు లేదు. అర్ధరాత్రిపూట తమ కవితా సంకలనాలను రిక్షావాలా, హోటల్ క్లీనర్, బిచ్చగత్తెలతో ఆవిష్కరింపజేసి, సంచలనం సృష్టించారు. దీని వల్ల వీరి ఉద్యమాన్ని సానుభూతితో చూడదలచుకున్నవారు కూడ అపార్థం చేసుకొని వీరి కీర్తి కాముకత్వాన్ని నిరసించారు.

దిగంబరకవులు ప్రస్తుత సమాజంలో అలముకొని వున్న దుర్భరమైన పరిస్థితులకు కారణమైన అందరినీ తిట్టారు. "పండితవర్యా! రికార్డులా నోరు త్రిప్పకు / నవ సృష్టిని కాలదన్నకు / భావకవుల నపుంసక హావ భావాలకు సవాలు / అభ్యుదయకవీ, నల్లమందు తిని నిద్రపోయావ్/ నయాగరా జలపాతంలో / దూకలేకపోయిన అన్నయ్యా! / గుడ్ బై! మీకందరికి సలామ్ ఆలేకుమ్ / వచనంలేదు! కవిత్వం అంతకంటెలేదు" (ఆత్మయోని) అని అన్నివైపులా పరిస్థితులకు బందీ అయిన మనిషిని చూచి దుఃఖించి, ఆవేశంతో మనిషిని దిగజార్చిన, దిగజారుస్తున్న పరిస్థితుల్ని తిట్టారు. "సాహిత్యంలో ఆదినుండి అనువాదానికీ అనుకరణకీ అలవాటుపడి నేడు పాశ్చాత్య స్వరాలకి ప్రతిధ్వనిగా మారిన తెలుగు సాహిత్యానికి మౌలికమైనధ్వని"ని కోరుతున్నామన్నారు. అణ్వాభ్యున్నతిలో మానవుడు యీ ధరాతలంలో తప్పి పోయాడు. తప్పి పోయిన ఆత్మను పట్టియిచ్చి, మనిషిని మనిషిగా చూడాలని మాకోరిక" అన్నారు. మతాలతో, ఇజాలతో తమకు నిమిత్తం లేదన్నారు. "ఈ భూగోళంపై దారిద్ర్యం, ఆకలి అలముకుని వున్నంతవరకూ

మార్క్సిస్టు దృక్పథాన్ని సవాల్‌చేసే అధికారం ఎవరికీలేదు'' అని మార్క్సిస్టు దృక్పథాన్ని అంగీకరిస్తూనే నియంతృత్వానికి మార్గమైన మార్క్సిజం తమమార్గం కాదన్నారు. "ఏ ఆచ్ఛాదనకీ తలవొగ్గని, ఏ భయాలకీ లొంగని నిరంతర సజీవ మానవుడి కోసం ఎలుగెత్తి పిలుస్తున్నాం'' అని జడత్వంలో మగ్గుతున్న మనుష్యుల్ని కవిత్వంతో కదిలించారు.

స్వేచ్ఛా మానవుడికోసం తపించిన వీరు ప్రస్తుత సమాజం కుష్ఠు వ్యవస్థగా మారిందనీ, దీన్ని నాశనం చెయ్యాలనీ భావించారు. వీరుకోరిన మార్పు 19వ శతాబ్దంలో రష్యాలో తలెత్తిన నిహిలిస్టు ఉద్యమం కోరిన మార్పు వంటిదే. "Prince petr kropotkin,the leading Russian anarchist, defined nihilism as a struggle against all forms of tyranny, hypocrisy and artificiality in favour of individual freedom. It was a revolt of an adolescent generation that cherished infinite faith in scientific truth"[3] నిహిలిస్టులు శాస్త్రజ్ఞానం అన్ని సమస్యలను పరిష్కరిస్తుందని నమ్మితే, దిగంబరకవులు వ్యక్తిస్వేచ్ఛ వలన సమాజం బాగుపడుతుందని- ఆర్థిక వ్యత్యాసాలు తొలగిపోనిదే వ్యక్తి స్వేచ్ఛ లభించదని భావించారు. దిగంబర కవులు శాస్త్రవిజ్ఞానం సాధిస్తున్న మహత్తర విజయాలకేసి దృష్టి సారించినట్లు కన్పించదు. ప్రస్తుత సమాజ కుష్ఠువ్యవస్థకు కారకులైన వాళ్ళను, కుష్ఠువ్యవస్థను పోషిస్తున్న వాళ్ళను సర్వనాశనం చెయ్యాలని వీరు తలచారు. వీరి ప్రయత్నంలో సఫలం కావటం అటుంచి ఎక్కువకాలం గడవకుండానే, వ్యవస్థను మార్చాలంటే దాన్ని అసహ్యించు కోవటం సరియైన మార్గం కాదని, ప్రజల్లో కలిసిపోయి ప్రజలను విప్లవానికి సమాయత్తం చేయాలని తలచి వీరిలో కొందరు విప్లవ రచయితల సంఘ స్థాపనకు తోడ్పడ్డారు. ఈ సందర్భంలో దిగంబర కవుల ఉద్యమాన్ని గురించి శ్రీకొడవటిగంటి

3. 'Nihilism' A G. M. - Encyclopaeadia Britannica-Vol–16, page-512 - 1966 Edition.

కుటుంబరావు "వాంతి చేసుకునే వాణ్ణి చూచి ఎవరూ వాంతి చేసుకోరు," సమాజం మారాలనే ఆవేశం లోపలి నుండే రావాలని, ప్రజలకు ఆ ఆవేశం కలిగించటానికి పూనుకోవాలని చెప్పిన హితవు వీరిపట్ల యథార్థమైంది. దిగంబర కవులు సమాజాన్ని చూచి అసహ్యించు కుంటున్నట్లే, ఇంకా ఎందరో అసహ్యించు కుంటున్నారు. వారిలో కొందరు సాయుధులై అన్యాయాలను ఎదుర్కొంటున్నారు. పరిస్థితులను తిట్టుకుంటూ కూర్చో లేదు. భారతదేశంలో అతివాద రాజకీయ పక్షాల్లో వచ్చిన మార్పు కూడ దిగంబర కవులలో మార్పు రావటానికి తోడ్పడింది.

సమాజంలో జరుగుతున్న అన్యాయాలపై దిగంబరకవులు ప్రకటిం చినది ధర్మక్రోధమే. ఆవేశ పూరితమైన కవులవాక్కులో కవితా కళ మెరిసింది, మొదటి సంపుటంలో "నన్నెక్కనివ్వండి బోను (చెరబండ రాజు); ఎముకలకేకలు (భైరవయ్య); జైల్లోసముద్రం (నగ్నముని);" రెండవ సంపుటిలో "ఆకాశం వెక్కివెక్కి ఏడుస్తోంది (చెరబండరాజు) మేంమనుషులంకాదు, ఇంకేదోపేరుంది మాకు (మహాస్వప్న) షష్టిపూర్తి (భైరవయ్య); కరువు బిచ్చం (భైరవయ్య) 'మా' (నగ్నముని)"; మూడవ సంపుటిలో "వందేమాతరమ్ (చెరబండరాజు) తొడవిరిగిన తరం (నగ్నముని), బుద్ధక్షమ (నగ్నముని) కుష్ఠురోగి (నగ్నముని) జగద్గురువు లొస్తున్నారు జాగ్రత్త (చెరబండరాజు)" గీతాలు చదివితే యీ కవులు ప్రతిభావంతులని, వీరి కవిత్వంలో లోతు, గాంభీర్యం వున్నాయని తోస్తుంది.

"ఆకలి, కామం, కలలూ, కన్నీళ్ళు / మనిషిలోని మర్మజ్ఞాన మంతా ఒక్కటే / దేశమేదైతేనేం? మట్టంతా ఒక్కటే / అమ్మ యెవరైతేనేం? చనుబాల తీపంతా ఒక్కటే / బిక్కముఖాలతో చూస్తా రేం? పిచ్చివాణ్ణిగా కేసు పుటప్ చెయ్యండి / నన్నెక్క నివ్వండిబోను" అన్న చెరబండరాజుగారి భావన, కవిని పిచ్చివాడని భావించేట్లుచెయ్యదు. కవితలో భావం సహృదయుల మనస్సుకు హత్తుకుంటుంది.

దిగంబరకవుల గీతాల నిండా బూతు మాటలే వున్నాయను కోవ టం పొరపాటు. "మనిషీ! మానవతా నిగమాగమఋషీ! మేలుకో! "అనే

భైరవయ్యగారి పిలుపు ఆలోచనను ప్రేరేపిస్తుంది. "సూర్యుని కడ్డంగా నుంచున్న / ఆ మబ్బు తునుక పేరేమిటి?" అని ప్రారంభమయ్యే 'జైల్లో సముద్రం'లో శ్రీ నగ్నముని "జీసస్ చేతుల్లో మొలిచిన మానవాత్మల మందారాలు" ప్రదర్శించి ధ్వని ప్రధానంగా కావ్యాన్ని తీర్చి దిద్దారు. శ్రీ చెరబండరాజు "ఆకాశం వెక్కి-వెక్కి- ఏడుస్తోంది" గీతంలో "పుడమితల్లి చల్లని గుండెను / పాయలు పాయలుగా చీల్చుకొని/ కాల్వలై ఎవరిదో/ఏతరం కన్నీరో / గలగలా సుళ్లుతిరిగి / మెలమెల్లగా పారుతూంది." అని ఊరిని ముంచేసిన వరదను వర్ణిస్తూ "అప్పుడే పుట్టిన ఆవుదూడ / లోతైనగోతిలో దిగబడింది / ఎక్కడో కత్తిమెరుపు/ఊరి ఎగువన తటాకం / గుండెతెగి ప్రవహిస్తున్నట్టుంది / ఒంటరి పాలేరు గుండె పూరింటిలో / దూలం విరిగి గోడకూలి / బంధాను బంధాల తాటాకులు / గాలిలో ఎగురుతున్నాయ్/....కాపరి హృదయంలో ఏదో/ కన్నీటి ఊయల కదలాడింది" అని కరుణామయ దృశ్యాన్ని ప్రదర్శించారు. ఆధునిక కవిత్వంలో ఉత్తమ కవిత్వంగా చెప్పదగిన గీతాల్లో ఇదొకటి.

"మేం మనుషులం కాదు, ఇంకేదో పేరుందిమాకు" అనేగీతంలో 'మహాస్వప్న' గాంధీజీని సంబోధించి, గోడ్సేల ఘాతుక హస్తాలనడుమ మానవత్వాన్ని చూచిన "బాపూ! మోసపోలేదు కదా నువ్వు!" అని అహింసను నమ్మి దేశాన్ని తోడేళ్ళ కప్పగించిన గాంధీజీ మోసపోయారని తలచారు.

విషమ పరిస్థితులలో కూడ చిన్నచిన్న సుఖాలతో తృప్తిపడి దుర్భరంగా జీవించేఉద్యోగుల మనస్థితిని 'కరువుబిచ్చం'లో శ్రీభైరవయ్య చక్కగా వెల్లడించారు. "అన్నా! భయపడకు / కరువు భత్యం పెరుగుతుంది / కొండచిలువ నోట్లోకి ఈగ పిల్ల దూకుతుంది" అని ధరలు అదుపులో పెట్టకుండా, కరువుభత్యాన్ని పెంచే ప్రభుత్వాన్ని నమ్మి మోసపోవద్దన్నారు.

భావకవులు మాతృదేశభక్తితో గీతాలు రచిస్తే, చెరబండరాజు మనదేశ వాస్తవ పరిస్థితి కళ్ళకు కట్టే విధంగా -

"ఓనా ప్రియమైన మాతృదేశమా
తల్లివి తండ్రివి దైవానివి నీవేనమ్మా
దుండగులతో పక్కమీద కులుకుతున్న శీలంనీది
అంతర్జాతీయ విపణిలో అంగాంగం తాకట్టుపెట్టిన అందంనీది
సంపన్నుల చేతుల్లో మైమరచి నిద్రిస్తున్న యవ్వనం నీది
వందేమాతరమ్ / వందేమాతరమ్"

అన్నప్పుడు జుగుప్స బాధ మిశితమై ఆక్రోశం కలుగుతుంది. పరిస్థితులు మారాలనిపిస్తుంది.

ఒకనాటి త్యాగధనులు స్వాతంత్ర్యం వచ్చాక సుఖాల్లో మునిగి పోయి ప్రజలకు ద్రోహం చేస్తుంటే చూచి, గుండెలుబ్రద్దలై పలవించిన గీతం నగ్నముని రచించిన 'తొడవిరిగిన తరం'. ఈ గీతంలో కవనశిల్పం నగ్నముని కవితా ప్రతిభకు మచ్చుతునక. మరో గీతంలో -

"నిజం రేజర్ లాంటిది
అది సీజర్ని సైతం క్షమించదు"

అన్న కవిశక్తిని కొనియాడకుండ వుండలేం. "రిక్షా నుండి టీబీలోకి / ....పంచవర్ష ప్రణాళికల ప్రగతి ప్రకారం / అభివృద్ధి చెందు తున్నప్పుడు" శ్రమజీవులకు అహింసా తత్వాన్ని బోధించటంలో అర్థం లేదని 'బుద్ధక్షమ' గీతంలో నగ్నముని హెచ్చరించారు. స్వాతంత్ర్యా నంతరం పేదలు కడుపేదలయ్యారని పాలకులే కొందరు అంగీక రిస్తున్నప్పుడు నగ్నముని గీతంలో నిజాన్ని గురించి ఉలిక్కిపడనక్కర లేదు. పదవీ మమకారంతో పాపాలుచేసి, జీవితంలో సుఖశాంతుల్ని కోల్పోయి, వ్యసనాల్లో మునిగ పోయిన రాజకీయ వాదిని నగ్నముని కుష్ఠురోగిగా అభివర్ణించారు. అటువంటి రాజకీయ వేత్తను సంబోధించి "నిన్ను రోడ్డుమీదకి / పిచ్చికుక్కలా తరుముకొచ్చి / ప్రజలు కాల్చక ముందే / కర్రలతో బరిసెలతో పొడవకముందే / నిజంచెప్పు" అని గద్దించారు. ఈ కవితావేశం వీరిని క్రమంగా విప్లవ రచయితల సంఘంలోకి నడిపించింది.

'జగద్గురువు లొస్తున్నారు జాగ్రత్త'లో చెరబండరాజు మనుషుల బుజాలమీద ప్రయాణంచేసే, మోసకారులయిన 'జగద్గురువు'ల బండారాన్ని వ్యంగ్యంగా దుయ్యబట్టారు. మఠాధిపతుల్ని పాతిపెట్టి, మంచికి పతాకాన్నెత్తే మనిషినని ఋజువుచేసుకో అని సాటి మనిషిని హెచ్చరించారు. శ్రీ భైరవయ్య "నేను చెరచబడ్డ గీతాన్ని" అంటూ జుగుప్స కలిగే విధంగా, దుర్మార్గ వర్తనులైన కవులు కవితను దుర్వినియోగం చెయ్యటాన్ని అతితీవ్రంగా నిరసించారు.

ఈ మూడు సంపుటాల్లో రసవంతమైన రచనలతోపాటు, రోత కలిగించే గీతాలు కూడ వున్నాయి. అశ్లీల పదాలుండటం దోషమని కాదు. ఆ అశ్లీల పదాలు కవి ఆవేశంలోంచి దుమికి వచ్చినవి కాక, సంచలనం కలిగించటానికి, పాఠకుల్ని 'షాక్' చెయ్యటానికి, ప్రయత్నపూర్వకంగా తెచ్చిపెట్టు కోవటం వీరి కవిత్వంలో పెద్దలోపం.

సమయమూ, సందర్భమూ గమనించి కవులు అశ్లీలాలు ప్రయోగిస్తే తప్పులేదు. అన్యాయాన్ని సహించలేక, ఆవేశంతో పలికే మాటల్లో అశ్లీలాలు దొర్లితే అందుకు తప్పుపట్ట వలసిన పనిలేదు. "దొంగలంజ కొడుకు లసలేమెసలే ధూర్తలోకం" అని శ్రీశ్రీ అన్నప్పుడు('కొంపెల్ల జనార్దనరావు కోసం' - మహాప్రస్థానం) దాన్నెవ్వరూ ఆక్షేపించరు. అవి నీతిని ఆకర్ష వంతంచేసి నప్పుడే వస్తుంది చిక్కు - ప్రబంధకవులు, క్షీణ యుగ కవులు, ఎంత సంస్కృత శబ్దాల మాటున భావాన్ని మరుగుపరచ జూచినా అశ్లీల వర్ణనలు అశ్లీలాలే. సాహిత్యంలో అశ్లీలానికి చోటున్నదని పూర్వంనుండి ఆలంకారికులు అంగీకరిస్తూనే వున్నారు.

"సన్నివేశ విశేషాత్తు దురుక్తమపి శోభతేనీలం పలాశమాబద్ధం అంతరాళే స్రజామివ" - దురుక్తం అంటే తిట్టు. సన్నివేశ విశేషవశాన తిట్టు వాడబడవచ్చు. అప్పుడది పూలదండలో అల్లిన పూలమధ్య

మోదుగాకులా వుంటుంది[4] సంస్కృత కవులు కాళిదాసాది మహాకవులు కావ్యనాటకాల్లో అశ్లీల పదాలను ప్రయోగించారు. శ్రీ శేషేంద్ర శర్మ చెప్పినట్లు "ఒక విధంగా తిట్లు ఆరోగ్యానికి ప్రతీకలు-ఒకడికి అన్యాయం మీద క్రోధం కలక్కపోతే, ఒకడు అన్యాయాన్ని సహించి నిశ్శబ్దంగా ఉండి పైగా నవ్వుతూఉంటే వాడి ఆరోగ్యాన్ని" శంకించాలి.[5] వాడిలో మానవ సహజ లక్షణాలు లోపించాయని ఆశ్చర్యపోవాలి.

దిగంబరకవులు ఉపయోగించిన అశ్లీల పదాలు, వర్ణనలు కామోద్రేకాన్ని కల్గించవు. జుగుప్స కలిగిస్తాయి. ఆ జుగుప్స వర్తమాన సమాజంలో ఉన్న హేయమైన పరిస్థితులవలన జనించిందే. దిగంబర కవుల మొదటి సంపుటి వెలువడగానే చాలమంది విమర్శకులు దిగ్భ్రాంతి పొంది, అశ్లీల ప్రయోగాలను ఆక్షేపించారు. వీరి కవితల్లో ఆవేశంతో అప్రయత్నంగా వచ్చిన బూతు మాటలతో పాటు, తెచ్చిపెట్టుకున్న "నీగ్రో సుందరులు, ఊరువులు, ఇంకా కొజ్జాల కామకేళి" వగైరాలన్నీ కవులు కావాలని కల్పించుకొన్నవే. ఇవిఅనవసరం. ఇటువంటి అశ్లీలాలను పరిహరించాలని విమర్శకులు అంటే, వారిని కూడ బూతులు తిట్టారు దిగంబరకవులు,

తిట్టు కవిత్వంలో దిగంబరకవుల పద్ధతి పూర్వకవు లనుసరించినది కాదు. కూచిమంచి జగ్గకవివంటి తిట్టుకవులకు, దిగంబర కవులకూ భేదం వున్నది, శ్రీ వెల్చేరు నారాయణరావు వివరించినట్లు "కూచిమంచి జగ్గకవి వంటి వారి కవిత్వం చదివినపుడు కవికి కోపం వచ్చిందని పాఠకుడికి తెలుస్తుంది. దిగంబర కవిత్వం చదివినప్పుడు పాఠకుడికి కోపం వస్తుంది."[6] హేయమైన సమాజ పరిస్థితులపై కోపం తెప్పించటంలో

---

4. 5, ఆధునిక కావ్యశాస్త్రము - కవిసేన మేనిఫెస్టో-గుంటూరు శేషేంద్రశర్మ-ఇండియన్ లాంగ్వేజెస్ ఫోరమ్ ప్రచురణ - 1977 - ఈ గ్రంథం నుండి సాహిత్యంలో అశ్లీలతకు సంబంధించిన సమాచారం స్వీకరించాము-వారికి కృతజ్ఞుణి.

6. తెలుగులో కవితా విప్లవాల స్వరూపం - వెల్చేరు నారాయణరావు-

దిగంబర కవులు కృతకృత్యులయ్యారు. అవసరానికి మించి ఉపయోగించిన అశ్లీల పదాలు మాత్రం వీరి కవిత్వంపై సదభిప్రాయాన్ని కల్గించవు.

## దిగంబర కవులపై ఆక్షేపణలు

దిగంబర కవుల తీవ్రధాటికి సమకాలిక కవులు, విమర్శకులూ కూడ తట్టుకోలేక పోయారు. ఒక్క శ్రీశ్రీగారు మాత్రం ఏ కొత్తదనం వచ్చినా ఆహ్వానించేతత్వం ఆయనస్వభావంలో ఒకభాగం కాబట్టి,దిగంబర కవులను మెచ్చుకోవటమేగాక వారి కవిత్వాన్ని ఇంగ్లీషులో అనువాదం కూడ చేశారు.

దిగంబర కవిత చదివి శ్రీ ఆరుద్ర "మహాబలిపురంలో పెద్ద అలలు వచ్చి మొహానికి తగిలితే" కలిగిన షాక్ వంటి అనుభూతి పొందానన్నారు. అభ్యుదయ కవులలో ప్రసిద్ధులైన కుందుర్తి, సోమసుందర్ మొదలైనవారు దిగంబర కవిత్వాన్ని నిరసించారు. సుప్రసిద్ధ సాహిత్య విమర్శకులు శ్రీ రాచమల్లు రామచంద్రారెడ్డి "వీళ్ళు ఆరుమంది, అరిషడ్వర్గంలాగా.....యీ సంపుటిలో దిక్‌లు చాలానే వున్నాయి. కవిత్వం మాత్రం యెక్కడాలేదు" అని నిందించారంటే దిగంబర కవులు సాహిత్య వేత్తలను ఎంతషాక్ చేశారో ఊహించుకోవచ్చు.[8] "వీళ్ళ రచనలు చదివితే అసహ్యం వేస్తుంది. అతిట్లూ, అబూతులూ, ఆఆటవిక ఆవేశమూ, ఆ ఒళ్ళెరుగని కుసంస్కారమూ ఆ నోటితీటా, ఆ మాటల కంపు మనకు జుగుప్స కలిగిస్తాయి." అని రామచంద్రారెడ్డిగారు ఆక్షేపించారేగాని, వీళ్ళకవిత్వంలో నిజాయితీని, ధర్మక్రోధాన్ని, అన్నిటినీ మించి ప్రతిభావంతులైన వీరి కవిత్వాన్ని ఆస్వాదించ లేక పోయారు. పుడకలున్నాయని పానకాన్ని పారబోసుకుంటామా? అశ్లీలాలున్నాయని కవిత్వాన్ని నిందిస్తే అది సహృదయ లక్షణం కాదుగదా?

---

7. 'ఆరుద్ర గారితో ఇంటర్వ్యూ' - 'నవత' - సంచిక - 4 - జూలై 1967.
8. సమాజం అంతగా పతనమైందా? (దిగంబర కవుల మూడవ సంపుటి మీద సమీక్ష) - రాచమల్లు రామచంద్రారెడ్డి - సంవేదన - జనవరి- 1969.

దిగంబరకవులు రాకపోతే అభ్యుదయకవులు శక్తిని కోల్పోయి నప్పు డేర్పడిన స్తబ్ధత చెదిరి పోయేదికాదు. వచన కవులు వైవిధ్యం కోసం ప్రయత్నంచేసినా, 'రాత్రి' కవితా సంకలనంలో కవులు కవితా వేశాన్ని ప్రకటించినా, పెద్ద మార్పు వచ్చేదికాదు. సమాజ పరిస్థితులను చూసి రోతపుట్టి, జుగుప్స కలిగే విధంగా తిట్టి దిగంబరకవులు రాయక పోతే యువకవులు కర్తవ్యాన్ని గుర్తించే వారుకారు. దిగంబరకవుల కవితల్లో అశ్లీలాన్ని పరిహరించి, సమాజాన్ని మార్చాలంటే దాన్ని తిడుతూ కూర్చోడం కాదు, ప్రజల్ని మేల్కొలిపే కవిత్వం రాయాలని 'తిరుగబడు', 'మార్చ్' సంకలనాల్లో కవులు ప్రయత్నించేవారుకారు.

1970లో విశాఖపట్టణంలో మహాకవి శ్రీశ్రీ షష్టిపూర్తి సభలో విశాఖ విద్యార్థులు పంచిపెట్టిన 'రచయితలకు సవాల్' దిగంబర కవుల్లో పునరాలోచనకు కారణమైంది. అప్పుడు వారిలో చీలిక వచ్చింది. విప్లవ రచయితల.సంఘం ఏర్పడినప్పుడు దిగంబరకవులు ఆరుగురిలో నలుగురే- నగ్నముని, చెరబండరాజు, జ్వాలాముఖి, నిఖిలేశ్వర్ మాత్రమే- విప్లవ కవుల రాజకీయాభిప్రాయాలను, ప్రణాళికను అంగీకరించారు. మహాస్వప్నకు 'విరసం'లో చేరిన దిగంబర కవులకు మధ్య భేదాభిప్రాయాలు తీవ్రమై ఒకరి నొకరు తిట్టుకొనేదాకా వెళ్ళాయి.

'తిరుగబడు'; 'మార్చ్' కవులతోకలిసి విప్లవ రచయితల సంఘం స్థాపించిన తర్వాత 'దిగంబర కవిత్వం' అంతరించింది. విప్లవ కవులుగా మారిన తర్వాత కూడ గీసు సొంత పేర్లతో గాక దిగంబరకవులుగా పెట్టుకున్న పేర్లతోనే కవిత్వం రాస్తున్నారు. బహుశా కులమత సంకేతాలైన అసలుపేర్లకంటె ఈపేర్లే బాగున్నాయని వారు తలచివుండవచ్చు.

## దిగంబర కవులకు అనుకరణ

దిగంబరకవుల ప్రేరణతో దరిదాపు అటువంటి పేరే పెట్టుకుని "సుగమ్ బాబు, కిరణ్ బాబు, దేవీప్రియ, కమలాకాంత్, ఓల్గా" అనే అయిదుగురు యువకవులు మానవతావాదం తమ కవితాతత్త్వమని ప్రకటించుకొని రెండు కవితా సంపుటులు వెలువరించారు. రోగగ్రస్తమైన

సమాజాన్ని బాగుచెయ్యాలని తలచారు. వీరిఉద్యమం పేరు, ఆకర్షించి నంతగా కూడ, వీరి కవిత్వం ఆకర్షించక పోవటం వలన దీనికి అనుయాయులెవ్వరూలేరు. 'విరసం' స్థాపించబడినప్పుడు వీరిలో కొందరు ఆ సంఘంలో కలిసి పోవటంతో పై గంబరకవుల సంపుటులిక వెలువడ లేదు.

## 'దళిత్ పాంథర్' ఉద్యమం

దిగంబర కవులతో సంబంధం లేకపోయినా, ఇటువంటిదే ఒక కవితోద్యమం మహారాష్ట్రలో 'దళిత్‌పాంథర్' ఉద్యమం వచ్చింది. దళిత జాతుల ఉద్ధరణకు ప్రభుత్వాన్ని ఆశ్రయించటంకాక, దళితజాతులు తిరుగుబాటుచేసి తమ హక్కుల్ని స్థాపించుకోవాలని వీరి ఉద్దేశ్యం. మరాఠీ సాహిత్య రంగంలో యీ ఉద్యమం గొప్ప సంచలనం కలిగించింది, నామ్‌దేవ్‌ధశాల్, జె. వి. పవార్ యీ ఉద్యమాన్ని ప్రారంభించారు. అమెరికాలో 'బ్లాంక్‌పాంథర్' ఉద్యమాన్ని గురించి వీరు 'Time' మేగజైన్‌లో చదివి దీన్ని ప్రారంభించారట !

ప్రపంచం దగ్గరగా వొదుక్కున్న యీనాడు ఏ దేశంలో ఏ కవితోద్యమం సాగినా దాని ప్రభావం- వార్తాసాధనాలవల్ల అతి త్వరగా ప్రపంచమంతటా వ్యాపిస్తున్నది. దిగంబర కవుల ఉద్యమంవంటి సాహిత్యోద్యమాలు ఒరియా, పంజాబీ, బెంగాలీ భాషల్లో కూడ వచ్చాయి. దిగంబర కవుల ఉద్యమం ఒక సంధియుగంలో, జడత్వాన్ని తొలగించి, సాహితీపరుల నరాల్లో నిప్పు రగిలించి, విప్లవ ఝంఝ వీచటానికి తోడ్పడింది. ఈ విధంగా దిగంబర కవిత్వం తన కర్తవ్యాన్ని నెరవేర్చింది.

తొమ్మిదవ అధ్యాయం

# విప్లవ కవిత్వం - ప్రారంభం; అభివృద్ధి

ప్రపంచ దేశాల్లో ఆర్థిక అసమానతలు తగ్గి సమసమాజ నిర్మాణం కోసం కృషిచేసేవారి సంఖ్య యీ శతాబ్దంలో బాగా పెరిగింది. 1918 లో బోల్షివిక్ విప్లవం తర్వాత సోవియట్ రష్యా సాధించిన విజయపరంపర ప్రజాస్వామ్య దేశాల్లో మేధావుల్ని కదిలించింది. మార్క్సిస్టు తత్త్వ శాస్త్ర అధ్యయనంతో భారతీయ మేధావులు కూడ సోషలిస్టు సమాజ స్థాపనకోసం కృషి చెయ్యాలనుకొన్నారు. ప్రజలను చైతన్యవంతుల్ని చెయ్యటానికి కళలు ముఖ్యసాధనం. సాహిత్యం అతిశక్తిమంతమైన సాధనం. ప్రగతిశీలమైన భావాలుగల రచయితలు ఒకచోట చేరి 1936లో అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘాన్ని స్థాపించారు. ఈ సంఘం కార్యకలాపాలు ఆంధ్రదేశాన్ని ఆలస్యంగాగాని ప్రభావితం చెయ్యలేదు. 1943లో ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడింది. "అభ్యుదయ రచయితల సంఘం రాజకీయ సంఘం కాదు. కాని రాజకీయాలను స్పృశించడమే మహాపరాధంగా భావించదు" అని తమ ప్రణాళికలో స్పష్టం చేశారు. మద్రాసులో జరిగిన ఆంధ్ర అభ్యుదయ రచయితల సభలో "అభ్యుదయ రచనకు మార్క్సిజమే ఆయువుపట్టు" అని సుప్రసిద్ధ భారతీయ రచయిత కె. ఏ. అబ్బాస్ స్పష్టం చేశారు. కాని అభ్యుదయ రచయితలు తమ మీద ఒక పార్టీ ముద్రపడకూడదని జాగ్రత్త పడుతూ "విశాలమైన ప్రాతిపదిక" ఏర్పరచాలనుకున్నారు. దీని ఫలితంగా అభ్యుదయ భావాలమీద ఏమాత్రం విశ్వాసంలేని కవి పండితులు కూడ అభ్యుదయ రచయితల సభల్లో పాల్గొనసాగారు. ఈ సంఘం పెదపూడిలో నిర్వహించిన పాఠశాలలో పేరెన్నికగన్న పండితులను, కవులనూ ఆహ్వానించి 'పాఠాలు' చెప్పించుకొన్నది. సంప్రదాయ

వాదులూ, జాతీయవాదులూ వైయాకరణులూ అందరినీ అభ్యుదయమనే మాట సందేహాలకు గురౌతున్నా అప్పటి దేశపరిస్థితుల వలన అభ్యుదయ రచయితల కృషి ఉజ్జ్వలంగా కొనసాగింది. స్వాతంత్ర్య పోరాట సమయంలో, ఆ తర్వాత తెలంగాణ పోరాట కాలాల్లో యీ సంఘం గొప్ప సేవ చేసింది. ఈ సంఘ సభ్యులు పెక్కు మంది ప్రజా పోరాటాల్లో పాల్గొని జైలు శిక్షలూ, ప్రవాస జీవితపు (Underground) కష్టాలనూ అనుభవించారు. జనానికి సన్నిహితంగా వచ్చి సాహిత్యాన్ని ప్రజా జీవితంలో ఒక భాగంగా చేయగలిగింది. 1952 ఎన్నికల తర్వాత అభ్యుదయ రచయితల కొంకవిధంగా గౌరవ ప్రతిష్ఠలేర్పడ్డాయి. తమ విజయాలను చూసి మురిసిపోతూ వుండగానే అభ్యుదయ రచయితల్లో కొందరు పాలకవర్గపు ప్రతినిధులై అభ్యుదయ రచయితల సంఘాన్ని వెన్నుపోటు పొడిచారు. 1955 నాటి ఎన్నికల్లో వీరిలో కొందరు బాహాటంగా 'ప్రజాస్వామ్య పరిరక్షణ' పేరుతో సంఘానికి ద్రోహం చేశారు. ఆ సందర్భంలోనే మిత్రులు చేసిన మోసాన్ని తట్టుకోలేక ప్రజాకవి శ్రీశ్రీ మానసిక వైక్లబ్యానికి గురైనారు.

1955 నుండి 1960 వరకు అభ్యుదయ రచయితల సంఘానికి గ్రహణం పట్టింది. శ్రీశ్రీ ధ్వజం నీడన భుజం కలిపి అభ్యుదయ ప్రస్థానం సాగించినవారు క్రమక్రమంగా జారిపోసాగారు. శ్రీశ్రీ యే జీవిక కోసం సినిమాల నాశ్రయించి రచనల్లో వాడిని, వేడినీ పోగొట్టుకున్నారు. ఆయన తర్వాత మరికొంత మంది అభ్యుదయ రచయితలు సినిమాల్లోకి, ఇతర ఉద్యోగ వ్యాపారాల్లోకి వెళ్ళిపోయి స్థిరపడ్డారు. ఒకప్పటి అభ్యుదయ కవులుగా సన్మానాలు మాత్రం పొందుతూ కాలం వెళ్ళదీయసాగారు. 'అరసం' నిర్వీర్యమైపోయింది. 1960 తర్వాత కుందుర్తి నాయకత్వంలో హైదరాబాదులో వచన కవిత్వం ఒక ఉద్యమ రూపంగా విస్తరించే ప్రయత్నం జరిగింది. 'ఫ్రీవర్స్ ఫ్రంట్' ఏర్పడింది. వచన కవిత్వం సాహిత్య రంగంలో ఎంతో మేలుచేసినా, కావ్యవస్తువులో శక్తి లేకుండ ఉద్యమమెలాగ వేళ్ళూనుకొని నిలుస్తుంది? అందువల్లనే

వచన కవిత్వాన్ని గురించిన లక్షణాలూ, చర్చలూ యువకులకు తృప్తి కలిగించలేకపోయాయి.

ఒకప్పటి అభ్యుదయ కవులు క్రమంగా పాలకవర్గాన్ని సమర్థిస్తూ, ప్రజాస్వామ్య సోషలిజాన్ని కీర్తిస్తూ కవితలు రచించసాగారు. ఆరుద్ర, దాశరథి గారలు వీరిలో ప్రముఖులు. "అభ్యుదయ కవుల ధర్మమా అని వర్గచైతన్యం గురించి పాడితే తప్ప మిగతాది కవిత్వం కాదేమోనన్న అపోహ ఆంధ్రదేశంలో అనవసరంగా ఊపిరి పీలుస్తోంది" అని ఆరుద్రగారు అభ్యుదయ రచనకు వర్గచైతన్యానికి సంబంధం ఏమంత లేదు అన్నంతగా మారారు.[1] ఆధునిక కవిత్వ వైతాళికులు దురదృష్ట వశాత్తూ ఒకపార్టీకి 'తాళికులై' పోవటం కవిత్వానికి శ్రేయస్కరంకాదని కూడ ఆరుద్ర అభిప్రాయపడ్డారు. 'జండాలను నమ్మి' పుండాకోర్ వి కావద్దంటూ, దేశభక్తిపేరిట ప్రభుత్వాన్ని అది ప్రవేశపెట్టిన సంస్కరణలను, ప్రణాళికలను పొగడటం సాగించారు శ్రీ దాశరథి. "పవిత్రులు పితుకుతున్న ప్రణాళికలపాలలో మజ్జిగనీళ్ళు కలపబోతున్నారు దుర్జనులు" అని ఆరుద్రగారు పంచవర్ష ప్రణాళికల వలన పేదప్రజలకు మేలుజరగటం లేదని భావించే వారిని ఆక్షేపించారు.

1962లో చైనా, భారతదేశంతో యుద్ధానికి తలపడింది. ఆ సందర్భంలో జాతీయత పేరిట అభ్యుదయ కవులు పాలక పక్షాన్ని పూర్తిగా సమర్థించారు. చైనాతో యుద్ధం ఆగిపోయిన తర్వాతకూడ వీరివైఖరిలో మార్పు రాలేదు. ప్రజల కష్టాలకు పాలకులు బాధ్యులు కారన్నట్టు కవులుగా తమ బాధ్యతను విస్మరించారు. ఒక పెద్ద స్తబ్దత ఏర్పడింది. ఈ సమయంలో సి. విజయలక్ష్మి, గజ్జెల మల్లారెడ్డిగారలు మళ్ళీ అభ్యుదయ కవిత్వానికి జీవంపొయ్యటానికి ప్రయత్నించారు.'రాత్రి'సంకలనంలో కవులు తమ మనస్సుల్లో అలజడిని బయటపెట్టారు. అప్పుడే ఉవ్వెత్తుగా దిగంబరకవుల తిరుగుబాటు సాహిత్యసీమను సంక్షోభంలో ముంచెత్తింది.

1. 'ఒప్పో తప్పో ఇది నా మెప్పు' ఆరుద్ర - కేశవరావ్ రచించిన 'ఉదయించని ఉదయాలు' కావ్యానికి పీఠిక - ప్రచురణ - ఏప్రిల్ 1961

"రష్యన్ విప్లవానికి నిహిలిస్టుల్లాగ, వీళ్ళు విరసం ఆవిర్భావానికి నేపథ్యం తయారు చేశారు"[2]

పశ్చిమ బెంగాల్ రాష్ట్రంలో 'నక్సల్‌బరీ' జిల్లాలో రైతులు, కూలీలు భూస్వాములకు వ్యతిరేకంగా పోరాటం సాగించసాగారు. తమ కష్టాన్ని దోచుకోజూస్తున్న భూస్వాములను వధించటం మొదలుపెట్టారు. దేశంలో అతివాద రాజకీయాలు తీవ్రరూపం పొందాయి. మార్క్సిస్టు పార్టీలో చీలికవచ్చి 'మార్క్సిస్టు - లెనినిస్టుపార్టీ' వొకటి కొత్తగా స్థాపించబడింది. మార్క్సిస్టు-లెనినిస్టుపార్టీవారు నక్సల్‌బరీ ఉద్యమాన్ని సమర్థించటమేగాక, అక్కడ ప్రారంభమైన వ్యవసాయ విప్లవాన్ని ఇతర ప్రాంతాలకు కూడ వ్యాపింప చెయ్యటానికి పూనుకున్నారు. చారు మజుందార్, కాను సన్యాల్ గారలు వీరికి నాయకత్వం వహించారు. ఈ పోరాట ప్రభావం శ్రీకాకుళంజిల్లాలో గిరిజన ప్రాంతాలకు వ్యాపించింది. అడవుల్లో జీవించే అమాయక ప్రజలను, ఇతర ప్రాంతాలనుండి వచ్చిన వ్యాపారస్తులు మోసం చెయ్యటాన్ని యీ పార్టీవారు వ్యతిరేకించారు. వీరి పోరాటాలు హింసాత్మకంగా సాగాయి. భూస్వాములు కొందరిని హత్యచేసి, న్యాయాన్ని, చట్టాన్ని తమ చేతుల్లోకి తీసుకొని, దోపిడీదారులని వారు భావించిన వారిని పోలీసులకు పట్టివ్వడం కాక 'ప్రజాకోర్టు'ల ద్వారా తామే విచారణ జరిపి, క్రూరంగా మరణ శిక్షలను అమలు జరపటంతో ప్రభుత్వం యీ పోరాటాన్ని అణచటానికి తీవ్ర చర్యలను తీసుకున్నది. విప్లవపోరాటంపై ఆశలు పెంచుకొని, ఆంధ్ర ప్రదేశ్‌లోని మిగిలిన ప్రాంతాల నుండి మేధావులు, విద్యార్థులు, పెద్ద చదువుల్లో వున్న యువకులు, స్త్రీ, పురుష వివక్ష లేకుండ శ్రీకాకుళం జిల్లాకు వెళ్ళి, అడవుల్లో రహస్యజీవితం కొనసాగిస్తూ ప్రజలకు రాజకీయాలు బోధించసాగారు. ఉద్యమాన్ని అణచే ప్రయత్నంలో ప్రభుత్వం తీసుకున్న తీవ్రమైన చర్యల్లో అనేకమంది యువతీ యువకులు ప్రాణాలు కోల్పోయారు. శ్రీకాకుళం రైతాంగ పోరాటానికి వెంపటాపు

2. 'సాహిత్యంలో విరసం తెచ్చినమార్పు' - చేకూరి రామారావు- 'సృజన' అక్టోబరు- 1980.

సత్యం, ఆదిభట్ల కైలాసం, సుబ్బారావు పాణిగ్రాహి మొదలైనవారు నాయకత్వం వహించారు.

ఈ రాజకీయ నేపథ్యంలో 1970 ఫిబ్రవరి 1, 2 తేదీల్లో మహాకవి శ్రీశ్రీకి షష్టిపూర్తిచేసి ఆయన రచనలన్నీ ఒకచోట చేర్చి, తెలుగువారికి అందివ్వాలని సాహిత్యాభిమానులు భావించారు. విశాఖపట్టణంలో జరిగిన శ్రీశ్రీ షష్టిపూర్తి సభకు ప్రసిద్ధ సాహితీవేత్త లెందరో హాజరయ్యారు. శ్రీశ్రీని ప్రశంసిస్తూ ఉపన్యాసాలూ, కవితలూ సాగుతుండగా సాహిత్య వేత్తల మధ్య 'బాంబు' లాగా 'రచయితలకు సవాల్' అని విశాఖ విద్యార్థుల కరపత్రం వొకటి తీవ్ర సంచలనం కలిగిస్తూ వెలువడింది.[3] ఆ కరపత్రంలో "ముప్పైఏళ్ళుగా సాహిత్యం ఏం చేస్తోంది? ఎటు వెళ్తోంది? మీరంతా ఎందుకోసం రాస్తున్నారు? ఎవరికోసం రాస్తున్నారు?" అని ప్రశ్నించారు. "అభ్యుదయం పేరుతో గొంతు చించుకుని అరచిన వాళ్ళంతా ఆ పేరుతో కవిత్వాన్ని cash చేసుకుంటున్నారు" అని రచయితలను తప్పు పట్టారు. "మిమ్మల్ని మీరు తిరిగి చూసుకోండి. "దొంగలంజ కొడుకు లసలే మెసిలే యీ లోకంలో" మీరు కూడ భాగస్వాములై పోతున్నారు జాగ్రత్త" అని హెచ్చరించారు. "స్పానిష్ విప్లవంలో ప్రాణాలు పోగొట్టుకున్న సాహిత్యకారుడు క్రిష్టఫర్ కాడ్వెల్‌లాగా తాను రాసిన ప్రతిపద్యం గిరిజనుల నోటి ఊతపదంగా చేసి శ్రీకాకుళ విప్లవ పోరాటంలో వీరమరణం చెందిన సుబ్బారావు పాణిగ్రాహిలా సాహిత్యం జీవితాన్ని మార్చే శక్తిగా మీరెందుకు చెయ్యలేదు" అని అభ్యుదయ కవులను నిలదీసి అడిగారు. "చేతనయితేరండి. నిజాన్ని నిర్భయంగా రాయండి. మేం ఉన్నాం. మీవల్ల ఉత్తేజితులయి మీరు చూపించే దారిపట్టి మీరూహించే మరో ప్రపంచాన్ని వాస్తవం చేస్తాం" అని తమ సంకల్పాన్ని, దీక్షను ప్రకటించారు. అభ్యుదయ కవులు తమ

3. 'రచయితలకు సవాల్' - విశాఖ విద్యార్థులు - కరపత్రాల దుమారం: తెర వెనుక భాగోతం; సంకలనం - అనంతం; లక్ష్మీకాంతం: బుక్‌లవర్స్; విశాఖపట్టణం-1977

దుస్థితికి కలవరపడ్డారు. దిగంబరకవుల్లో పెద్ద మార్పే వచ్చింది. అప్పటి కప్పుడు ఏమీ జరక్కపోయినా 'రచయితలకు సవాల్' కరపత్రం వలన సాహితీ వేత్తలలో ఒకపెద్ద సంచలనమే వచ్చింది. అభ్యుదయ రచయితల సంఘం ఎత్తుబడి పోయిందని, మరొక సాహిత్యసంస్థ ప్రజా పోరాటాల వెల్లువను ప్రోత్సహించేది ఏదయినా కావాలని సాహితీపరులు ఆలోచించ సాగారు.

## "తిరుగబడు కవుల" తిరుగుబాటు

దిగంబరకవుల కున్నంత ఆవేశమూవుంది, అశ్లీలాలు లేకుండ కవిత్వం రాసినవారు 'తిరుగబడు'కవులు. వీళ్ళు పదిమంది.[4] సమాజంలో జరుగుతున్న దోపిడి తొలగి పోవాలంటే, అన్యాయానికి గురి అవుతున్న వాళ్ళు తిరగబడాలని, అది సాయుధంగా జరగటం అవసరమని వీరు తలచారు. అణగారిన ఆర్తులందరినీ తిరుగబడమని కోరటమే వీరి కవిత్వ లక్ష్యం.

"విషం కలిసిన పాయసం మనస్వరాజ్యం, డబ్బున్న భడవా పోషించే ఉంపుడుకత్తె మన ప్రజాస్వామ్యం, మనప్రణాళికలూ, తీర్మానాలూ, వాగ్దానాలూ, రేడియోలూ, పత్రికలూ, సినిమాలూ, సాహిత్యమూ ఒకటేమిటి, అన్నిరంగాలూ ఇరవయ్యేళ్ళకే పడుపుకూడు తిని రాగూడని రోగాలు తెచ్చుకుని ముసలిదైన దీని విలాసాన్ని వర్ణించటానికే ఖర్చయి పోతున్నాయి....శాంతియుత పోరాటం అసంభవం. పోరాటం లేకుండా నిజమయిన శాంతి రాదు.... సామ్యవాద సమాజాన్ని నిర్మించాలి. ఈ వ్యవస్థను శస్త్రచికిత్స చేసి కొత్తవ్యవస్థను నిర్మించటానికి త్యాగాలూ బలిదానాలు తప్పవు."[5] కాబట్టి తిరగబడి పోరాడమని యువతరాన్ని రెచ్చగొట్టారు.

---

4. శ్రీ మతుల వరవరరావు; అశోక్; లోచన్; కిషన్; ఎక్స్-రే; ఐ. సంజీవ రావు; సుధాకర్; సుదర్శన్; యాదగిరిరావు అనే యువకులు 'తిరుగబడు' కవులు.

5. 'యువతరానికి'' .. తిరుగబడు కవులు - 'తిరుగబడు' కవితా సంచలనం స్వేచ్ఛా సాహితి - వరంగల్ - డిసెంబరు

వ్యవస్థ తేలికగా మారదని, అంధవిశ్వాసాల్లో మగ్గుతున్న ప్రజలే అందుకు సహకరించరని యీ కవులకు తెలుసు. ''దీనికి శస్త్ర చికిత్స తప్ప మందులేదని / నాకు తెలుసు / కాని అబ్బో నాశరీరం కన్నా/ నా కలవాటయి పోయిన / యీ దుర్మాంసాన్ని చీల్చనిస్తానా / యీచెడ్డ రక్తాన్ని కడగనిస్తానా / చస్తే చస్తాను అనే రోగివలె రుజాగ్రస్తమైనది సమాజమని వాస్తవ పరిస్థితిని తెలియ జెప్పారు. (వరవరరావు). ''హక్కుల్ని అడుక్కుతినేవాడు / ఇక్కడ జీవించుటకు పనికిరాడు/ హక్కులు ఒక డివ్వడమేమిటి? శ్వాసించడం ఎవడు నేర్పాదేమిటి?'' న్యాయమైన హక్కుల కోసం పోరాడటం శ్వాసించడం వంటి సహజ లక్షణం కావాలని 'లోచన్' ఉద్బోధించారు.

మతాల పిచ్చికుక్కలు కాటేస్తున్న సమాజంలో ''దేవుడా, నువ్వొక ప్లేగువి''అని 'ఐ'అన్నిమతాలు విషప్రాయమని భావించారు. ఎన్నికలపై నమ్మకం పెట్టుకొని దగాపడవద్దన్నారు. కర్మ సిద్ధాంతంలో ''నీ నోరు కట్టేసిన'' ధర్మ సూత్రాలమీద, దోపిడిగాళ్ళ చేతుల్లో రూపొందిన శాస నాల మీద, అబద్ధాన్ని ఆయుధబలంతో కాపాడుకో జూచే కపట తత్వం మీద తిరుగబడమని ఉత్తేజం కలిగించారు. వీరి కవితలో వాచ్యార్థ ప్రధానమైన, రాజకీయోపన్యాసం వంటి రచనలే ఎక్కువ. కాని కవుల చిత్తశుద్ధీ, ఆవేశమూ అప్పటి పరిస్థితులలో వీరి కవిత్వాన్ని ఆదరించే లాగ చేశాయి. తమ ఆవేశం ఏ దిక్కుగా ప్రవహింప జేయాలా? అని ఎదురుచూస్తున్న వీరికి దిగంబర కవుల తోడ్పాటు, శ్రీశ్రీ మొదలైన ప్రసిద్ధ రచయితల సహకారమూ లభించి విప్లవ రచయితల సంఘం ఏర్పడింది. 'తిరుగబడు' కవులు 'విరసం'లో చేరి సాయుధ విప్లవంతో సమాజం మారుతుందని ఎదురు చూస్తున్నారు.

## ఆధునిక కవిత్వ వేదిక 'నవత'

హైదరాబాదులో 'సెవెన్‌స్టార్స్ సిండికేట్' అనే సంస్థ 1959 లో యువకులచేత ప్రారంభింపబడి అనేక సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహించింది. 'నవత' అనే సాహిత్య పత్రికనుగూడ ఆధునిక సాహిత్య

వేదికగా నడిపింది. ఈ సంస్థవారు తమ పదవ వార్షికోత్సవ సందర్భంలో 1970 జులై 4, 5 తేదీల్లో "అభ్యుదయ సాహిత్య సదస్సు" జరపాలని నిశ్చయించారు. ఆ సదస్సుకు అభ్యుదయ కవులను, మంత్రులను, సినిమా నటులను ఇంకా ఎందరినో ఆహ్వానించి మహాకవి శ్రీశ్రీకి ఘనసన్మానం తలపెట్టారు. అభ్యుదయ కవులు, మంత్రులు, సినిమా నటులతో కలిసి వేడుకల్లో పాల్గొనటం తీవ్రవాదులైన వారికి నచ్చలేదు. ఈ సదస్సును ప్రజాపరమైన అభ్యుదయ వేదికగా గుర్తించడంలేదని దిగంబర కవులు దీన్ని బహిష్కరించారు. వరవరరావు మొదలైన యువకవులు కూడ యీ సదస్సు అభ్యుదయ సదస్సుకాదని, దీన్ని బహిష్కరిస్తున్నామని ప్రకటించారు. ఈ సదస్సుకు వెళ్ళవద్దని శ్రీశ్రీగారికి ఎందరో ఉత్తరాలూ, టెలిగ్రాములూ పంపారు; ప్రకటనలు చేశారు, "కసాయివాడు జీవ కారుణ్యం మీద సెమినార్ పెడితే భూతదయ కలవాళ్ళు ఉరకటమేనా?" అని శ్రీశ్రీ అభ్యుదయ సదస్సుకు వెళ్ళటాన్ని గురించి శ్రీ కొడవటిగంటి అభ్యంతరం లేవనెత్తారు. శ్రీశ్రీ మాత్రం ఆ సభలకు హాజరుకాదలచారు. "ఈనాడు నేనో వ్యక్తి మాత్రుణ్ణికాదు. ఒక మహోద్యమ ప్రతినిధిని. కాబట్టి నేను గైరుహాజరు కావడమంటే ఉద్యమానికి ద్రోహం చెయ్యడమవుతుంది. అంతేకాక ఉద్యమవిరోధులంతా నాకు పిరికితనాన్ని అంటగట్ట వచ్చు. సన్మానాన్ని మాత్రం స్వీకరిస్తే అది స్వార్థపరత్వమౌతుంది"అని సన్మానసంఘం ఇచ్చే డబ్బు తీసుకోనని ముందుగానే ప్రకటించి శ్రీశ్రీ మద్రాసునుండి హైదరాబాద్ వెళ్ళారు.[6] అక్కడ విప్లవ రచయితల సంఘం స్థాపించటానికి కృతనిశ్చయులై వున్న రచయితల అభిప్రాయాలకు సమ్మతించి 'అభ్యుదయ సాహిత్య సదస్సు'ను బహిష్కరించారు.

అభ్యుదయ సాహిత్య సదస్సు శ్రీశ్రీగారు హాజరుకాక పోయినా పెక్కుమంది అభ్యుదయ కవులతో నిర్విఘ్నంగా జరిగింది. ఆ సదస్సును బహిష్కరిస్తున్నామంటూ "విప్లవ సాహిత్యాభిలాషులు" కరపత్రం

---

6. శ్రీశ్రీ లేఖ 'ఆంధ్రపత్రిక' - జులై 4, 1970 - దినపత్రిక

పంచిపెట్టారు.[7] అందులో "కుళ్ళిపోయిన సరుకుల్ని, చెల్లిపోయిన మందుల్ని ఇక్కడ అమ్మి ప్రజల ఆరోగ్యాన్ని చెడగొట్టవద్దని" అభ్యుదయ కవులను హెచ్చరించారు. ఇంకా అసభ్య పదజాలంతో అభ్యుదయ కవులను నిందించారు. "ఇవాళమాకు యువకులమీద ప్రజాశక్తుల మీద తప్ప ఎవరిమీదా నమ్మకంలేదు.... ప్రజాశక్తి ప్రాణం విప్లవ యువతరం" అని ప్రకటించి "ఎన్నోత్యాగాలతో కూడుకున్న దీర్ఘవీర ప్రయాణానికి సిద్ధమౌతున్నా"మన్నారు. "ప్రజాపోరాటాలు సాయుధరూపంలో ఉధృతమౌతున్న విప్లవయుగంలో రచయితలు ఎటువైపో తేల్చుకోవాలి. తమ "కమిట్‌మెంట్" ప్రజాపక్షం అని రుజువుచేయాలి" అని రచయితలకు విజ్ఞప్తి చేశారు.

ఈసందర్భంలో మాక్సింగోర్కీ కళావేత్తలకు చేసిన హెచ్చరికను జ్ఞాపకం చేసుకోవచ్చు. దుర్మార్గ పరిస్థితులను చూచి ఓర్పు వహించటం సబబుకాదని ఆయన అభిప్రాయపడ్డారు. "ఓరిమి గాడిదల సుగుణం. ఇతరులు పెట్టే బాధలకి లొంగి సహించి ఓరిమితో పడివుండడం మానవుణ్ణి నాశనం చేస్తుంది. ఓరిమి నిప్పులాగే ఆశ్రయమిచ్చిన వాళ్ళని దహించేస్తుంది. ఓరిమి కలిగివుండండని బోధించేవాళ్లు ప్రజల్ని కన్నుగప్పి గాడిదలుగా చేద్దామని చూస్తున్నారన్న మాట" అని కళావేత్తలను హెచ్చరించి "మీరెటువైపో" తేల్చుకోమన్నారు.[8] అభ్యుదయ కవులు కూడ 'సదస్సు' తర్వాత ఎటువైపో తేల్చుకోవలసిన అవస్థలో పడ్డారు.

అభ్యుదయ సాహిత్య సదస్సు జరగటానికి ముందురోజు రాత్రికి రాత్రి యువకుల ఆవేశపూరితమైన ఆలోచనలకు, సాయుధ పోరాటాన్ని

7. "ఈ పగటి వేషగాళ్ళ రంకు రాజకీయ, సినీకంపు సాహిత్య వంతని మేం బహిష్కరిస్తున్నాం" - కరపత్రాల దుమారం: తెరవెనుక బాగోతం: సంకలనం: అనంతం; లక్ష్మీకాంతం: బుక్‌లవర్స్ పబ్లికేషన్స్ - విశాఖపట్టణం-1977

8. Maxim Gorky - 'on Literature' - Progress publishers, Moscow.

సమర్థించటమే రచయితల కర్తవ్యమన్న తలంపుకు శ్రీశ్రీ కట్టుబడి విప్లవ రచయితల సంఘాన్ని స్థాపించారు. ఈ సంఘానికి శ్రీశ్రీ గారే అధ్యక్షులు.

''సాయుధ విప్లవ బీభత్సుని సారథినై
భారత కురుక్షేత్రంలో
నవయుగ భగవద్గీతా ఝంఝుని ప్రసరిస్తాను
మంటలచేత మాట్లాడించి
రక్తంచేత రాగాలాపన చేయిస్తాను'' (ఝంఝు)

అని శ్రీశ్రీ విప్లవ రచయితల సంఘం అధ్యక్షులుగా తన దీక్షను ప్రకటించారు. ప్రసిద్ధ అభ్యుదయ రచయిత శ్రీ కొడవటిగంటి కుటుంబరావు; పేద ప్రజలజీవితాన్ని వాస్తవికంగా చిత్రిస్తున్న శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి, శ్రీ కాళీపట్నం రామారావు, అభ్యుదయ కవి శ్రీ కె. వి. రమణారెడ్డి మొదలైనవారు విప్లవ రచయితల సంఘంలో చేరారు.

'సాహితీమిత్రులు' నిర్వహిస్తున్న సాహిత్యపత్రిక 'సృజన' 13 సంచికల వరకు ఆధునిక సాహిత్య వేదికగా వుంటూ వచ్చింది. శ్రీశ్రీ షష్టిపూర్తి నాటినుంచి తన వైఖరి మార్చుకొని విప్లవ భావాలవైపు మొగ్గి 'విరసం' స్థాపనతో విప్లవ రచయితల వాణిగా మారింది. ఒక విధంగా చెప్పాలంటే 1970 నుండి 1980 వరకు విప్లవ రచయితల కార్యకలాపాలు; కవితలు,కథలు,వ్యాసాలు మొదలైన రచనలన్నిటికి 'సృజన' ప్రచార సాధనంగా నిలిచింది. 'విరసం' వారికి ''ప్రభంజనం; విద్యుల్లత; పిలుపు; అరుణతార'' మొదలైన పత్రికలు కూడ తోడ్పడ్డాయి.

1970 అక్టోబర్‌లో 'విరసం' ప్రథమ మహాసభలు ఖమ్మంలో జరిగాయి. కేవలం సంస్కరణవాదానికి కాలం చెల్లిపోయిందంటూ విరసం ఖమ్మం సభల్లో 13 అంశాలతో కూడిన ప్రణాళికను ప్రవేశ పెట్టింది. ''సాహిత్యం ఒక ఆయుధ విశేషం. సమగ్రమైన మానవ

స్వాతంత్ర్యంపై పే విప్లవ సాహిత్యం జరిపే మహా ప్రస్థానం" అని తన పోరాటమార్గాన్ని నిర్దేశించుకొన్నది. "విశ్వమానవతావాదాన్ని మార్క్సిజం లెనినిజం క్రాంతిమార్గంలో ఎలుగెత్తి చాటడం" తన ప్రధాన ఆశయంగా, వివిధ ఆశయాలను పదింటిని ప్రకటించింది.

ప్రథమ మహాసభల నాటికి 'విరసం' సభ్యుల కవితా సంకలనం 'ఝంఝ' వెలువడింది. యువకులు ప్రభుత్వ వ్యతిరేక ప్రచారంచేస్తున్న సాహిత్యోద్యమం కావటంచేత, అన్యాయాలపై ధర్మక్రోధం ప్రకటిస్తున్న సంస్థ కావటం చేత గూడ ప్రజలు విరసాన్ని బాగా ఆదరించారు. విరసం వారు మార్క్సిస్టు తత్వాన్ని అనుసరించారు. ఐతే యీ అనుసరణ మార్క్సిస్టు - లెనినిస్టు పంథాలో సాగాలని, మావో ఆలోచనా విధానమే ఆచరణీయమని వీరు భావిస్తారు. మావో-సే-టుంగ్ నడిపిన 'లాంగ్ మార్చ్' లాగే భారతదేశంలో విప్లవం దీర్ఘకాలిక సాయుధ పోరాటం ద్వారా సిద్ధిస్తుందేగాని, కేవలం ఎన్నికలు, సంస్కరణల వలన రాదని, దీర్ఘకాలిక సాయుధ పోరాటానికి ప్రజలు సన్నద్ధులై త్యాగాలు చెయ్యటానికి సంసిద్ధం కావాలని వీరు ప్రబోధిస్తారు. దేశదేశాల్లో ప్రజలకోసం పోరాడి మరణించిన వీరుల గురించి వీరు రచనలు చేశారు. భారతదేశంలో ప్రజలు ఏ ప్రాంతంలో తిరుగుబాటు జరిపినా దాన్ని తమ పోరాటంగానే వీరు తలుస్తారు.

ప్రజలను చైతన్యవంతులను చెయ్యటానికి తరతరాలుగా వస్తున్న సంప్రదాయ కళారూపాలను ఉపయోగించుకోవటం తప్పులేదని, అట్లా ఉపయోగించుకోవటమే సరియైన మార్గమని మావో-సే-టుంగ్ చెప్పిన హితవును వీరు నమ్మి జానపద కళారూపాలను పునరుద్ధరించి, వాటిద్వారా ప్రజలకు విప్లవ భావాలను బోధిస్తున్నారు. "We should take over the rich legacy and the good traditions in literature and art that have been handed down from past ages in China and foreign countries, but the aim must still be to serve the masses of the people. Nor do we refuse to utilise the literary and artistic forms of the past, but in our hands these old forms, remoulded and infused

with new content, also become something revolutionary in the service of the people"[9] అని మావో-సే-టుంగ్ విప్లవ వీరులకు చెప్పిన హితవును విరసం వారు బాగా ఆచరణలో పెట్టారు. ప్రజాసేవలో యీ కళాకారులు ప్రతిఫలం ఆశించకుండ, గ్రామాలు పట్టణాలు తిరుగుతూ, ప్రజలలో విప్లవభావాలను వెదజల్లటానికి ప్రయత్నిస్తున్నారు

'విరసం' అన్ని సాహిత్య ప్రక్రియలను ఆదరించే సంఘమే అయినా దేశకాల పరిస్థితులను బట్టి కవిత్వం, కథలు ప్రాముఖ్యం వహించాయి. ఈ రచయితల చేతిలో నాటకం శక్తివంతమైన సాధనం కాలేకపోయింది. విప్లవ భావాలతో నవలలుకూడ చెప్పుకోదగినవిరాలేదు. జానపద కళారూపాలు-జముకుల కథ, వొగ్గుకథ. మొదలైనవి, పాటలు ఎక్కువగా వెలువడ్డాయి. 'విరసం' అంటే ప్రధానంగా కవుల సంస్థ అనిపించింది.

## విప్లవ కవితా ప్రభంజనం 'ఝంఝ'

శ్రీకాకుళ గిరిజనోద్యమంలో ప్రాణాలర్పించిన కవిశ్రీసుబ్బారావు పాణిగ్రాహిస్మృతికి అంకితం చేయబడిన కవితా సంకలనం 'ఝంఝ' 'శ్రీకాకుళం' జిల్లాలో జరిగిన సాయుధ పోరాటంలో అసువులు అర్పించిన నక్సలైట్ నాయకులపై రాసిన కొన్ని స్మృతిగీతాలు కూడ యీ సంపుటంలో వున్నాయి.

విప్లవ పోరాటంలో మరణించిన వీరుణ్ణి సంబోధించి "అన్నా! నీ గాయాలపై నుండి వీచి / గాలి ఎరుపెక్కింది" అని శ్రీ అశోక్; శ్రామిక జీవుల పక్షం వహించి "ఆరోపరకో అటో ఇటో మన నేరాలన్నీ ఒకే సెక్షను కింది కొస్తాయి / అందుకే / దారి తప్పిన సోదరులందరికీ ఒకే బాట" అని విప్లవ మార్గాన్ని అనుసరించ మంటున్న శ్రీ చెరబండ

9. 'Talks at Yenan Forum on Literature and Art'- Mao Tse-Tung-on Literature and Art - Foreign Languages press, Peking-1967 - page 11&12.

రాజు; "ఉదయం రాకుండా / ఊరంతా కాపలా - మనమందరం కటిక చీకటి కోటలో బ్రతుకుచెడిన బానిసలం / విముక్తి మార్గం కావాలి/.... దీన్ని క్రాంతి గునపాలతో కూల్చాలి. ..లక్ష నక్షత్రాలు రాలందే/ఉజ్జ్వల ఉదయం ప్రవహించదు" అని శ్రీ జ్వాలాముఖి; "క్రమం తప్పడంలో కూడా క్రమంఒకటివుంది" అని శ్రీ కె. వి. రమణారెడ్డి; మూడుకోతులూ నవ్వులూ జాతిని నిర్వీర్యం చేసేస్తే / ఇంకా వ్యక్తిస్వేచ్ఛ అనే వెర్రి భ్రమలో వర్గసామరస్యం పన్నిన వలలో / గిలగిలా తన్నుకోలేను/.... ఈ కొండమంగలి వెధవల చేతుల్లో నిస్సహాయంగా తల ఉంచలేను/.... రైట్ టు ఓట్ కాదు / ఈ దోపిడీ రేచుకుక్కల్ని తరిమితరిమి / ఫైటు టుదిలాస్ట్" అని 'లోచన్;' "పోరాటం మధ్యలో /అంతులేని కన్నీళ్ళకు ఆస్కారం లేదుసుమా ! "అని శ్రీ శివుడు: "మెలిదిరిగిన కండరాలు కాయకష్టంలో కుమిలి పోతున్నా / గంజి మూకుట్లో రెండు మెతుకులు లేవు. / దారిద్ర్యం మన శత్రువు / యవ్వనమంతా విశ్వవిద్యాలయ పడగనీడల భవనాల్లో బంధించినా / యువతరం చదువుల బ్రతుకుల్లో వెలుగులేదు / అజ్ఞానం మన శత్రువు / ప్రపంచాన్ని ప్రమాణాల్ని ప్రజాప్రభుత్వాన్ని నిర్మించే మనుషులు కావాలిప్పుడు / ప్రతి తల్లీ / ఒక సూర్యుణ్ణి ప్రసవిస్తే చాలు" అని శ్రీ నగ్నముని యువతరాన్ని కదిలించి ఝంఝూ ప్రభంజనం వీచేలాగ చేశారు. 'ఝంఝ'లో 'నిన్నటి ఐటాక్వాలా' శ్రీశ్రీ రచించిన మిగిలిన కవితల్లాగ కాకుండా జానపద రీతిలో సాగింది. ఈ శైలి శ్రీశ్రీకి సహజం కాదు. తెచ్చిపెట్టుకున్నట్లే వున్నది. కాని యీమార్గంలో తర్వాత గద్దర్, వంగపండు ప్రసాదరావు, చెరబండరాజు మొదలైనవారు రసవంతమైన, ఉత్తేజకరమైన గీతాలు రచించి ఉద్యమానికి బలం చేకూర్చారు.

'తెరవెనుక' అన్న 'ఎక్స్-రే'గీతం వివాదాస్పదమయింది. కవులు ఉద్యమాలకు వెనకుండి నడిపించాలన్న కవిభావం తీవ్రమైన సందేహ దోలకు తావిచ్చింది. "నటులు వేరు. గ్రీన్‌రూమ్‌లో వుండేవారువేరు" అని కవి చెప్పిన ఉపమానం ఘోరమైనది. విద్యాధికులు, దేశభవిష్యత్తు వారిమీద ఆధారపడిన యువకవులూ పోరాటాల్లో ప్రాణాలు విడుస్తూ

వుంటే - తీరికూర్చుని కవి పాటలు కవితలు రచించి, వాళ్ళకు ప్రేరణ కలిగించి తాను సుఖంగా వుండటం క్షమించరాని ఘోరమైన అపరాధంగా తోస్తుంది.

"సైన్యంలో చేరకు" (జి. సోమయ్య)వంటి గీతాలు దేశద్రోహ కరంగావున్నాయని ప్రభుత్వం 'ఝుంఝు'ను నిషేధించింది. 'నరుడో భాస్కరుడా' (శివుడు) అనేగీతం శ్రీకాకుళ పోరాటంలో మరణించిన డాక్టర్ చాగంటి భాస్కరరావుపై రచించినపాట, దీన్ని జననాట్యమండలి; 'నవోదయ' వంటి సంస్థలు, ఇతర గాయకులు వివిధ సభల్లో గానంచేసి ప్రజలకు ఉత్తేజం కలిగించారు. 'ఝుంఝు' వెలువడిన తరువాత యువకులు చాలమంది కవిత్వం రాయాలనే ఉత్సాహంతో రాజకీయ నినాదాలు, ఉపన్యాసాల వంటి రచనలు చేశారు. ఉద్యమావేశంలో వచ్చిన తాలూ, టోలూ పోగా నిజమైన కవితాశక్తి గలిగిన కవులు కొందరు విప్లవ రచయితల సంఘాన్ని చైతన్యవంతంగా నిలిపారు. శ్రీశ్రీ, సుబ్బారావు పాణిగ్రాహి; శివుడు; చెరబండరాజు; నగ్నముని; గద్దర్; వంగపండు ప్రసాదరావు; కె. వి. రమణారెడ్డి; లోచన్; అశోక్‌వంటి కవుల విప్లవ రచనలతో యీ దశాబ్దం (1970-80) విప్లవ కవులదేనన్న భావం కలిగించింది.

## 'మార్చ్' - కవితా సంకలనం

"ప్రజలను సాయుధం చేస్తున్న రివల్యూషనరీ నేటికవి" అని నమ్మిన కవుల కవితా సంకలనం 'మార్చ్'. దీని సంకలన కర్త శ్రీ పి. కిషన్‌రావు, సాయుధ విప్లవం ద్వారా ప్రజలు దోపిడి నుండి విముక్తమవుతారని నమ్మిన విప్లవ కవుల గీతాలతో వచ్చింది 'మార్చ్'. అందరి అభిప్రాయాలు ఒకటే కాబట్టి కవితలకు కవులపేర్లక్కర లేదన్నట్టు, కవులపేర్లు లేకుండ యీ సంకలనం వెలువడింది. ప్రభుత్వం యీసంకలనాన్ని నిషేధించి, కిషన్‌రావుగారిని అరెస్టు చేసింది.

"కసితో స్వార్థం శిరస్సు గండ్ర గొడ్డలితో
నరకగల్గిన వాడే నేటి హీరో"

అని పలికిన కవి ఆవేశాన్ని విప్లవవాదులు మెచ్చువచ్చు. ఏదేశంలోనైనా పాలక వర్గానికి వ్యతిరేకంగా హింసను ప్రబోధించిన వారిపై చర్య తీసుకోకుండా ప్రభుత్వాలు మిన్న కుంటాయా? పోషలిస్టు దేశాల్లో నైనా ఇటువంటి రచనల్ని నిషేధిస్తారు. 'మార్చ్' కవుల హింసాత్మక రచనల్ని ప్రభుత్వం సహజంగానే భరించలేక పోయింది.కాని సమాజంలో జరుగుతున్న అన్యాయాలపై క్రోధం ప్రకటించిన కవులను శిక్షిస్తే సరిపోదు. అన్యాయాలను రూపుమాపినప్పుడు ఇటువంటి కవిత లను ప్రజలు ఆదరించటమనే ప్రసక్తి వుండదు. "బాలట్లతోకాదు బులెట్లతో / ఈ రాజ్యాధిపత్యం చేపట్టండి" అనే శుష్క రాజకీయాభి ప్రాయం కవిత్వమని సహృదయులు అంగీకరించలేరు.

## 'లే' - కవితా సంకలనం

'ఝంఝ'; 'మార్చ్' సంకలనాల ప్రేరణతో తిరుపతినుండి 'లే' అని ప్రజల్ని మేల్కొలపదలచిన కవితా సంకలనం వచ్చింది. ఆవేశం పుష్కలంగా వుండి కవితాశక్తి ఏ మాత్రమూలేని యువకుల రచన లిందులో వున్నాయి. భావాల్లో ఏకాభిప్రాయం వుండటంవల్ల విప్లవ సాహిత్యాన్ని అభిమానించేవారు దీన్ని ఆదరించారు. కాని పల్లెల్లో రైతుకూలీలు "యీ విప్లవ సాహిత్యానికి పాఠకులయ్యా"రని శ్రీ త్రిపురనేని మధుసూదనరావు భావించారు, కాని మరొక విప్లవ కవి శ్రీ కె. వి. రమణారెడ్డి యిట్లా భావించటం 'wishful thinking' లాంటిదేనని అభ్యంతరం చెప్పి "ఇంకా ఆ దశ రాలేదు. అవశ్యం రావాలి" అని ఆశించారు,[10] కాని ఆ దశ యిప్పటికీ రాలేదు. గద్దర్, వంగపండు ప్రసాదరావు, చెరబండరాజు మొదలైన వారి పాటలు కొన్ని పల్లెలకు వ్యాపించాయి గాని 'లే' సంకలనంలోని కవితలకు ఎటు వంటి ఆదరమూ లభించలేదు. ప్రభుత్వం యీ సంకలనాన్ని కూడ నిషేధించింది.

10 'లే' సమీక్ష; కె. వి. రమణారెడ్డి; సృజన - ఏప్రిల్ 1971.

## 'ఎన్నికలను బహిష్కరించండి'

1971 జనరల్ ఎన్నికలముందు, ఎన్నికలను బహిష్కరించమని 'విరసం' ప్రజలకు విజ్ఞప్తి చేసింది. ఎన్నికల ద్వారా ప్రజాస్వామ్యం నిలబడేది కల్ల అనీ, సాయుధ పోరాటమే దోపిడికి విముక్తి మార్గమని విప్లవ కవులు ప్రబోధించారు. ఎన్నికలు యథావిధిగా జరిగిపోయాయి. 'విరసం' ఇప్పటికీ ఎన్నికలపై విశ్వాసం ప్రకటించలేదు. ఎన్నికల ద్వారా ఎక్కడైనా ప్రతిపక్షాలు గెలుపొందినా వాటి పరిపాలన కూడ సరిగా వుండదనీ, మొత్తం రాజ్యాంగాన్ని సమూలంగా మార్చనిదే ప్రయోజనం లేదని విప్లవ కవులు భావిస్తున్నారు.

## విప్లవ కవులపై ప్రభుత్వం ఆగ్రహం

విప్లవ రచయితల సంఘం ఏర్పడిన మొదటి సంవత్సరంలోనే 1971 ఆగస్టు రెండవ తేదీన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చెరబండరాజు, జ్వాలాముఖి, నిఖిలేశ్వర్‌లను అరెస్టు చేసింది. "వాళ్ళ ఇళ్ళు సోదా-చేసి పుస్తకాలను, ఉత్తరాలను స్వాధీనం చేసుకొన్నది. "ఇట్లాగే ఇంకా విప్లవ రచయితలు పి. కిషన్‌రావు (మార్చ్ సంకలనకర్త) : ఎం. వి. రమణారెడ్డి ('ప్రభంజనం' సంపాదకుడు), కె. వి. రమణారెడ్డి గారలను వేర్వేరు సందర్భాల్లో బంధించింది. కాని కోర్టులో ప్రభుత్వం పెట్టిన కేసులు నిలవలేదు. "విశ్వాసాలు అదుపులో పెట్టబడేవికావు. అతనికున్న విశ్వాసాల గురించి జైల్లో పెట్టటానికి వీలులేదు" అని జస్టిస్ ఓ. చిన్నప రెడ్డి, జస్టిస్, ఎ. డి. వి. రెడ్డి (అప్పటి హైకోర్టు న్యాయమూర్తులు) గారలు తీర్పుచెప్పారు. 'సృజన' సంపాదకులు వరవరరావును, ఆయన శ్రీమతిని కూడ పెక్కుమారులు ప్రభుత్వం జైల్లో పెట్టింది. "జననాట్య మండలి, అరుణోదయ, నవోదయ" సంస్థలకు చెందిన విరసం కళాకారులను గూడా పోలీసులు హింసించారు. ప్రజలకు యీ విషయాలు తెలియజెప్పి రచయితలపై సానుభూతి కలిగించటానికి, పౌరహక్కుల పరిరక్షణకై దరిదాపు ఆంధ్రప్రదేశ్‌లో అన్ని పట్టణాలలో పౌరహక్కుల సభలు జరిగాయి. ఆ సభల్లో పాడిన పాటలు విప్లవ కవుల రచనలను ప్రజలకు సన్నిహితంగా తీసుకువెళ్ళాయి.

1975 జూన్‌లో దేశంలో 'అత్యవసర పరిస్థితి' ప్రకటించినప్పుడు ప్రముఖ విప్లవ కవులను అందరినీ- శ్రీశ్రీ వంటి ఒకరిద్దర్ని మినహాయించి- ప్రభుత్వం జైల్లో పెట్టింది. అత్యవసర పరిస్థితిని వ్యతిరేకిస్తూ విప్లవకవులు రచనలు సాగించారు. కాని 18 మాసాలపాటు సాగిన నిర్బంధంలో విప్లవకవులు కొందరికి మనస్థైర్యం చెదిరిపోయింది. విరసానికి రాజీనామా లిచ్చారు. ప్రభుత్వానికి తామిక క్రియాశీల కార్యకలాపాలలో పాల్గొనబోమని హామీ పత్రాలిచ్చారు. 'విరసం' తనశక్తిని కోల్పోసాగింది. వీటన్నిటికంటె విశేషమైనది 'విరసం'అధ్యక్షులు శ్రీశ్రీ జైల్లోగాక బయటే ఉన్నప్పటికీ ప్రభుత్వాన్ని, ప్రభుత్వ చర్యల్ని సమర్థించారు. అత్యవసర పరిస్థితి అనంతరం 'విరసం' శ్రీశ్రీని అధ్యక్షపదవి నుండి తొలగించింది. విరసానికి క్షమాపణ చెప్పి, తనను సాధారణ సభ్యునిగా కొనసాగనిమ్మని కోరిన శ్రీశ్రీని విరసం క్షమించి, శ్రీశ్రీ కోరికను మన్నించింది. మళ్ళా 1980లో 'విరసం' కార్యకలాపాలను విమర్శించి అస్సాం ఆందోళనలో ప్రభుత్వ వైఖరిని సమర్థించి శ్రీశ్రీ 'విరసం' ఆగ్రహానికి మరోసారి గురి అయ్యారు, మళ్ళీ ఆయన విరసానికి క్షమాపణ చెప్పి విప్లవ రచయితగానే కొనసాగుతున్నారు. ఇది శ్రీశ్రీ విదూషకుని Temperament కే గాక, మహాకవి బాధ్యతా రాహిత్యానికి కూడ నిదర్శనమే. 'అత్యవసర పరిస్థితి'తర్వాత తనశక్తిని బాగా కోల్పోయిన 'విరసం' మళ్ళీ కోలుకోవటానికి ప్రయత్నిస్తున్నదిగాని అది Convalescent గానే- మునుపటి శక్తి ఉత్సాహమూ రచయితల్లో కానరావటంలేదు,

## విప్లవ కవులు - రాజకీయ నేపథ్యం

విప్లవ రచయితలకు చైనాదేశపు జాతిపిత మావో ఆలోచనా విధానం ఆదర్శప్రాయంగా కన్పించింది. మార్క్స్, ఏంగెల్స్‌లు ప్రవచించిన కమ్యూనిస్టు సిద్ధాంతం, లెనిన్ దాన్ని ఆచరణలో పెట్టిన విధమూ మావో-సే-టుంగ్ నడిపించిన 'లాంగ్ మార్చ్' వెలుగులో వీరు భారతీయ ప్రజా పోరాటాలు సాగాలని తలచారు, క్యూబాలో ఫిడెల్ కాస్ట్రో

నాయకత్వంలో విప్లవ పోరాటం విజయవంతం కావటం వీరికి ధైర్యాన్ని యిచ్చింది. అర్జంటీనాలో జన్మించి మంత్రి పదవిని వదలిపెట్టి ప్రపంచ విప్లవ పోరాటాలకు అంకితమై 'బొలీవియా' గెరిల్లా పోరాటంలో అజ్ఞాతంగా పోరాడి ప్రాణాలు అర్పించిన 'చేగువేరా' వీరికి అమితోత్సాహాన్ని కలిగించాడు.

భారతదేశంలో బెంగాల్‌లో చెలరేగిన రైతు పోరాటంలో 'నక్సల్ బరీ' నాయకులైన చారు మజుందార్, కానుసన్యాల్; ఆ తర్వాత శ్రీకాకుళంలో గిరిజనోద్యమంలో పాల్గొని అసువులు అర్పించిన వెంపటాపు సత్యం, ఆదిభట్ల కైలాసం, పంచాది కృష్ణమూర్తి, పంచాది నిర్మల, చాగంటి భాస్కరరావు, తామాడ గణపతి, ఇంకా జైలు జీవితాన్ని అనుభవిస్తున్న చౌదరి తేజేశ్వరరావు, నాగభూషణ పట్నాయక్ మొదలైనవారి త్యాగాలు విప్లవకవుల కావ్యవస్తువులు - ఆ వీరుల మార్గంలో ప్రజలు పోరాటం సల్పాలని వీరుద్బోధించారు. ప్రజా ప్రతినిధిగా ఎన్నికై, పదవికి రాజీనామా ఇచ్చి, రైతాంగ పోరాటంలో పాల్గొని, అజ్ఞాతవాస జీవితం గడిపి, మరణించిన ప్రజానాయకుడు శ్రీ తరిమెల నాగిరెడ్డి వీరికి ఆదర్శమయ్యారు. అతివాద రాజకీయపక్షాల్లో వచ్చిన చీలికలు 'విరసం'లో కూడ తలెత్తాయి.

అనంతపురంలో జరిగిన విప్లవ రచయితల మహాసభల్లో జ్వాలాముఖి, నిఖిలేశ్వర్ మొదలైనవారు విడిపోయి 'జనసాహితి' స్థాపించుకున్నారు. సుప్రసిద్ధ రచయిత్రి రంగనాయకమ్మగారు వీరితో కలిసి కొన్నాళ్లు 'జనసాహితి'లో వుండి ఆ తర్వాత అభిప్రాయ భేదాలతో ఆ సంస్థ నుండి వైదొలగారు.

'ప్రత్యేక తెలంగాణ' కోసం జరిగిన ఆందోళనలో 'విరసం' వైఖరిని ప్రజలు హర్షించలేక పోయారు. స్వార్థపరశక్తుల ఆందోళనను ప్రజోద్యమంగా వక్రరీతిలో వ్యాఖ్యానించ జూచింది. ఆ తర్వాత తమ పొరపాటును గుర్తించి ఆంధ్రప్రదేశ్ చీలిపోవాలని కోరలేదు.

'బంగ్లాదేశ్ విముక్తి' సందర్భంలో కూడ 'విరసం' వైఖరి జాతీయ వాద కవులవైఖరి కంటె భిన్నమైనది. జాతీయతను విడనాడిన అంత ర్జాతీయ దృష్టిని 'విరసం' అనుసరించటం సహృదయులకు నచ్చలేదు.

విప్లవకవుల రచనలు విని ఫాక్టరీ కార్మికులు, రిక్షావాలాలు,ఇంకా చిన్నచిన్న వృత్తులతో పొట్టపోసుకునే శ్రామికులు ఉత్తేజితులై రచనలు చేసిన సందర్భాలున్నాయి. వారి రచనల్లో కళావిలువ లంతగా లేక పోవచ్చు, సాహిత్య సృష్టి ఏ వొక్కరి సొత్తూ కాదు, దాన్ని అనుభ వించే అర్హత అందరికీ వున్నదని 'విరసం' నిరూపించింది. మున్నెన్నడూ లేనంతగా సాహిత్యాన్ని ప్రజలవద్దకు తీసుకువెళ్ళిన ఘనత విరసానిదే.

విప్లవ రచనలతో తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన కవుల కవితా విశేషాలను పరిశీలిస్తే యీ దశాబ్దంలో (1970-80) తెలుగు కవిత్వపు పోకడల్లో ఒక ముఖ్యభాగం అర్థమైనట్లే.

## విప్లవ కవిగా శ్రీశ్రీ - "మంటలచేత మాట్లాడించి, రక్తంచేత రాగాలాపన చేయిస్తాను"

'విరసం'వ్యవస్థాపక అధ్యక్షులు శ్రీశ్రీ యీదశాబ్దంలో (1970-80) మళ్ళీ యవ్వనాన్ని పుంజుకొని, కొన్ని రసవంతమైన గీతాలు రచించారు. విరసం ఆయన్ను అధ్యక్షస్థానం నుండి తొలగించిన తర్వాత కూడ అధ్యక్షునిగా మరెవ్వరినీ ఎన్నుకోలేదు. 'విరసం' శ్రీశ్రీని ఆయనలోపా లెన్ని వున్నా మన్నించి తనలో కలుపుకుంటూనే వున్నది.

ప్రత్యర్థులపై విసుర్లు, ప్రభుత్వంపై తిట్లు, కావాలని నినాదాల వంటి గీతాలు కూడ రచించినా, కొన్ని మాత్రం శ్రీశ్రీయే రచించ గలరనే ఉత్తమ రచనలు ఆయన కలం నుండి వెలువడ్డాయి, 'మరో ప్రస్థానం'లో విప్లవ పోరాటంలో ఉరిశిక్షకు గురియైన భూమయ్యా, కిష్టా గౌడ్‌లపై శ్రీశ్రీ స్మృతిగీతం 'భూమ్యాకాశాలు' ఇప్పటికీ శ్రీశ్రీ లో కవితాజ్వాల ఆరిపోలేదనటానికి నిదర్శనంగా, మహాకవి ప్రతిభకు దీటుగా

వున్నది. "ఒద్దు కన్నీటి కవిత్వం రాయొద్దు / సమాజానికి కాలం పెట్టిన అప్పును / ప్రాణాలతో వారు తీర్చుకున్నారు.... బతికే అర్హత లేని పందల్ని, పందుల్ని / చంపడమే వాళ్ళు చేసిన నేరం/.... బ్రతకడం అంటే సెక్కడం అయితే / వాళ్ళెప్పుడో చచ్చిపోయారు /.... వాళ్ళిద్దరిలో ఒకడు భూమి. రెండోవాడు ఆకాశం" అన్న యీ గీతంలో భూమయ్యను భూమిగా, కిష్టాగౌడ్‌ను ఆకాశంగా పోల్చడంలో శ్రీశ్రీ గొప్పతనం వ్యక్తమవుతున్నది.

'తుది పయనం : తొలి విజయం' గీతం. విప్లవ వీరులను కదన రంగాని కురికించే శక్తి యీ గీతంలో వున్నది.

"ఊగరా, ఊగరా, ఊగరా ! ఉరికొయ్య అందుకొని ఊగరా !
ఉరికొయ్య అంటుకొని ఊగరా !....

నెత్తురు కార్చిన కళ్ళే నిప్పులు చెరుగుతాయి
స్వాతంత్ర్యపు మారుపేరు సామ్యవాదమే సత్యం !
చావులేని ఆ సత్యం జ్వలిస్తుంది అనునిత్యం
మాంచాలను కొలుస్తారు, మల్లమ్మను తలుస్తారు
ఝాన్సీలక్ష్మీ బాయికి బాష్పధార విడుస్తారు
సరోజినీదేవి ఫోటో పటం కట్టి పొగుడుతారు
పంచాద్రి నిర్మలంటే భయం పుట్టి వణుకుతారు !
తెల్లవాడు నిన్ను నాడు భగత్సింగు అన్నాడు
నల్లవాడు నువ్వు నేడు నక్సలైటు వన్నాడు
ఎల్లవారు నిన్ను రేపు వేగుజుక్క అంటారు !
శివాజీకి వారసుడా ! శ్రీశ్రీ కవిత్వలాలసుడా !
నీ ధాటికి అడ్డులేదు, నీ త్యాగం వృథాకాదు !"

అని వీర విప్లవ గీతం రాసిన శ్రీశ్రీ బాధ్యతారహితంగా, ఆ విప్లవాన్ని అణచివేస్తున్న ప్రభుత్వాన్ని సమర్థించి తన కవిత్వానికి తానే కళంకం ఆపాదించుకొన్నారు. "హింసతోనే సృష్టిపూస్తది/హింసతోనే

మార్పు వస్తది (ఓ మహాత్మా! ఓ మహర్షీ!) అని శ్రీశ్రీ దౌర్జన్యాలపై హింసాత్మక చర్యల్ని సమర్థించటంలో ఆశ్చర్యం లేదు. "తిరుగుబాటు మా వేదాంతం" అని మహాప్రస్థానంలోనే స్పష్టం చేశారు కదా!

"తెలుగువీర లేవరా!" పాట అల్లూరి సీతారామరాజు సినిమా కోసం రాసిందైనా జాతిని ఉత్సాహపరచగల గీతం. ఈ గీతానికి జాతీయ స్థాయిలో బహుమతి రావటంచేతగాక, పాటను వింటున్నప్పుడు శరీరం పులకించని రసికుడుండ డనటం అతిశయోక్తి కాదు.

"ఎదురుచూసి మోసపోకుమా" అనేది కూడ ప్రస్తుత సమాజ పరిస్థితిని కళ్ళకు కట్టించే రమ్యమైన గీతం. భూమికోసం భుక్తి కోసం సాగే రైతుల పోరాటానికి 'అంతం కాదిది ఆరంభం' అని విప్లవ చైతన్యం రగుల్కొల్పారు.

ఉగాదులకూ, కవి సమ్మేళనాలకూ సభలకోసమూ ప్రత్యేకంగా రాసిన గీతాల్లో కవిత్వం పలచబారింది. "కుర్చీలు విరిగిపోతే కూర్చోడం మాననట్లు" చేర్చదగు నొకింత చెత్త అంటూ "మూడు యాభైలు పంచ పదులు" రాసిన శ్రీశ్రీ 'మరో ఝంఝు'ను మాత్రం కాలక్షేపానికిగాక విప్లవ చైతన్యంతోనే రాశారు. 'శ్రీరమణ'గారు చెప్పినట్లు "యుగకలం ఆయన చేతిలో వుంది. అది కదిలినా కక్కినా అందమే."[11]

## సుబ్బారావు పాణిగ్రాహి - "కష్టజీవులం మేం కమ్యూనిస్టులం"

శ్రీకాకుళం జిల్లాలో గిరిజనుల పోరాటంలో పాల్గొని, తన పాటలతో జముకు కథలతో గిరిజనుల్లో రాజకీయ చైతన్యం కలిగించి, పోరాటం నడిపించి, పోరాటంలో మరణించిన విప్లవకవి శ్రీ సుబ్బారావు పాణిగ్రాహి. "పాణిగ్రాహి రచనల్లో రాజకీయాలకు, కళకు ఐక్యత సిద్ధించింది. విప్లవ రాజకీయ వస్తువుకు, కళానైపుణ్యానికి పాణిగ్రహణం చేసినవాడు పాణిగ్రాహి".

11. 'శ్రీసీ్క' - శ్రీరమణ. 'శ్రీరమణ పేరడీలు' - నవోదయ పబ్లిషర్స్ విజయవాడ -

"ఎరుపంటె కొందరికి భయం భయం
పసిపిల్లలు వారికన్న నయం నయం"

అని తన క్రియాశీల రాజకీయ సిద్ధాంతాల ప్రచారంలో తేలికైన మాటలతో పాటలు కట్టి, ప్రజలకు ఉత్సాహం కల్పించారు. భారత స్వాతంత్ర్య పోరాటంలో, తెలంగాణ విముక్తి పోరాటంలో ప్రజలను చైతన్యవంతుల్ని చేసిన కవులవలె సుబ్బారావు పాణిగ్రాహి కూడ ప్రజా కవి. వారికీ పాణిగ్రాహి గారికీ ప్రధానమైన భేదం- వారనుభవించినట్లు కష్టాలు అనుభవించటమే గాక ప్రజా పోరాటంలో తన ప్రాణాన్నే అర్పించిన కవి శ్రీ పాణిగ్రాహి.

"కష్టజీవులం మేము కమ్యూనిస్టులం
ఔనన్నా కాదన్నా అదే యిష్టులం"

అని తన పార్టీ సభ్యులకు 'మార్చింగ్‌సాంగ్' వంటి ఉత్తేజకర మైన గీతాన్ని ప్రసాదించారు. "యమయాతనలుదాటి/సుఖమనుభవించి/మాకున్న లేకున్న/ముందుతరమైనాను" అని కోరుకున్న పాణిగ్రాహి గారు సుఖాన్ని చవిచూడకుండానే ముందుతరం సౌఖ్యం కోసం ఆత్మ త్యాగం చేశారు. విప్లవ పోరాటాల్లో దేశమూ, జాతీయత అనే హద్దులు కూడ తగవని శ్రీ పాణిగ్రాహి అభిప్రాయం. "ఒక దేశపు ఆవేశం/ఒకదానికి ఆశయం" కావాలని ప్రపంచంలో కష్టజీవులంతా సుఖపడాలని కోరుకుని, తన పాటలతో పోరాటమార్గాన్ని తీర్చిదిద్దారు.

క్రిష్టఫర్ కాడ్వెల్‌వలె సాహిత్యానికి, పోరాటానికి భేదం లేదని తలచి, నమ్మిన విశ్వాసానికి అంకితమై, ప్రాణాలున్నంతవరకూ పోరాడిన అమరవీరుడు ప్రజాకవి శ్రీ సుబ్బారావు పాణిగ్రాహి.

### శివుడు - 'నరుడో భాస్కరుడా'

'శివుడు, శివసాగర్, రెంజిమ్' మొదలైన కలంపేర్లతో కవిత్వం రచించిన శ్రీ కె.జి. సత్యమూర్తి విప్లవకవితాయుగంలో తేజస్వంతుడైన కవి. 'నరుడో భాస్కరుడా' అనేపాటతో ప్రసిద్ధుడైన యీ కవి ఒకకొత్త

మార్గానికి వరవడి పెట్టారు. అభ్యుదయ కవులు జానపదుల పాటల్ని తీసుకొని ప్రగతిశీల భావాన్ని ప్రచారం చేసినట్లుగా, 'శివుడు' ప్రజల్లో బాగా ప్రచారమై వారిరక్తంలో ఇంకి పోయిన జానపదరీతుల్ని గ్రహించి విప్లవ భావాలను ప్రచారం చేశారు. ఈయన స్వయంగా పోరాటాల్లో పాల్గొని, శ్రీకాకుళం మొదలైన ప్రదేశాల్లో ప్రజలజీవితాన్ని, అడవుల్లో గిరిజనుల బ్రతుకు బాధల్ని ప్రత్యక్షంగా చూచి తెలుసుకొని రాసిన కవి.

"నాచెల్లీ చెంద్రమ్మా!" అనే వీరి కథాగేయం. కరుణరసంతో నిండి గురజాడ వారిపూర్ణమ్మ కథవలె కంట తడిపెట్టిస్తుంది. "ఆచూకీ తెలిపితే బహుమతి" అనేది ప్రభుత్వం విప్లవవీరుల ఆచోకి తెలుపమని చేసే ప్రకటనపై శక్తిమంతమైన వ్యంగ్యరచన. 'అమ్మా' అనే గీతంలో కుమారుని సమాధివద్ద శోకించే తల్లితో కవి"ఆసమాధిలో నువుపెంచిన/ నీకోసం పోరాడిన కొడుకులేడు / అప్పుడే అతడు ఒళ్ళువిరుచుకొని/ సమాధినుండి లేచి/ఆయుధం చేతపట్టి/తిరిగి రణరంగం చేరినాడు" అని చెప్పి ఆమె కన్నీరు తుడిచి, ధైర్యం చెప్పారు.

"శత్రువుల చేతికి చిక్కి జైల్లో మగ్గుతున్న వీరుడు కిటికీలోంచి చంద్రుణ్ణి చూచి" శత్రు చేజిక్కితినని / వెక్కిరించకునన్ను / మిత్ర ద్రోహము చేత శత్రు చేజిక్కితినే / చందమామా / చందమామా!" అని ఖైదీ ఆలపించే గీతంలో కరుణ రసార్ద్రంగా వీరుని మనస్థితిని వర్ణించారు.

జానపదశైలిలో-

"మేరిమి కొండల్లో మెరిసింది మేఘము
ఉద్దమాల కొండల్లో ఉరిమింది మేఘము
కురుపమ కొండల్లో కురిసింది వర్షము
సంగమొలసా కొండల్లో సాగింది వర్షము
ఏరుమీదే ఏరొచ్చెరా! ఓ జాలరన్నా !
ఏరు ఎచ్చుగా పారెరా ! ఓ జాలరన్నా !
మెండు చీకటి కమ్మెరా"

అని వర్ణించి పోరాటంలో బలి అయిపోయిన అన్నదమ్ముల్ని తుఫానులో కన్పించకుండ పోయిన వారితో పోల్చి–''మొనగాడుతమ్ముణ్ణి మొసలిమింగేసినా / ఎదిగిన తమ్ముణ్ణి ఏరుకాటేసినా / గుండెజారిన దండుగంగాకు మొక్కినా / పల్లెకారుల్లోన కల్లోలంపుట్టినా / గుండెల్లో ఆశ–ఎఱ్ఱజెండాగా ఎగరాలి'' అని ముందుగా, తన భావాల్ని చక్కగా ధ్యానించి, తర్వాత తన ఉద్దేశ్యాన్ని స్పష్టంగా చెప్పేశారు. ''ఏటికెదురీదు వాళ్ళమురా!'' అనే పాటలో 'శివుడు' రాసిన పాటలన్నీ వొక ఎత్తు.

''బర్రెంక సెట్టుక్రింద నరుడో! భాస్కరుడా!
బందూకు పట్టివయ్య నరుడో! భాస్కరుడా!
బందూకు సేతపట్టి నరుడో! భాస్కరుడా!
ఇంధాలు తెంచితివయ్యా నరుడో! భాస్కరుడా!''

అని తెలంగాణ జనపదాన్ని అనుసరించి, విప్లవవీరుడు చాగంటి భాస్కరరావుపై రాసిన యీగీతం విప్లవ కవితలో విశేషమైనది.

''అలలపైన నిఘా/అలలు కనే కలలపైన/నిఘా/అలలపై అను రాగం చూపించే చిరుగాలి సితారా సంగీతంపై నిఘా'' అని స్వేచ్ఛ కొరవడిన సమాజంలో మనిషి బ్రతుకు బానిస బ్రతుకుకంటె హీనమని వీరు రాసిన పాట ఆలోచనాప్రేరకమైనది.

నరుడో భాస్కరుడా! పాటను తలపించే మరోపాట 'తోట రాముని పాట'.

''తోట రాముడంటె మిత్రులకు ప్రాణము/శత్రువుపై బాణము
తోట రాముడు మంది ఒరలోని ఖడ్గము
తోట రాముడు పల్లెచేతిలో బల్లెము
తోట రాముడు అడవి గుండెలో గీతము

కల్లాకపటము లేదురా! ఓ విలుకాడ
అతనివల్లా నేరమేమిరా?''

అని సుదీర్ఘంగా సాగే యీ పాట జానపదులు పాడుకునే చిన్నపరెడ్డి పాట వంటిదే. కాని 'శివసాగర్' రాసిన తోటరాముని పాటలో కవి చెప్పదలచుకున్న విప్లవ భావాలను అందంగా, ధ్వని పూర్వకంగా వచ్చేలా కవిత్వకళ మెరిసేలాగున చెప్పారు. తోటరామునికి గాయం తగిలితే అడవి జంతువులన్నీ కన్నీరు కార్చాయని, పూలన్నీ వాడిపోయాయని- మళ్ళీ తోటరాముడు కోలుకోగానే "అడవి అడవి నవ్వేరా! పల్లెమల్లెలు పూచెరా!" అని ఉత్సాహాన్ని పొదిగి యీ గీతాన్ని రక్తి కట్టించారు. చిలక, కరోజు, లేడి, నల్లపిట్ట, గోగురిచ్చు, పైడికంటి వంటి పక్షులు తోటరామునితో కలిసిమెలిసీ బాధనూ, ఆనం దాన్ని పంచుకున్నట్లు వర్ణించారు. ప్రబంధాల్లో కవీ, సహృదయులూ చూడని పక్షుల పేర్ల జాబితావలెగాక యీ పాటలో అడవులు చూచి తెలుసుకుని రాయటంవల్ల యిది ప్రజాకవిత్వమైంది.

విప్లవ కవిత్వాన్ని పాటలద్వారా ప్రజలకు అతి సన్నిహితంగా తీసుకొనివచ్చి, విప్లవం తీసుకురావలసిన అట్టడుగువర్గాల ప్రజలకు రాజకీయ చైతన్యం కలుగజేసిన 'శివుడు' కవిగా త్రినేత్రుడు. అధర్మంపై ఆయన తెరిచిన మూడవ నేత్రమే ఆయన కవిత్వం.

## చెరబండరాజు - "ఇంటింట చీకటే, ప్రతికంట కన్నీరే"

ఆధునిక కవులలో అత్యంత ప్రతిభావంతుడు, వచన కవిత్వము, పాటలలో సవ్యసాచి శ్రీ చెరబండరాజు. దిగంబరకవిగా ఆయన 'దిక్'లు వెలువరిస్తున్నప్పుడు "నన్నెక్క నివ్వండి బోను; వందేమాతరమ్; ఆకాశం వెక్కి వెక్కి ఏడుస్తోంది; జగద్గురువులొస్తున్నారు జాగ్రత్త"రచన లతో రసజ్ఞుల హృదయాల్ని చూరగొన్నకవి. విప్లవకవిగా పరిణామం పొందాక జైలుశిక్ష అనుభవించినా, ఉద్యోగంనుండి కొన్నాళ్లు తొలగింప బడినా, భయంకరవ్యాధి పీడిస్తున్నా మొక్కవోని ధైర్యంతో భవి ష్యత్తుపై అచంచల విశ్వాసంతో కలాన్ని ఝళిపిస్తున్న మేటి విప్లవకవి శ్రీ చెరబండరాజు. ఈ దశాబ్దంలో వికసించిన ప్రజ్ఞావంతులైన కవులలో ఆయన ఉత్తమ శ్రేణిలో లెక్కించదగిన వారు.

"దిక్సూచి; ముట్టడి; గమ్యం; కాంతి యుద్ధం; గౌరమ్మ కలలు; జన్మహక్కు; పల్లవి" కావ్య సంపుటులను చదివి సహృదయులు ఎంతో మెచ్చారు. వీరి రాజకీయాభిప్రాయాలతో ఏకీభవించనివారు కూడ వీరి కవిత్వాన్ని, కవిత్వశిల్పాన్ని కొనియాడారు.

'అశోక చిహ్నం' గీతంలో "రేగేదుక్కి దుమ్ములో పులుకు పులుకున ఇల్లాలి కనుగుడ్లకేసి చూస్తూ / గంజితాగే రైతుకూలీ / ఉరకలు వేసే నీ యువరక్తం / ఏ నరరాక్షసి పీల్చేశాడూ" అని జాలిగా అడిగి "చెప్పులు, గొంగడి / ఏడాదికి ఒకజతగుడ్డలు దొరికే ఆశకు / అయిదు మానికెల నెలజీతానికి ఏడేండ్లయినా నిండని బిడ్డని / కుదవేశా వెందుకు కూలీ" అని బాధగా ప్రశ్నించి "ఎముకలు కొరికే చలిలో గజగజ/ వొణుకుతు పోయీ వారాలగట్లను తీసే / మళ్ళించిన నీళ్ళల్లో / నీరక్తం ప్రవహిస్తోందని / కూలీ!నీభవితవ్యం బురదవుతోందని / నీతలిదండ్రులు చెప్పలేకనే / నీవూ నీ బిడ్డలు ఆహుతి అవుతా!" అని వారిని చైతన్యవంతుల్ని చెయ్యటానికి ప్రయత్నించారు. వచన గీతాలు సాధారణంగా పామరులకు సులభంగా అర్థంకావు. కాని చెరబండరాజుగారి గీతాలు సభల్లో గొంతెత్తి చదివి వినిపిస్తే, ఎందరో పామరులు ఆపాటల్లో తమ బ్రతుకు స్థితిగతుల్ని అర్థం చేసుకొని, కవి చెప్పిన పరిష్కారం సరియైనదని ఆనందం పొందారు. "యుద్ధం మానీ బౌద్ధం పుచ్చుకు/ధర్మప్రబోధం చేసిన రాజూ/కళింగరాజ్యం / కడకయినా ఇచ్చేశాడా!" అని గడుసుగా ప్రశ్నించి, ఆ అశోకచిహ్నం కింద మనం ధర్మపరిపాలనలో వున్నామా?" అని ప్రశ్నిస్తారు. ఈ భావం పామరులకు అందకపోయినా విద్యాధికుల్ని మాత్రం ఆలోచింప జేస్తుంది.

"పొద్దుపొడుపు కిరణంతో లేచి / పట్టెడన్నం పెట్టమ్మా అంటూ/ పొట్టచేత బట్టుకొని వచ్చే / లక్షలాది భిక్షుకుల మస్తిష్కాల్లో / నాదేశం పేరేమిటి/నా పెదాలు చెప్పేదేమిటి?" అని తనభావాల 'ముట్టడి'లో హృదయాన్ని కైవసం చేసుకొని కవి ఆలోచనాపరులకు కర్తవ్యబోధ చేశారు.

"గడ్డిపోచలు గర్జించాలి; విప్లవ గ్రామం; పునర్జన్మ" మొదలైన గీతాలు ఏ కవితా ప్రమాణాలతో చూచినా ఉత్తమ కావ్యాలుగా ఎన్న దగినవి.

'నరుడో భాస్కరుడా!' పాటతో విప్లవ కవులలో పెద్ద మార్పు వచ్చింది. రైతులు, కూలీలు, గిరిజనులు, ఇంకా వివిధ వృత్తులతో జీవించే శ్రామికులు, చైతన్యవంతులు కావాలంటే పాటకుమించిన ప్రచార సాధనం లేదని విప్లవకవులు గుర్తించారు. 'శివుడు, చెరబండ రాజు, గద్దర్, వంగపండు ప్రసాదరావుగారల పాటలు తెలుగుదేశం నాలుగు మూలలా వ్యాపించాయి. కవిత్వపరంగా చూచినప్పుడు శివుడు, చెరబండరాజు పాటలు మేలైనవిగా తలచవచ్చు.

"కొలిమంటుకున్నాది / తిత్తినిండా గాలి / పొత్తంగ వున్నాది / నిప్పారి పోనీకు రామన్నా/పొద్దెక్కి పోనీకు- లేవన్నా.... ఉత్తరా నురిమింది/రోజు మొగులవుతూంది/ఎర్రమెరుపూ సూడు- రామన్నా / కర్రుపారాసాన- బెట్టన్నా" అని వివిధ వృత్తుల శ్రామికుల్ని సంబో ధించి రాసిన చెరబండరాజు పాటలు పామరుల్నేగాక విద్యాధికులను గూడ అపరిమితంగా అలరించాయి. 'పోలీసు'ను సంబోధించి మాలోని మనిషివే, మా మనిషివే నీవు/పొట్టకూటికి నీవు పోలీసువైనావు" అని పోలీసులపై జాలికలిగించి, 'కానిస్టేబుల్స్' కూడ శ్రామికుల్లో భాగమేనని తెలియ జెప్పిన విశాల హృదయుడు యీకవి. "కర్రూ, నాగలి, పారాపట్టండి/ ఎత్తిన గునపాలు దించకండి" (మరణానికి మారుపేరు) అని ఆయుధాలు ధరించిన శ్రామికులను ఆయుధాలను వర్గశత్రువుపై ప్రయోగించ మన్నారు.

"ఇంటింట చీకటే, ప్రతికంట కన్నీరె/రాజ్యమెవరికి వచ్చెనో- రాజన్న సుఖము లెవరికి దక్కెనో"- శ్రమవొకరిదీ ఫలిత మింకొకరిదీ అయిన యీ బ్రతుకు ఇంకెన్నాళ్ల యీ విధంగా సాగుతుంది? పోరాడితేనే శ్రమ జీవులకు ఫలితం దక్కుతుందని గుర్తించమన్నారు.

నేను భారత విప్లవాన్ని; ఏకులమబ్బీ మాదే మత మబ్బీ": "మారలేదన్నా" అనే పాటలూ 'ఊరు మేలుకుంది; గౌరమ్మకలలు; కాంతి యుద్ధం" కథాకావ్యాలూ చెరబండరాజు కవిత్వాన్ని చిరస్మరణీయంగా నిలుపుతాయి. యువకవులు చాలమంది చెరబండరాజును ఆదర్శంగా కవిత లల్లుతున్నారు. కాని వారెవ్వరూ చెరబండరాజును మరపించలేరు. ఒక విలక్షణమైన శైలితో, ఊపిరి నింపిన తీవ్ర బాధాజనితమైన ఆర్తితో వెలువడుతున్న చెరబండరాజు కవిత అనితరసాధ్యమనిపిస్తున్నది.

## నగ్నముని - 'తూర్పుగాలి' -
## "ప్రతి తల్లి ఒక సూర్యుణ్ణి ప్రసవిస్తే చాలు"

'కేశవరావ్' పేరుతో 'ఉదయించని ఉదయాలు' రచించి తిరుగు బాటుదార్లపై తిరుగుబాటు ప్రకటించి, వచన కవితలో కవితా శిల్ప రహస్యాల్ని ఆకళించుకున్న కవి శ్రీ 'నగ్నముని'. దిగంబర కవితోద్యమంలో ప్రముఖపాత్ర వహించి సంప్రదాయవాదుల విశ్వాసాల్ని, కాళ్ళ కింది భూమిని తొలిచేసి సంచలనం సృష్టించిన కవి ఈయన. విప్లవ కవిగా పరిణమించాక, కవిత్వాన్ని నినాదాల స్థాయికి దిగజారనీక, కవితా విలువల్ని పరిరక్షించుకొన్నకవి. ఆదినుండి కవితామార్గంలో వీరికి ఆదర్శ ప్రాయులైన 'అజంతా'వలె శబ్ద సంగీతము, శబ్దం యొక్క రంగురుచి, వాసనా తెలిసినకవి. కవితా శిల్పంలో మహాకవులు కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ గారల మెప్పుపొందిన కవి. 'తూర్పు గాలి' సంకలనంలో కవిత్వం కాని పంక్తి లేదనటం అతిశయోక్తికాదు.

శ్రీ నగ్నముని కవిత్వంలో ఉపయోగించిన భాష ప్రజలకు సన్నిహితమైనదే. ఏ శబ్దాన్నీ మరొక శబ్దంతో మార్చిచెప్పటానికివీల్లేని అరుదైన కవితాశిల్పం వీరికవితల్లో కన్పిస్తుంది. 'పాలు ఎర్రబడ్డాయి' అనే వచనగీతం కథారూపంలో వున్నది, వీరి కవితల్లో కరుణరసానికి పరాకాష్ఠ అనదగినది. ఈ గీతం చదివి సహృదయులు చలించకుండ వుండటం అసంభవం. వొళ్ళమ్ముకుని జీవించేస్త్రీకి పుట్టినబిడ్డ, ఒక నాటి జ్ఞాపకం ఇందులో విషయం. ఏ ఘరానా రాక్షసుడో ఆస్త్రీనిబాధిస్తే-ఆమె

చనుమొన కొరికేస్తే - అది తెలియని పసివాడు "పాలు నోటినిండా చిమ్మి కడుపుని నింపుతాయని" అమ్మ వక్షంలోకి తలదూర్చి పాలు తాగబోతే "అమ్మ కళ్ళ నిండానీళ్ళు / నాచేతుల్నిండా / మూతినిండా రక్తం / అప్పుడే తెలుసు కున్నాను / నా వంటి వాళ్ళ అమ్మలపాలు/ తెల్లగాకాదు ఎర్రగా వుంటాయని" అని పలవించే కవి ఆర్తి ఎటువంటి కటికి గుండెనైనా కరిగిస్తుంది.

"జీవితాన్ని చూచి కవిత్వం రాయమని హెచ్చరిస్తూ "కవీ! గాలిని గురించీ రాయి / గాలిని మాత్రం నీ గీతాల్లో నింపకు" అని వర్గ సమాజంలో అన్ని సౌఖ్యాలు, - డబ్బున్న వాళ్ళకే దక్కుతాయని రాయ మంటారు.

'ప్రజల పత్రికలేకాదు
తెల్లకాగితమూ నవ్వుతుంది హేళనగా
మనం పందులమీద పంచరత్నాలు రాస్తున్నప్పుడు
ప్రభుత్వ జనవ్యతిరేక కార్యాల్ని కీర్తిస్తున్నప్పుడు"

అని 'ప్రజాద్రోహి' గీతంలో కవులబాధ్యత గురించి వ్యంగ్యంగా హెచ్చరించారు,

"సముద్రం; రుతువు: సమాధులు, పూలు, దీపాలు, త్యాగాలు, దణ్ణాలు, 'కళ్లు: వేదాంతి' ఫర్వాలేదు; ప్రవేశించకు; దేశభక్తి" గీతాల్లో ఉత్తమ కవిత్వం అందించిన శ్రీ నగ్నముని శ్రీశ్రీగారు చెప్పినట్లు "One of our finest masters of the prose - poem" అని భావించవచ్చు.[12]

## 'కొయ్య గుర్రం'

1977 నవంబర్లో కోస్తా ఆంధ్రలో సంభవించిన పెనుతుఫాను భీభత్సం ఆ ప్రాంతపు ప్రజలకు తీవ్ర నష్టాన్ని కలిగించింది. ప్రకృతి

12. 'తూర్పుగాలికి స్వాగతం' - శ్రీశ్రీ - 'తూర్పుగాలి' కావ్యానికి ముందు మాట - విముక్తి ప్రచురణ - 1972.

వైపరీత్యానికి గురైన ప్రజల దుర్భర వేదనకు కవులు బాధతో పలవరించి కావ్యాలు రాశారు. వారిలో ఎక్కువ మంది ప్రకృతి భీభత్సాన్ని, మనుష్యుల నిస్సహాయత్వాన్ని, నోరులేని పశువుల గోడును వర్ణించారు. కొద్దిమంది కవులు తుఫాను గురించి ముందుగా హెచ్చరించి ప్రజలను కాపాడలేదని ప్రభుత్వాన్ని విమర్శించారు. కాని తుఫానును ఒక సంకేతంగా తీసుకొని యీ వ్యవస్థ ప్రభుత్వమూ 'కొయ్యగుర్రం' వంటిదనీ, దీని పాదాల కిందపడి నలుగుతున్న ప్రజలు దీన్ని తగలబెట్టందే దేశానికి విముక్తిలేదని హెచ్చరిస్తూ శ్రీ నగ్నముని 'కొయ్య గుర్రం' కావ్యాన్ని రచించారు. కావ్యం మరీ సాంకేతికంగా, క్లిష్టమైన కవితా శిల్పమర్యాదలతో వుండటాన, సామాన్య పాఠకులకీ కొయ్యగుర్రం కొరకరాని కొయ్య అయింది. ముఖ్యంగా తుఫానులో తల్లడిల్లిపోయిన ప్రజలకు యీ కావ్యంలో కవి దేన్ని గురించి చెప్తున్నారో సరిగా బోధపడదు కూడ.

"తపస్సు చేయడానికి వెళ్ళవలసింది హిమాలయాల్లోకి కాదు, జనంలోకి"- ఇటువంటి పదునైన భావాలు మాత్రం పఠితను ఆకర్షిస్తాయి. "ఒకప్పుడిక్కడో వూరు వుండేది/ఒకప్పుడు ఇక్కడి గాలినిండా, నేలనిండా / ఆకాశం నిండా మనుషుల పాటలు / మాటలు, వూర్పులు, వోదార్పులు, నవ్వులు, నిట్టూర్పులు/కలకలం కలగానం కనబడేవి వినబడేవి/చెట్ల ఆకులు పచ్చగా గాలిలో ఈదేవి/పక్షుల బారులు కొంటెగా పళ్ళ కొరికి/గుసగుసలు పోయేవి" మొదలైన వర్ణనలు శ్రీ నగ్నముని ప్రతిభను వెల్లడిస్తాయి.

"సిద్ధార్థుణ్ణి రాజ్యం పొలిమేరవరకూ చేరవేసి అశ్రునయనాలతో తిరిగివచ్చిన అశ్వం నాగార్జునకొండలో యింకా నిలబడే వుంది. మానవుడి మనస్సులో మాత్రం మహాబోధి ఎప్పుడో కూలిపోయింది" అనే కవి ఊహ అద్భుతమైనది. ఈ వ్యవస్థలో మనిషి మనస్సులో కరుణ అంతరించిపోయిందని కవి ధ్వనించారు. అంతులేని సాంకేతిక జ్ఞానం మనిషిలో కరుణను పెంపొందించటం లేదన్నారు. కొయ్యగుర్రం వంటి వ్యవస్థను నాశనం చెయ్యాలని బోధించారు.

శ్రీ నగ్నముని 'విప్లవ రచయితల సంఘం' అభిప్రాయాలతో భేదించి, ఆ సంఘానికి రాజీనామా ఇచ్చారు. ''సకల విలువలను విధ్వంసం చేసే కవిత'' కావాలని కోరుతున్నారు. ఎదురుచూచిన విప్లవం దీర్ఘ కాలిక పోరాటమని విస్మరించి, అరాచకవాదిగా అస్తవ్యస్తమైన ఊహ లతో వైయక్తికమైన వింత ఊహాలే కవిత్వమని తలుస్తున్నారు.

శివారెడ్డి - 'నేత్రధనుస్సు' -
''మంటలేని ఆ దుఃఖమెందుకు కళ్ళనిండా''

విప్లవ రచయితల సంఘం సభ్యుడు కాకపోయినా విప్లవ భావా లతో కవిత్వం రాస్తున్న ప్రజ్ఞావంతుడైన కవి శ్రీ కె. శివారెడ్డి. ''రక్తం సూర్యుడు; చర్య; ఆసుపత్రి గీతం; నేత్రధనుస్సు'' కావ్యాల ద్వారా ఉత్తమ కవితను అందించిన కవి శ్రీ శివారెడ్డి. ఈ తరం కవుల్లో యీయన గొంతు విలక్షణమైనది; శక్తిమంతమైనదిన్నూ. చెప్పదలచు కున్న భావాన్ని నంగిరిపింగిరి మాటల్తో నాన్చకుండ కంఠం చీల్చుకుని వచ్చి గుండెల్లో గుచ్చుకునేలాగ చెప్పగల కవి యీయన. కవితా శిల్పాన్ని విడిచిపెట్టకుండానే తీవ్రమైన పదజాలాన్ని అతి వాడుపుగా, కవితగా మలచగల నేర్పరి. వీరి సంపాదకత్వంలో 'వేకువ' అనే పత్రిక ఆధునిక సాహిత్య వేదికగా కొంత కాలం నడిచింది.

వజ్రగీతం (నేత్రధనుస్సు) యీకవి కవితా రహస్యాన్ని చక్కగా వెల్లడిస్తుంది, ''కళ్ళు దృశ్యాన్ని వడకట్టినట్టు/వూపిర్ని కూడా వడబోసు కోవాలి..../ వెలుగువేళ్ళకి ఎక్కడన్నా / చీకటి మరక ఉన్నాయేమో చూచుకోవాలి / శబ్దాన్ని కూడ పుటంపెట్టి పరీక్షించు కోవాలి'' అని చెప్పిన కవి విప్లవఆవేశంలో శబ్దశక్తిని మరచిపోక, కవిత్వాన్ని తపోనిష్ఠతో రచించటం చెప్పుకోవలసిన విశేషం.

రక్తము, చీకటి, సూర్యుడు వంటి అరిగి పోయిన శబ్దాలతో స్పందింప జేయటం అసాధ్యమని 'రక్తం సూర్యుడు' తర్వాత గ్రహించి

లోక పరిశీలన తర్వాత కవిగా చేవదేలారు. ఎన్నేళ్ళు గడిచినా పేదల బ్రతుకు మారక పోవటాన్ని "తరం మారినా" గీతంలో-

"ఆగేటు పక్క / బెరుకు బెరుగ్గా - బెదురుగా / నిలబడ్డాడు- మూడేళ్ళవాడు / లోన వాళ్ళమ్మ బాసాన్‌లు తోముతుంది / బయట వాళ్ళయ్య / ఏడరాళ్ళు గొడుతున్నాడో / వాళ్ళయ్యకి కూడా / అదే వయసులో అలానే / ఈగేటు పక్క కాకపోతే / మరో గేటు ప్రక్క నిలబడే వున్నాడు" అని జీవిత దృశ్యాల్ని కళ్ళకు కట్టించిన యీ కవికి భవిష్యత్తు ఉజ్జ్వలంగా వుంటుందనటంలో సందేహంలేదు.

శ్రీ శివారెడ్డి ఇంకా "నా అక్షరం; శిక్ష; రాత్రి మిగిలిన కూడు; ధ్వని; పాదాలు; ఆకన్నీళ్ళునావే; దినదినగండం నూరేళ్ళాయుష్షు"గీతాల్లో జీవిత దృశ్యాలను యథార్థంగా, కళాత్మకంగా చిత్రించారు. ఈయన రచనల్లో 'ఆసుపత్రిగీతం' విలక్షణమయినది. ప్రభుత్వ ఆసుపత్రిలో రోగులస్థితీ, అక్కడి పరిస్థితులు వాస్తవికత వుట్టిపడేటట్లు కావ్యకళ ఏ మాత్రం తగ్గిపోకుండ రచించారు.

'కవిత్వం' అనే గీతంలో శ్రీ శివారెడ్డి 'కుకవి'ని-

"భ్రష్టుడు శబ్దంలో కూడా వ్యభిచరిస్తున్నాడు
మంటలేని ఆ దుఃఖమెందుకు కళ్ళనిండా
కర్రకాళ్ళ కదిలినట్లు శబ్దాన్ని మాత్రమే
మోయించుకుంటూ వెడతాడు తప్ప
స్పర్శతో భూమి గుండెని మేల్కొల్పటం లేదు"

అని నిందించారు. జీవంగల శబ్దాలతో భూమిగుండెని మేల్కొల్పి బాధాసర్పదష్టులైన దీనుల జీవితాలను గురించి రచించిన శివారెడ్డిగారి కవిత్వం సహృదయులు మళ్ళీమళ్ళీ చదివి ఆనందించగలరు.

## విప్లవగేయ ప్రస్థానం గద్దర్ - 'లాల్‌సలామ్'

ప్రజల నాడి గుర్తించి, వర్గపోరాట స్వభావం తెలిసి, స్వయంగా పాటలు కట్టి, పాడి, విన్పించి ఉత్తేజపరుస్తున్న కళాకారుడు శ్రీ గద్దర్.

ఆయన పాటల్లో ఝటితిస్ఫూర్తి వున్నది. కవిత్వపు లోతులకంటె ప్రజల మనస్సుల్ని నాలుకల్ని పట్టుకునే లయ వుంది. ఆ పాటలు కార్చిచ్చులాగా పట్టణాల్లో పల్లెల్లో వ్యాపించాయి. ఆ పాటల్లో భావాల వేడిని గుర్తించిన ప్రజలు మాత్రం తక్కువే. తన ఆశయసిద్ధి కోసం దేశమంతా తిరిగి పాటలతో విప్లవ భావాలను ప్రచారం చేస్తున్న కవి గాయకుడు శ్రీ గద్దర్. విద్య, విజ్ఞానాల్లో ఒకప్పుడు బాగా వెనకబడ్డ ప్రాంతం తెలంగాణ. ఇప్పుడిప్పుడే అన్నివిధాల అభివృద్ధి సాధిస్తున్నది. ప్రజలపై జులుం చూపించే అధికారుల్ని బెదిరించే పాటలు- ప్రజల పాటల రీతుల్లోంచే పట్టుకుని, కొత్తవి రచించి ప్రచారం చెయ్యడం శ్రీ గద్దర్ ప్రత్యేకత. "ఓరోరి అమీనోడా/ఓరోరి సర్కారోడ! పదిలంగ ఉండు కొడకో! కదిలింది ఎర్రదండు" అనే పాట వినగానే ప్రజలు ఉత్సాహభరితులై గాయకునితో గొంతు కలుపుతారు. కాలం గడిచినకొద్దీ గాని కవి ఉద్దేశించిన భావం ప్రజల మనస్సుకెక్కదు.

"అద్దమోలె మెరిసెటట్టు/నీ బూట్లు తుడిసినోల్లు/గంజిలో బట్ట లుతికి/కడకిస్త్రీ జేసినోల్లు/నీ కాల్ల గోల్లుదీసి/గడ్డాలు జేసినోల్లు/సెయ్యంత నూనెరాసి/మాలీసు చేసినోల్లు/పిడికిండ్లు ఎత్తినారు/పందేసి తొక్కుతారు" అని అభినయపూర్వకంగా గద్దర్ పాడుతున్నప్పుడు విన్నవాళ్ళు ఆయన శక్తిని కొనియాడకుండ వుండలేరు.

శ్రీ గద్దర్ రచించిన 'రాజకీయ వీధి భాగోతం' విస్తృత ప్రచారం పొందిన రూపకం. విప్లవ సాహిత్య ప్రచారంలో ప్రాముఖ్యం వహించవలసిన ప్రక్రియ నాటకం. తెలుగులో విరసం వారుగాని, మరెవ్వరూగాని చెప్పుకోదగిన విప్లవ భావాలుగల నాటకాన్ని రాయలేదు. గద్దర్ 'రాజకీయ వీధిభాగోతం' వంటివి నాటకాలులేని కొరతను కొద్దిగా తీర్చాయి.

"వోలీ వోలీలరంగ వోలీ; లాల్‌సలామ్; కూలోల్లపిల్లా; కరువు పాట" మొదలైనవి విద్యార్థులను, గ్రామీణ యువకులను, పండిత పామరులందరినీ ఉత్తేజపరుస్తున్నవి. ఈ గీతాలను లలిత సంగీతపు

పాటలవలె శ్రావ్యంగా ఆలకించి, ఆనందించటం గాక ప్రజలు ఆలోచించి నప్పుడే గద్దర్‌గారు ఉద్దేశించిన ప్రయోజనం నెరవేరుతుంది.

## వంగపండు - 'పూటబత్తెం పుల్లలెలుగన్నా'

తూర్పు యాసతో - విశాఖ, శ్రీకాకుళం మాండలికాల్లో పాటలు రాసి, పాడి విప్లవ భావప్రచారం చేస్తున్న కళాకారుడు శ్రీ వంగపండు ప్రసాదరావు. 'ఏరువాక; పొలికేక' సంపుటాల్లో పాటలను ప్రజాకళా రూపాల్ని ప్రచారం చేసే సాంస్కృతిక దళాలు బాగా ఉపయోగించు కుంటున్నారు. శ్రీ ప్రసాదరావు పాటలు "తీగెలోకి విద్యుచ్ఛక్తి ప్రవహించినట్లు జనంలోకి ప్రవహిస్తున్నా"యని సుప్రసిద్ధ రచయిత శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి ప్రశంసించారు. మాండలిక భేదాన్ని పట్టించుకోక వీరిపాటలను ఆంధ్రప్రదేశ్‌లో అన్ని ప్రాంతాలవారు ఆనందిస్తున్నారు. ఆదరిస్తున్నారు.

ఏం పిల్లో ఎల్దమొత్తవా
శ్రీకాకుళములో - సీ(వకొండకీ
సిలకలు కత్తులు - దులుపరిత్తయట
ఏం పిల్లో ఎల్ద మొత్తవా"

అని విప్లవ భావాలను ప్రజల వాడుకలో వున్న పల్లవులలో పొదిగిన వంగపండువారి కృషి మెచ్చదగినది.

"పూటబత్తెం పుల్లలెలుగన్నా
పేదోల్ల బతుకూ- రోజురోజుకు బాధలేనమ్మా?"

అని కరుణామయంగా గానంచేసే వీరి పాటలు విని ప్రజలు తమ దుస్థితికి కారణాలను అన్వేషించినప్పుడు యీ కవి కృషి సార్థకమౌతుంది.

మాలపేటను వర్ణిస్తూ "వుందర్రా మాలపేటా! ఆ వూరు సివర! కాష్టాలు వున్నసోటా!" అని కవి వాస్తవమే చెప్పి ఉద్రేకం కలిగిస్తున్నారంటే అది పాటలోని శక్తివల్లనే అనుకోవాలి. "యెంత్రం;

గిరిజనుడా; రైతుకూలి కోలాటం''; మొదలైనవి ఇప్పటికీ బాగా ప్రచారం పొంది జనుల నోళ్ళలో నానుతున్నాయి.

## రమణారెడ్డి - ఎర్రపిడికిలి; జైలుకోకిల

కె. వి. రమణారెడ్డి విప్లవ కవులలో ప్రముఖులు - 'అత్యవసర పరిస్థితి'లో 'మీసా' కింద నిర్బంధింపబడినవీరు జైలు జీవితం గడుపుతూ తమమదిలో మెదిలిన తలపులను కవితలుగా 'జైలుకోకిల' వెలువరించారు. జైలు జీవితంలో ''మనస్సును చిక్కమట్టుకోడమే కష్టం, చిత్తవృత్తి ఈరోజున ఉన్నట్లు రేపు ఉండదు. అంచేతే ఇందులో కోపం, భూషణం, వ్యంగ్యం, అపహాస్యం, దుఃఖం కనిపిస్తూపోతాయి'' అని కవి స్వయంగా చెప్పుకున్నారు. 'విరసం' ఆవిర్భవించిన నాటినుండి బాధ్యత గల కవిగా, కార్యకర్తగా ఆయన కృషి చేశారు. ఆయన భావంలో గాంభీర్యం, కొన్ని చోట్ల క్లిష్టమనిపించి, సాఫీగా నడవదు. బరువైన సంస్కృత పదాలమధ్యలో నెల్లూరు మాండలికాలతో మణిప్రవాళంలాగ వింతగా తోస్తుంది. చిలీదేశపు మహాకవి 'పాబ్లో నెరూడా' మరణించినప్పుడు వీరు రాసిన స్మృతిగీతం విశిష్టమైనది.

## వరవరరావు 'జీవనాడి' - 'స్వేచ్ఛ'

''శిశిరోషస్సు; జీవనాడి'' కావ్యాలలో అభ్యుదయ భావాలను వెదజల్లిన శ్రీ వరవరరావు 'తిరుగబడు కవుల'లోచేరి విప్లవ యుగానికి దారితీసిన కవి. సృజన సంపాదకునిగా పది సంవత్సరాలకు పైగా విప్లవ సాహిత్యానికి ఆయన చేసిన సేవ విప్లవవాదులు విస్మరింపరానిది. భారతదేశంలో విప్లవం విజయవంతమవుతుందని, శ్రమజీవులకు న్యాయం జరుగుతుందని నమ్మి, తన చిత్తశుద్ధిని కావ్యాల్లో ప్రతిధ్వనింప చేస్తున్న కవి శ్రీ వరవరరావు. జైలు జీవితాన్ని అనుభవిస్తూ ఆయన రాసిన కావ్యఖండికలు 'స్వేచ్ఛ' సంకలనంలో వచ్చాయి. ''నాకిక్కడ సుఖంగా వున్నదా అని నువ్వడిగావు/ఈ విశాలదేశం కోట్లాది జనం గుండెల్లో/మబ్బులో దాగిన మెరుపులా వెలుగుతున్న / భవిష్యత్తు మీది ఆశ ఈ

సంకెళ్ళలో ధ్వనిస్తున్నది'' అని శ్రీ వరవరరావు తేలిక మాటల్లో ప్రసన్న మైన భావాన్ని ద్యోతకం చేస్తారు. విప్లవయుగంలో మరపురాని మంచి కవులలో శ్రీ వరవరరావు వొకరు.

## జ్వాలాముఖి 'ఓటమి తిరుగుబాటు'

దిగంబర కవిగా ప్రసిద్ధులైన 'జ్వాలాముఖి' కావ్యం 'ఓటమి తిరుగుబాటు' కవిగా ఆయన పరిణామక్రమాన్ని తెలిపే కావ్యం. కవితా శిల్పదృష్టితో చూచినప్పుడు ఆయన రచన రాజకీయోపన్యాసంలాగ వుంటుంది; విశేషమైన అందచందాల కోసం వెదికి ప్రయోజనంలేదు. విప్లవభావ ప్రచారానికి ఉద్దేశింపబడిన కావ్యోపన్యాసమే ఆయన కవిత. 'జనసాహితి' కవులలో ఆయన ప్రముఖులు.

## నిఖిలేశ్వర్ - 'మండుతున్న తరం'

శ్రీ నిఖిలేశ్వర్ రచన 'మండుతున్న తరం' దిగంబర కవిత్వం నుండి ఆయన విప్లవకవిగా పరిణామాన్ని పొందటాన్ని సూచిస్తుంది. విప్లవభావాలున్నప్పటికీ ఆయనలో కవితావేశం మరీ తక్కువ. వీరి వచన కవితల్లో వచన మనదగిన భాగమే ఎక్కువగా వుంటుంది. 'జన సాహితి' లో వీరు కూడ ప్రముఖ పాత్ర వహిస్తున్నారు.

## జయధీర్ తిరుమలరావు 'అరణ్యనేత్రం'

శ్రీ జయధీర్ తిరుమలరావు 'అరణ్యనేత్రం' విప్లవ భావాలకు కవితా స్వరూపమిచ్చిన కావ్యసంపుటి. ''ప్రతివాక్కు చేతగా బతికేవాడే కవి'' అని నమ్మిన తిరుమలరావుగారు 'జైహింద్' అనే గీతంలో ''ఇక్కడ ఇనుప ముక్కల బ్రిడ్జీలున్నాయి/బ్రిడ్జీల క్రింద నదులున్నాయి/ కాల్వల పంట పొలాల గుండెల్లో హాలాలున్నాయి / ఇక్కడ / కంద లున్నాయి/పొలాల తలల్ని నిమురుతూ/ఇక్కడ కాల్తున్న కళ్ళున్నాయి/ కాలడం ఆగిన కడుపులున్నాయి / ప్రణాళికల బోర్డులున్నాయి'' అని సమాజస్థితిని వ్యంగ్యంగా తెలియజెప్పి కర్తవ్యాన్ని గురించి హెచ్చరించారు. విప్లవ కవులలో ప్రస్ఫుటంగా వినవస్తున్న గొంతుకలలో శ్రీ తిరుమలరావు స్వరం వినదగినది.

ఇంకా 'మరో ఝంఝ' ను ప్రసరింప జేస్తున్న కవులలో శ్రీయుతులు జ్యోతి, దామోర, చలసాని ప్రసాద్ మొదలైన కవుల గీతాలు ఆలోచనాత్మకంగా, దేశ పరిస్థితుల గురించి ఆవేశాన్ని కలిగిస్తున్నాయి.

'విరసం' పది సంవత్సరాల ప్రగతిలో యీ దశాబ్దం తనదేనని ఋజువు చేసుకోగలిగింది. సంఖ్యకు మాత్రం ఎక్కువ మంది కవులను అందివ్వలేక పోయింది. భావాలలో ఏకీభావం వున్నంత మాత్రాన కవితలు ఒక దానికొకటి ప్రతిధ్వని కానక్కరలేదు. కాని ఎక్కువ మంది కవులు ఒకేవిధమైన పదజాలంతో, ముఖంమొత్తే పడికట్టు పదజాలంతో, అవేఅవే ఉపమానాలతో, తిట్లతో విప్లవ కవిత్వమంటేనే వెగటు కల్పించారు. వీరిలో కవితాశిల్పం మెండుగా గలిగి, ఉత్తమ గీతాలు రచించిన వారు- శ్రీశ్రీ, సుబ్బారావు పాణిగ్రాహి; శివుడు; చెరబండరాజు; నగ్నముని; శివారెడ్డి, గద్దర్, వంగపండు ప్రసాదరావు, జయధీర్ తిరుమలరావు వంటి వారు-కొద్ది మంది కవిత్వంస్థాయిని పెంచి, తెలుగుకవిత్వంపై ఆదర్శాన్ని కలిగించారు.

స్వాతంత్ర్యానంతరం తెలుగు కవిత్వపు తీరుతెన్నులను పరిశీలిస్తే అందులో విప్లవకవుల రచనలే శ్రేష్ఠమైనవిగా చెప్పవచ్చు. సమాజంలో కవిత్వాన్ని జనసామాన్యానికి దగ్గరగా తీసుకు వచ్చిన ఖ్యాతి అభ్యుదయ కవులదైనా - వారికంటె ఇంకా నిశితంగా జన జీవితాన్ని అర్థంచేసుకొని విప్లవాన్ని ఆహ్వానిస్తున్న విప్లవకవుల రచనలు నిస్సందేహంగా మేలైనవి.

## 'విరసం' లో విభేదాలు

ప్రజాక్షేమాన్ని కోరి సాహిత్యరంగంలో విప్లవానికి కారణభూతులైన కవులు సంఘంగా ఏర్పడి ప్రజల్ని ముందుకు నడిపించదలచారు. కాని వాళ్ల పది సంవత్సరాలైనా గడవకముందే - వారు విశ్వసించిన 'దీర్ఘకాలిక సాయుధ పోరాటం' ప్రారంభదశలోనే చీలిపోయారు. వీరి అభి

ప్రాయ భేదాల్ని పరిశీలిస్తే సహృదయులు నివ్వెరపోతారు. ఋషితుల్యులైన కవులు, క్రాంతదర్శులైన కవులు అహంకార ప్రదర్శనలో, ఈర్ష్యాద్వేషాలతో, ఇంకా అంతకంటె ఎవరెక్కువ అనే చిన్న మనస్తత్వంతో ప్రవర్తించినట్లు వీరి పరస్పర ఆరోపణలే తెలియజేస్తాయి.

'విరసం' రాజకీయ సంస్థకాదని మొదటినుండి ప్రకటించుకుంటూనే వుంది. కాని విరసానికి రాజకీయాలు దూరంకాదని, సరియైన రాజకీయాభిప్రాయాల్ని ప్రజలకు కలిగించి, చైతన్యవంతుల్ని చెయ్యటమే తనలక్ష్యమంటుంది. సాహిత్య సాంస్కృతిక రంగానికే పరిమితం కావలసిన యీ సంస్థ దేశంలో చెలరేగిన అతివాద రాజకీయ పక్షాల అభిప్రాయాలకు, మతాతత్త్వాలకు, ముఖ్యంగా వ్యక్తుల ఆరాధనలో పడి 'ఎవరి నాయకుడెక్కువ' అనే చర్చలకు తావిచ్చింది. ఈ అభిప్రాయ భేదాలు తీవ్రమై అనంతపురంలో జరిగిన సభలో జ్వాలాముఖి, నిఖిలేశ్వర్ మొదలైన కొందరు చీలిపోవటం జరిగింది. ఈ విధంగా చీలిపోయినవారు 'జనసాహితి'ని స్థాపించుకున్నారు. సుప్రసిద్ధ రచయిత్రి రంగనాయకమ్మగారు జనసాహితిలో చేరటమూ, ఆ తర్వాత ఆమె సంస్థకు రాజీనామా చెయ్యటమూ జరిగింది. ఆమెరచించిన 'జనసాహితితో మావిభేదాలు' అన్న పుస్తకాన్ని చదివితే తెలుగుదేశంలో రచయితలు ఎంత బాధ్యతారహితంగా ప్రవర్తిస్తున్నారో అర్థమౌతుంది.

'అత్యవసర పరిస్థితి'లో భయంతో, స్వార్థంతో 'విరసం' నుండి విడిపోయిన కవులు, మళ్ళీ మామూలు పరిస్థితులు నెలకొన్నా తిరిగి 'విరసం' లో చేరటానికి ముఖం చెల్లక, ఆ ఆవేశం చల్లారిపోయి ఆ సంఘాన్ని నిర్వీర్యం చేశారు.

మళ్ళీ విరసాన్ని పునరుద్ధరించి తమ కార్యకలాపాలు కేవలం కళా సాంస్కృతిక సాహిత్యరంగాలకే పరిమితమని ప్రకటించుకొని 'విరసం' సభలు, సమావేశాలు చేయటం; పత్రికలు 'సృజన, అరుణతార' మొ॥వి ప్రకటించటం; ఇంకా దశాబ్ది ఉత్సవాల సందర్భంగా "మరో ప్రస్థానం; మరో ఝంఝ" ప్రకటించటం వంటి కార్యకలాపాలలో

నిమగ్నమైవున్నా అది యువతరాన్ని ఆకర్షించి, వారికి చైతన్యాన్ని ఉత్తేజాన్ని కలిగిస్తున్న జాడలులేవు. నిప్పు ఆరిపోకుండ జాగ్రత్త పడుతున్నట్లు కన్పిస్తుంది. అభ్యుదయ రచయితల సంఘం కొన్నాళ్ళకు శక్తిని కోల్పోయినట్లే 'విరసం' కూడ క్రమంగా తనశక్తిని కోల్పోతున్నది.

## విప్లవోద్యమం వెనుకంజ

కవులు నిప్పులు చెరిగే గీతాలు రాస్తున్నా, ముక్కుపచ్చలారని యువకులు, విద్యార్థికులు, మేధావులు పోరాటాల్లో మరణిస్తున్నా విప్లవోద్యమం ముందంజ వేస్తున్నదని చెప్పలేము. అట్లాగని విప్లవం పూర్తిగా ఆగిపోయిందనటమూ అబద్ధం. దీర్ఘకాలికమైన విప్లవపోరాటాల్లో యీ విధమైన వెనుకంజ అప్పుడప్పుడూ తప్పదు. 'ఒక్క నిప్పురవ్వ వున్నా దాన్ని వూదివూది జ్వాలగా మండించటం' తప్పకుండ జరుగుతుంది. విప్లవ జ్వాలను ఆరిపోనీక జ్వలింప జేయటంలో కవుల బాధ్యత ఎంతైనా ముఖ్యమైనది.

కేవలం ప్రజలకు ఉత్తేజం కలిగించి, ఆవేశం రగిలించి వారిని పోరాటానికి నడిపించట మొక్కటే చాలదు. తామూ తమకవితల్లోచెప్పిన విధంగా ఆత్మత్యాగాలకు సిద్ధమైనప్పుడే విప్లవ కవిత్వోద్యమం ముందుకు వెళ్తుంది.

విప్లవకవులు త్యాగాలుచెయ్యటంలో ఇతరులకు ఆదర్శప్రాయంగా లేరని చెప్పక తప్పదు. మీరు పొగుడుతున్న వీరులవలె, మీరు కూడ త్యాగాలకు సిద్ధమేనా? అని అడిగిన వారికి "మేం విప్లవ సిద్ధాంతాలకు నిబద్ధులమేగాని విప్లవ కార్యకలాపాల్లో నిమగ్నులం కాము" అని వీరు చెప్పే సమాధానం ఎవరికీ తృప్తి కలిగించదు. 'నిబద్ధత, నిమగ్నత'అనే మాటల వెనక నిజాన్ని దాచలేరు. కవి తాను ఆచరించలేని ఆదర్శాన్ని గురించి ఇతరులకు చెప్పటం కంటె మోసం మరొకటుండదు. యువతరం తాత్కాలికంగా యీ మోసానికి గురి అయినా తెలివి తెచ్చుకుని తనను ప్రేరేపిస్తున్నవారు ఏపాటి త్యాగం చెయ్యగలరో పరిశీలించి వివేకవంతు

లౌతారు. కొందరు ఆ ఆవేశంతో వెనుదిరిగి చూడకుండ విప్లవ పోరాటాల్లోకి వెళ్ళి ఆత్మాహుతి గావిస్తారు. విప్లవకవుల్లో త్యాగశీలురైన వారికి యీ మాటలు వర్తించవని వేరే చెప్పనక్కరలేదు. 'సుఖాల్ని కామించి' మాటల్లో మాత్రమే విప్లవాలురగిలించే కవుల రచనల్లో కవిత్వ శిల్పానికి సహృదయులు తలలూచినా వారిని చరిత్ర క్షమించదు.

కళలన్నిటికంటె సత్యమే గొప్పది. "కవిత్వానన్ సత్యంబు సాధింతునా?" అని ధూర్జటి పలికినట్లే సత్యసుందరమైన కవి వాక్కే సమాజానికి శ్రేయస్సును ప్రసాదించగలుగు తుంది. విప్లవకవులు తమ బాధ్యతను గుర్తించి సమాజ శ్రేయస్సుకు తోడ్పడే కవిత రచిస్తే ప్రజలు దాన్ని తప్పకుండ స్వీకరిస్తారు. కవులు చెయ్యని త్యాగాన్ని ప్రజలకు బోధిస్తే తిరస్కరిస్తారు.

1980 తర్వాత తెలుగు కవిత్వం మరే విధమైన మలుపు తిరుగు తుందో, విప్లవ కవిత ప్రజల్ని ఎంత వరకు చైతన్యవంతుల్ని చేస్తుందో వేచిచూడాలి. ఇప్పటికప్పుడే తెలుగుదేశం మరొక నూతన కవితోద్యమం కోసం ఎదురుచూస్తున్నట్లనిపిస్తుంది. ఇటీవల వస్తున్న వచన కవుల కవితల్ని గమనిస్తే వారు మరేదో కొత్తదనం కోసం ఎదురుచూస్తున్నారని అనిపిస్తున్నది.

## పదవ అధ్యాయం

# వినూత్న కవితా రీతులు

కవిత్వం రాజకీయ సిద్ధాంత ప్రచారం కోసమే ఉద్దేశించబడినట్లు, ప్రేమ, ప్రకృతి, భక్తి వంటి భావాలతో కవిత్వంరాసిన వారిని బూర్జువా కవులని, తిరోగమన వాదులనీ, ఫ్యూడల్ వ్యవస్థ అవశేషాలని సామాజిక ప్రగతి వాదులైనవారు నిందించటం తరచుగా జరుగుతున్నది. కవి మనస్సులో చెలరేగిన అనుభూతికి కావ్యరూపం ఇవ్వటం తప్పుకాదనే విశ్వాసంతో కొందరు కవిత్వం రాస్తున్నారు. వారిభావాల్లో కొన్ని సామాజిక ప్రగతిని కోరేవి కూడ వుంటాయి. ఆత్మానుభూతికే వీరు ప్రాధాన్యమిస్తారు. ఇటువంటి కవులను 'అనుభూతి' కవులని పేర్కొనవచ్చు.

### కమిట్ మెంట్

ఇటీవల ఎన్నడూ లేనంతగా 'కమిట్‌మెంట్' అనే మాట విస్తృతంగా ప్రచారంలోకి వచ్చింది. నమ్మిన రాజకీయ విశ్వాసానికో, తాత్విక సిద్ధాంతానికో మరొకదానికో కట్టుబడకుండ కవిత్వం రాయటం వ్యర్థమని ప్రగతివాదులు వాదిస్తున్నారు. తీవ్రవాద రాజకీయ పక్షాలను సమర్థించే విప్లవ కవులను "మీరు ఆ రాజకీయ పక్షాలతో ఏకాభిప్రాయంతో వున్నారా? వారు సాగిస్తున్న పోరాటంలో మీరూ పాల్గొంటారా?" అని ప్రశ్నించిన వారికి విప్లవ కవులు తమది సాహిత్య సంస్థయేగాని, రాజకీయ సంస్థకాదని నిర్ద్వంద్వంగా ప్రకటించారు. విప్లవ భావాలకు నిబద్ధులమేగాని, విప్లవ కార్యక్రమాల్లో నిమగ్నులం కామని విప్లవ రచయితలు ప్రకటించారు. శివకవులు, వైష్ణవ కవులు పూర్వకాలంలో వున్నట్లే అభ్యుదయ కవులు, విప్లవ కవులు అనే విభాగం కన్పిస్తున్నది. ప్రగతివాదులందరూ సామాన్య మానవుని క్షేమం కోరేవారైనప్పుడు

రచయితల సంఘాలు తమ 'కమిట్‌మెంట్' దేనికో ప్రకటించాలి. వారివారి మానిఫెస్టోలలో ప్రకటిస్తున్నారు గూడ.

కవి కవిత్వానికే 'కమిట్' అయి కవిత్వం రాస్తే తప్పేమిటి? ఒప్పే అవుతుందని తలచి ఏ రచయితల సంఘానికీ చెందని కొందరు కవులు స్వేచ్ఛగా కవిత్వం రాస్తున్నారు. వీరిలో కొందరు మాత్రమే తమది అనుభూతి ప్రధానమైన కవిత్వమని ప్రకటించు కుంటున్నారు.

భావకవిత్వం అనుభూతి ప్రధానమైనదే. భావకవిత్వానికే కొత్త పేరు పెట్టి 'అనుభూతి' అనటం ఎందుకంటే, భావకవులు పట్టించుకోని అభ్యుదయ భావాలనుకూడ అనుభూతివాదులు అంగీకరిస్తారు కాబట్టి. కవి అనుభవంలోకి వచ్చిన సమస్తమైన అనుభవాలకు ఇందులో చోటుంటుంది.

అనుభూతి లేనిదే ఏకాలంలోనూ కవులు కవిత్వం రాయలేదు. కవిత్వానికి విశ్వశ్రేయం కంటె, కవి ఆత్మానుభూతి వ్యక్తీకరణమే ప్రధానమని తలచిన వారి కవిత్వాన్ని ముందుముందు కవులు, సహృదయులు ఏ విధంగా స్వీకరిస్తారో వేచి చూడాలి.

## ఇంద్రగంటి శ్రీకాంతశర్మ - అనుభూతివాదం

ఏ ఇతరకవి మార్గాన్ని అనుసరించక, తనకుతానై నూతన మార్గాన్ని వెతుక్కుంటున్న కవి శ్రీ ఇంద్రగంటి శ్రీకాంతశర్మ. లోకంలో తాను దర్శించిన వస్తువు మనస్సును కదిలిస్తే, ఆ అనుభూతిని కావ్యంగా మలచుకుంటారేగాని యీయన ఏ రాజకీయ సిద్ధాంత ప్రచారానికీ కవిత్వాన్ని సాధనంగా ఉపయోగించరు. ఏ ఇజాలతో నిమిత్తం లేకుండ, అన్ని ఋతుపవనాలను ఆహ్వానిస్తారు. జీవితం నుండి వెలుగును స్వీకరించి వెలుతురును ప్రసరింపజేసే కవి శ్రీకాంత శర్మగారు.

"జెండాలు, నినాదాలు, సిద్ధాంతాల సంకెళ్ళతో నిమిత్తం లేకుండా కేవలం కవిత్వంకోసం కలంపట్టిన సరికొత్తతరం ప్రతినిధి" శ్రీకాంతశర్మ అని శ్రీ అజంతా వీరి కవిత్వాన్ని పరిచయం చేశారు. "ఆధునికాంధ్ర సాహిత్య చరిత్రలో ఇది కాలుష్యయుగం. సాహిత్యేతర ప్రయోజనాల

కోసం కవిత్వాన్ని బాహాటంగా నడివీధిలో ఉరితీస్తున్న రోజులివి...సిద్ధాంత సంబంధమైన కాలుష్యం ఒకటేకాదు, అంధానుకరణంకూడ కాలుష్యమే... శ్రీ ఇంద్రగంటి శ్రీకాంతశర్మ పరిశుభ్రమైన కవి. శబ్దశక్తి, శబ్దసంగీతం తెలిసినవాడు'' అని శ్రీ అజంతా శ్రీకాంత శర్మగారి కవితావైశిష్ట్యాన్ని వివరించారు.[1]

''కిరణంలోంచి / వాతావరణం లోంచి / కేలెత్తి అవతరిస్తున్న నవ విరించిని / సమతావిపంచిని / సాహస గరుత్తులు విప్పి / సమయానికి రాగల శూరుణ్ణి, నరుణ్ణి, హరుణ్ణి'' అని తన సంకల్పాన్ని వ్యక్తపరచి శ్రీకాంతశర్మగారు ''భావి నా ఉజ్జ్వలనేత్రం'' అంటారు. ''జీవితం/ జనమయ బాహ్యప్రపంచంలో / సీలింగ్ ఫాన్‌కుపైగా / చిట్టిపిచ్చుకలు కట్టేగూడు''(కెలైడోస్కోప్) అని జీవితాన్ని గురించిన వీరి భావన ఆధునిక కవుల ఊహావైచిత్రి కొక చక్కని నిదర్శనం. ఆధునిక భావచేతన, అనుభూతికి ఆకారం కల్పించే నేర్పు వీరి కవితలో విశేషంగా కన్పించే అంశాలు. వీరి 'అనుభూతి గీతాలు' లో ''పటకుటీరం; గది; అద్దం ముందు ఒక రాత్రి; క్షణికం; ప్రేమానికి గొళ్ళెంతీస్తే; కళ్ళు''ఇంకా ఇటీవల వీరురాసిన జ్ఞాపకాల హవేలీ; కాళీ కుర్చీ'' గీతాలు సహృదయులకు ఆనందం కలిగిస్తాయి.

శ్రీకాంతశర్మగారి కవిత్వంలో భావతీవ్రత తక్కువగా వుంటుంది? దూరానవున్న మొగలిపూల పరిమళం సుడివేసి బాటసారిని నిలవేసినట్లు వీరి కవిత్వంలో అనుభూతులు రసజ్ఞులను క్రమక్రమంగా వశం చేసుకుని ఆనందాన్ని కల్గిస్తాయి.

'అనుభూతి వాదాన్ని' ఒక నూతన సిద్ధాంతంగా వీరు ప్రతిపాస్తున్నారు. ఆ వాదానికి వీరి కవిత్వం సరియైన తార్కాణ. ఈ వాదం ఎంత వరకు వ్యాపిస్తుందో కాలమే తీర్పు చెప్పాలి.

1. పరిచయం - అజంతా - 'అనుభూతి గీతాలు'- నవోదయ పబ్లిషర్స్-1978.

## వేగుంట మోహనప్రసాద్ - "అట్లాఅని పెద్ద బాధా వుండదు"

ఆధునిక పాశ్చాత్య కవుల ప్రభావంతో తెలుగు వచనకవిత్వంలో ఇంతకుముందు ఏ కవీ అనుసరించని ప్రత్యేక పద్ధతిలో కవితరాస్తున్న వారు శ్రీ వేగుంట మోహనప్రసాద్ - అభ్యుదయ కవుల సామాజిక ప్రగతివాదం వీరిని ఆకర్షించలేదు. వచన కవిత్వంలో నూతన ప్రయోగాలు చేసి, అల్లకల్లోలమైన మానసికావస్థను మాటల్లో పెట్టటానికి ప్రయత్నిస్తారు. అధివాస్తవికుల ఆలోచనల్లాగే వీరిగీతాల్లో భావాలు కూడ ఒక క్రమంగా లేకుండా, చెదిరిపోతూ వుంటాయి. నేటిసమాజాన్ని చూచి కవి పొందిన నైరాశ్యం, ప్రాచీన స్మృతులు, కవి మనస్సులో అల్లిబిల్లిగా, గజిబిజిగా అలుముకున్న చిన్ననాటి జ్ఞాపకాలు శ్రీమోహనప్రసాద్ కావ్యవస్తువులు. అభివ్యక్తిలోవున్న ప్రత్యేకత వలన వీరి కవితపై పాఠకులు ఆసక్తి చూపుతారు. వీరి గీతాల్ని అర్థం చేసుకున్న వారు పాఠకుల్లో చాల కొద్ది మంది మాత్రమే వుంటారు. మార్క్సిస్టు సిద్ధాంత ప్రభావంతో శ్రీశ్రీ ముద్రను వీడలేక నినాదాలతో కవిత్వాన్ని హోరెత్తిస్తున్న కవుల కవిత చదివి, శ్రీ మోహనప్రసాద్ కవిత చదివితే ఒకకొత్త లోకంలోకి వచ్చినట్లుంటుంది. 'చితి-చింత'లో గీతాలన్నీ కవి నూతనత్వం కోసం చేస్తున్న ప్రయత్నానికి నిదర్శనాలే.

శ్రీ మోహనప్రసాద్ కవితల్లో భావచిత్రాలు (Images) ప్రధానం. వాటికి ప్రయోజనం వుండాలని కవి ఉద్దేశించరు. కవి హృదయంలో చెలరేగిన భావ సంఘర్షణకు ఆకారమిచ్చి భావ చిత్రాన్ని రూపొందించటమే ఆయన చేసేపని.

> "అట్లా అని / పెద్ద బాధా ఉండదు
> వెల్లవేసిన గోడలేమో తెల్లబోతూ ఉంటాయి/విద్యుత్కాంతికి
> మహా అయితే ఏ బల్లో ప్రాకుతూంటుంది / గోడమీద
> దానినీడ ఒక్కటే ఛాయామాత్రంగ మెదుల్తుంది / విచారంగ
> ....ఇది దిగులు చిత్తవృత్తి సీన్ ('నిరీహ'—చితి-చింత)—

ఈ భావచిత్రంలో బల్లిని ప్రతీకగా, కవి "వాక్యుయేస్ (Suggesting absence of thought) బల్లిప్రలాపంలో - రక్తం స్రవిస్తున్నా" అని తన బాధను వ్యక్తీకరించారు.

"ఆఖరి ఆశ్రమం: సెల్ఫ్‌పిటీ; వగపేటికి చల్లచిందినన్; దీప వృక్షం; వీభూతి; హేమసీత; రాలిపోయిన కిరణం" గీతాలుచదివినప్పుడు శ్రీ మోహన్‌ప్రసాద్ భావచిత్రాలు చదువరులకు విచిత్రంగా తోస్తాయి. 'విచిత్రమే సౌందర్యం' అని భావించే వారికి యీ కవిత నచ్చుతుంది. నైరాశ్యం పునాదిగా పెంపొందిన వీరి కవిత్వానికి వచన కవిత్వంలో ప్రత్యేక స్థానమున్నది.

శ్రీ ప్రసాద్ ప్రయోగించే పదాలు తెలుగునుడికారానికి దూరంగా వుంటాయి. అస్పష్టత, అయోమయం వీరి కవిత్వంలో తరచుగా ఎదురౌ తాయి. వీటిని తట్టుకొని చదివితే వీరి కవిత్వపు నిరాశామయ లోకంలోకి ప్రవేశించవచ్చు.

## ఇస్మాయిల్ భావచిత్ర సౌందర్యం - "సవ్వడి చెయ్యక భూమి బుగ్గపై చల్లటి నవ్వు సొట్టలా ముడుచుకుంటుంది బావి"

వచన కవిత్వంలో భావుకశక్తి గల కవులలో అగ్రగణ్యుడు శ్రీ ఇస్మాయిల్. భావచిత్రాల్లో యీయన కవితాశక్తి అపురూపంగా కన్పిస్తుంది. "చెట్టు నా ఆదర్శం; మృత్యువృక్షం: చిలకలువాలిన చెట్టు", కావ్యాల్లో వీరి ప్రకృతివర్ణనలు ప్రసిద్ధ చిత్రకారులు కాన్‌స్టేబిల్, టర్నర్ లను తలపిస్తాయి. ఆయన జీవన వేదాంతం కష్టజీవులు తిరుగుబాటు చెయ్యటం గురించి, వర్గసమాజం గురించీ చెప్పదు. కవి హృదయంలో మెదలిన తలపు క్రమంగా ఆకృతి ధరించి కావ్యరూపం తాలుస్తుంది. నిత్య జీవితంలో అనుభవానికి వచ్చే సామాన్య సంఘటనలు కూడ వీరి భావుక స్ఫూర్తితో ఉత్తమ కవిత్వమై భాసిస్తాయి. కాలవొడ్డున షికార్లు; ఫ్యాను కింద లోకం; వర్షాల్లో కాలేజి; బదిలీ: మేకు; ఊరుమారాలని; పజిల్; రాత్రి కారు ప్రయాణం; టీకప్పు;" లాంటి ఇతివృత్తాల్ని తీసుకొని వీరు

ఉత్తమ కావ్య ఖండికలను వెలయించటం చూస్తే యీ క అద్భుతమైన ప్రతిభావంతు లనిపిస్తుంది.

“సవ్వడి చెయ్యక భూమిబుగ్గపై చల్లటి / నవ్వు సొట్టలా ముడుచుకుంటుంది బావి”అని బావిని; “ఎవరూ ఎరగని ఏదో కాయలా బరువుగా నామెదడు చెట్టుని పెరుగుతోంది యీ ముసురు” అని ముసురును వీరు వర్ణించిన తీరు నాన్యతో దృశ్యమైనది; రమ్యమైనది; వెయ్యేళ్ళ తెలుగు కవిత్వంలో బావి, ముసురు కొత్తకావ్యవస్తువులు కావు. కాని శ్రీ ఇస్మాయిల్ వాటిని వర్ణించేటప్పుడు ఉపయోగించిన ఉపమానాలు సరికొత్తవి. “ఆధునిక కవిత్వంలో ఆధునికత్వం ఏమిటి?” అని అడిగే వారికి యీ పోలికలను ఆధునికత్వానికి ఉదాహరణలుగా చూపవచ్చు.

రాజకీయ సిద్ధాంతాల ప్రచారానికి కవిత్వం సాధనం కారాదని శ్రీ ఇస్మాయిల్ భావిస్తారు. జీవితం ప్రేమించదగ్గది. జీవితాన్ని వివిధ కోణాల నుండి చూచి ఆనందించటమే జీవిత పరమార్థమని ఆయన నమ్మకం. ‘మృత్యువృక్షం’లో “అకస్మాత్తుగా / ఒక రోజు / మృత్యు వృక్షం / వ్యత్యస్తంగా / తలకిందుగా / మొలిచింది. మూగిన బంధు మిత్రులు / మోసుకుపోయి అతణ్ణి / విత్తనంలా పాతారు. జనాల/మనో గగనంలో / చాపుకున్న జ్ఞాపకాలకొమ్మల్ని / గాఢానురాగాల / ఊడల్ని వెనక్కి పీల్చేసి / ఈ మృత్యుబీజం / ఏమీ తిరిగి ఇవ్వదు” అని ఉపనిషదికమైన భావాన్ని రమ్యమైనపద్ధతిలో వ్యక్తీకరించారు. ‘చెట్టు నా ఆదర్శం’లో “తరుచాపము వీడిపోయి / గురి మరచిన బాణంలా / తిరుగాడును పిట్ట. ధరణి గుట్టు తెరవబోయి / బిరడాలో ఇస్క్రూలా/ ఇరుక్కున్న పురుగు / పురుగు సగం, సగం పిట్ట / ధరను చొచ్చి, దివిని విచ్చి / విరులు తాల్చు తరువు” అని ప్రకృతిలో ఊర్ధ్వముఖంగా సాగిపోయే చెట్టు తన కాదర్శమని యీాయన తలచారు.

“కిచకిచమని శబ్దమైతే / కిటికీలోంచి చూశాను / ఎప్పటిలాగే చెట్టు / గుప్పిట విప్పి నిలుచుంది” అనే పంక్తులు సహృదయుల మనస్సుల్లో భావ చిత్రాన్ని ముద్రిస్తాయి. చిలకలు వాలిన చెట్టు లోతైన

కావ్యంలాంటిదని, చిలకల్ని వెదకి చూచినట్లే, కవి హృదయంలో భావాలను వెతికి పట్టుకోవాలంటారు. ''స్వేచ్ఛాగానం; వానవచ్చిన మధ్యాహ్నం; తాటితోపు; వేయిపిట్టల సముద్రం; బోటులోటాగోర్; ట్వింకిల్; వైరు; జంక్షన్; దేశభక్తి: అనంతపురంలో వీధికుళాయి'' మొదలైనవి ఎన్నిసార్లు చదివినా తనివి తీరని కావ్యానందాన్ని కలిగించే వచనగీతాలు. వీరి ''అనంతపురంలో గాడిదలు'' సంచలనాత్మకమైన వివాదాస్పదమైన గీతం. ఇందులో అన్యాపదేశంగా ఆయన రాజకీయవేత్తల్ని అవహేళన చేశారు.

అయోమయ భావన ఇస్మాయిల్‌గారి కవిత్వంలో వెదికినా కన్పించదు. శ్రీ తిలక్ చెప్పిన 'ట్రాన్స్‌పరెంటు చీకటి' వంటి అస్పష్టత మాత్రం కొన్ని గీతాల్లో వుంది. వాటిలో ఇస్మాయిల్‌గారి భావన 'రేడియమ్'లా మెరుస్తూ, మనోగోచరమవుతుంది.

## పి. హనుమయ్య 'విభావరి' - ''స్వేచ్ఛా స్వప్నాల వంటి పువ్వులనే పూయగలను''

రాజకీయ సిద్ధాంతాల చట్రంలో యిమిడిపోని కవిత్వం శ్రీ పి. హనుమయ్య రచించారు, శీర్షికలు లేకుండ 80 వచన గీతాలున్న వీరి కవితా సంకలనం 'విభావరి' ఆయన స్వేచ్ఛను, భావుక శక్తిని వెల్లడిస్తుంది. ''నేనొక పూలమొక్కను / నా స్వేచ్ఛా స్వప్నాలవంటి పువ్వులనే పూయగలను'' అనే యీ కవి మనస్సుకు ఉద్రేకం కలిగితేనేతప్ప, ఏదో మొక్కుబడిగా కవిత్వం రాయలేదు. జీవితాన్ని ఒక సవాలుగా తీసుకోవటమంటె వీరికి ఇష్టం.

''జీవితానికి జీవులంటె / ప్రయోజనాతీతమైన ఇష్టాగోష్ఠి/అయినా పసిపిల్లలకు పాలివ్వాలని / రసలుబ్ధులకు పానకం పోయాలని / భయస్తులకు బ్రాందీ తాపాలని / సోక్రటీస్‌ను మాత్రమె / విషపాత్రికతో సవాలు చేయాలని / దానికి తెలుసు'' అని ఆలోచనాత్మకమైన కవిత్వం రాశారు. ''ఆకలిగొన్న కళ్ళకు క్షమాపణ చెప్పుకునే **పులివిస్తరాకులు**''

వీరి కవిత్వంలో వున్నాయి. "అద్దంలో తప్ప తమను చూచుకోలేని అభాగ్యుల"పై కవి జాలిపడతారు.

"శ్రీమంతులు కుడిచే మృష్టాన్నం ప్రతి ముద్ద / అన్నార్తుల చూపులతో/ఎంగిలి పడిందే"నని భావించే వీరు అన్నార్తులను తిరుగుబాటు చెయ్యమని చెప్పరు. ప్రతిరోజూ చాకిరీ చేసుకుని బువ్వతినే వాడికి/ భవిష్యత్తంటే భయంలేదు" అని కష్టజీవులకు తృప్తి వున్నదని భావిస్తారు.

"ఈ కూజా నిండింది ప్రభూ! పట్టుకెళ్ళండి" అనే గీతంలో కవి ఊహోపైచిత్రి రసజ్ఞులను ఆకట్టుకుంటుంది. "కవికీ భక్తుడికి అవస్థా భేదం తప్ప ఆంతర్యంలో తేడాలేదు" అని శ్రీ హనుమయ్య కవిత్వాన్ని తపస్సుగా భావిస్తారనటం అతిశయోక్తికాదు, "హృదయంలో ఖేదమై పోవడమే తడవు / నాగాన మాగిపోతుంది." అని బాధను కవిత్వానికి పర్యాయపదంగా వీరు భావిస్తారు. రాసిన ప్రతి కావ్యఖండికలో ఏదో ప్రత్యేకతను చూపించి ఆర్తినినింపిన వీరి 'విభావరి' అనిబద్ధ కావ్యాల్లో 'అనుభూతి' పద్ధతిలో ఒక మైలురాయిగా గుర్తించదగినది.

## కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ; "వెలుతురు పిట్టలు"; "సిలువెక్కగలిగినవాడే సింహాసనానికి అర్హుడు"

కవికి అనుభూతి కలిగి ప్రేరణ కలిగినప్పుడే కవిత్వం రాయాలని తలచే కవి శ్రీ కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ, ప్రకృతిని దర్శించినప్పుడు, మానవ ప్రకృతిని అర్థం చేసుకున్నప్పుడు కవిలో మెదిలిన భావాలే 'వెలుతురు పిట్టలు' కావ్యరూపం ధరించాయి.

"నీలాకాశం ప్రశాంతంగా వుంది/తలస్నానం చేసినట్టున్న/సర్వీ చెట్లకు/గాలులు మెల్లగా/తల చిక్కుల్ని తీస్తున్నాయి"- శ్రీమన్నారాయణగారి యీ ప్రకృతి చిత్రం ఆహ్లాదం కలిగిస్తుంది. కుంకుడు పులుసు పడి ఏడ్చే/పసిపాప ఎర్రజీరల నేత్రాల్లో/తల్లి పిండిన చనుబాలులా/చిమ్మిన వేకువ/శాంతపరచిన అడవిపై/అందమైన పిట్టలు ఎగురుతాయి" అనే

భావనలో ఔన్నత్యం విభ్రాంతి గొల్పుతుంది. చీకటి కాకి / చుక్కల గుడ్లని / రాత్రల్లా పొదుగుతుంది/ఒకే ఒకటి / సూర్యకోకిలం ఔతుంది / మిగిలినవన్నీ/కాకిపిల్లలై /చీకటి కాకితో/ఎగిరిపోతాయి'' (సూర్యకోకిలం) అనే వర్ణన అద్భుతంగా తోచి యీ కవి ప్రతిభ సహృదయులకు ఆశ్చర్యం గొలుపుతుంది.

స్వతంత్రమైన ఆలోచనా, నిశితమైన పరిశీలనా, ఆవేశాన్ని మాటల్లో పట్టుకోగల నేర్పు శ్రీమన్నారాయణగారి కవిత్వంలో కన్పిస్తాయి. కొన్నిచోట్ల ఆయన అనుభూతి ఆకారం అగమ్యగోచరంగా కూడ వుంటుంది.

''సిలువెక్క గలిగినవాడే సింహాసనానికి అర్హుడు'' మొదలైన సూక్తులు వీరి కవిత్వాన్ని చిరస్మరణీయం చేస్తాయి. ''పడుచు చిరునవ్వుల వంటి వెలుతురు పిట్టల''ను సహృదయుల మానసాకాశంలో విహరింప జేసిన శ్రీమన్నారాయణగారు సమాజ శ్రేయస్సును గురించి పట్టించుకున్నట్లు లేదు. కవిత్వాన్ని రాజకీయాలనుండి దూరం చెయ్యాలనుకునే వారు వీరి కవిత్వాన్ని మెచ్చుకోగలుగుతారు. స్థూలదృష్టికి వీరి కవిత్వం ఆత్మాశ్రయంగా వుండి కొత్తరకపు భావకవిత్వంగా తోస్తుంది. భావ ప్రకటనలో భావకవుల పద్ధతికి కూడ భిన్నమై, ''స్వచ్ఛమైన కవిత''గా, ''కవిత్వానికే కమిట్ అయిన కవిత'' గా శ్రీమన్నారాయణ గారి కవిత్వాన్ని గుర్తించవచ్చు.

## పొట్లపల్లి రామారావు 'చుక్కలు'

విశ్వకవి రవీంద్రుని 'స్ట్రేబర్డ్స్' వంటి రచన శ్రీ పొట్లపల్లి రామారావు రచించిన 'చుక్కలు'. ''రామారావుగారు బిందువులో సింధువును దర్శిస్తారు. బిందువుకు చుక్క అని కూడ పేరు, అందుకే వారు 'చుక్కలు' సృష్టించారు.''

చుక్కలులో రామారావుగారి ఆలోచనలు చిన్న చిన్న వచన గీతాలవలె వేటికవి విడిగా వుంటాయి. వీటిలో కొన్ని ఆహ్లాదకరమైనవి;

కొన్ని మెదడును చురుక్కుమనిపించేవి; మరికొన్ని మనఃకవాటాన్ని తెరిచి నూతన సత్యాన్ని ఆవిష్కరించేవి. మొత్తంమీద ఆలోచనాత్మక మైనవి.

"ప్రభుత్వాలు ఎన్ని లోపాలు చేసినా క్షమించవచ్చును కాని/ప్రతి సాధారణ విషయానికి తమ దిక్కు చూచేంత నిర్వీర్యులను, నిస్సహాయులనుగా/ప్రజలను చేయడమనేది క్షమింపరాని నేరం"- ఈ భావం మెదడుకు చురుక్కుమని సోకుతుంది. "చందనం అలదేవాడు, ముందు తన వ్రేళ్ళ గంధపాత్రలో ముంచితే కాని/మరొకరికి పూయడానికి అవకాశం చిక్కదు. అట్లాగే అంతో ఇంతో ముందు చేతులు మసిచేసుకుంటేనే గాని ఒకడి ముఖానికి పూసే అవకాశం లభించదు" - రామారావుగారి భావాలలో చల్లదనం మనస్సుకు చందనం అలదినంత హాయినిస్తుంది.

## రంధిసోమరాజు; "వానాకాలం, శీతకట్టు, ఏసంగి పొద్దులు"

కృత్రిమమైన, జానపద శైలిలో "ఎదగండి; బూర్జువా పెళ్ళి కూతురు; పొద్దు; సిన్నమ్మి వొచ్చింది: రోజీ"కావ్యాలు రచించి శ్రీరంధి సోమరాజు వచన కవిత్వంలో ఒక కొత్తతోవ తీశారు. శ్రీశ్రీగారికి షష్టిపూర్తి జరిగిన సమయంలో ఒక పామరుడు శ్రీశ్రీని ఆక్షేపించిన రీతిలో శ్రీ సోమరాజు 'పెద్దపెద్ద కబుర్లు' రాశారు. అభిమానులు, ప్రజలు శ్రీశ్రీకి చేస్తున్న సన్మానం న్యాయమైనదిగా సోమరాజుగారికి తోచలేదు. శ్రీశ్రీ కవిత్వం శ్రామికులను ఉద్ధరించదని ఆవేశంతో విరుకు పడ్డారు.

శ్రీ సోమరాజు కావ్యాల్లో ఉపయోగించిన భాష పామరులదికాదు. తెచ్చిపెట్టుకున్నదే. ఆయన ఊహలు పామరుల ఊహలుకావు. అవినీతిని వర్ణించేటప్పుడు మితిమీరి, అతి ఆకర్షవంతంగా వర్ణించి, చివరమాత్రం అవినీతిని ఖండిస్తారు. 'దిసమొలసోగ్గత్తె'లో నైట్‌క్లబ్‌లో కేబరేనృత్యం చేసే స్త్రీని వర్ణించారు, కావ్యం చదివాక ఆమె మీద జాలికలుగదు. సామాన్యమానవునికి రాజకీయ సిద్ధాంతాలు, పార్టీలు హాని చేస్తున్నాయని సోమరాజుగారు తలుస్తారు. మనిషిలోని మంచితనం మీద నమ్మకముంచి, ఆ మంచితనం పెంపొందించటానికి వీరు రచనలు చేస్తారు.

శ్రీ సోమరాజు కావ్యాల్లో 'పొద్దు' విశిష్టమైనది. ఋతువులపై ఎందరో కావ్యాలు రాసినా, సోమరాజుగారి కావ్యంలో లోకపరిశీలన, భావుకశక్తి అత్యద్భుతంగా కలిసి పోయాయి, దీన్లోకూడ కవి ఉపయోగించిన భాష ఇబ్బందిగా తోస్తుందిగాని, ఆయన రూపొందించిన భావ చిత్రాలు మనస్సును కదిలిస్తాయి. సామాన్యులకు తెలిసిన "వానాకాలం శీతకట్టు, ఏసంగిపొద్దులు"- మూడుకాలాల్నే కవి వర్ణించారు. "సల్లని గాలి తాకిడికి / సుకంగ కరిగి పోద్దిమబ్బు / గొప్పోలు అలా పేదల గుండెల్ని / కరిగిత్తే నోకమంతా ఔద్దారే / వాకచేసేమంతిపువ్వు" అని సోమరాజుగారు ధనవంతుల్లో హృదయ పరివర్తన వస్తే లోకం మారుతుందని నమ్ముతారు. గోదావరిలో ఈదులాడిన పిల్లలు వొల్లు బిర్సెక్కిపోనాక/సొక్కాలతో తల తుడ్సేసుకొని యెండలోపడి/నిక్కబొడ్సుకున్న ఎంట్రుకలతో / ఎర్రనీ కల్లతో ఇంటి కొత్తారు ఎర్రినాగమ్మలు / ఎండ దేవుళ్ళ" అని రమ్యమైన భావచిత్రాన్ని అందించిన సోమరాజుగారి కవిత మరపురానిది. "సెప్పుల్లేకుండా రోడ్డేసేవోల్ని సూసి / తారుతో కరిగి / డబ్బాలోంచి సుక్కలు సుక్కలుగా రాలి/ఏడ్చింది ఎండ" అని కరుణామయమైన దృశ్యాన్ని వర్ణించిన సోమరాజుగారి ప్రతిభ విశేషంగా చెప్పుకో దగినది.

"సిస్మమిమ్మ వొచ్చింది; బూర్జువా పెళ్ళికూతురు" వచన కవితలో కథా కావ్యాలు, సోషలిస్టు సమాజాన్ని స్థాపిస్తామని చెప్పే కుహనా సంస్కర్తల బండారాన్ని బయట పెట్టటం సోమరాజుగారి లక్ష్యం. కాని ఆయనశైలి చదువరులకు వింతగాతోచి, ఆలోచనలు ప్రగతికి విరుద్ధంగా వున్నట్లనిపిస్తాయి. 'రోజీ' కావ్యం మురికివాడల్లోంచి తారాపథాన్ని చేరుకున్న సినిమాతార కథ, పామర భాషను ఇంగ్లీషుతో జోడించి రాసిన యీ కావ్యం కవి ఉద్దేశించిన కరుణరసాన్ని అందివ్వటంలో విఫలమైంది.

భావుకశక్తి కలిగిన వచన కవులలో శ్రీ సోమరాజు శ్రేష్ఠులని చెప్పవచ్చు, లోకపరిశీలన, ఊహావైచిత్రి సోమరాజుగారి కవితకు ఒక వింత సోయగాన్ని కలిగిస్తాయి.

## సాహిత్యోపనిషత్తు

కవిత్వమంటే యేమిటి? కావ్యానికి ఆత్మయేది? కావ్యప్రయోజనాలేవి? మొదలైన విషయాలను గురించి భారతీయాలంకారికులు సుదీర్ఘంగా చర్చించారు. సంస్కృత సాహిత్యంలో యీ విషయాలను చర్చించిన వారు ఎక్కువగా పండితులే. దండి, జగన్నాథ పండితరాయల వంటి కవులుకూడ యీ చర్చలు చేసినప్పటికీ ఎక్కువగా కవిత్వ మూల స్వరూపాన్ని గురించిన చర్చల్లో పండితులే ఎక్కువగా పాల్గొన్నారు.

పూర్వాంధ్ర సాహిత్యంలో కావ్యస్వరూపాన్ని గురించి కవులు తమ అభిప్రాయాలను వెల్లడించారు. కావ్యావతారికలలో సుకవి స్తుతి, కుకవి నిందలలో కవులు కవిత్వాన్ని గురించి వివిధ విధాలుగా భావించారు. ఇవి మిక్కిలి ఆసక్తి గొలుపుతాయి.

ఆధునికాంధ్ర సాహిత్యంలో కావ్యస్వరూపాన్ని గురించి శ్రీశ్రీ, ఆరుద్ర, వరదరాజేశ్వరరావు గారలొక రసవత్తరమైన చర్చ చేశారు. ఆరుద్రగారు 'సినీవాలి' కావ్యానికి 'స్వవిషయ సూచికగా' యీ 'సాహిత్యోపనిషత్తు'ను చేర్చారు,

ఆరుద్ర: ఏమయ్యా కవీ! నాదో మనవి ! నువ్వెందుకు రాస్తున్నావ్ / నూకలివ్వక పోయినా భావాల / మేక లెందుకు కాస్తున్నావ్? అని ప్రశ్నించటంతో ఆరంభమౌతుంది చర్చ. ఈ ప్రశ్నకు జవాబుగా శ్రీశ్రీ "అనుకరణ అనవసరం, అంతేకాదు అనర్థకం....ఈమేకలే నాలోని పెద్దపులికి ఆహారం / నాకవిత్వం అవ్యాఘ్రం ఆకలి ఆకారం," అని చెప్పారు, ఈ సందర్భంలో శ్రీశ్రీ ఇమిటేషన్‌కీ, క్రియేషన్‌కి భేదాన్ని గూడ వివరించారు. "కవికోరేది మెప్పు గండెపెండేరం కాదు / సమాన ధర్ముల హృదయ స్పందనం, శిరఃకంపనం" అంటారు శ్రీశ్రీ. ఇంకా ఆయన "ప్రజాస్వామ్యాన్ని అంగీకరిస్తూనే కవి / మెజారిటీకి అందని ఊహలు వెదకాలి"అని అభిప్రాయపడ్డారు. కవికి వ్యాఖ్యాత అవసరమా? అన్న ఆరుద్రగారి ప్రశ్నకుశ్రీశ్రీ "కవిత్వంమీద కవిత్వంకూడ కవిత్వమే.

ఎవరైనా తికమక పడుతున్నప్పుడు, వ్యాఖ్యాత జోక్యం చేసుకోక తప్పదు....చక్రాల్లో చక్రాల్లాగ అర్థాల్లో అంతరార్థాలుంటాయి / కొంత మట్టుకే బోధపడవచ్చు కొందరికి / ఇంకా కొందరికి ఇంకా అందులో ఏముందో చెబుతాడు వ్యాఖ్యాత" అని వ్యాఖ్యాన ప్రయోజనాన్ని వివరించారు.

"ఏమిటి చెప్పడం, ఎలాచెప్పడం అనేవి రెండూ రెండు చక్రాలు" అని ఆరుద్రగారు భావించారు. కవి కీర్తికోసం కాక ఆర్తివల్ల అరిస్తే చెప్పకుండానే ఏదో ఒకఛందంలో చెవికింపుగా సొంపుగా పలకటం జరుగుతుందని "ఇంతకుమించిన ఛందోనియమం, బంతి లేకుండా ఫుట్‌బాల్ ఆట్టం" అని ఆయన అభిప్రాయపడ్డారు.

ఎవరికోసం కవిత్వం? ఎందుకోసం నవత్వం? అన్న ఆరుద్రగారి ప్రశ్నకు శ్రీశ్రీ సూటిగా "మనిషికోసం కవిత్వం, మంచికోరి నవత్వం" అని జవాబిచ్చారు. ఈ సూక్తి అధునిక కవులందరూ శిరోధార్యంగా యెంచదగినది.

"చూశావా ఆరుద్రా ఒక తమాషా, సంప్రదాయం నిలిచేవుంటుంది హమేషా"; జాతికి జీవననాళిక, జానపదగీతిక; మహాకావ్యానికి క్రైటీరియా, సైజూ బరువూ కావయా, నిన్నటి మహాకావ్యం పద్దెనిమిది పర్వాలైతే, నేటి మహాకావ్యం పద్ధెనిమిది పేజీలే; "పల్లెపదాన్ని యీసడించే సంగీత విద్వాంసులున్నారు/ప్రబంధాన్ని చదవలేని పామర జనం ఉంది / కాని ఎక్కడో స్పందిస్తారిద్దరూ.... ట్రెపీజీ ఆర్టిస్టులిద్దరూ క్రాస్ అయిన క్షణం, మెదడూ హృదయం మిళితమయే గుణం, అదే మహాకావ్యానికి ఏకైక లక్షణం"; ఛందస్సుల అశ్వహృదయం తెలియనివాడు, సవారీకి తయారు కాకూడదు; కవిత్వానికి కూడా సైన్సుకివలె / కావాలి రిసెర్చి ఎక్స్‌పెరిమెంటూ/కాని దాని పరమార్థం/పలాయనవాదం కాదు, ప్రజాక్షేమం" మొదలైన శ్రీశ్రీగారి సూక్తులు ఈచర్చను చిరస్మరణీయం చేస్తాయి.

ఆరుద్రగారి పలుకుల్లో "కావాలి కవిత హృదయానికి నరిష్మెంటు, కారాదు ఏనాడు మెదడుకు పనిష్మెంటు; కల నిజపరచడంకాదు కవిత్వం, నిజాన్ని కలగనడమే దాని తత్వం, వర్తమాన కవితయేమిటో తెలుసా వరదా, అది భూత భవితవ్యాల మధ్య ట్రాన్సపరెంటు పరదా!; కవిత్వం రోజూవాడని టూత్‌బ్రష్; యాంత్రిక నాగరికత కాంతివంతమైన చీకటి; ఎప్పటికైనా మానవ పథికుడు చేరుకునే గొప్ప విశ్రాంతిమందిరం కవిత; విచిత్రమే సౌందర్యం; విచింతనయే మాధుర్యం: వర్తకుని మనస్సులో పెట్టుకుని, శుక్తి మౌక్తికాలను ధరించదు, ప్రజలదృష్టిలో నిదుకొని కవి రచించడు" మొదలైన సూక్తులు ఆలోచనామృతాలు.

శ్రీ వరద రాజేశ్వరరావు ఆలోచనలలో "ఎందుకోసం మనధ్యాన ముద్ర? ఎందుకీ చైతన్యవంతమైన నిద్ర?; ఎలుగులేని వాడికెలా కనిపిస్తుంది వెలుగు, పులుగు కానివాడికెలా విహాయస దృక్పథంకలుగు?; కవిత్వం విధ్వంసక కారణ విచ్ఛేదన, కవిత్వం నిత్య సౌందర్యారాధన, శ్రమలేనిదే మనోరమ సాక్షాత్కరించదు" మొదలైనవి మెదడుకు మేత వేసి హృదయాన్ని అలరిస్తాయి.

ఆధునికాంధ్ర కవిత్వస్వరూపాన్ని తెలుసుకోదలచిన జిజ్ఞాసువులు యీ సాహిత్యోపనిషత్‌ను అధ్యయనం చేసితీరాలి, ప్రతిభావంతులైన కవులు కవిత్వంపై చేసిన యీ చర్చ మిక్కిలి ఆసక్తి గొలుపుతుంది; విలువైన విషయాలు బోధిస్తుంది; ఆనందం కలిగిస్తుంది.

## 'చేతనావర్తం' కవులు

అభ్యుదయ కవిత్వం రెండు దశాబ్దాలకుపైగా తెలుగుదేశాన్ని ఉర్రూత లూపి అల్లకల్లోలంచేసి, సమూలమైన మార్పునే తెచ్చింది. సమ సమాజ నిర్మాణంలో తన వంతు కర్తవ్యం నిర్వహించకుండానే తెరమరుగైంది. వచన కవిత్వంలో వైవిధ్యంవచ్చి అభ్యుదయ భావాలనేగాక ప్రేమ, భక్తి, తాత్త్వికచింతన మొదలైన పెక్కుభావాలు కవితలో వ్యాపించాయి.

పదవ అధ్యాయం

అల్లకల్లోలమైన సమాజ జీవనంలో మనిషి సమిష్టిలోంచి వ్యష్టి లోకి ప్రయాణించి ''ఏకాకిగా జీవించలేక గమ్యం తెలియక శూన్యంవైపు ప్రయాణం చేస్తున్నాడు''. భూతకాలం గూర్చిన నిరాశ, భవిష్యత్తును గూర్చిన భయమూ ఆవరించగా సంకులితుడౌతున్నాడు.'' జగచ్చైతన్యం కల్లోలితమై తనలోతానే సుడులు పడుతున్నది. మనిషి అంతర్ముఖు డౌతున్నాడు. మనిషి మొదట తన ఆత్మానుభూతిలోనుండి సమాజ చైతన్యంలోకి ప్రయాణిస్తున్నాడు. ఈ చేతనావర్తమే కవిత్వమని విశ్వసించి శ్రీయుతులు సుప్రసన్న, పేర్వారం జగన్నాథం, సంపత్కుమార, నరసింహారెడ్డి 'చేతనావర్తం' పేరుతో సామూహికమైన తమచైతన్యాన్ని వచన కవితా సంకలనంగా 1967లో వెలువరించారు.

అభ్యుదయ కవితాయుగంలో వెలువడిన 'నయాగరా' సంకలనం వలె 'చేతనావర్తం' కూడ యువకవులలోని వొక సామూహిక శక్తికి ప్రతిబింబం. రెండూ వచన కవితా సంకలనాలే. రెండూ సమకాలిక సమా జాన్ని దృష్టిలో వుంచుకున్నవే. 'నయాగరా' కవులు సమాజంలో మార్పుకు తిరుగుబాటు అవసరమని భావించగా, చేతనావర్తం కవులు మానవుడు తాను సంపాదించుకున్న విజ్ఞానబలంతో చెతన్యవంతుడై తన ఉనికిని గుర్తించి సాటి మానవుకి తోడ్పడాలని భావించారు.

డార్విన్, ఫ్రాయిడ్, మార్క్స్, ఐన్‌స్టీన్ ఈ నలుగురూ ఆధు నిక భావబోధకు నాలుగుస్తంభాలు. ఈ శాస్త్రీయ భావాల ఆధారంపైననే ''ఆధునికత'' నిలిచి వున్నది. హేతువాదమూ, స్వచ్ఛందతా, విప్లవమూ ఈ మూడు తత్వాల సమ్మేళనమే ఆధునిక భావన.... ఆధునిక చేతన వొక విధంగా నిరంతర అన్వేషణ. అనంత దీర్ఘప్రయాణం స్వప్నలోకం నుండి యథార్థంవైపు, ఆదర్శంనుండి ఆత్మానుభవంవైపు యీప్రస్థానం.'' ఆధునిక కవిత్వానికి అవసరమైన ఆధునిక విజ్ఞానబలంతో యీ కవులు రంగం మీదికి వచ్చారు. ఆలోచన ఎక్కువగా, ఆవేశం తక్కువగా వీరి కవిత్వం నిశితమైన భావాలతో సాగుతుంది. భారతీయ విజ్ఞానానికి, సాంస్కృతిక పునరుజ్జీవనానికి రాజారామమోహనరాయ్, వివేకానందుడు

చేసిన కృషిని వీరు కొనియాడారు. గాంధీ, రవీంద్రుడు, అరవిందుడు జాతీయతా దృష్టిని కలిగించినందుకు వీరికి ఆదర్శంగా నిలిచారు. దేశ దేశాల కవితాసిద్ధాంతాలను వీరు అర్థం చేసుకున్నప్పటికీ ఆ ప్రవాహాలలో కొట్టుకుపోలేదు. మానవ జీవితంలోని పురోగతి, సుదూరాకాశాల స్ఫురించే దివ్యజీవనశ్రీ శిఖరం అధిరోహించడం'' వీళ్ళ లక్ష్యం. 'ఇజా'ల కీకారణ్యంలో స్వచ్ఛమైన రసానుభవం లోపించిందని వాపోయి ఆ అనుభవాన్ని కలిగించడానికి వీరు పూనుకున్నారు.

మార్క్సిజం పునాదిగా కవిత్వం రాస్తేనే ప్రగతివాద కవిత్వ మౌతుందనీ, లేకపోతే అది సమాజ పురోగతికి ఉపయోగపడే కవిత్వం కాదనే వాదాన్ని వీరు ఖండించారు. ప్రగతివాద కవి మార్క్సిస్టు కానక్కరలేదని నిశ్చయంగా ప్రకటించారు.

దేశపటాన్ని చూచి ''స్వార్థానికి రంగురంగులు పూసి/భాషలపేర మతంపేర జాతిపేర / దేశంపేర చేసిన మారణ హోమాలకు / చరిత్ర కారులు తొడిగారు మారువేషాలు – శవగంధం కొడుతున్న ఈపట్టుతెరని/ శుష్కశోశనానికి పంపించండి'' అని శ్రీ సుప్రసన్న చరిత్రలో జరిగిన మారణహోమాలు పునరావృతం కారాదంటారు. ''ఇంద్రియాలు నిద్ర పోయిన వేళ / ఈశ్వరుడు మేల్కొన్న దినాన / పంచభూతాలు తొడుకున్న ఇంద్రియాల / కంచుకాలు వదిలేసి'' మనిషి మనస్సు కాలంతో ప్రయాణిస్తుంది. ''మహాకావ్యాలలో రసంవలె, భగవంతుడెప్పుడూ వ్యంగ్యమైనవాడు''. అతడ్ని వెతికి పట్టుకునే ప్రయత్నమే కవిత్వమని శ్రీ సుప్రసన్న భావన. 'అమృత పుత్రులు' గీతంలో నాగరికత పేక మేడలు కూలి పోవడం చూచిన మనుష్యులు తరణి కిరణాలవలె, తరుణ భావం వలె ముందుకు నడవాలంటారు.

శ్రీ పేర్వారం జగన్నాథం కవిత్వం చమత్కార ప్రధానమైంది. ''స్వామీ ఈ మగడు నాకొద్దు, వీడసలే తుమ్మమొద్దు.... వీడా సత్య వంతుడుకాడు. నేను సావిత్రిగా నటించలేను''. అని ధ్వని ప్రధానంగా భగవంతునికి మానవుని నిస్సహాయస్థితిని నివేదించారు.''స్వామీ ఈబండి/

అర్ధరాత్రి పట్టాలు తప్పింది/గార్డు గాబరాపడుతున్నాడు/అయితే కాస్తవ పోయింది / డ్రైవర్ నిద్దురపోతున్నాడు / బండిలో విద్యుద్దీపాలు ఆరి పోయాయి / హఠాత్తుగా / ప్రయాణీకులు వొకరినొకరు / తిట్టుకుంటు న్నారు / బండి ఆగడానికి కారణం నీవంటె నీవని"(పట్టాలుతప్పినబండి) జీవన గమనాన్ని పట్టాలుతప్పినబండితో పోల్చి రసానందం కల్గించారు. జీవితాన్ని దేనితోనైనా పోల్చి రక్తికట్టించగల నేర్పు శ్రీ జగన్నాధం గారి కున్నది.

ఆధునిక జీవనపరిస్థితులను ఛాయారోపం (అలీగరీ)వల్ల వ్యాఖ్యా నించటం శ్రీ సంపత్కుమార కవిత్వంలో ప్రత్యేకత. "నాటకాంతం; ఈరాత్రి గడువలేదు; అంతర్లయం" గీతాలు సంపత్కుమారగారి జీవితావ గాహనను చక్కగా వెల్లడిస్తాయి.

శ్రీ నరసింహారెడ్డి సమకాలిక సంఘంలో లోపాలను వ్యంగ్య శక్తితో, వాడియైన మాటలతో ఎదుర్కొన్నారు. "ఇక్కడంతా క్షేమం/ నాయకులు నానాగడ్డి కరుస్తున్నారు / పశువులు మేత లేక చస్తున్నవి (రఫ్ స్కెచ్) అని సంఘపు వ్రణాలకు శస్త్రచికిత్స జరగకతప్పదంటారు.

"ఈ దేశంలో ఎప్పుడూ /పేదల గుడిసెలే కాలిపోతాయి/కడుపుతో మండే ఆకలి మంటలు/కనుల్లోంచి ఎగసి/కప్పులంటుకుంటాయేమో" (చేదు మాత్రలు) అని భావించే కవికి సామాజిక దృష్టి వున్నదని వేరే చెప్పనక్కరలేదు. కాని చేతనావర్తం కవుల భావనను అందుకోవటానికి పాఠకులు ఎదగాలి. అరవిందుల కవిత్వంలోవలె భావం క్లిష్టంగా, ఆలోచనాత్మకంగా వుంటుంది. "The whole style and rhythm of poetry are the expression and movement which come from us, out of a certain spiritual excitement caused by a vision may be of anything in Nature or God or man or the life of creatures or the life of things—[2]" అని అరవిందులు చెప్పినట్లుగా అంతరాత్మ ప్రబోధమే

2. Future Poetry - Aurobindo.

ఉన్నత విలువలకు ఉత్తమ కవిత్వానికి ప్రేరణ అని చేతనావర్తం కవులు విశ్వసించారు. వీరిలో శ్రీ సుప్రసన్న కవిత్వంపై అరవిందుల ప్రభావం అధికంగా కన్పిస్తుంది.

'చేతనావర్తం' కవులను తర్వాత తరం కవులు అనుసరించినట్లు గాని, వీరివల్ల ప్రభావితులైనట్లుగాని అనిపించదు.

## 'కవిసేన' కవులు - శేషేంద్ర ఊహా వైచిత్రి

వచన కవితలో కావ్య వస్తువుతోపాటు రీతి కూడా మారాలని వాదించి కొత్త కవిత్వం రాస్తున్న కవి శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మ. "షోరాబ్; ఋతు ఘోష; పక్షులు" కావ్యాలను సంప్రదాయ పద్ధతిలో రచించి, కావ్య వస్తువులో, కవితా శిల్పంలో మార్పు రావలసిన ఆవశ్యకతను గుర్తించి, సమకాలిక సమాజ సమస్యలను అవగాహన చేసుకొని వీరు వచన కవితకు మరలారు. ప్రకృతి పరిశీలనలో శ్రీ శేషేంద్ర శర్మ దృష్టి అమోఘం. ఆయన ఊహల్లో ప్రకృతి కొత్త అందంతో కనిపిస్తుంది.

రాజకీయవేత్తల నినాదాల్లో కవిత్వం బందీ అయిపోయిందని బాధపడి ఒక కొత్త కవితోద్యమాన్ని శ్రీ శేషేంద్ర ప్రారంభించారు. అదే 'కవిసేన'. దీనికి వీరు నాయకులై కవిత్వాన్ని ఒక మహాయుధంగా సామాజిక ప్రగతివాదులమని భావించే కవులపై ఝళిపించారు. ప్రాచీనాంధ్ర సారస్వతమంతా వాచ్యార్థ ప్రధానంగా వెలువడినదేనని, భావ కవిత్వం వచ్చిన తర్వాతే కవిత్వంలో 'ధ్వని' ప్రధానమైన కావ్యాలు వచ్చాయని వీరి అభిప్రాయం.

"శేషజ్యోత్స్న; మండే సూర్యుడు; నా దేశం, నా ప్రజలు; సముద్రం నా పేరు; నీరై పారిపోయింది; గొరిల్లా; ప్రేమలేఖలు" కావ్యాలు శేషేంద్రశర్మగారి కవితా సౌందర్యాన్ని ప్రతిబింబించే నిలువుటద్దాలు.

ఉషస్ అనే గీతంలో (శేష జ్యోత్స్న) "ఎన్నాళ్లకు మా అతిథిగా వచ్చావు/ఈ శిథిలకుటీరాని కింత వెలుతురు తెచ్చావు/గగనానికి నీలిమ పూశావు/గాలికి పుప్పొడి రాశావు/....కన్నీటి తెరల మాటున కదలే పేద చూపులు/కవితల కాలవాలమని చెప్పావు/అంగూరు చితకందే ఆసవం రాదని/చెఱుకు నలగందే శీధువు వెలువడదనీ/చితికిన బ్రతుకు లోతు ఆవిష్కరించావు/వ్యధను కళ్ళ కద్దుకున్న మనిషి/బ్రతుకు తనకు బానిసైనవాడని తెలిపావు" అని ఉషోదయాన్ని ఆహ్వానించటంలో వీరి కవితాతత్త్వం స్పష్టమౌతుంది.

"మానవత నగ్నంగా, ఉద్విగ్నంగా/నూతన వ్యక్తీకరణకోసం చూస్తోంది" (గాలులు - శేష జ్యోత్స్న) అని భావించే వీరు యీ దశాబ్దంలో భావ వ్యక్తీకరణలో నూతనత్వంకోసం ప్రయత్నించే కొందరు కవులకు నాయకత్వం వహిస్తున్నారు.

వానవస్తే "భూమిలో ఉన్న/చిన్నారి గింజ/మెడబయటపెట్టి/మొదట వచ్చిన రెండాకుల్ని/చేతులుగాజోడించింది/కృతజ్ఞతతో" ('వాన'-మందే సూర్యుడు)-ఈ పంక్తుల్లో కవి భావ వ్యక్తీకరణ కొత్తది. వి త్తనం మొలకెత్తటం పాత కవితా వస్తువే. శ్రీ శేషేంద్ర భావ ప్రకటన మాత్రం నాన్యతో దృశ్యమైనది.

"జైళ్ళ కటకటాలకే/ఖర్చవుతోంది/దేశంలో ఇనుమంతా/రైళ్ళ పట్టాలకు మిగలడంలేదు/రవంత" (మరో దేవుడు - మందే సూర్యుడు) అన్నమాటల్లో కవి సమకాలిక విప్లవోద్యమాలపైన సానుభూతిగల వారని తోస్తుంది. రాజకీయ నాయకుల్ని కవులు అనుసరించరాదని, కవులే విప్లవాలకు నాయకత్వం వహించాలని వీరు ఆశిస్తారు.

'గుప్పెడు వెలుతురు' కూడ నోచుకొని గుడిసెల్లో దీనుల జీవితాలను వర్ణించారు. "ఏ గుడిసెల్లో పగలు మనుష్యుల్లేరో/ఏ గుడిసెల్లో రాత్రి వెలుతుర్లేదో/ఆ గుడిసెల్లో నడిచిపోతున్నా" (నా దేశం, నా ప్రజలు) అనే కవి కష్టజీవుల పక్షం వహిస్తున్నారనటం వాస్తవం. కష్ట జీవుల గురించి రాయాలంటే వారితో కలిసి జీవించాలని, త్యాగ మూర్తులై వారికి తోడ్పడాలనే ఉద్దేశ్యం కొందరు విమర్శకుల్లో వున్నది.

కార్మిక నాయకులూ, శ్రామికవీరులూ కవులు కాలేకపోవచ్చు. కష్ట జీవుల గురించి రాసే వారికి వారి జీవితం గురించి తెలిస్తే చాలు. వాళ్ళ కష్టం కవిని కదిలిస్తే చాలు. వారికోసం కలంపట్టి, సమాజంలో మార్పు తీసుకు రావటానికి తోడ్పడితే చాలు. ఇక కవి శ్రామికులతో కలిసి, వారి కష్టాల్లో పాలుపంచుకొని, వారికి నాయకుడైతే మరీ మంచిది. కాని నిత్య జీవితంలో శ్రామికునిలా బ్రతకనంత మాత్రాన కవి నిజాయితీని శంకించనక్కరలేదు. కవిత్వం చదివినప్పుడు సహృదయులు ఆలోచనా పరులై, మంచి చెడ్డలు తెలుసుకుని సమాజంలో మార్పుకు తోడ్పడితే కవిత్వం తన ప్రయోజనాన్ని నెరవేర్చినట్లే. ఎక్కడ తిండిలేని పనివాడు దూడను మేతకు తీసుకుపోతున్నాడో / ఎక్కడ పసితనం కూడా బతక డానికి పని చెయ్యాలో / అక్కడ నా కాళ్ళు నిజంగా తెగిపోయాయి (నా దేశం, నా ప్రజలు) అని రాసిన కవి ఏ రాజకీయ పక్షానికీ చెందకుండ కవితోద్యమానికి నాయకత్వం వహించవచ్చు.

నిర్విరామంగా వస్తున్న శ్రీ శేషేంద్రశర్మ కావ్యాల్లో అధిక భాగం ఉపన్యాసాల్లాగ వుంటాయి. కొన్నిచోట్ల కవి భావం అస్పష్టంగా వుంటుంది. వైచిత్రికోసం కవి ఒకదానితో మరొకదానికి సంబంధంలేని భావాలను కూర్చటం కన్పిస్తుంది. కాని ఎడారిలో ఒయాసిస్సులాగ వీరి కవిత్వంలో రమ్యమైన భావన సహృదయుల్ని నిలవేసి ఆలోచింప జేస్తుంది. శేషేంద్రగారి భావుకత అచ్చెరువు గొలిపి, ఆనందింపజేస్తుంది. సమకాలిక రాజకీయ పక్షాలను, కవులను, సాహిత్యోద్యమాలను తూల నాడడంలో ఆయన సంయమాన్ని కోల్పోతున్నారు. ఔచిత్య శోభిత మైన కవిత్వం రాణించటానికి ఇతర కవులను నిందించనక్కరలేదు. కవి వైశిష్ట్యం కవిత్వంలో భాసిస్తుందిగాని తిట్లలో మెరవదు.

## 'కవిసేన' కవుల తలపులు

1977 లో శ్రీ శేషేంద్రశర్మ నాయకత్వంలో ఏర్పడినది 'కవి సేన' ఉద్యమం. ఆర్థిక రాజకీయ సమస్యల వరకు, ఈ శతాబ్దం అంగీక రించిన మార్క్సిస్టు సిద్ధాంతాన్ని కనీస పరిష్కారంగా యీ ఉద్యమం

స్వీకరిస్తుంది. సమగ్ర మానవ జీవితంలో రాజకీయం ఒక భాగమే కాబట్టి కవి సంపూర్ణ మానవ జీవితంమీద తనకున్న బాధ్యతను గుర్తించాలంటుంది. "కవి నాయకత్వాన్ని నెలకొల్పటానికి కవిసేన ముఖ్యంగా ఉద్యమిస్తుంది." ఈ ఉద్యమం ఆంధ్రదేశంలో కొన్ని పట్టణాలకు, ఇతర రాష్ట్రాల్లో ఆంధ్రులున్న కొన్ని ప్రదేశాలకు కూడ వ్యాపించింది. యువకవులు కొందరు శేషేంద్రశర్మగారికి ప్రతిధ్వనుల వంటి కవితలు రాస్తున్నారు.

కవులు రాజకీయ పక్షాల నిరంకుశ ప్రజ్ఞలకు కట్టుబడి సాహిత్య స్పృహను కోల్పోరాదని కవిసేన హెచ్చరిస్తున్నది. "సామాజిక చైతన్యం ముసుగుక్రింద వీరవిహారం చేస్తున్న శిల్పరహిత అకవిత్వ మలినాన్ని దేశంనుంచి క్షాళనం చెయ్యాల"ని వీరి సంకల్పం. శిల్ప రహితమైన కవిత్వం త్వరలోనే తన తేజస్సు కోల్పోతుంది. దానికోసం 'కవిసేన' కత్తులు దూయనక్కరలేదు.

కావ్యవస్తువును గురించి విమర్శకులు చాల కాలంపాటు చర్చించారని, ఆ చర్చ వ్యర్థమని, కావ్యశిల్పం మీద దృష్టి వుంచాలని 'కవిసేన' వారి అభిప్రాయం. కవిసేన ఆశయాలను శ్రీ శేషేంద్రశర్మ 'కవిసేన మేనిఫెస్టో'లో వివరించారు. మార్క్సిస్టు విమర్శకుల మాటలను విస్తృతంగా ఉదాహరించి, అభ్యుదయ కవులను, విప్లవ కవులను ఆక్షేపించారు. కవితాశిల్పాన్ని విడిచిపెట్టమని మార్క్సిస్టు విమర్శకులెవ్వరూ, ఎక్కడా చెప్పలేదని పదేపదే హెచ్చరించారు. ప్రసిద్ధులైన కవులెవ్వరూ 'కవిసేన'ను అనుసరించినట్లు కన్పించదు. యువతరంలో కొద్దిమంది కవిసేన అభిప్రాయాలను ఆమోదించి కవిత్వం రాస్తున్నారు.

"కొమ్మలు చీల్చుకుని వస్తున్న పూలు" కవిసేన సభ్యుల రచనలతో వెలువడిన వచన కవితా సంకలనం. ఇంకా రావు వెంకటరావుగారి 'నాకు భూమి కావాలి'; 'వనమాలి వచన పద్యాలు' మొదలైన కవిసేన సభ్యుల కావ్యాలు. ఇవిగాక పోస్టర్ కవిత లనే పేరుతో ఒక పెద్ద కాగితం మీద కవిసేన సభ్యుల గీతాలు 'సైక్లోస్టైల్' చేసినవి కూడ వెలువడినాయి.

కవిసేన కవుల భావప్రకటనలో వైచిత్రి ఎక్కువ. "తలుపు తీస్తే వ్రేలాడే ఖగోళరాశి; నా చిన్నగదికి పహరా ఇస్తూ నక్షత్ర మండలం" (అవధాని); "ముసలి వీధిలాంతరు వెలుతుర్లో తడుస్తూ, వినిపిస్తూన్న బిచ్చగాని పిచ్చిపాట" (మల్లెల); "స్నేహితుల భుజాల మీద చేతులేసి అనేక పాదాలతో నడిచిపోతున్న ఒకే దేహంగా కని పిస్తాను" (వనమాలి); "సంధ్యాశోణిమ జ్వాలగా పచ్చికలోకి జాలు వారింది; నిశ్శబ్దత ఒడిలో మవున గీతికలుగా పూలు" (మోనా)- ఇటు వంటి ఊహలు కవిసేన కవుల ఊహావైచిత్రిని వెల్లడిస్తాయి. వీరు భావ వ్యక్తీకరణలో కొత్తదనం కోసం ఆరాటపడుతున్నారు. "కష్టాలను కన్నీళ్ళలో అద్దుకుంటాను"; ఆకులన్నీ తుపాకులై బులెట్ల ప్రవాహా లను చిమ్ముతాయి" మొదలైన ఊహలు కవుల చిత్తశుద్ధికంటె, ఊహా వైచిత్రినే ఎక్కువగా తెలియజేస్తాయి.

కవిసేన ఉద్యమం యువతరంలో కొంత వ్యాపించినా, అది కవి త్వోద్యమంగా నిలబడుతుందనిపించదు. కవిసేన భావ విప్లవానికి తోడ్పడే ఒక 'ఫోర్సు' కాదు.

## మినీ కవిత

'అల్పాక్షరాల్లో అనల్పార్థ రచన' ఏ కాలంలోనైనా కవిత్వానికి అవసరమే. చాటువులు, శతకాలూ ఇంకా ఎన్నో చిన్న పద్యాలు, ముక్తకాలు పూర్వ సాహిత్యంలో వున్నాయి. ఆధునిక నాగరికతలో వేగం పెరిగిపోయింది. సుదీర్ఘమైన రచనలను ఆస్వాదించటానికి సామాన్యులకు అవకాశం అంతగా లేకపోవటం వలన సాహితీ ప్రక్రియల్లో కొన్ని మార్పులు వచ్చాయి. నవలతోపాటు 'నవలిక', కవిత్వంతోపాటు 'మినీ కవిత' వ్యాప్తిలోకి వచ్చాయి. చిన్న చిన్న కవితలు పూర్వ కాలంలో కూడ వున్నా, ఆ పేరు ఇటీవల వచ్చిందే. మొట్టమొదట యీ పేరు ఎవరు ఉపయోగించారో తెలియదుగాని పత్రికల ప్రచారం వలన యీ ప్రక్రియ కొద్ది కాలంలో ఎక్కువ ప్రచారంలోకి వచ్చింది.

'మినీ కవిత' అంటే పొట్టిగా, క్లుప్తంగా వుండే కవిత మాత్రమే కాదు, మరికొన్ని విధాలుగా కూడ దీన్ని గుర్తించవచ్చు. నిగూఢమైన భావాన్ని కొద్ది పంక్తులలో పొదిగి, ఒక రసవత్కావ్య ఖండికను చదివిన అనుభూతి కలిగించటం దీని ప్రత్యేకత. వ్యర్థపదం వొక్కటీ లేకుండ, చెప్పదలచిన భావం పూర్తయ్యాక గీతం పూర్తయిందా లేదా అని చూడక అక్కడే ఆపివెయ్యటం 'మినీ కవితలో' కన్పిస్తుంది.

పత్రికలలో ఖాళీ జాగాలను (Space Fillers) పూరించటానికి సంపాదకులు వీటిని స్వీకరించటంవల్ల, మినీ కవితలు విరివిగా వెలువడుతున్నాయి. వచన కవితా వైవిధ్యానికి తోడ్పడుతున్న రూపం 'మినీ కవిత', 'మినీ కవితలు' పద్యాల్లో, గేయాల్లో కూడ వచ్చినా యీ మాట వచన కవితల్లో వచ్చిన వాటికే సార్థకమనిపిస్తున్నది.

'మినీ కవితా విప్లవం' పేరుతో ఒక మినీ కవితల సంకలనం కూడ వచ్చింది.[3] దీనిలో 200 మంది కవుల రచనలున్నాయి. అన్నీ వచన గీతాలే. శ్రీశ్రీ, కుందుర్తి, ఆరుద్ర, సి. నారాయణరెడ్డి, నగ్నముని, శివారెడ్డి మొదలైన ప్రసిద్ధ కవుల కవితలను కూడ ఇందులో చేర్చారు - ఆ కవులు యీ సంపుటంలో కవితలను మొదట రాసినప్పుడు వాటికి 'మినీ కవిత' అనే పేరు లేదు. ఇప్పుడు వాటికి కొత్తగా 'మినీ కవితలు' అని పేరు పెట్టనక్కరలేదు.

ఉక్తి వైచిత్రితో చిటికెలో చదివి ముగించటానికి వీలైన, ఆనందం అందించగలిగిన కవితలను 'మినీ కవిత'లని పిలవవచ్చు. దీనికి ప్రత్యేకంగా లక్షణాలను నిర్దేశించనక్కరలేదు. అట్లా ఎవరేనా లక్షణ నిర్దేశం చేసినా యీ స్వేచ్ఛా యుగంలో ఎవరూ లెక్కచేయరు. వచన కవిత్వానికే ఇదమిత్థమని లక్షణాలు లేకపోగా, వచన కవిత్వంలో వచ్చిన కొత్తరూపానికి లక్షణాలేర్పరచటం వ్యర్థం, కవులు శక్తిమంతులై మినీ కవితలను రాస్తే, వాటిలో రసవత్కావ్యాలను చదివి సహృదయులు ఆనందిస్తారు. మిగిలినవి కాల ప్రవాహంలో కొట్టుకుపోతాయి.

---

3. మినీ కవితా విప్లవం - సంకలనకర్త; కొల్లూరి; సాంస్కృతీ సమాఖ్య - అమలాపురం - 1980.

మినీ కవిత్వాన్ని ఒక విప్లవంగా పేర్కొన్నారు శ్రీ కొల్లూరి. మినీ కవిత విప్లవం కాదు. శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ చెప్పినట్లు విప్లవం భావ సంబంధి, మీటర్‌కి చెందినది కాదు[4]." ఆధునిక కాలంలో అన్ని మార్పులను, తిరుగుబాట్లను విప్లవమని పిలవటం ఒక ఫాషన్ అయిపోయింది. సరికొత్త కవిత్వ రూపం కాబట్టి శ్రీ కొల్లూరి మినీ కవితా సంకలనాన్ని కూడ విప్లవమని భావించారు.

కావ్య ఖండిక పొడవు ఎంత వుండాలో కవే నిర్ణయించుకుంటాడు. 'మహాప్రస్థానం'లో "కవితా ! ఓ కవితా !" - 'ఆః' రెండూ ఉత్తమమైనవే. అందులో ఒకటి మేక్సీ కవిత అనీ, రెండవది 'మినీ కవిత' అని పేరు పెట్టి పిలవనక్కరలేదు. ఇటీవల చిట్టిపొట్టి కవితలు మాత్రమే రానే కవులు తమ కవిత్వానికి 'మినీ కవిత్వం' అని పేరు పెట్టుకోదలిస్తే పెట్టుకోవచ్చు.

"కన్ను తెరిస్తే జననం
కన్ను మూస్తే మరణం
రెప్పపాటేగద ప్రయాణం"

(కంటి తెలివి-కవి 'చంద్రసేన్')

ఇటువంటి రసవత్కావ్య ఖండికను ఏ పేరుతో పిలిచినా అది ఉత్తమ కవిత్వమే. 'మినీ కవితా విప్లవం'లో సగానికి పైగా రచనలను కవిత్వమనటానికి వీలులేదు. పత్రికల్లో 'స్పేస్ ఫిల్లర్స్' అచ్చుపడినంత మాత్రాన, ఏ కొద్ది చమత్కారమో, తల్లకిందుగా పేర్చిన భావాల సమాహారమో వుండి పఠితను ఆకర్షించినా-అవి గుప్పున వెలిగి ఆరిపోయేవే. "అంతరాంతర జ్యోతిస్సీమల్ని" ఆవిష్కరించే కవితలు చాల కొద్ది. ఇటువంటి సంకలనాల్లో తాలూ బోలూ తూర్పారబోసి గట్టి గింజలను మిగిల్చే బాధ్యతను కాలమే తీసుకుంటుంది. అంతటినీ కలిపి ధాన్యరాశిగా చేర్చే బాధత్యను శ్రీ కొల్లూరి స్వీకరించారు.

4. 'బహురూపి' - పురాణం సుబ్రహ్మణ్యశర్మ మినీ కవితా సంకలనం - సాంస్కృతీ సమాఖ్య - 1980.

శ్రీ అద్దేపల్లి రామమోహనరావు వివరించినట్లు 'మినీ కవిత' దీర్ఘ కవితకు హ్రస్వరూపంకాదు, పుట్టుకతోనే సద్యోయౌవనం పొందిన కవితా రూపమిది. "వాచ్యతాదోషం ఎక్కువై పోతున్న వచన కవితకి వ్యంగ్య వైభవాన్ని నేర్పిన మినీకవిత కవిప్రతిభకు నికషోపలం లాంటిది"[5]

'మినీ కవిత' అంటే భావాల్ని కొద్ది మాటల్లో దట్టించి కూరటం అనుకొని "అహంబ్రహ్మాస్మి" లాంటి సూక్తులను కవిత్వంగా ప్రకటించే ప్రమాదం వున్నది. అప్పుడు అన్నిటికంటె చిన్న మినీ కవిత ఓంకారమే అవుతుంది. ఆ తర్వాత అన్నీ మౌనంలో లీనమైపోతాయి. శ్రీ ఆరుద్ర అన్నట్లు ఎన్ని గజాలు రాశాడన్నది కాక, ఎన్ని నిజాలు చెప్పాడన్నదే ప్రధానంగా తీసుకోవాలి. ఇక్కడ ఎన్ని నిజాలు అంటే సూక్తులని అర్థం చేసుకోకూడదు. చాల మంది మినీకవితలు రాసేవారు కవిత్వమంటే సూక్తులని భ్రమపడుతున్నారు. సూక్తులకు విలువ వుంటుంది. కాని ధ్వని, వ్యంగ్యం మొదలైన గుణాలు కలిగిన కవిత్వం మేలైనదిగా ఆదరం పొందుతుంది.

"మంచుబిందువులు, వెన్నెలపూలు, నిప్పురవ్వలు, చేతిబాంబులు, కొరడా చెళుకులు, ప్రభంజనాలు, సముద్ర కెరటాలు, పిల్లగాలులు, నీలిమబ్బులు, నవ్వుల పువ్వులు" వంటి మినీకవితల్ని శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ చెప్పినట్లు కొత్తవారు రాసినవి అలక్ష్యం చెయ్య కూడదు.[6] మినీకవితల వలన కవిత్వానికి వైవిధ్యం అబ్బుతుంది. ముఖ్యంగా సామాజికప్రగతి పేరుతో పడికట్టు మాటలతో, ఉపన్యాసంలా సాగుతున్న కవితల 'మొనాటనీ' నుండి విముక్తి కలుగుతుంది, జీవిత వైవిధ్యాన్ని చాటే మినీకవితల రవ్వల వెలుగుల్ని చూచి ఆనందించ

5 Mini విప్లవానికి Maxi ఆహ్వానం : - అద్దేపల్లి రామమోహనరావు - 'మినీ కవితా విప్లవం' - సాంస్కృతీ సమాఖ్య - అమలాపురం - 1980.

6. 'బహురూపి' - పురాణం సుబ్రహ్మణ్య శర్మ - 'మినీ కవితా విప్లవం' - సాంస్కృతీ సమాఖ్య - అమలాపురం - 1980.

వచ్చు. ఈ కవితలు చదివి పాఠకుడు సద్యఃపరనిర్వృతిని పొందుతాడని మాత్రం చెప్పలేము. నిమ్మతొనలు ఆకలి తీర్చకపోయినా, దాహాన్ని తీర్చగలిగినట్లు మినీకవితలు రసజ్ఞుల ఆర్తిని పూర్తిగా తీర్చలేకపోయినా, తగుమాత్రమైన ఆనందాన్ని కలిగించగలవు.

## కొన్ని వచన కవితా సంకలనాలు

నవలల తర్వాత అత్యధికంగా అచ్చవుతున్న తెలుగు పుస్తకాలు వచన కవితా సంకలనాలే. ఈ యుగధర్మాన్ని వివరించే కవితావాహకంగా వచన కవిత ప్రాచుర్యం పొందింది. పత్రికల్లో కొద్దిగీతాలు ప్రచురింపబడగానే యువకవులు వాటితోపాటు మరికొన్ని గీతాలు కలిపి, ఏ ప్రసిద్ధ కవినో బతిమాలుకొని పీఠిక రాయించుకొని కవితా సంకలనాలను ప్రకటించుకొంటున్నారు. విరివిగా వస్తున్న యీ సంకలనాల్లో కవితాభావం అక్కడక్కడా మెరుపులా తగిలినా, కేవలం వచనమనదగిన రచనలే ఎక్కువ. శుష్కవచనాన్ని పంక్తులుగా విరిచి, నిలువునా ఒకదానికిందొకటి అచ్చువేసినంత మాత్రాన అది కవిత్వంకాదు. చాల వచన కవితా సంకలనాల్లో కవిత్వం కోసం వెదుక్కోవలసిన గతి పడుతున్నది. అత్యధిక సంఖ్యలో వచ్చిన యీ కవితా సంకలనాల్లో నా దృష్టికి వచ్చిన కొన్ని సంపుటాలను పరిచయం చేస్తాను.

అరవిందులు ప్రబోధించిన తత్త్వంతో ప్రభావితులై, అరవిందాశ్రమం సందర్శించి శ్రీ సుప్రసన్న రచించిన 'పాండిచ్చేరీ గీతాలు పన్నెండు' తాత్త్విక గాంభీర్యం వున్న కవితా సంపుటి. అరవిందాశ్రమంలో "ఆనంద మధుకోశాన కనిపించని తుమ్మెద/అప్రతిహత ఝుంకారం వినిపిస్తోంది ఇప్పటికీ" అని పలికి ఆనాదం నడుమ 'ఋతంభర' ఛందోమయమై సాక్షాత్కరించిన అనుభూతిని శ్రీ సుప్రసన్న పన్నెండు గీతాల్లో వ [illegible]కరించారు.

యువతరం శక్తిపై అచంచల విశ్వాసమూ, ఉక్తివైచిత్రిపై మక్కువ కలిగిన కవి శ్రీ ఎమ్వీయల్. వీరు రచించిన 'యులిసిస్' ఆధునిక యువతరం ఆలోచనలకు ప్రతిరూపం. "To Strive, to seek,

to find and not to yield" అన్న Tennyson కవివాక్యం వీరికి ఆదర్శం. "ఖంజన పక్షులు వాలినచోట / ఖజానాలు దొరకవు.... కష్టజీవి కండలలో, గుండెలలో ఖజానాలున్నాయి / గరళాన్ని గళంలో నింపుకొని / కలంలో అమృతం ఒంపకు / అబద్ధాన్ని కవిసమయాల ఒరల్లోదాచి / నిజాన్ని కవిత్వంతో చంపకు" అని సమాజ శ్రేయస్సును కోరారు.

సమాజంలో పరిస్థితులు దుర్భరమై సామాన్యునిపై మంట మండిస్తున్నాయని నిరుద్యోగుల, ఆకలి బాధతో అలమటిస్తున్న అభాగ్యుల కన్నీటికి కవితారూపం 'వేసవి'. ఈ కావ్యాన్ని రచించిన శ్రీ కిరణ్ వర్ధమాన కవులలో సొంత గొంతుక, భావవ్యక్తీకరణలో వాడుపూ వున్న కవి.

"అబద్ధాల పూబాటల్లోంచి నడిచి రాలేదు నేను / నిజం ముళ్ళ కంచెల్ని దాటుకుంటూ వచ్చాను / స్పృహ తప్పిన లోకం మొహంమీద వాస్తవాల్ని చల్లాలి / నాలా అరణ్యంలో చిక్కడిపోయిన నా సోదరుల్ని పిలవాలి" అని సంకల్పించిన కవి శ్రీ గుత్తికొండ సుబ్బారావు. "మనిషి కోసం" కావ్యసంపుటిలో శ్రీ సుబ్బారావు అభ్యుదయ భావాలను వెద జల్లారు. "వడ్డించిన విస్తరనుకున్నాను జీవితం / ముక్కలు చింపినదని తెలుసుకున్నాను" అని భావించిన శ్రీ సుబ్బారావు కఠోరమైన వాస్తవ జీవితాన్ని ప్రదర్శించి, దీన్ని సంస్కరించుకోవలసిన అవసరం వున్నదని తలచారు.

సామాజిక సమస్యలకు ప్రతిస్పందించే హృదయ సౌకుమార్యంతో శ్రీ 'అదృష్టదీపక్' 'ప్రాణం' కవితా సంపుటిని రచించారు. మానవుని భవిష్యత్తు ఉజ్జ్వలంగా వుంటుందని నమ్మి, అందాక పరిస్థితులపై పోరాడి, చీకటిని ఛేదించాలని వీరు తలచారు. "ప్రస్తుతాన్ని ప్రస్ఫుటంగా ప్రతిబింబించే ప్రతిభ లేకపోతే కవిత్వం రాయొద్దనీ, ముక్కు మూసుకొని మూల కూర్చోమని చెప్పే యీ కవి సంకల్పం ఉన్నతమైనది.

ఒక చిన్న కవిత 'కంటి తెలివి'తో ప్రసిద్ధుడైన కవి శ్రీ చంద్ర సేన్. 'నరసింహావలోకనమ్' ఆయన కవితా సంకలనం. "బాలానందం; నిమ్మతొనలు; శునకన్యాయం" మొదలైన కవితలు చమత్కారంగా, అర్థవంతంగా, ఆహ్లాదకరంగా వున్నాయి. "ఎదలేని మనిషి ఎన్నడూ ఎదగలేడు" అని భావించే శ్రీ చంద్రసేన్ మానవత్వాన్ని తన కవితకు ప్రాణంగా తలుస్తారు.

"వెలుగుపూలు; వెన్నెలతునకలు" కావ్యసంపుటులను రచించిన శ్రీ దిలావర్ యీ తరం అభ్యుదయ కవి. "మొనలుదేలిన ముళ్ళన్ని మొక్కవోగ / పూవుపూవుకు గుండెలుప్పొంగవలె"నని తలచే యీ కవి భవిష్యత్తుపై ఆశలు నిలుపుకున్నారు.

"అనుభూతి ప్రధానమైన కవితలో మానవత్వపు విలువల్ని చాటిన 'గోదావరి గలగలలు' శ్రీ గోదావరిశర్మ రచించిన ఉత్తమ గీతాల సంపుటి. "వంతెనమీద/ప్రజలు ప్రవహిస్తారు/ఎదురొచ్చే రాత్రిని/టార్చి లైట్లతో నిరోధిస్తూ" భావనలో వైచిత్రి, వ్యక్తీకరణలో చేయి తిరిగిన కవితాశిల్పమూ వీరి కవితల్లో కన్పిస్తాయి.

చిన్నచిన్న మాటల్లో భావాల్ని కూరి, కుదించి, కవితనొక మందు గుండు సామగ్రిగా దట్టించి సంఘంలో అన్యాయాలు, అక్రమాలపై పేల్చిన కవి శ్రీ అరిశెట్టి ప్రభాకర్-వీరి 'ఎర్ర పావురాలు'లో 'భయం', నా కవిత; వేశ్య" మొదలైన గీతాలు పఠితలను ఆలోచింపచేసి, ఆనందింపచేయగలవు.

శ్రీ 'కె ఎస్వీ' రచించిన 'రాత్రి' సుదీర్ఘమైన వచనగీతం. రాత్రికీ రహస్యానికి సంబంధం వుందని, రాత్రి రహస్యాల్ని ఆవిష్కరించిన భావాలు 'కెఎస్వీ' గారివి. వీరి భావాల్లో నిగూఢమైన ఆవేశం సహృదయుల్ని ఆకర్షిస్తుంది.

శ్రీ పణతుల రామచంద్రయ్య అనుభూతి ప్రధానమైన కావ్య ఖండికలలో 'సీమోల్లంఘన' సంపుటిని ప్రకటించారు. ఆవేశంలేని వీరి భావాలు పఠితల మనస్సులో ఆలోచనలు రేపుతాయి. "ఫ్యాను క్రింద

చెమటపట్టు భయద రాత్రియందు - రేపు చేయదగిన పనియే''ముందని చింతించెడు మానవుడను. నాకు నమ్మకము కావలె''నసే వీరి కవిత ఆస్వాదయోగ్యమైనది.

జీవితం-తిని పండుకోవడమూ కాదు/
ముఖం చెండుకోవటమూ కాదు/
జీవితం/రసమయ కావ్యంలో హవణించిన
హృదయంగమ ఆముఖం''

అని భావించిన శ్రీ విహారి 'చలనమ్' వచన కవితా సంకలనాల్లో రసవంతమైన గీతాలున్న సంపుటి. వర్షాకాలపు మేఘం లాంటిది నా హృదయం, కరుణ పవనానికి కరుగుతోంది!'' అనే విహారిగారి కవితాతత్త్వం ఇంపుగొలుపుతుంది.

అసంఖ్యాకంగ వస్తున్న కవితా సంకలనాలలో శ్రీ మండలీక వెంకటేశ్వర్లు ''ఆవేదనా వేదం; మాష్టర్ రవి 'ఇది హృదయం'; శ్రీ రాఘవ 'విరాళి'; శ్రీ శశికాంత శాతకర్ణి 'చంద్ర జ్యోతి'; శ్రీ అన్నపురెడ్డి విజయభాస్కరరెడ్డి 'నదికదిలొస్తే'; శ్రీ సుభాష్ చంద్ర 'కలం'; శ్రీదేవిప్రియ 'సమాజానంద స్వామి' మొదలైనవి రసజ్ఞులు చవిచూడ దగ్గవి-ఇంకా నా దృష్టికి రాని ఉత్తమ కావ్య సంపుటాలు వుండి వుంటాయి. వాటిని చూడలేకపోయినందుకు చింతిస్తున్నాను.

రచించిన కవిత్వం సంపుటంగా ప్రకటించకపోయినా ఆధునిక కవులలో మిక్కిలి ప్రతిభావంతులు శ్రీ 'స్మైల్'. ''కన్పించని చావులు సముద్రాల్ని లేపవు''; ''కొత్త సముద్రం'' గీతాలు వీరి శక్తికి నిదర్శనంగా చెప్పదగినవి. దిక్కులేక తిరిగే దౌర్భాగ్యుల్ని సంబోధించి ''మీకేం తక్కువని / గాలి మీది నేల మీది, సందుగొందుల సమీకృతా హారం మీది'' అని వారి కష్టాల్ని ధ్వనించి ''వెళ్ళిపొండి చడీచప్పుళ్ళే కుండా నీడల్లా నిష్క్రమించండి/మానిద్రలు చెడతాయి, మానిషాలు వొదుల్తాయి/....మాకు మా పిల్ల పాపల చదువూ క్షేమం అభివృద్ధి తప్ప/ఇంకేమీ తెలీదు'' - ఈ విధంగా భావించే మధ్యతరగతి

ధనవంతుల ఊహల్ని తీవ్రంగా హేళన చేశారు. "ఆవిడ కౌగిల్నీ పిల్లల నవ్వుల పూరేకుల్నీ/సిగరెట్లనీ విస్కీ- సీసాలనీ, పేక ముక్కల్నీ/.... స్నేహితుల ఆప్యాయపు వేళ్ల కొసల్నీ/అభాగ్యుల జాలి చూపుల చివర్లనీ/పట్టుకుని/మూడొందల అరవై అయిదు కల్లోల సముద్రాల్ని" ఈదాలనుకునే భావుకుడు. కవిత్వంలో ప్రతి శబ్దాన్ని తూచి తూచి, రత్న పరీక్షకుడిలా విలువకట్టి, భావాన్ని మనః కుహరంలో దాచి దాచి, తీర్చిదిద్దిన శిల్పంతో కవిత్వం రచించే మేటికవి 'శ్రీ స్మైల్'.

## కవయిత్రులు

తెలుగు సాహిత్యంలో నవలా రచనలో ముందంజవేసి అసంఖ్యాకమైన నవలలను రచిస్తున్న స్త్రీలు కవిత్వ రచనలో తగినంత ఆసక్తి చూపటంలేదు. వచన కవిత రాసి మెప్పించిన వారిలో శ్రీమతి నాయని కృష్ణకుమారి, శ్రీమతి అనసూయగారలు ప్రముఖులు. స్నేహలతారెడ్డి (అత్యవసర పరిస్థితిలో జైలుబాధను అనుభవించి, అనారోగ్యానికి గురై మరణించిన వనిత)పై స్మృతికావ్యం రచించిన అనసూయగారి కవిత కన్నులు చెమ్మగిల్ల జేస్తుంది.

అభ్యుదయ భావాలతో వచన కవిత్వంలో శక్తిమంతమైన గీతాలను శ్రీమతి శీలా సుభద్రాదేవి 'ఆకలి నృత్యం'లో రచించారు. దేశ మాత వీరికి చింకి పాతల్లో దీనంగా కన్పించింది. పరిస్థితులు మారాలని సత్సంకల్పంతో రాసిన వీరి కవిత ఆలోచనను, ఆవేశాన్ని కలిగిస్తుంది.

శ్రీమతి జ్యోతిర్మయి రచించిన 'భావన; దీప్తి' సంపుటాలు వచన కవిత్వంలో ఒక సుకుమారమైన రీతికి మార్గదర్శకంగా వున్నాయి. "నా కవిత్వంలో మమత్వం మందభాగ్యుల కంకితం; నా కలంలో మషీపంకం పేద ప్రాణికి అమృతం"అని జ్యోతిర్మయిగారు కవిత్వాన్ని మానవతా విలువలు పెంపొందించే సాధనంగా తలుస్తారు.

ప్రసిద్ధ సాహిత్య సంస్థ యువ భారతి ప్రకటించిన "కవితాలత" 13 మంది కవయిత్రుల వచన గీతాల సంకలనం. వీరందరిలో సామాజిక

దృష్టి, పరిస్థితులు మారాలనే తపన కన్పిస్తున్నాయి. ఈ మాత్రం చైతన్యం చాలదు. కవయిత్రులు ఇంకా ముందుకు వచ్చి-బంగారమ్మ, విశ్వసుందరమ్మ, రాజ్యలక్ష్మమ్మగారలవలె నాలుగు కాలాలపాటు నిలిచి వుండే కవితలు రచించాలి. అపుడే సాహిత్య రంగంలో స్త్రీ పురుష వివక్షత లేదనే మాట సార్థకమౌతుంది.

## కవిత్వానువాదాలు

సృజనాత్మకమైన కవిత్వానికి ఆదరం లభించినంతగా అనువాదాలకు ఆదరంలేదు. ఐనప్పటికీ విశ్వవిఖ్యాత మహాకవుల రచనలు చదివి, పరవశించి వాటిని తెలుగులోకి తీసుకురావాలని తపనపడే కవుల వలన కొన్ని ఉత్తమ కావ్యాలు వచ్చాయి. అనువాదాలు కేవల అనువాదాలు గాక మళ్ళీ స్వతంత్ర కావ్యాలనిపించే విధంగా వుండాలని కవులు ప్రయత్నిస్తున్నారు.

మహాకవి కాళిదాసు కావ్యాల్లో రఘువంశము, కుమారసంభవములను ఆంధ్రీకరించాలన్న కోరికకంటె మేఘసందేశంపైనే కవులు ఆసక్తి చూపుతున్నారు. గాలీ, నీరూ, నిప్పు, నింగీ, నేలా, మేఘమూ, మేఘసందేశమూ అన్ని కాలాలవీ అందరివీ- అందుకే మేఘసందేశాన్ని తెలుగు చెయ్యాలని తాపత్రయం. మందాక్రాంత వృత్తం తెలుగులో లేకపోవటాన దానికి సరిపడే వృత్తాన్ని ఎవరూ తీసుకోలేకపోయారు. శ్రీ రాయప్రోలు సుబ్బారావు యతిప్రాసలులేని మత్తేభ వృత్తాల్లో కాళిదాస కవి భావసౌందర్యం జారిపోకుండ 'దూతమత్తేభం' రచించారు. కాళిదాస మహాకవి భావనాశక్తికి వివశులైపోయి విద్వాన్ విశ్వంగారు మేఘసందేశాన్ని కంద పద్యాలలో అనువదించారు. మూలంలో భావాలు కొన్ని కంద పద్యాలలో ఇమడకపోవటమూ, కొన్నిచోట్ల ఒక శ్లోకానికి రెండు పద్యాలు రాసి, పద్యం పూర్తి కావటానికి భావాన్ని సాగదియ్యటమూ జరిగింది. పుట్టపర్తి నారాయణాచార్యులుగారి మేఘదూతం కాళిదాస కవిని అనుసరించినా, అనువాదం కాదు. ప్రవాసగతుడైన నాయకుడు మేఘానికి చూపిన త్రోవలో ఆంధ్ర దేశమంతా వర్ణింపబడింది. శ్రీ ఎం. వి. ఆర్. కృష్ణశర్మ మేఘసందేశాన్ని సరళసుందరమైన రీతిలో

అనువాదం చేశారుగాని మూలంలోవున్న కవితా సౌందర్యం కొద్దిభాగం మాత్రమే ఇందులోకి వచ్చింది. శ్రీ ముకురాల రామారెడ్డి మేఘదూతను గేయంలో అనువదించి, గీతిమాధుర్యం సాధించారు. ఇంకా ఎన్నో అను వాదాలు, నా దృష్టికి రానివి వుండి వుంటాయి.

భల్లటకవి అన్యాపదేశంగా వివిధాంశాలపై రాసిన శతకానికి శ్రీ ధనకుధరం 'ఆంధ్రభల్లటము' అనే పేరిట చక్కని అనువాదం చేశారు. ఈ శతకాన్ని యింతకుముందు చిలకమర్తివారు కూడ అనువదించారు.

జయదేవకవి గీతగోవిందానికి తెలుగులో యింతవరకు సరియైన అనువాదం రాలేదనే చెప్పాలి. శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్య కొంత వరకు ప్రయత్నం చేశారుగాని మూలంలో వున్న శబ్దార్థాల నాదసౌంద ర్యమూ, భావగాంభీర్యమూ అందులో రాలేదు. మూలానికి దీటైన అను వాదం ఇంకా రావలసే వున్నది.

పారసీక మహాకవి ఉమర్ ఖయ్యాం రుబాయీలు ఆంధ్ర కవులను అమితంగా ఆకర్షించాయి. కీర్తిశేషులు దువ్వూరి రామిరెడ్డి, ఆదిభట్ల నారాయణదాసు, బుచ్చిసుందర రామశాస్త్రి, ఉమర్ అలీషా, రాయప్రోలు, ముద్దుకృష్ణ గారల తర్వాత స్వాతంత్ర్యానంతర కాలంలో శ్రీ పి. హను మయ్య, శ్రీ 'స్ఫూర్తిశ్రీ'; శ్రీ ఎం. ఆర్. అప్పారావు, చలం మొద లైనవారు రుబాయీలు ఆంధ్రీకరించారు. వీటిలో రామిరెడ్డి, రాయ ప్రోలుల తర్వాత శ్రేష్ఠమైనదిగా చెప్పదగిన అనువాదం చలం గారిదే.

స్వాతంత్ర్యానంతర సాహిత్యంలో ఉర్దూ భాషలో మహాకవి గాలిబ్ గీతాలను శ్రీ దాశరథి మిక్కిలి రసవత్తరంగా ఆంధ్రీకరించారు. మొట్ట మొదటిసారిగా గాలిబ్ కవిత్వ మాధుర్యాన్ని తెలుగువారికి చవిచూపిన ఘనత దాశరథిగారిదే. ఇంకా సాదీ, మీర్, జఫర్, కైఫీఆజ్మీ, మఖ్దూం మొదలైన ఉర్దూ పారసీక కవితలను దాశరథి తెలుగువారికి రుచి చూపారు. 'గజల్' నడకల అందచందాలను తెలుగు కవితకు సమకూర్చ డానికి శ్రీ దాశరథి కృషి చేస్తున్నారు.

లెబనాన్ దేశీయుడు, ప్రపంచ విఖ్యాతుడైన ఖలీల్ జిబ్రాన్ 'ప్రాఫెట్' కావ్యాన్ని శ్రీ కాళోజీ 'జీవన గీత' పేరుతో ఆంధ్రీకరించారు. శ్రీ ధనకుధరం కూడ జిబ్రాన్ రచనలను తెనుగు చేశారు. జిబ్రాన్ కవి సూక్తులను ఏర్చి కూర్చి శ్రీ సి. నారాయణరెడ్డి 'శిఖరాలు-లోయలు' పేరుతో చక్కని అనువాదం చేశారు. సరోజినీదేవి కవితలకు శ్రీ నారాయణరెడ్డి కమనీయమైన అనువాదం 'ముత్యాల కోకిల' పేరుతో వెలువడింది.

విశ్వకవి రవీంద్రుల ప్రభావం యీ శతాబ్దారంభం నుండి తెలుగు కవులపై కన్పిస్తున్నది. 'గీతాంజలి'కి స్వాతంత్ర్యానంతర కాలంలో శ్రీయుతులు బి.వి. సింగరాచార్య, చలం, ఆచంట జానకిరామ్, బెల్లంకొండ రామదాసు మొదలైన వారి అనువాదాలు వచ్చాయి. వీటిలో శ్రీ సింగరాచార్య, చలంగారల అనువాదాలు శ్రేష్ఠమైనవి. శ్రీ చలం రవీంద్రుని ఇతర రచనలు కొన్నింటిని - 'Fruit Gathering' ను 'ఫల సేకరణ' పేరుతోనూ తెలుగు చేశారు. రవీంద్ర కవిత్వానువాదాలలో శ్రీమతి అనసూయ రచించిన 'శ్యామపర్ణి' (Gardener కు అనువాదం) స్వతంత్ర రచన అని చెప్పదగినంత మేలైన అనువాదం. రవీంద్రుని కవితలలో హృద్యమైన నూరు కవితలను ఏరుకుని శ్రీ బెజవాడ గోపాలరెడ్డి 'నైవేద్యం' పేరుతో తెలుగు చేశారు. రవీంద్రుని భార్య మృణాళినీదేవి మరణించినప్పుడు ఆయన రచించిన స్మృతికావ్యాన్ని శ్రీ గోపాలరెడ్డి 'స్మరణ' పేరుతో అనువదించారు. ప్రఖ్యాత ఉర్దూ కవి మఖ్దూం మొహియుద్దీన్ కవితలకు శ్రీ దాశరథి, నారాయణరెడ్డి, మల్లారెడ్డి మొదలైనవారు చేసిన అనువాదాలతో 'మఖ్దూం కవిత' వెలువడింది. బెర్టోల్ట్ బ్రెష్ట్ జర్మన్‌లో రాసిన కవితలకు ఇంగ్లీషు నుండి పెక్కుమంది తెలుగు కవుల అనువాదాలతో 'బ్రెష్ట్ కవిత' అనే సంపుటం వచ్చింది.

తమిళ కావ్యం 'తిరుప్పావు'కు మహాకవి శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి గేయానువాదం వచ్చింది. రష్యన్ మహాకవి మయకోవ్‌స్కీ 'లెనిన్' కావ్యానికి శ్రీశ్రీగారి అనువాదం మూలంలో శక్తినంతటినీ

తీసుకువచ్చిన రచన. దేశ దేశాల కవుల రచనలకు శ్రీశ్రీ చేసిన అనువాదాలు 'ఖడ్గ సృష్టి' సంపుటిలో వచ్చాయి.

దేశదేశాల కవులు, భారతీయ కవులు తెలుగు కవులకు ఉత్సాహం కల్పిస్తున్నప్పటికీ భారతదేశంలోనే ఇంకా ఎన్నో భాషల కవితా పరిమళాలు తెలుగువారికి సోకడమేలేదు. ఇంతకంటె ముఖ్యమైనది. రసవంతమైన తెలుగు కావ్యాలకు ఇంగ్లీషు, హిందీ, ఇంకా ఇతర భారతీయ భాషలలోకి విరివిగా అనువాదాలు జరగాలి. సమర్థులందుకు పూనుకుంటే తెలుగు కవితకు నిజంగా రావలసిన ప్రతిష్ఠ వస్తుంది

## "ఉద్యమాలు; అలజడులు; యుద్ధాలు; - కవుల ప్రతిస్పందన

జాతికి విపత్తు వచ్చినప్పుడల్లా కవులు ఆవేశంతో కవిత్వం రచించటం పరిపాటిగా వస్తున్నదే. స్వాతంత్ర్యం వచ్చీ రాగానే కోటి మంది ప్రజలు నిజాం సంస్థానంలో యింకా బానిసలుగా పడరాని కష్టాలు పడుతున్నప్పుడు, వారిని విముక్తుల్ని చెయ్యటానికి నాయకత్వం వహించిన వారిలో కవులు కూడ ముందు వరుసలో వున్నారు. సంస్థానం వెలుపల నుండి కూడ ఎందరో కవులు తెలంగాణ ప్రజలకు బాసటగా నిలిచారు.

ఈ శతాబ్దారంభం నుండీ ఆంధ్రోద్యమం సాగుతున్నప్పటికీ అది 1950 ప్రాంతాలలో తీవ్ర రూపం ధరించి ఆంధ్రరాష్ట్రం వచ్చేవరకు కొనసాగింది. శ్రీ తుమ్మల సీతారామమూర్తి రచించిన 'రాష్ట్ర గానము' యీ విధమైన కావ్యాలలో మేలుబంతి.చిట్టచివరకు శ్రీ పొట్టి శ్రీరాములు ఆత్మత్యాగంతో రాష్ట్రం సిద్ధించింది. ఆయన త్యాగాన్ని గుర్తించి, గౌరవించిన సరియైన కావ్యమేదీ రాలేదనే చెప్పాలి. వచ్చిన కావ్యాలలో శ్రీ బండ్ల సుబ్రహ్మణ్య కవి రచన శ్రేష్ఠమైనదని చెప్పవచ్చు. ఆంధ్ర రాష్ట్రమైతే వచ్చింది కాని అది ముక్కోటి ఆంధ్రుల నొక్కటిగా కలిపినదికాదు. కోటిమంది ప్రజలున్న తెలంగాణ 1953 నాటికి మన రాష్ట్రంలో లేదు. 1956 నవంబరు ఒకటవ తేదీన ఆంధ్రప్రదేశ్ ఏర్పడే

దాక ఆంధ్రుల కోరిక తీరలేదు. ఇప్పటికి కూడ కొన్ని ఆంధ్ర ప్రాంతాలు ఇరుగు పొరుగు రాష్ట్రాలలోనే వుండిపోవటం దురదృష్టం. ఆంధ్రు లందరూ ఒక్క గొడుగు నీడకు చేరుకున్నాము గదా అని ఆనందం పొంది, ఇల్లు చక్కదిద్దుకునేటంతలో పీడకలల్లాగ రెండు అలజడులు ఆంధ్రప్రదేశ్‌ను సంక్షోభపరిచాయి. అవి ప్రత్యేక తెలంగాణ, ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం కావాలని వేర్పాటువాదులు సాగించిన అలజడులు. ఈ సమయాల్లో తెలుగు కవులు తమ బాధ్యతను గుర్తించి, ఆందోళన చేస్తున్న జనుల ఆగ్రహాన్ని కూడ తట్టుకొని ఐకమత్యాన్ని బోధించటం హర్షదాయకం.

భారతదేశం అహింసా సిద్ధాంతాన్ని నమ్మి, 'పంచశీల'కు కట్టుబడి పోరు నష్టం పొందులాభమనే తత్వంతోనే వున్నది. కాని 1962లో చైనా భారతదేశంతో యుద్ధానికి దిగింది. ఆ సమయంలో జాతికి జాతి అంతా ఒక్కటిగా నిలిచినట్లే, జాతీయతను, దేశభక్తిని నూరిపోస్తూ సమరోత్సాహం కలిగించే కవితలు విరివిగా వచ్చాయి. "రణభేరి; విజయ గీతావళి; వీర భారతము" కవితా సంకలనాలూ; శత్రుం జయము (శ్రీ కేతవరపు వేంకట రామకోటి శాస్త్రి రచన) మొదలైన కావ్యాలూ వచ్చి ప్రజలకు ఉత్సాహం కలిగించాయి.

1971 లో భారతదేశం బంగ్లాదేశ్ 'ముక్తి వాహిని'కి సాయంగా ఆ దేశాన్ని పాకిస్తాన్ దౌర్జన్యం నుండి రక్షించటానికి పూనుకున్నప్పుడు కూడ ప్రజల వాణిని కవులు చక్కగా ప్రతిధ్వనించారు. "తుపాకి రవ్వలు; సమర విజయ; సమర్ పథే బాంగ్లా; బంగ్లాదేశ్ కవితా వాహిని" కావ్య సంకలనాలు వచ్చాయి. వీటిలో ఎక్కువ భాగం ప్రబోధమే పరమార్థంగా గలవి అయినా కొన్ని రచనలు కవితా శిల్పంతో ఉత్తమ కవిత్వంగా చెప్పదగినవి కూడ వున్నాయి.

1975 లో భారత ప్రభుత్వం 'ఆత్యయిక పరిస్థితి'ని విధించినప్పుడు కవులు విడిచిపెట్టాలి. లేకపోతే తాత్కాలికంగా వారు పబ్బంగడుపుకున్నా చరిత్ర వారిని క్షమించదు.

ఆంధ్రులు ఆవేశపరవశులన్న మాట తరచు వినవచ్చేదే. దేశంలో ఏ విధమైన ఆందోళన వచ్చినా, తెలుగు కవులు ప్రతిస్పందించటం హర్షదాయకం. వీరిలో కొద్దిమంది మాత్రమే తాము నమ్మిన సత్యం ఆవేశపరవశులైన జనుల ఆగ్రహానికి గురిఅవుతుందని తెలిసినా, నిర్భయంగా వెల్లడించగలరు. వారి కవిత్వంలో సత్యాన్ని సామాన్య జనులు తెలుసుకోలేక ఆగ్రహించినా, ఆ తర్వాత ఆ కవుల ధైర్యానికి చిత్తశుద్ధికి హర్షించి, వారిని ప్రాణాధికంగా ప్రేమిస్తారు.

సమకాలికమైన తెలుగు కవిత్వం సమకాలిక సమస్యలను ప్రతిబింబిస్తున్నదని చెప్పటానికి ఎంతైనా ఆనందంగా వున్నది.

## రేపటి కవిత్వం

రేపటి కవిత్వం ఏ విధంగా ఉండబోతున్నదని ఆలోచించినప్పుడు మేధావులు కొందరు నిరాశ చెందుతున్నారు. శ్రీ జి. వి. కృష్ణరావు 'సాహిత్య భవితవ్యం' అనే వ్యాసంలో "జీవితం నిలకడలేక త్వరితగతిని మారుతున్నప్పుడు తదనుగుణమైన మార్పులే సాహిత్యంలోనూ తక్కిన లలిత కళలలోనూ వస్తవి. సమాధ్యవస్థాపాదకాలైన కృతులకు అవకాశం తక్కువ. తదాస్వాదన శక్తి కూడ సన్నగిల్లక తప్పదు. వెనుకటివలె నవ్యకృతులు ఇకమీదట మూడు కాలాలపాటు నిలవటం అసంభవంగా కన్పిస్తున్నది.........రచనయందలి వస్తు శిల్పాలు కూడ పత్రికా వార్తలవలె ఉద్వేజకాలుగా ఉంటవి. అంటే పత్రికా రచనయే (Journalism) సాహిత్యంగా చెలామణి అవుతుంది. ఈ లక్షణాలు అప్పుడే కొంతవరకు గోచరిస్తున్నవి" అన్నారు. పత్రిక వార్తలను పోలిన కేవల ఉద్వేజకరమైన కవిత్వమే ఇప్పుడు ఎక్కువగా వస్తున్న మాట యధార్థమే. కాని నిరాశకు ఆస్కారంలేదు. జీవితంఇప్పుడున్నంత సంక్లిష్టంగా ఇంతకు ముందులేదు. అలజడుల్లోంచి, ఆందోళనల్లోంచి, బాధల్లోంచి ఉత్తమ కవిత్వం తప్పక పుడుతుంది.

కవిత్వమిప్పుడు చీలుదారుల కూడలిలో నిలిచి వున్నది. సామాజిక దృష్టితో ప్రగతిమార్గంలో నడవాలని కొందరు, వ్యక్తి స్వేచ్ఛను

కాపాడుకొని స్వీయానుభూతిని కవితా శిల్పంతో వెల్లడించాలని మరి కొందరూ తలుస్తున్నారు. మార్గాలు వేరైనా కవుల గమ్యం వొక్కటే. కవిత్వ ప్రయోజనం ఏ కాలంలోనైనా ఆనందాన్ని కలిగించటం, సదుపదేశం చేయటం, విశ్వశ్రేయాన్ని సమకూర్చటమే. కవులు భావనా సమాధిని నిలుపుకొని ఉద్వేజ కారకాలైన రచనలనేగాక నాలుగు కాలాల పాటు నిలిచి వెలిగేవి, 'ఇదీ మా తెలుగు కవిత' అని అంతర్జాతీయమైన ప్రతిష్ఠను పొందగలిగే కవితలను వెలయిస్తారని ఆశిద్దాం.



# ఉపయోగించిన గ్రంథాలలో ప్రధానమైనవి కొన్ని-

## తెలుగు


కవిత్వ తత్త్వవిచారము - కట్టమంచి రామలింగారెడ్డి

నేటికాలపు కవిత్వము - అక్కిరాజు ఉమాకాన్తమ్

నవ్యాంధ్ర సాహిత్య వీధులు - కురుగంటి సీతారామయ్య, పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు

మహోదయము - కె. వి. రమణారెడ్డి

కవికోకిల గ్రంథావళి-వ్యాసములు - దువ్వూరి రామిరెడ్డి

సారస్వత వివేచన - రాచమల్లు రామచంద్రారెడ్డి

ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు - ప్రయోగములు - డాక్టర్ సి. నారాయణరెడ్డి

కావ్యజగత్తు - డాక్టర్ జి. వి. కృష్ణరావు

వ్యాసావళి - గిడుగు రామమూర్తి పంతులు

బాలకవి శరణ్యం - గిడుగు రామమూర్తి పంతులు

పండిత భిషక్కుల భాషాభేషజం - గిడుగు రామమూర్తి పంతులు

గిడుగు రామమూర్తి (జీవితచరిత్ర) - జి. వి. రామమూర్తి

వ్యాసమంజరి - కట్టమంచి రామలింగారెడ్డి

కొమర్రాజు వేంకట లక్ష్మణరావు (జీవిత చరిత్ర) - డా॥ అక్కిరాజు రమాపతిరావు

సాహిత్య వివేచన - సుప్రసన్న

సమగ్ర ఆంధ్ర సాహిత్యం - ఆరుద్ర

ఉషఃకిరణాలు - శ్రీవాత్సవ

సాహిత్య ప్రయోజనం - కొడవటిగంటి కుటుంబరావు

కళలు - శాస్త్రీయ విజ్ఞానం - కొడవటిగంటి కుటుంబరావు

ఆంధ్ర రచయితలు - మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

నా వాఙ్మయ మిత్రులు - చీకుమళ్ల కామేశ్వరరావు

శ్రీశ్రీ కవితా ప్రస్థానం - అద్దేపల్లి రామమోహనరావు

కవి హృదయం - చలం

పాలేరు నుంచి పద్మశ్రీ వరకు
బోయి భీమన్న } హైమవతి

గురజాడ - శ్రీశ్రీ

డిసెంటు పత్రము - గురజాడ (అను) పోరంకి దక్షిణామూర్తి

లోవెలుగులు - ముట్నూరి కృష్ణారావు

వచన పద్యం - లక్షణ చర్చ - చేకూరి రామారావు; సంపత్కుమార

సారస్వతాలోకము - రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

సమాజము - సాహిత్యము - ఆర్. యస్. సుదర్శనం

మరపురాని మనీషి - తిరుమల రామచంద్ర

చంద్రం వ్యాసావళి - మద్దుకూరి చంద్రశేఖరరావు

సమాలోచనం - ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమి

మహతి - యువభారతి

సాహితీ వాల్లభ్యము
(రెండు సంపుటాలు) } నరేంద్రనాథ సాహిత్య మండలి

ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము - (3, 4, 6, 14 సంపుటాలు)
ఆంధ్ర సంస్థానములు - సాహిత్య పోషణము } డాక్టర్ తూమాటి దొణప్ప
తెలుగులో తిట్టు కవిత్వము - రావూరి దొరస్వామిశర్మ
కవిసేన మేనిఫెస్టో - గుంటూరు శేషేంద్రశర్మ
సాహిత్యశిల్ప సమీక్ష - పింగళి లక్ష్మీకాంతం
వీరేశలింగం పంతులు - సమగ్ర పరిశీలన } డా. అక్కిరాజు రమాపతిరావు
తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము } డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావు
స్వీయచరిత్ర - కందుకూరి వీరేశలింగం పంతులు
శ్రీశ్రీ సాహిత్యం - (5 సంపుటాలు) - శ్రీశ్రీ
తెలుగు వైతాళికులు (రెండు భాగాలు)- ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
చైతన్యలహరి - యువభారతి
నవోదయలహరి - యువభారతి
వికాసలహరి - యువభారతి
ప్రతిభాలహరి - యువభారతి
వచన కవిత - ఫ్రీవర్స్ ఫ్రంట్
కావ్యాలంకార సంగ్రహము(వివరణ) - సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి
కరపత్రాల దుమారం - తెరవెనుక భాగోతం } (సం) అనంతం, లక్ష్మీకాంతం
కవికోకిల జీవితమూ, సాహిత్యమూ - కె. వి. రమణారెడ్డి
తెలుగులో కవితా విప్లవాల స్వరూపం - వెల్చేరు నారాయణరావు

సాహిత్య పరిచయం (1875-1975) - ఇంద్రగంటి శ్రీకాంతశర్మ
వీర తెలంగాణ - నా అనుభవాలు - రావి నారాయణరెడ్డి
తెలంగాణలో జాతీయోద్యమాలు - దేవులపల్లి రామానుజరావు
అప్పుడు పుట్టి వుంటే ! - దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి

## కా వ్య సం క ల నా లు

| | |
|---|---|
| వైతాళికులు | అగ్నిగర్భ |
| మహాసంకల్పం | దిగంబర కవుల సంపుటాలు |
| కల్పన | ఝుంఝు; మరో ఝుంఝు |
| తెలుగు కావ్యమాల | కవిత |
| కావ్యాంజలి (రెండు భాగాలు) | జలపాతం |
| నవీనకావ్యమంజరి | చేతనావర్తం (రెండు సంపుటాలు) |
| శ్రీశ్రీయుగం | నయాగరా |
| మహోదయము | తిరుగబడు |
| నవసాహితి | తే |
| స్వేచ్ఛాపథం | కిర్మీరం |
| అడుగుజాడ గురజాడది | మణిమకుటం |
| తరం తరం | ఉదయ ఘంటలు |
| ప్రత్యూష | ఉదయ తార |
| చైతన్య | మినీ కవితా విప్లవం |
| రాత్రి | |

# పత్రికలు, ప్రత్యేక సంచికలు

ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలు
భారతి
కృష్ణా పత్రిక
ప్రతిభ
ఉదయిని (4, 5 సంచికలు)
అభ్యుదయ
నవత
సంవేదన
కళాకేళి
వేకువ
సృజన
గ్రంథాలయ సర్వస్వము
మేఖల
జయంతి

యుగపురుషుడు వీరేశలింగం
రాయప్రోలు సాహిత్య సౌందర్య దర్శనము
వ్యాససంగ్రహము (గిడుగు రామమూర్తి పంతులు సప్తతితమ జన్మదిన సంచిక)
ఆలూరి బైరాగి సంస్మరణ సంచిక
'పలనాడు వెలలేని మాగాణిరా' (పులుపుల శివయ్య స్మృతి సంచిక)
ఆకాశవాణి విజయవాడ రజతోత్సవ సంచిక
విమర్శిని (పరిశోధన పత్రిక)
పరిశోధన

# ఆంధ్రీకృత, సంస్కృత గ్రంథములు

| | |
|---|---|
| నాట్యశాస్త్రము | - పోణంగి శ్రీరామ అప్పారావు |
| నాట్యవేదము | - జమ్ములమడక మాధవ రామశర్మ |
| భామహాలంకారము | - పుల్లెల శ్రీరామచంద్రుడు |
| కావ్యాదర్శము | - అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి |
| కావ్యాలంకార సూత్రవృత్తి | - వేదాల తిరువేంగళాచార్యులు |
| ఆంధ్ర ధ్వన్యాలోకము | - వేదాల తిరువేంగళా చార్యులు |
| కావ్య మీమాంస | - పుల్లెల శ్రీరామచంద్రుడు |
| వక్రోక్తి జీవితము | - పుల్లెల శ్రీరామచంద్రుడు |
| కావ్య ప్రకాశము | - జమ్ముల మడక మాధవరామశర్మ |
| ఆంధ్ర దశరూపకము | - మల్లాది సూర్యనారాయణశాస్త్రి |
| సాహిత్య దర్పణము | - వేదం వేంకట రాయశాస్త్రి |
| ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము | చలంచర్ల రంగాచార్యులు |
| రసగంగాధరమణి | - జమ్ములమడక మాధవరామశర్మ |
| రసార్ణవ సుధాకరము | - బులుసు వేంకట రమణయ్య |
| ఔచిత్య విచారచర్చ | - జమ్ములమడక మాధవరామశర్మ |
| ఆంధ్ర చంద్రాలోకము | - అక్కిరాజు ఉమాకాంతం |
| కువలయానందము | - కంభంపాటి సత్యనారాయణ |